ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

సంపుటి 2 | సంచిక 2 జనవరి-మార్చి, 2022

మమత-సమత-మానవత
www.gurajada.org

# తెలుగు కవితోద్యమాలు



ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

మమత-సమత-మానవత
www.gurajada.org

## ధన్యోస్మి



ప్రకాశిక జనవరి-మార్చ్ సంచికలో కవిత్వోద్యమాల మీద కొన్ని ప్రత్యేక వ్యాసాలు ప్రచురించాలని అనుకున్నప్పుడు ముందుగా ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారి పేరు తట్టింది. అడిగిన వెంటనే అనువైన అంశాలు, వ్యాసకర్తల పేర్లతో ఒక పట్టికని నాతో పంచుకున్నారు. పరస్పర సంప్రదింపులు చర్చల తరవాత ఆయన వ్యాసకర్తలని సంప్రదించి వ్యాసాలు రాయమని కోరారు. ఇది గత నవంబరు మొదటి వారంలో జరిగిన విషయం. పన్నెండు అంశాలు, పన్నెండుమంది వ్యాసకర్తలని సమన్వయ పరచి మృదువుగా గుర్తుచేయడం అంత సులువైన పని కాదని అనుభవంతో తెలుసుకున్నాను. ఆ కర్తవ్యాన్ని సమర్ధవంతంగా చాకచక్యంగా నిర్వహించిన అగ్రజుడు రాచపాళెం గారికి కృతజ్ఞతాపూర్వక నమస్సులు. కవిత్వోద్యమాల మీద ప్రత్యేక వ్యాసాలు రాసిన వారికి ప్రత్యేక కృతజ్ఞతలు. ప్రకాశిక కోసం విశిష్టంగానూ, విశ్లేషణాత్మకంగానూ రాయాలన్న కృత నిశ్చయంతో వారి వృత్తిపరమైన ఎన్నో వత్తిడులు, గడువులు ఉన్నా చక్కని వ్యాసాలు రాసిన వ్యాసకర్తలందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను.

సిరివెన్నెల గారి మీద వ్యాసానికి డా. ఏనుగు నరసింహారెడ్డి గారిని సంప్రదించి ఒప్పించిన శ్రీమతి యనమండ్ర వసంత గారికి, కందుకూరి వారిమీద వ్యాసానికి డా. రామకృష్ణ గారిని సంప్రదించి ఒప్పించిన డా. భద్రి కూర్మారావు గారికీ కృతజ్ఞతలు.

ఈ సంచిక వెలువరించడంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ సహకరించిన వారెందరో ----, అందరికీ వందనములు.

భవదీయుడు
ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ
ప్రధాన సంపాదకులు

# ప్రకాశిక సంపాదక వర్గం



## ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ

ప్రధాన సంపాదకులు

పుట్టినది పశ్చిమగోదావరి జిల్లాలోని ఇరగవరం అగ్రహారం. పెరిగినది చాలా వరకు తణుకులో. తాడేపల్లిగూడెం కళాశాల నుంచి డిగ్రీ, ఉమ్మడి రాష్ట్ర రాజధాని భాగ్యనగరంలోని కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎస్.సి., దేశ రాజధానిలోని ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఫిల్., పి.హెచ్.డి. చేశారు. గత 27 సంవత్సరాలుగా అమెరికాలో నివాసం. చాలా సంవత్సరాలు వైద్య విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా కేన్సర్ వ్యాధికి సంబంధించిన అంశాలపై పరిశోధనలు జరిపారు. ప్రస్తుతం అంతర్జాతీయ ఫార్మస్యూటికల్ కంపెనీలో కేన్సర్ మందులు రూపొందించే శాస్త్రవేత్తగాను, హ్యూస్టన్ లోని టెక్సాస్ విశ్వవిద్యాలయంలోని వైద్యశాస్త్ర విభాగంలో అనుబంధ ఆచార్యులుగానూ పనిచేస్తున్నారు. అంతర్జాతీయ కేన్సర్ పరిశోధనలకి సంబంధించిన అంతర్జాతీయ పత్రికకి ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. మాటల మాలలల్లడం ప్రవృత్తి. అడపాదడపా రాసిన కవితలు, కథలు, వ్యాసాలు ఒకచోట కూర్చి "మనస్వినీయం" అన్న పేరుతో ఇటీవల ఒక పుస్తకం ప్రచురించారు.



## మా శర్మ

గౌరవ సంపాదకులు

మా శర్మగా సుపరిచితులైన మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయశర్మ 1967 సంవత్సరం నవంబర్ 29వ తేదీన గుంటూరు జిల్లా, నరసరావుపేటలో జన్మించారు. పాత్రికేయులు, కాలమిస్ట్‌గా ప్రసిద్ధులు. తెలుగువారికి సొంతమైన అవధాన ప్రక్రియ, ఆశుకవిత్వంలో అగ్రగణ్యులు, ఆరాధ్యులైన కొప్పరపు కవులు మా శర్మగారికి మాతామహులు. ఆ మహాకవుల పేరిట శ్రీ కొప్పరపు కవుల కళాపీఠాన్ని 2002లో స్థాపించారు. వారి విగ్రహాలను విశాఖపట్నం సాగరతీరంలో, నరసరావుపేటలో స్థాపించారు. కొప్పరపువారి సాహిత్యాన్ని సేకరించి దొరికినంత వరకూ గ్రంథస్థం చేశారు. ప్రతియేటా శ్రీ కొప్పరపు కవుల ప్రతిభా పురస్కారాలు ప్రదానం చేస్తున్నారు. ప్రముఖులు పీసపాటి నరసింహమూర్తి, వేటూరి సుందరరామ్మూర్తి, మల్లాది చంద్రశేఖరశాస్త్రి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, నేదునూరి కృష్ణమూర్తి, కె.విశ్వనాథ్, బేతవోలు రామబ్రహ్మం, మేడసాని మోహన్, గరికిపాటి నరసింహారావు, మాడుగుల నాగఫణిశర్మ, పి.సుశీల, సిరివెన్నెల సీతారామశాస్త్రి మొదలు

ఎందరో తెలుగు, జాతీయ కవులు, కళాకారులు ఆ పురస్కారం అందుకున్న వారిలో ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రపత్రిక దినపత్రికకు కన్ సల్టింగ్ ఎడిటర్ గా పాత్రికేయ సేవలు అందిస్తున్నారు. ఎన్నో ఏళ్ల నుండి మీడియాలో ఉన్నారు.



## శ్రీమతి గురజాడ అరుణ

నిర్వాహక సంపాదకులు

గురజాడ వేంకట అప్పారావుగారి ముని మనుమరాలు శ్రీమతి గురజాడ అరుణ. ముంబైలో పుట్టి పెరిగిన వీరు IT రంగంలో ప్రాజెక్ట్ మేనేజర్ గా పనిచేస్తున్నారు. ముత్తాతగారి అకాల మరణంతో అసంపూర్ణంగా మిగిలిపోయిన వారి సాహితీ సేవలు, సంఘ సంస్కరణ కార్యక్రమాలను ముందుకు తీసుకెళ్ళే క్రమంలో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపించారు. గురజాడ వారి పేరిట ఎన్నో సేవా కార్యక్రమాలు చేస్తూ ముత్తాతగారి స్మృతిని చిరస్థాయిగా ఉంచుతున్నారు.



## శ్రీ గురజాడ రవీంద్రుడు

సంపాదక సలహాదారు

గురజాడ వేంకట అప్పారావుగారి మునిమనుమడు శ్రీ గురజాడ రవీంద్రుడు. 2014లో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపనలో ముఖ్య భూమిక పోషించారు. ఫౌండేషన్ లక్ష్యాలను, ఆశయాలను ముందుకు తీసుకెళ్ళడంలో చురుకైన పాత్ర పోషిస్తూ ముత్తాతగారి అడుగుజాడల్లో పయనిస్తున్నారు. గురజాడ ఫౌండేషన్ (అమెరికా) ఇండియన్ చాప్టర్ కు ప్రెసిడెంట్ గా వ్యవహరిస్తున్నారు.



## శ్రీ విహారి

సంపాదక సలహాదారు

విహారి అనే కలం పేరుతో సుప్రతిష్ఠులైన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 1941లో తెనాలిలో జన్మించారు. వీరు 12 కథాసంపుటాలు, 15 విమర్శనాత్మకమైన వ్యాస సంపుటాలు, ఒక వ్యాస కదంబం, 7 నవలలు, 5 కవితా సంపుటాలు, ఒక దీర్ఘ కథాకావ్యం- పుస్తకాల రూపంలో వెలువరించారు. అన్ని ప్రసిద్ధ తెలుగుపత్రికలలోనూ 300కి పైగా వీరి రచనలు ప్రచురితమయ్యాయి. వివిధ పత్రికల్లో పరిచయాలూ-పరామర్శలు, బతుకు గీతలు, కథావిహారం వంటి శీర్షికలనూ నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కా రం, అజో విభో కందాళం ఫౌండేషన్ (AVKF) వారి జీవన

సాఫల్య పురస్కారం, ఆం.ప్ర భాషా దినోత్సవ పురస్కారం, తె.వి.వి.కీర్తి పురస్కారం లాంటి ఎన్నో ప్రతిష్ఠాత్మకమైన పురస్కారాలు అందుకున్నారు. ఎల్.ఐ.సి.లో జనరల్ మేనేజర్ గా పదవీ విరమణ చేసి, హైదరాబాద్ లో నివాసం ఉంటున్నారు.



## ఆచార్య వెలమల సిమ్మన్న

సంపాదక సలహాదారు

బహుముఖ ప్రజ్ఞాశాలిగా వాసికెక్కిన ఆచార్య వెలమల సిమ్మన్నగారు 1955 సంవత్సరం మార్చి 1వ తేదీన శ్రీకాకుళం జిల్లా, జలుమూరు మండలం, తిమడాం గ్రామంలో జన్మించారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్, స్కూల్ఆఫ్ డిస్టెన్స్ ఎడ్యుకేషన్ లో తెలుగుశాఖలో అధ్యాపక ధర్మం నిర్వర్తించారు. భాష, సాహిత్యం, వ్యాకరణం, భాషా శాస్త్రం, విమర్శ, పరిశోధన మొదలైన రంగాలకు సంబంధించి 83 గ్రంథాల్ని రాశారు. 440కి పైగా పరిశోధన పత్రాలు ప్రముఖ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 160కి పైగా వివిధ సెమినార్లలో హాజరై పరిశోధన పత్రాల్ని సమర్పించారు. 50కి పైగా రేడియో ప్రసంగాలు చేశారు.



## ఆచార్య గుమ్మా సాంబశివరావు

సంపాదక సలహాదారు

తెలుగు సాహిత్యంలో ప్రముఖ విమర్శకులుగా, పుస్తక సమీక్షకులుగా, అన్నింటికీ మించి మంచి అధ్యాపకునిగా పేరొందిన గురువర్యులు ఆచార్య గుమ్మా సాంబశివరావుగారు. స్వగ్రామం గుంటూరు జిల్లాలోని వేజెండ్ల. 2018లో ఆంధ్ర లయోలా కళాశాలలో తెలుగు శాఖాగ్రణిగా పదవీ విరమణ చేశారు. మహాకవి గురజాడ 150వ జయంతి కానుకగా 2011 డిసెంబరులో కన్యాశుల్కంలో హాస్యం పేరుతో ఓ గ్రంథాన్ని ముద్రించారు. 2012 డిసెంబరు 27,28,29 తేదీల్లో తిరుపతి నగరంలో నాలుగో ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకుని తెలుగు అకాడమీ వారు ఆచార్య గుమ్మా సాంబశివరావు రచించిన తెలుగువాఙ్మయ చరిత్ర-రచయితలు అనే గ్రంథాన్ని ముద్రించారు. నూటముప్పైకి పైగా వివిధ పత్రికల్లో వ్యాసాలు, 150 కి పైగా పుస్తక సమీక్షలు, 60 కి పైగా ఆకాశవాణిలో ప్రసంగాలు అనేక జాతీయ అంతర్జాతీయ వేదికల మీద వివిధ అంశాల మీద ప్రసంగాలు, సాంబశివరావుగారి విస్తృత ప్రతిభకి తార్కాణం. సాంబశివరావు గారు అనేక జాతీయ, అంతర్జాతీయ సన్మానాలు, సత్కారాలు పొందారు. ఏ అంశంపైనైనా అనర్గళంగా ప్రసంగించే వీరి సామర్థ్యాన్ని గుర్తించి అనేక సాహిత్య పీఠాలవారు 'ప్రసంగప్రజ్ఞా నిధి', 'ఉపన్యాసకేసరి' వంటి బిరుదులతో సత్కరించారు.



## డా.సి. భవానీదేవి

సంపాదక సలహాదారు రచయిత్రి, విమర్శకురాలు

ఆంధ్రప్రదేశ్ సచివాలయం నుంచి ప్రభుత్వ ఉప కార్యదర్శిగా పదవీ విరమణ చేశారు. 15 కవితా సంపుటులు, వివిధ ప్రక్రియల్లో 51 గ్రంథాలు వెలువరించారు. వీరి పలు కవితలు, కథలు ఇతర భాషల్లోకి అనువదించబడ్డాయి. డాక్టర్ సి. భవానీదేవి పలు అవార్డులు, ప్రశంసలు అందుకున్నారు. ఆకాశవాణి, ప్రసారభారతి జాతీయ స్థాయిలో ప్రతి ఏటా ప్రతిష్టాత్మకంగా నిర్వహించి ప్రసారం చేసే జాతీయ కవి సమ్మేళనంలో భాగంగా 2019 సంవత్సరానికి తెలుగు కవయిత్రిగా ఎంపికయ్యారు.



## డా. రేవూరి అనంత పద్మనాభరావు

సంపాదక సలహాదారు

పద్మనాభరావు వందకుపైగా అష్టావధానాలు చేశారు. 120 గ్రంథాలు ప్రచురించారు. అందులో నాలుగు కథా సంపుటాలు, నాలుగు నవలలు, 12 అనువాదాలు, 11 జీవితచరిత్రలు, 12 సివిల్స్ పరీక్షల గ్రంథాలు, పరిష్కరణలు, వ్యాఖ్యలు, పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. వీరి రచనలపై నాలుగు విశ్వవిద్యాలయాల నుండి ఆరుగురు పరిశోధక విద్యార్థులు ఎం.ఫిల్. / పి.హెచ్.డి. డిగ్రీలు సంపాదించారు. పద్మనాభరావుకు 1993లో తెలుగు విశ్వవిద్యాలయ అనువాద పురస్కా రము, 2000లో కేంద్ర సాహిత్య అకాడమీ అనువాద పురస్కారం లభించాయి. ఢిల్లీ తెలుగు అకాడమీ, మదరాసు తెలుగు అకాడమీ సనాతన ధర్మచారిటబుల్ ట్రస్టు తదితర అవార్డులు పొందారు. కందుకూరి రుద్రకవి రచనలపై పి.హెచ్.డి. చేశారు. 1967లో కందుకూరు ప్రభుత్వ కళాశాల అధ్యాపకులుగా ఉద్యోగ జీవితం ప్రారంభించి 1975 నుండి 2005 వరకు ఆకాశవాణి, దూరదర్శన్ లో పదవీ బాధ్యతలు మూడు దశాబ్దాలు నిర్వహించి, ఢిల్లీ అదనపు డైరెక్టర్ జనరల్ గా పదవీ విరమణ చేశారు. 2005 - 10 మధ్య తిరుమల తిరుపతి దేవస్థానంలో పనిచేసి శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ కు అంకురార్పణ దశలో కృషి చేశారు. కంచికామకోటి పీఠాధిపతి వీరిని ఆస్థాన విద్వాంసులుగా సత్కరించారు. అమెరికా, యు.కె, జర్మనీ దేశాలలో పర్యటించి ఉపన్యసించారు. 1200 వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురించారు. 74 సంవత్సరాల పద్మనాభరావు హైదరాబాదులో స్థిరపడ్డారు.



## డా. నాగసూరి వేణుగోపాల్

సంపాదక సలహాదారు

దేశవ్యాప్తంగా తొమ్మిది ఆకాశవాణి కేంద్రాలలో సుమారు ముప్పైయి మూడు సంవత్సరాలుగా పనిచేస్తూ మరోవైపు రచయితగా, కాలమిస్టుగా, సంపాదకునిగా డా. నాగసూరి వేణుగోపాల్ ఇంతవరకు 60 పైగా పుస్తకాలు వెలువరించారు.అనంతపురం జిల్లా కొనతట్టు పల్లిలో 1961లో జన్మించిన నాగసూరి ఎస్వీయూ నుంచి ఫిజిక్స్‌లో ఎం.ఎస్సీ., ఎం.ఫిల్., తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జర్నలిజంలో పి.హెచ్.డి. గడించారు. పరిశీలన, పరిశోధన, ప్రణాళికతో ఆకాశవాణి కార్యక్రమాలు నిర్వహించిన నాగసూరి రేడియో పరిచయ కార్యక్రమ నిర్వహణలో పేరుపొందడమే కాక 'ఆదివాసీ అంతరం', 'శతవసంత సాహితీ మంజీరాలు', 'వెలుగుజాడ', 'అన్నమయ్య పదగోపురం', 'జీవనబింబం', 'చిత్తూరు జిల్లా జీవన చిత్రం' వంటి విలువైన కృషి ద్వారా చిరకాలం నిలబడే ముద్ర వేశారు. విజ్ఞానశాస్త్రం, సాహిత్యం, పత్రికారంగం, ప్రసారమాధ్యమాలు, చరిత్ర, భాష వంటి విషయాలపై పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. గురజాడ, తాపీ, పొట్టి శ్రీరాములు, నార్ల, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, జి.వి.కృష్ణారావు, విద్వాన్ విశ్వం వంటి వారి పరిశోధనాత్మక పుస్తకాలు వెలువరించిన నాగసూరి 'సాహితీ వీక్షణం', 'సాహితీ స్పర్శ' వంటి విమర్శనా గ్రంథాలు కూడా రచించారు. 20వ శతాబ్దం ముగుస్తున్న వేళ విజయవాడ ఆకాశవాణి ద్వారా మూడేళ్ళ పాటు పరిచయం చేసిన శతాబ్దపు వంద ఉత్తమ తెలుగు గ్రంథాల గురించి వెలువరించిన 'శతవసంత సాహితీ మంజీరాలు' అత్యంత విలువైన సంకలనం. ఇంకా సాహిత్య అకాడమీకి 'సైన్స్ ఫిక్షన్' 'వైజ్ఞానిక కథలు', అలాగే 'కథావరణం', 'మదరాసుబదుకులు' కథా సంకలనాలను మిత్రులతో కలిసి వెలువరించారు. 'స్థానిక మూలాలు', 'విస్మృత ప్రముఖులు', 'జానపదకళలు', 'హెచ్.ఐ.వి./ ఎయిడ్స్', 'ఆదివాసుల జీవితం', 'ఇతర ప్రాంతాల తెలుగువారు', 'అన్నమయ్య' వంటి అంశాలపై దృష్టి నిలిపి కృషి చేసిన వేణుగోపాల్ ప్రస్తుతం తెలుగువారు విస్మరించిన గాంధీ తత్వంలోని ప్రయోజనకరమైన కోణాలను వివరించడానికి తన బృందంతో కలసి శ్రమిస్తున్నారు. వీరి ప్రస్తుత నివాసం హైదరాబాదు.



## ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

"తెలుగులో ఉద్యమకవిత్వం" సంచికకి ప్రత్యేక సంపాదకులు

రాచపాళెం చంద్రశేఖరరెడ్డి గారు 1977 ఆగష్టులో అనంతపురంలోని శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖలో లెక్చరర్ గా చేరి, 2008 అక్టోబరులో ఆచార్యుడుగా ఉద్యోగం విరమణ చేశారు. తరవాత కడపలోని యోగివేమన విశ్వవిద్యాలయం ఆచార్యుడుగా నియమించింది. రాచపాళెం గారు నేషనల్ బుక్ ట్రస్ట్ లోను, కేంద్ర సాహిత్య అకాడమీలోను తెలుగు సలహా మండలి సభ్యులుగా పని చేశారు. ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం సభ్యులుగా వ్యవహరించారు.ఇప్పుడు కేంద్ర సాహిత్య అకాడమీ జనరల్ కౌన్సిల్ సభ్యుడుగా ఉన్నారు. ఈయన అనంతపురం జిల్లా రచయితల సంఘం అధ్యక్షుడుగా వ్యవహరించారు. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం అధ్యక్షుడుగానూ, ప్రజాశక్తి బుక్ హౌస్ గౌరవసంపాదకుడుగానూ ఉన్నారు.

ఈయన శిల్పప్రభావతి నుండి విమర్శావరణం దాకా 30 సాహిత్య విమర్శ గ్రంథాలు, పాలి మొదలైన నాలుగు కవిత్వ సంపుటాలు ప్రచురించారు. కర్తార్ సింగ్ దుగ్గల్ కథలు, నెత్తురు నది మొదలైన పది గ్రంథాలను అనువదించారు. అనంతదర్శిని నుండి సీమసంతకం దాకా 30 గ్రంథాలకు సంపాదకత్వం వహించారు. అనేక విశ్వవిద్యాలయాల దూరవిద్యా వాచకాలకు దాదాపు వంద పాఠాలు రాశారు. కళాశాల అధ్యాపకులకు నిర్వహించే పునశ్చరణతరగతులలో దాదాపు 150 పాఠాలు చెప్పారు. కనీసం 50 జాతీయ సదస్సులో కీలకీపన్యాసాలు చేశారు.కరోనా సమయంలో దాదాపు 200 అంతర్జాల సదస్సులలో పాల్గొని, ప్రసంగించారు.

ఈయన రచించిన మన నవలలు-మనకథానికలు అనే విమర్శ గ్రంథానికి 2014లో కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఇటీవలే వైయస్సార్ లైఫ్ టైం అచీవ్ మెంట్ పురస్కారంతో గౌరవించింది. తెలుగు విశ్వవిద్యాలయం, విశాలాంధ్ర విజ్ఞాన సమితి ల నుండి అనేక పురస్కారాలు అందుకున్నారు. ఈయన సాహిత్యం మీద వివిధ విశ్వ విద్యాలయాల్లో తొమ్మిదిమంది విద్యార్థులు పరిశోధన చేసి ఎం.ఫిల్, పిహెచ్. డి లు పుట్టారు పొందారు. ఈయన పర్యవేక్షణలో 25మంది విద్యార్థులు పిహెచ్.డి చేయగా, 20మంది విద్యార్థులు ఎం. ఫిల్ చేశారు. గురజాడ సాహిత్యం నన్ను మార్చింది అని సగర్వంగా చెప్పుకునే రాచపాళెం ప్రకాశిక పత్రిక తెలుగులో ఉద్యమకవిత్వం ప్రత్యేక సంచికకు సంపాదకత్వం వహించారు.






# కవిత్వం-సమాజం

ఈ సంచికలో, సమాజంలోని అసమానతలని, వేదనలని ఎత్తిచూపుతూ ఉద్వేగభరితంగా రాసిన కవితల ఉద్యమాల గురించి వివరంగా, విశ్లేషణాత్మకంగా రాసిన చక్కని వ్యాసాలు ఉన్నాయి. కవిత్వోద్యమాల ద్వారా ప్రజా సమస్యల్ని జనబాహుళ్యానికి తెలియచేస్తూ పరిష్కారాలు వెదికే దిశగా ఉత్తేజపరచవలసిన అవసరం ఎంతైనా ఉంది. అనుకోకుండా, గూగులయ్య దయవల్ల దొరికిన ద్వానా శాస్త్రి గారి వ్యాసం కవిత్వోద్యమాల గురించిన విహంగ వీక్షణంలా ప్రకాశించింది.

కమ్యూనిజం, సోషలిజం స్ఫూర్తితో అభ్యుదయ, విప్లవ కవిత్వాలు రాసినవారు ఆ వ్యవస్థలు నిజంగా అభ్యుదయ సమాజానికి ప్రతీక, ప్రతినిధి అని నమ్మి రాసారు. రష్యా, చైనాలు కమ్యూనిజాన్ని వదిలి పెట్టుబడిదారీ వ్యవస్థని అనుసరించి రాజ్య విస్తరణాకాంక్షతో విశృంఖలంగా విజృంభిస్తోంటే అలనాటి కమ్యూనిజం ఇచ్చిన ఉత్తేజంతో ఉరకలెత్తిన కవులు కొంతమంది ఇంకా అదే మత్తులో ఉన్నట్లు కనిపిస్తోంది. ఒకప్పటి కమ్యూనిష్టు రాజ్యాలయిన చైనా, రష్యాలలో మనుషులు పాలకుల చేతిలో ఊచకోతకి గురవుతూ ఉంటే, ఆ దేశాలలో అధికారంలో ఉన్నవారు సంపదని కొల్లగొడుతూ ప్రజలని అణగా దొక్కుతోంటే అదే స్ఫూర్తితో కవితలు రాయడం కష్టం కదా. అనుచితం, అసంబద్ధం కూడా. ఇజాలకతీతంగా మానవుల దుస్థితిని నిరసిస్తూ, సమసమాజ నిర్మాణ స్ఫూర్తి వైపు

పౌరుల మనోస్థితిని సమాయత్తం చేయడం అభ్యుదయ, విప్లవ కవిత్వాల ఉద్దేశం, ధ్యేయంగా ఉండాలి.

అభ్యుదయ భావాలని పద్యరూపంలో చెప్పిన వేమనని ప్రజా కవిగా అభ్యుదయ కవిగా పొగుడుతున్నాం. అదే పద్య ప్రక్రియలో అభ్యుదయ, విప్లవాత్మక భావాలని వెదజల్లిన జాషువా, కరుణశ్రీ ల వంటి కవులని మాత్రం ఆ కోవలో జమకట్టి గౌరవించలేకపోతున్నాం. అభ్యుదయ తత్వం కమ్యూనిజం మూసకి మాత్రమే పరిమితి అయ్యేలా నిర్వచించడం వల్ల ఆ కవిత్వ ధోరణి విస్తృతి నియంత్రించబడింది. కమ్యూనిజం ప్రభావం ప్రపంచవ్యాప్తంగా సన్నగిల్లడంతో అభ్యుదయ కవిత్వ ఉద్యమం నీరుగారిందనిపిస్తోంది. ఇప్పటికీ, ప్రపంచవ్యాప్తంగా ప్రజల సమస్యలు, సమాజ స్థితిగతులూ దైన్యంగానే ఉన్నాయి. ఎవరిని నిందిస్తాం? ఏ వ్యవస్థని నిరసిస్తాం? రాతలలో కమ్యూనిజం, సోషలిజం వెల్లువిరిసినా, వాస్తవ జీవితంలో పెట్టుబడిదారీ, పెత్తందారీ వ్యవస్థలకి ప్రతినిధులుగా వ్యవహరించే కొంతమంది కవుల తీరు వారి స్ఫూర్తిదాయకమైన పలుకులకి విలువ తగ్గిస్తోంది అనిపిస్తోంది.

నిరసన ప్రాతిపదికగా కాకుండా ప్రజా సమస్యలని వెలుగులోకి తెస్తూ, సమాజం లోని లోపాలు ఎత్తిచూపే విధంగా, ప్రజల దృష్టిని ఆకర్షిస్తూ ప్రభావవంతంగా రాయగల కవిత్వం ఏదైనా అభ్యుదయ కవిత్వమే. ఏ సిద్ధాంతాన్నయినా నమ్మి, ఆచరించి రాసే ఏ మాటయినా అభ్యుదయ గీతమే అవుతుంది. "చిత్తశుద్ధి లేని శివ పూజాలేలయా" అన్నట్టు రాసే దానికి, చేసే దానికి పొంతన లేని రచయితలు సమాజంలో ప్రభావశీల పాత్ర వహించలేరని నా నమ్మకం. కొన్ని సంవత్సరాలు మాటల ద్వారా ప్రభావితం చేసినా చరిత్ర లో చిరకాలం నిలవడం కష్టమే. ఈ సందర్భంగా నమ్మిన సిద్ధాంతాన్ని చెప్పి ఆచరించిన మహానుభావులు కందుకూరి వారిని తలుచుకుంటూ ఒక వ్యాసం కూడా వేస్తున్నాం.

అభ్యుదయ కవిత్వ రచన ఒక వృత్తి కాదు. అభ్యుదయ భావాలు మన ప్రతీ పనిలోనూ, ఆలోచనలలోనూ, ప్రతి మాటలోనూ ఉన్నప్పుడే అభ్యుదయ భావనలు వేసంగి లో మల్లెల పరిమళంలా, ఉక్కపోతకి గురవుతున్న సమాజంలో సువాసనతో కూడిన ఒక తాజా "సువాసనాలోచనలని", ఆశలని మొలకెత్తిస్తాయి.

ఈ సంచిక లోని వ్యాసాలు భావి విద్యార్థులకీ, పరిశోధకులకీ ఉపయోగకరంగా ఉంటాయని నమ్ముతున్నాను.

కొవ్వలి గోపాలకృష్ణ

ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ
ప్రధాన సంపాదకులు

# ముఖచిత్రం

తెలుగు కవితోద్యమాలు




# లోపల

## ప్రత్యేక వ్యాసాలు





## తెలుగు కవితోద్యమాలు

ప్రత్యేక వ్యాసం

# గాంధీజీ
## మహాత్ముడెందుకైనాడు?

*(వెనుక నొకప్పుడు మహాత్ముని ఒకానొక జన్మ దినోత్సవ సందర్భంలో రవీంద్రకవి గాంధీ మహాత్ముని గురించి శాంతినికేతన్ విద్యార్థులకు ఇచ్చిన ఉపన్యాసంలోని కొంత భాగ మిది).*

**అనువాదం: అమరేంద్ర**

నేడు మన దేశంలో దేశ ద్రిమ్మరులై సంచరించే సన్యాసులు, బైరాగులు ఎందరో వున్నారు. వీరికి లోకంతో సంబంధం లేదు. దేశంలోని దారణ సంక్షోభాన్ని, దారిద్ర్యాన్ని చూసి చలించరు. దానితో వారికి పని లేదు. వారికి కావలసిందల్లా తమ మోక్షమే. ఆ మోక్షంకోసం అభ్యాసాలు చేయటమే వారి పని. అటువంటి సన్యాసిని ఒక సారి ఒక పల్లెటూరిలో కలుసుకున్నాను. "ఆకలితోనూ, ఆ నారోగ్యంతోనూ అలమటించే ఈ నిర్భగ్యులకు మీరేమైనా సాయం చేయకూడదా?" అని ప్రశ్నించాను. నా ప్రశ్న విని ఆశ్చర్యంతోనూ, చిరాకుతోనూ ఆ సన్యాసి "ఏమిటీ! నేనా? సచ్చిదానందం కోసం ఈ మాయా ప్రపంచంలో బంధాలన్నీ తెంపి వేసుకున్నాను. మాయలో పడి కొట్టుకుంటున్న ఈ పల్లీయుల కోసం నన్ను మళ్ళీ ఆ మాయాజాలంలో జొరబడమంటున్నరా!" అన్నాడు.

ఇటువంటి వేదాంతంతో మన జాతి నిర్వీర్యమై, నీరసమై, నిద్రాణమైపోయింది. ఆ సమయానికి మన దేశ చరిత్రలో ఒక గొప్ప సంకటం వచ్చింది. అటువంటి



స్థితిలోనే మన దేశం పాశ్చాత్యుల సామ్రాజ్య తృష్ణను అరికట్టటానికి ఎదురుగా నిలబడవలసివచ్చింది. అంతకుముందెప్పుడూ లేనంత ప్రమాదకర స్థితి వచ్చింది. మునపు ఆర్యలు, ముసల్మానులు దేశంపై దండెత్తి రాజ్యాలు స్థాపించుకున్నారు. కాని, వారు మన దేశంలో స్థావరం ఏర్పరచుకొని మన దేశీయులుగా మారిపోయారు. వారు సాధించిన



ఘనకార్యాలు మన జాతి సంస్కారానికీ, యశస్సుకు వన్నెలద్దినవి. కాని, ఈ పాశ్చాత్యుల సామ్రాజ్యం చిత్రమైంది, భిన్నమైనది వీరు మనపై కూర్చుని పరిపాలించేరే కానీ వీరు మనలో ఒకరై కలిసిపోలేదు.

మన దేశం వీరి స్వాధీనం అయ్యింది కానీ, వీరు మాత్రం మన దేశీయులు కాలేదు. అంతకుముందు ఎప్పుడు ఇంతటి విచ్ఛేదనానికి, ఇంత వంచనకు గురికాలేదు. అంతకముందెవ్వరు మన దేశాన్ని ఈ విధంగా కొల్లగొట్టలేదు. పాశ్చాత్య నాగరికత సంపర్కం వల్ల, ప్రభావం వల్ల మన హిందూ సంస్కారంలో అనాదిగా వస్తున్న ఏకీభావం ముక్కలు ముక్కలైపోయింది. ఈ విధంగా పతితమై విచ్ఛిన్నమైపోయిన మన జాతికి ఎన్నటికైనా మోక్షమున్నదా? ఈ నిరాశ నుంచి, నిస్పృహ నుంచి జాతికి ఎన్నటికైనా విముక్తి ఉన్నదా?

మహానాయకుడు, సాధుమూర్తి, గాంధీ రంగంలో అడుగు పెట్టగానే, ఈ సందేహాలన్నీ మాయమైపోయినాయి అజేయమైన దివ్యశక్తి మహాత్మునిలో మూర్తీభవించినది. మహాత్ముడు మార్గదర్శుకుడై మనకొక గొప్పబాటను చూపించాడు. ఆ బాటలో మనందరం ముందడుగు వేసి సాగిపోగలిగితే మన జాతిని రక్షించుకోగలుగుతాము. ఇతర జాతులకు కూడా మార్గదర్శకులం కాగలుగుతాం.

స్వార్ధరాహిత్యం ఈ మహా పురుషునికి పరివేషం! వ్యక్తులకు స్వార్ధమున్నట్లే జాతులకు కూడా మితిలేని స్వార్ధం ఉంటుంది.! ఈ రెండువిధాలైన స్వార్ధాలకు దూరంగా నిలబడగలగటమే మహాత్ముని విశిష్టత.

సాధారణంగా రాజకీయ వేత్తల నీతినియమాలను అంత చెప్పొకోదగ్గవి కావు. అసత్యం చెప్పటం వారికి మంచి నీళ్ల ప్రాయం. తమ జాతి ఘనత కోసం ఇతర జాతులను వంచించటానికి, హింసించటానికి, వారు కొంచెమైన వెనుకాడరు.

రాజకీయ వేత్తలు కార్యసాధనమే తమ ముఖ్య ఉద్దేశ్యం అని గొప్పలు చెప్పుకుంటారు. తమ కార్యం సిద్ధిస్తే చాలు, తమ కార్యసాధనకు తోడ్పడితే చాలు ఎంత అక్రమ పద్ధతినైన సరే అవలంభిస్తారు. కొంచమైన సంకోచించరు.

కానీ మన భాగ్యవిధాతయైన మహాత్మునికి ఈ పద్ధతులు గిట్టవు. ఆయన క్షణికమైన, తాత్కాలిక మైన ప్రయోజనాలు కోసం విశ్వజనీనమైన, శాశ్వతమైన నీతి మార్గాన్ని వదిలేసి పెడదారి తొక్కమని ఎన్నడూ సలహా ఇవ్వలేదు. అట్లా ఉల్లంఘన చేస్తే ఎన్నడూ సహించనూలేదు.

> హింసను విసర్జించి స్వాతంత్ర్యం సంపాదించుకునే మార్గం ఆయన మనకు చూపించాడు. పాశ్చాత్యుల అనాగరికమైన యుద్ధాల సంగతి చెప్పనక్కరలేదు. భారతంలో ధర్మ యుద్ధంలో కూడా ఎంతో హింస, కాఠిన్యం ఉంది.

హింసను విసర్జించి స్వాతంత్ర్యం సంపాదించుకునే మార్గం ఆయన మనకు చూపించాడు. పాశ్చాత్యుల అనాగరికమైన యుద్ధాల సంగతి చెప్పనక్కరలేదు. భారతంలో ధర్మ యుద్ధంలో కూడా ఎంతో హింస, కాఠిన్యం ఉంది. కాని మొట్టమొదటి సారిగా ఈ అపూర్వమైన సందేశం విన్నాను. “ఇంకోకరి ప్రాణాలు బలి తీసుకోరాదు. మన ప్రాణాన్నే సమర్పణ చెయ్యాలి. ఈ ఆత్మ బలిదానమే మనకు నిజమైన విజయసోపానం!”. ఎంత అద్భుత సందేశం ఇది.! ఇది కుటిలమైన రాజనీతి కాదు, ఇది కేవలం రాజకీయమైన సాధనోపాయం కాదు. అధర్మయుద్ధంలోనైతే మరణం వినాశనం; మరణమే సమాప్తి. కానీ అహింసాయుతమైన ధర్మయుద్ధంలో మరణం అమరత్వానికి, పరాజయం విజయానికి ప్రాతిపదికలు కాగలవు.

ఇదివరకు మాదిరిగానే భారతదేశం తనను జయించిన జాతి యొక్క సంస్కారంలోను, ధర్మం లోను వుండే ముఖ్యమైన అంశాలను గ్రహించి, వాటిలో మానవజాతికి తానొక వినూతన సందేశాన్ని అందించింది. క్రైస్తవ మతం లో మానవజాతిని ఉద్ధరించుటకు భగవంతుడే మనుష్యరూపమెత్తినాడనీ, మానవుల పాపాల బరువునంతా తాను మోసి బాధలు పడ్డాడని ఒక అద్భుతమైన విశ్వాసం ఉంది. తిండి లేని వారికి ఆహారం, గుడ్డలేని వారికి దుస్తులు ధర్మం చెయ్యాలని క్రైస్తవ మతం ప్రబోధించినంతగా ఇంకేమతము బోధించలేదు.

అట్లాగే దానమూ, ధర్మమూ అనే పవిత్ర ధర్మాలను మన మతం కూడా ప్రచారం చేసింది. కానీ క్రైస్తవ మతంలో తోటిమానవుని మీద ప్రేమ వల్లనే ఈ సిద్ధాంతాలు పుట్టినాయ్ ఈ అమూల్యమైన సందేశాన్ని మహాత్ముడు అద్భుతంగా ఆచరణలోకి తీసుకువచ్చారు. అదృష్టవశాన మహాత్ముడు క్రీస్తు సిద్ధాంతాలను వారి మాత ప్రచారాకుల వలన గ్రహించలేదు. తన జీవితంలోని అనుభవాల వల్ల, సంఘర్షణల వల్ల అహింస యొక్క విలువను పూర్తిగా గ్రహించిన టాలస్టాయ్ దగ్గరనే మహాత్ముడు అహింసా సిద్ధాంతాలను నేర్చుకున్నాడు.

> సాధువులే ధరాధిపతులు కాగలరని క్రీస్తు ప్రబోధించాడు. కానీ క్రైస్తవులు మాత్రం క్రూరులకే, హింసాప్రమత్తులకే విజయం సిద్ధిస్తుందని విశ్వసిస్తున్నారు.

సాధువులే ధరాధిపతులు కాగలరని క్రీస్తు ప్రబోధించాడు. కానీ క్రైస్తవులు మాత్రం క్రూరులకే, హింసాప్రమత్తులకే విజయం సిద్ధిస్తుందని విశ్వసిస్తున్నారు. దీంట్లో ఆశ్చర్యపడవలిసింది ఏమిలేదు. వారికి ఈ సిద్ధాంతం విరుద్ధంగా, అసత్యంగా అనిపించింది. సృష్టి పరిణామమంతే. హింసాపూరితం, స్పర్ధ ప్రేరేపితం కనుక మరొక ప్రవక్త ప్రభవించి, సాధుత్వం అంటే సత్యంతోనూ, మైత్రి తోనూ ధర్మంతోనూ, కూడిన సత్యాగ్రహ శక్తి అని ప్రబోధించవలసిన అవసరం వచ్చింది. సాధుత్వం అంటే లొంగిపోవడం కాదు. అక్రమాన్ని, అన్యాయాన్ని సహిస్తూ ఊరుకోవడం సాధుత్వం కాదు, ఆ విధంగా సహించడం పిరికితనం. అటువంటి వారు తమకు తెలియకుండానే క్రూర శక్తులకు సహకారం చేసినవారు అవుతగారు. కానీ మహాత్ముడు ప్రబోధించిన సాధుత్వం, అహింసా ఉత్కృష్టమైన ధీరతా లక్షణాలు. బలమదాంధుల క్రూరతకు అహింస ప్రబలవిరోధి. వారి దౌర్జన్యానికి ఎదురు నిలిచి గెలిచే అజేయమైన అద్భుత శక్తి అహింస.

ఆయన జీవితం అహింసా పథంలో మనలను ముందుకు తోడ్కొనిపోయే అమరజ్యోతి కాదా! ఆ బాటలో మనం ఎంత మందంగా ముందుకు సాగినా, ఆయన సందేశం మాత్రం మన హృదయాలలో ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది.

*భారతి పత్రిక నుంచి పునర్ముద్రణ*
*(1948_02_01_Volume_no_25_issue_no_2)*

ప్రత్యేక వ్యాసం

# ఆధునిక సాహిత్య యుగపురుషులు- కందుకూరి వీరేశలింగం పంతులు



డా. జక్కు రామకృష్ణ
✆ 94414 27386



జనులు అవిద్యతో మూఢ విశ్వాసాల కారు చీకట్లో కొట్టుమిట్టాడుతున్నప్పుడు, జనహితాన్ని చేకూర్చేవలసిన సాహిత్యం వికృత చేష్టలతో, స్త్రీల అంగాంగ వర్ణనలతో రాజాస్థానాలలో అరాచక పైశాచికానందభోగాలను

అనుభవిస్తున్న తరుణంలో, చీకట్లను చీల్చుకుంటూ ఉదయించిన ప్రతిభా భానుడులా వచ్చారు అధునిక సాహిత్య

యుగపురుషులు కందుకూరి వీరేశలింగం పంతులు గారు (16-04-1848 - 27-05-1919).

ఆంధ్రుల అదృష్టం ఆది కావ్యానికి శ్రీకారం చుట్టిన రెండో వాల్మీకి నన్నయభట్టు. ఆధునిక సాహిత్యానికి రెండు శ్రీలతో అనగా సంఘం సంస్కరణ ఒక శ్రీ, సాహిత్యానికి రెండు శ్రీకారంతో ఆరంభించిన యుగపురుషులు రావు బహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులుగారు. నన్నయ్య గారి లాగానే వీరుకూడా రాజమహేంద్రవరంలో జన్మించారు. ఇద్దరూ ఆంధ్రసాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. తెలుగు భాషా దీప్తిస్తంభాలై ప్రకాశిస్తున్నారు.

"సారమతిం కవీంద్రుల" పద్యం నన్నయ్య కవితా లక్షణాలను ఎలా తెలియజేస్తుందో, అలాగే వీరేశలింగం గారు కూడా తన కవితా రచన

విధానాలను వివరించారు. "తెలుగులో మొదటి వచన ప్రబంధం (నవల)ను నేనే చేసితిని, మొదటి నాటకం నేనే తెనింగించితిని, మొదటి ప్రకృతి శాస్త్రమును నేనే రచించితిని, మొదటి ప్రహసనం నేనే వ్రాసితిని, మొదటి చరిత్ర నేనే విరచించితిని, స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని, అయినను ప్రథమ ప్రయత్నములెప్పుడును ప్రథమ ప్రయత్నములే. అవి దోష బహుళములయి యుండుట స్వాభావికము. మనము వృద్ధి పొందగలుగుట చేసిన తప్పులను బట్టియే కాబట్టి మొదట చేయబడిన నా పుస్తకము నా తరువాత వారి గురుతర పుస్తక రచనకు కొంత తోడ్పడవచ్చును" (పుట 525 కందుకూరి స్వీయ చరిత్ర) అన్నమాటలు నిజమయ్యాయి.

> "సారమతిం కవీంద్రుల" పద్యం నన్నయ్య కవితా లక్షణాలను ఎలా తెలియజేస్తుందో, అలాగే వీరేశలింగం గారు కూడా తన కవితా రచన విధానాలను వివరించారు.

గురజాడవారు వీరేశలింగంగారి గురించి ఇలా అన్నారు ".... ఒక వైపు వాడుక భాష, క్రమక్రమంగా గుర్తింపు పొందుతుండగా, మరోవైపు గ్రాంధిక భాషే, పద ప్రయోగంలో ఎంతో స్వేచ్ఛ తీసుకుని రాసిన అత్యుత్తమ ఆధునిక వచన, రచనల్లోని వాడుక భాషకు దగ్గరగా వస్తుంది. నేడు తెలుగు సాహితీ ప్రపంచంలో అందరికన్న ప్రముఖులైన రాయ్ బహద్దూర్ కె. వీరేశలింగం పంతులుగారు ధృతప్రకృతికం మీది పరుషాల స్థానంలో సరళాలు వస్తాయనే సూత్రాన్ని ఖచ్చితంగా పాటించకుండా, ఇతరులకు తోవ చూపారు. వ్యాకరణ సూత్రాలను సంప్రదాయబద్ధమైన పదప్రయోగాలను బట్టి పాఠశాలల్లో బోధనబట్టి తప్పొప్పులను నిర్ణయించినట్లయితే ఆధునిక రచయిత ఒక్కరు కూడా అభిశంస నుంచి తప్పించుకోలేడు. పండితులు సంధి సూత్రాలను ఖచ్చితంగా పాటించాలన్న పట్టుదలను సడలించారు. సంప్రదాయక ప్రతిబంధకాలను ప్రక్కకు నెట్టే ఈ ధోరణిలోని గుణపాఠం స్పష్టమే. ప్రాచీన గ్రాంధిక భాష అనుకూలమైన పరికరం కాదని అనుభూతమైంది-------."(కన్యాశుల్కం-2వ కూర్పు, పుట 9) ఈ మాటల వలన ఒక యుగపురుషుడైన పంతులుగారు యుగకర్త గురజాడకు మార్గదర్శకులయ్యారని తెలుస్తోంది.

విద్యార్జన యందు ఆసక్తి మెండుగా ఉన్న వీరేశలింగంగారు ఏకసంతాగ్రహి. సంస్కృతాంధ్ర ఆంగ్ల భాష పాండిత్యం సంపాదించారు. ఒకటి, రెండు అష్టావధానాలు చేసినా ఆ మార్గం నరైనది కాదని విరమించుకున్నారు. సమాజ స్థితిగతులు కళ్ళముందు కదలాడుతున్నప్పుడు మేధావులైన మహా పురుషులు ఉపేక్షించక మంచి మార్గం వైపు నడవడానికి, సమాజాన్ని నడపడానికి ఏ సాహసానికైనా వెనుకాడరు అని నిరూపించుకున్నారు వీరేశలింగం పంతులు గారు. సాహిత్యం, సమాజం రెండు నేత్రాలు. సంఘసంస్కరణ విషయంలో "అతివాది", సాహిత్యం విషయంలో "మితవాది" వెరసి జనహితవాది. ప్రస్తుతం వీరేశలింగంగారి సాహిత్యాన్ని పరిశీలిద్దాం.

మహాశివరాత్రి నాడు ఉపవాస దీక్షతో మార్కండేయ స్వామి మీద కోటిలింగాల క్షేత్రంలో పద్యానికి శ్రీకారం చుట్టారు

క. శ్రీరమణీ హృల్లోలా<br>
కారుణ్య లతాలవాలా కాంచన చేలా<br>
ఘోరావహ జయశీలా<br>
శ్రీ రాజమహేంద్రవరపురీ గోపాలా

ఇలా రెండు శతకాలను రాశారు.

వీరేశలింగం గారి రచనలు సాహిత్య పరంగా మూడు విధాలు. 1) పత్రికా రచన 2) ఆంధ్రీకరణ, స్వతంత్ర గద్య పద్యాత్మక రచనలు 3) విదేశీయమైన ప్రక్రియలను నామమాత్రంగా గ్రహించి ఆధునికమైన భావ జాలంతో తెలుగుదనం ఉట్టిపడేలా రాయడం. దీనితో సాహిత్యం ద్వారా సకల జన చైతన్య దీప్తిని అందించారు పంతులుగారు.

**సాహిత్యం-మార్పు:** చక్రవర్తులు సామ్రాజ్యాలను స్థాపించారు. తరువాత వాణిజ్యం కోసం విదేశీయులు

పోర్చుగీసు వారు, డచ్ వారు, ఫ్రెంచి వారు, ఆంగ్లేయులు రావడం వలన భారతదేశంలో సాంఘిక, ఆర్థిక, సామాజిక బౌగోళిక, భాషా సంస్కృతులలో అనేకములైన మార్పులు వచ్చాయి. భారతీయ సంస్కృతిలో విదేశీ సంస్కృతులు చొరబడ్డాయి. పాలకులు, పాలితులలో మార్పులు, ఇంగ్లీషు, ఫ్రెంచి వారి భాషా విశేషాలు ప్రబలంగా ఉన్నాయి.

భారతీయ యువకులు ఆంగ్ల భాషను అభ్యసించడం, అచ్చు యంత్రాలు రావడం, యువకులుగా ఉన్న పంతులుగారు ఆంగ్ల సాహిత్యాన్ని అధ్యయనం చేయడం వలన విశ్వం పోకడలను అవగాహన చేసుకున్నారు.

ప్రభావితులైన ప్రతిభావంతులైన వీరేశలింగం పంతులు గారు విదేశీ సంస్కృతిలోని గుణాలను స్వాగతించారు. కాల్డ్ వెల్డా విడ భాష వ్యాకరణం, కాంబెల్ దొర తెలుగు భాష నవ్య మార్గం సూచనం, ఎల్లిస్, కోక్ బ్రూక్, సి.పి. బ్రౌన్ మున్నగు వారి కృషిని ఆదర్శంగా తీసుకుని వీరేశలింగంగారు తన మార్గాన్ని సుగమం చేసుకున్నారు. సులభ వ్యాకరణం వ్రాసారు.

**పత్రికల స్థాపన - రచన:** "పత్రికొక్కటి చాలు పది వేల సైన్యం" అని నార్ల వారు అన్నట్లు అప్పటికే ఆంధ్రాలోఎన్నో పత్రికలు వచ్చాయి. శ్రీ వీరేశలింగం పంతులుగారు 1874లో "వివేకవర్ధని" పత్రికను స్థాపించారు. సులభ శైలి పంతులు గారి అభిప్రాయం. అందుకు మొదటి పద్యం

బ్రాహ్మణుండను హూణ భాషనేరిచియందు
నేనేఁబ్రవేశ పరీక్ష నిచ్చినాడ
నాంధ్రమున నొకింత యభిరుచి గలవాఁడ
దేశాభివృద్ధికై లేశమైన
బ్రాలుమాలక పాటుపడ నిచ్చ గలవాడ
గవితాపటిమ కొంత గలుగువాడ
నోపిక సర్వజనోపయోగములైన
విషయమ్ములును నీతి విషయములును
సులభశైలి నందఱకును దెలియునట్టి
కఠిన సంధులు లోనుగాఁగలవి విడిచి
వ్రాయుదు నొకప్పుడన్య దేశీయములను
లోనుగాఁగల వానినిఁబూనికూర్తు (వివేకవర్ధని డిసెంబర్ 1874)


SRI VIVEKAVARTHANI.

శ్రీ వివేకవర్ధని

A MONTHLY MAGAZINE OF MORALITY &

RAJAHMUNDRY.

Vol. III.] No. 2.

February, 1878.

CONTENTS.

| | | | |
|---|---|---|---|
| Native Civil Service. | | Vaccination. | |
| | | Our Hospital Assistant. | |
| Good Luck. | | Correspondence. | |
| | | Happiness lies in constitution. | |

RAJAHMUNDRY.

Printed at the Vivekavarthani Press.

1891లో చింతామణి పత్రికను ప్రారంభమైయింది. పంతులు గారు తన నవలను, రచనలను ఈ పత్రిక ద్వారా ప్రచురించారు. చిలకమర్తి వారు ఈ పత్రిక నవలల పోటీలో పాల్గొని బహుమతులు అందుకున్నారు. మరో పత్రిక "హాస్య సంజీవని" సంఘ హాస్యాత్మ కమైన రచనలు ఇందులో ప్రచురింపబడ్డాయి. లంచములు తగవన్న రాజకీయోద్యోగులకు కోపము వేశ్యాంగన సంగమము నీతికాదన్న శృంగార నాయకులకు కోపము పూర్వాచారములు మార్చుకోవలెనన్న పామర జనులకు కోపము నీతిమాలిన బాహ్య వేషములు మత విరుద్ధములన్న ఆచార్య పురుషులకు కోపము మా పత్రికలో నుద్దేశమును నిశ్శంకముగా నిర్వహింపవలసినచో నిన్ని కోపములను సరకు చేయుకుండవలెను. ఈ పద్యము

వలన వీరేశిలింగంగారికి సమాజంపై గల అభిప్రాయం స్పష్టమగుచున్నది.

**ఆంధ్రీకరణము - గద్య పద్య సాహిత్యం:** పిల్ల వసుచరిత్రలు పిల్ల కాలువలా పరుగులు తీస్తున్న సమయంలో

వీరేశలింగం గారు కూడా మొదట్లో ఆ ప్రభావానికిలోనై ప్రబంధాలు రాశారు. 1870 నాటికి "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము","శుద్ధాంధ్రోత్తర రామాయణము" రాశారు. "నీతి గీతిక" పద్యాలు ఆబాలగోపాలానికి

అనువుగానున్నట్లు రాశారు.

గీ: తాత ముత్తాత లెంతెంత ధనము కూడఁ
బెట్టె, బెట్టెల నిండంగ బెట్టియున్నం
గష్టపడి, తాను న్యాయమార్గమునఁ బడయు
స్వార్థితంబొక గవ్వతో సమానముగాదు

అలాగే ఆనాటికున్న "గర్భ కందం" "కందకర్భ సీసం" కందము గోమూత్రకా బంధము వీటిని పురుషార్థ ప్రదాయిగా ప్రకటించారు.

సీ. ముద్దియ విద్దె మున్నున్నదంటుకుఁ
గబ్బము లెక్కు తార్కాణగాగ... ఇలా అచ్చ తెనుగు కావ్యాలను రాశారు.

నీతికథామంజరి 1898లో చిత్ర పటములతో రెండు భాగములుగా ప్రకటించారు. ఇంగ్లీషులో ఉన్న ఈశపు కథలను అనువదించారు.

కష్టపడు నట్టి వారు లోకంబు తోడ
మొఱ్ఱ పెట్టరు తమ కష్టములను గూర్చి
వట్టి వారలేయఱతురు మెట్టి పడుచు
గొడ్డు గేదెలకరపులు గొప్పగావే

ఎన్నో నీతి శతకములు రాశారు. సత్య ద్రౌపదీ సంవాదం, మాతృ పూజ, పితృ పూజ అనునవి స్త్రీల కోసం ద్విపదల్లో పాడుకోవడానికి వీలుగా రాశారు. 1889లో స్త్రీ దీపిక రాశారు. స్త్రీ విద్య అవసరాన్ని గుర్తించారు.

విద్యవలనను జ్ఞానంబు వెలయుగాన
నవనినిది మంచి యిది చెడ్డ అని తెలియ
బాలురను బోలె! దప్పక బాలికలను
విద్య నేర్పంగ వలయును హృద్యముగను

సుమారు 113 గ్రంథములను రచించారు, 21 ప్రాచన గ్రంథాలను పరిష్కరించారు. అభిజ్ఞాన శాకుంతలం నాటకాన్ని చక్కగా తెనిగించారు పంతులుగారు. ఉదాహరణకు ఒక శ్లోకం.

సూ : తవాస్మి గీతరాగేణ హరిణా ప్రసభం హృత
ఏషరాజేన దుష్యంతస్సారంగేణాతి రంహసా (ప్రథమాంకం)

అనువాదం : "రమ్యమగు నీదు మృదుగీత రాగమునను
బలిమి మెయి సమాకర్షింపఁడిన వాఁడ
లీల నతివేగవంతమౌ లేడి చేత
వడిగ దుష్యంత నృపుఁ డీడ్వబడిన యట్లు

నాటకం ఆసాంతం ఔచిత్యవంతంగా ఆంధ్రీకరింపబడింది. నాటకేషు శకుంతలా అన్న నానుడకి తగ్గట్టుగా

అనువదించారు పంతులుగారు.

**విదేశీ ప్రక్రియలు - స్వతంత్ర రచన:** దుర్గుణములు ఉన్నచో దేశీయములైనను విడువదగినవి. సద్గుణములున్నచో విదేశీయుములైనను శిరోధార్యములే అగుచున్నవి. ఈ మాటలను సత్యంగా గ్రహించిన ఉత్తమ సాహిత్యవేత్త, కవి, రచయిత వీరేశలింగం పంతులుగారు.

మన తెలుగు భాష లక్షణ, లక్ష్య సంప్రదాయాలను అనుసరించి పద్య ప్రబంధాలను రాశారు. కానీ ఆయనకు సంతృప్తి లేదు. భాషాభివృద్ధికి, ప్రయోజనానికి ఆ ప్రక్రియలు ఉపయోగం కావని తెలియజేయడానికి తన సాహిత్య మార్గాన్ని మార్చుకున్నారు. అభాగ్యోపాఖ్యానం, సరస్వతీ నారద విలాపము కావ్యాలను రాశారు.

సీ. దయమాలి తుదముట్ట తలకట్లు నిగిడించి
వీరుడై నన్ను బాధించు నొకడు
పాదంబు లోపల పాదంబు నిమిడించి
వీరుడై నన్ను నొప్పించునొకడు
ప్రాసంబు పై పెక్కు ప్రాసంబులడరించి
పోటు బంటయి నన్ను పొడుచునొక్కడు
బెండు పల్కులుగూర్చి నిండైన నగలంచు
దిట్టయై చెవులు వేధించునొకడు
ఖడ్గ చక్రాది రూపముల్ గానిపించి

వర్ణముల్ మార్చినను చిక్కు పరచునొకడు
కుమతులొడ లెల్ల విరచి ప్రాణములు తీయ
ఒడలి పసలేక శుష్కించియున్నదాన

ఈ పద్యం వలన వీరేశలింగం గారి ఆలోచనలు పాత కవిత్వానికి భరత వాక్యం, నవ్య కవిత్వానికి నాంది వాక్యం అయ్యింది. పద్యం అయినా, గద్యం అయినా, వచనం అయినా, సాహిత్య ప్రయోజనాన్ని ఉద్దేశించి రాసిందే కావాలి.

తెలుగుదనం అందులో ఉట్టి పడాలి. "తెలుగులో పద్య కావ్యములు కంటే వచన కావ్యం వ్రాయుట ఎక్కువ ఉపయోగ కరమని నాకు తోచినది అని ). ఆంధ్ర కవుల చరిత్రలో రాశారు. "(స్వీ.చ. పుట 437)

"నేనారంభించిన కాలమందు తెలుగులో నిప్పటివలె వివిధములైన పుస్తకము లేవు. ఏ విధములైన వచన పుస్తకములు లేవు. అప్పుడు అన్నియు నూతన సృష్టి చేయవలెను" అని పంతులు గారు స్వయంగా తెలియజేశారు.

నవల, కథ, వ్యాసం, పద్యకావ్యం, రూపకం, ఆంగ్ల భాషా ప్రభావంతో స్వతంత్రంగా తెలుగులో రాశారు. దేశము కాలము, ప్రజలను గాంచి కవితా లతాంగి వెలయాలని తిరుపతి వెంకటేశ కవులు అన్నారు. కానీ వారికి ఆంగ్ల భాష పాండిత్యం లేదు. బహుముఖ ప్రజ్ఞాశాలి పంతులుగారు సంస్కృతాంధ్ర, ఆంగ్ల భాష పాండిత్యం సాధించారు. పాత కొత్తల మేలుకలయికతో తన రచనలు సాగించారు.

వీరేశలింగం పంతులు గారు "రాజశేఖరచరిత్రము" 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్" అంగ్ల నవలను ఆధారంగా రాశారు. అంతేకాకుండా ఇంకా చాలా నవలలను రాశారు. ఈ నవల పూర్తిగా తెలుగుదనాన్ని సంతరించుకొన్నది. రాజశేఖరుడు రాజమహేంద్రవరానికి దగ్గర్లో ఉన్న ధవళగిరిలో ఉండేవారు. సంపన్న గృహస్థులు, పూర్వాచార పరాయణులు. ముఖస్తుతికి తలకు మించిన దానధర్మాలు

> వీరేశలింగం పంతులు గారు "రాజశేఖరచరిత్రము" 'వికార్ ఆఫ్ వేక్ ఫీల్డ్" అంగ్ల నవలను ఆధారంగా రాశారు. అంతేకాకుండా ఇంకా చాలా నవలలను రాశారు. ఈ నవల పూర్తిగా తెలుగుదనాన్ని సంతరించుకొన్నది.

చేశారు. నిర్ధనులు అయ్యారు. రాజశేఖరుని గారి పెద్ద కుమార్తె రుక్మిణి. ఆమెకు 14 సంవత్సరములు. వివాహం అయినది. భర్త ఎవరికీ చెప్పకుండా దేశాంతరం వెళతాడు. రెండో కూతురు సీత. ఆమెకి 7 సంవత్సరములు. రాజశేఖరుని భార్య మాణిక్యాంబ. పెద్ద కుమారుడు సుబ్రహ్మణ్యం. రాజశేఖరుని బావమరిది దామోదరం బాగుపడ్డాడు. కాశీ నుండి తిరిగి వచ్చినపుడు కుటుంబం దొంగల వలన దోచుకోబడి, కకావికలం అయ్యింది. మూఢ విశ్వాసాల వలన మోసగించబడతాడు. చివరకి జైలుకు కూడా వెళ్ళాడు. రామరాజు రాజశేఖరుని కుటుంబానికి సహకరిస్తాడు. కొంతకాలానికి రాజశేఖరుకి శోభనాద్రి రాజాతో స్నేహం, చివరికి కుటుంబం అంతా కలవడంతో కథ సుఖాంతం అవుతుంది.

కథ రచనకు - మార్గదర్శి

ఆంగ్లం వలన ప్రభావితులైన పంతులుగారు "సత్యరాజు పూర్వ దేశ యాత్రలు" స్త్రీల గురించి మన వారు చేసిన అన్యాయాల గురించి వ్యాజ రీతిని రాశారు. గలివర్స్ ట్రావెల్స్ లో ఇలాంటి ఛాయలు కనిపిస్తాయి. "లంక ద్వీపం కథ". "ఆడ మలయాళం" జ్యోతిష్య శాస్త్రం గురించి జాతకాది విషయాలను మూఢవిశ్వాసాలను తూర్పారబట్టారు. అనువాద కథలు "ద కామిడీ ఆఫ్ ఎర్రర్స్" ని చమత్కార రత్నావళి గానూ రోమియో ఎండ్ జూలియట్"ను మాలతీ మధుకరంగాను ఇలా 16 అనువాద కథలు చక్కగా చిత్రీకరించారు. పాశ్చాత్య దేశాలలో స్త్రీలకు ఉన్న స్వేచ్ఛ భారతీయ స్త్రీలకు లేదన్నారు. స్త్రీలకు చదువులు చాలా అవసరం అని సందేశాత్మకంగా రాశారు. అరిషడ్వర్గాలు అన్నవి అన్ని దేశాల్లో మనుషులకు ఒకేలా ఉంటాయని గ్రహించాలన్నారు. సంధి, విగ్రహం సులభమైన తెలుగులో వ్రాసి గద్యతిక్కనగా పేరుగాంచారు.

> "ఆంగ్లం వలన ప్రభావితులైన పంతులుగారు "సత్యరాజు పూర్వ దేశ యాత్రలు" స్త్రీల గురించి మన వారు చేసిన అన్యాయాల గురించి వ్యాజ రీతిని రాశారు."

**అత్మకథ:** ఆంగ్ల సాహిత్య ప్రభావంతో తన ఆత్మ కథను విపులంగా వ్రాసి ఆదర్శప్రాయులు అయ్యారు. అలాగే చరిత్ర గ్రంథాలు, శాస్త్ర గ్రంథాలు, జీసస్, రాజా రామమోహనరాయ్ చరిత్రలను వ్రాశారు. పదార్థవివేచనా శాస్త్రం, శరీర

శాస్త్రం, స్త్రీల కోసం దేహారోగ్య ధర్మ బోధిని, జంతు స్వభావ చరిత్ర, ఇలా పాశ్చాత్య శాస్త్ర జ్ఞానంతో ప్రజోపయోగకరంగా రచించారు.

**ప్రహసనములు:** సంఘంలోని దురాచారాలను ఖండిస్తూ, హేళన చేస్తూ ఎక్కువ ప్రహసనములను రాశారు.

అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనం, విచిత్ర వివాహ ప్రహసనం, మహా బధిర ప్రహసనం, పునర్నిర్మాణ ప్రహసనం, బలత్కార గాన వినోద ప్రహసనం, యోగ నిద్ర ప్రహసనం, కలహప్రియ ప్రహసనం, మహామహోపాధ్యాయ ప్రహసనం, మహా వంచక ప్రహసనం, అసహాయ శూర ప్రహసనం ఇలా ఆంగ్ల భాషా ప్రభావంతో తెలుగువారి కథలకు ప్రహసనాలుగా రచించారు.

వీరి నాటకాలన్నీ ప్రదర్శన యోగ్యమై ప్రదర్శింపబడినవి. రావు బహదూర్ కందుకూరి వీరేశలింగం పంతులు గారు రాజమహేంద్రవరం గవర్నమెంట్ ఫస్ట్ గ్రేడ్ కాలేజీలో ప్రధాన పండితులు. మహారాజ రాజశ్రీ శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారికి 1893 సంవత్సరమున ఇండియా గవర్నమెంట్ వారు "రావుబహద్దర్" అను బిరుదు ఒసంగిరి. (స్వీ. చ. 380) పంతులు గారికి ఎన్ని బిరుదములు ఇచ్చినా చాలవు. అటు వెయ్యి సంవత్సరాల సాహిత్యాన్ని సమాజాన్ని చదివారు. ఇటు మరో వెయ్యి సంవత్సరాలకు మించి రాబోవు తరాలకు ఆదర్శమైన సాహిత్యాన్నిఅందించారు. ఇంతటి మహత్తరమైన కార్యం యొక్క మహానుభావుడైన యుగపురుషులుకే సాధ్యం. సదా స్మరణీయం.

"తన దేహము తన గేహము
తన కాలము తన ధనమ్ము తన విద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘనుడీ వీరేశలింగం కవి జనులారా!" అన్న చిలకమర్తి మాటలు సత్యం.

" కొట్టుకుపోయే కోటిలింగాలలో వీరేశలింగమొక్కడె మిగిలెనుచాలు" అని వీరేశలింగం పంతులుగారి గురించి ప్రముఖ కవి, విమర్శకులు ఆరుద్ర గారు చక్కగా తెలియజేశారు. దక్షిణదేశ విద్యాసాగరునిగా పేరొందిన ఆధునిక సాహిత్య యుగపురుషులు సదా ప్రాతఃస్మరణీయులు.

# గోరలు పోయె గోడు మిగిలె



ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ

మాకొద్దన్నాం, మనకొద్దన్నాం
గాంధీ ముద్దన్నాం  గోర నేతలొద్దన్నాం
మన భూమి మన సొత్తన్నాం, స్వపరిపాలన మన హక్కన్నాం
గోరగాళ్ళకి  గోరీ కట్టేం, తరిమి తరిమి తిరగ్గొట్టేం

ఆజాదొచ్చింది, మహాత్మ చావు తెచ్చింది
చంపినోళ్ళు గోరగాళ్ళు కాదు, మదమెక్కిన మత పిచ్చోళ్ళు
ఓట్ల పండగలొచ్చై, దండగ నేతల్ని తెచ్చై
గోరనేతలు పోయె, కాల దందాలొచ్చె
నల్ల సూట్లు పోయె, తెల్ల ఖద్దరొచ్చె

కరువొస్తే గోరగాళ్ళ తప్పన్నాం
కలతొస్తే తెల్లదొరలకి ఉసురెట్టాం
కరువు, కలత మనతోటే ఉంటున్నై
నిందించడానికి తెల్ల దొరలు లేరు, శపించడానికి తెల్ల బాబులూ  లేరు
ఏదో ఒక  పార్టీనందామంటే, ఎవరెటున్నారో తెలీదు
గోర పాలన పోయె, గోర దొరలు పోయె, ప్రజల గోడు మిగిలె

మచి రోజులొస్తాయని విన్నాం
స్వఛ్ఛ దేశం, రామ రాజ్యం వచ్చేస్తాయని ఎదురు చూసాం
నల్ల ధనం నడిచొస్తుందంటే ఆశ పడ్డాం
మాల్ రాలే, మాల్యా పోయే

భారత జనత పార్టీలతో పరేషానుంది
గట్టి మాటలు నీటి మూటలని తెలిసీ నమ్మాం
రంగుల కలలు కన్నాం,
వాస్తవిక క (కా)షాయాన్ని మౌనంగా దిగమింగుతున్నాం

గోరగాళ్ళు లేరు, ఎవరిని నిందిద్దాం?
ఎవరిని పొమ్మందాం?
ఎవరికి గోరీ కడదాం?
తెల్ల దొరలు పోయె, తెల్లదనం పోలే ,
బడుగు రొదలు, బక్క వెతలు మిగిలె

అంకితం: జగన్నాథ రథచక్రాలొస్తున్నై ఏడవకండేడవకండి అని శ్రీ శ్రీ అభయమిస్తే నమ్మి ఎదురు చూసిన ప్రజలకి; అందరికీ కూడు గుడ్డ అన్న అమ్మ నినాదం నమ్మిన అమాయకులకీ; మంచి రోజులు ముందున్నాయంటే, కాబోసు అని ఎదురు చూస్తూ ఉన్న సవా సౌ కరోడ్ దేశ ప్రజలకి, ప్రేమతో.



ప్రత్యేక వ్యాసం

# పంచవన్నె చిలుకలు సిరివెన్నెల పలుకులు



**డా. ఏనుగు నరసింహారెడ్డి**
89788 69183



ప్రగతిశీల భావాలున్న ఒక అమ్మాయి రాజ్యానికి వ్యతిరేకంగా సమర శంఖం పూరిస్తుంది. ఆ భావాలకు పునాదులు పేర్చిన బడిపంతులు లాంటి తండ్రి ఆమెకు మద్దతుగా నిలుస్తాడు. ఇద్దరూ ఈ సమాజపు అపసవ్యత మీద పోరాటం మొదలుపెడతారు. ఫలితంగా ఏం జరుగుతుందో మనమందరమూ ఊహించవచ్చు. మనం ఊహించినట్లుగానే 'అంకురం' సినిమాలో రేవతి ఇంటిని పోలీసులు ముట్టడిస్తారు. వస్తువులన్నీ చిందర వందర చేస్తారు. అణువణువూ సోదా చేస్తారు. ఇంట్లో పెద్ద విధ్వంసమే సృష్టిస్తారు. బయటికి వెళ్ళి వచ్చి జరిగిన విధ్వంసం చూసి తండ్రి కూతుళ్ళు బిత్తరపోతారు. నోట మాట రాక ఆగిపోతారు. చుట్టు పక్కల వాళ్ళు ఆ విధ్వంసం చూసి 'పోలీసుస్టేషన్ లో కేసు పెట్టాలి' అంటారు. తండ్రీ కూతుళ్ళిద్దరూ ఆ మాట విని పగలబడి నవ్వుతారు. ఆ సందర్భానికి సూటయ్యే పాట ఎలా రాయాలి, ఎవరు రాయాలి?

'ఎవరో ఒకరు ఎపుడో అపుడు
నడవరా ముందుకు అటో ఇటో ఎటో'

అని రాసారు. ఎవరు? సిరివెన్నెల సీతారామశాస్త్రి. ఏదో ఒక విధంగా తిరుగుబాటుకు తొలి అడుగు పడాల్సిందేనని సందేశం ఇచ్చే విధంగా రాస్తూ, అందులో సాధక బాధకాలుంటాయని, అయినా ముందుకే సాగాలని చెబుతూ అనేక దృష్టాంతాలిస్తారు.

'కదలరు ఎవ్వరూ వేకువ వచ్చినా
అనుకొని కోడికూత నిదురపోదుగా
జగతికి మేలుకొల్పుమానుకోదుగా
మొదటి చినుకు సూటిగా దూకిరానిదే
మబ్బుపొందుచాటుగా ఒదిగిదాగితే
వానధార రాదుగా నేలదారికీ
కాలమంటు లేదుగా బ్రతకడానికి'

> ఇంతటి కఠిన సన్నివేశంలో జీవన సత్యాలను చెప్పినట్లే ఎంతో సరదా సన్నివేశంలోనూ అంత వినూత్నంగా లౌకిక వాస్తవాలను చెబుతారు సీతరామ శాస్త్రి,

ఇంతటి కఠిన సన్నివేశంలో జీవన సత్యాలను చెప్పినట్లే ఎంతో సరదా సన్నివేశంలోనూ అంత వినూత్నంగా లౌకిక వాస్తవాలను చెబుతారు సీతరామ శాస్త్రి, బాటనీ, హిస్టరీ లెక్చర్ ను బంక్ కొట్టి మ్యాటని, మిస్టరీ పిక్చర్ ల బాట పట్టే టీనేజీ కుర్రకారు చెప్పే వాస్తవాలలాంటి పాదాలు సిరివెన్నెల ఎంత చమత్కారంగా చెబుతారో చూస్తే ఆశ్చర్యపోక మానరు. కాలేజీ కుర్రమూకలో ఒదిగి శివగా నాగార్జున, లవర్ గా అమల క్లాసులెగ్గోట్టి మార్చిలో ఫేలయినా సెప్టెంబరుందని మురిసిపోవడంతోనే ఆగిపోతే సిరివెన్నెల ప్రత్యేకత ఏమీ లేకపోయేది. కానీ వాళ్ళద్వారా అనిపిస్తున్న నిష్టురనిజాలు ఏంటంటే

'లెక్కలూ ఎక్కాలు తెల్వనోళ్ళు
లక్కుతోటి లచ్చలల్ల మున్గిపోతరు
పుస్తకాల్తో కుస్తీలు పట్టెటోళ్ళు
సర్కారీ క్లర్కులై ముర్గిపోతరు!'

విభిన్న సన్నివేశాలకు విచిత్రమైన పాటలు రాయాల్సిన వింత స్థితి సినీగేయకారులకు తప్పదు. శ్రీశ్రీ, దాశరథి, ఆత్రేయలాంటి కవులు తమ సాహిత్య సృజనలో సినిమా రంగాన్ని చిన్నభాగంగా చూసిన వారు అయినా కూడా ప్రేమ, ప్రణయం మాత్రమే కాకుండా కుప్పిగంతులకు కూడా పాటలు రాయాల్సిన దుర్గతిని ఎదుర్కొన్నారు. సముద్రాల, పింగళి, కొసరాజు, అరుద్ర, సినారె లాంటి తొలితరం గేయరచయితలు అసౌకర్యమైన సందర్భాలకు కూడా అందమైన గేయాన్ని సృష్టించి తమ ప్రతిభా వ్యుత్పత్తులను చాటుకునేవారు. సిరివెన్నెల

సీతారామ శాస్త్రిని కూడా మనం ఆ కోవలో లెక్కించవలసి ఉంది. నిజానికి సాధారణ ప్రేమ సన్నివేశాలను కూడా తరచూ వినగలిగే పాటగా మలవడం కష్టం.

'ఈ వేళలో నీవు ఏం చేస్తుఉంటావో
అనుకొంటు ఉంటాను ప్రతి నిమిషమూ నేను'

అనే సాదాసీదా వాక్యాలు రాసి కూడా కొన్ని లక్షల మందిని మెప్పించారు సిరివెన్నెల. నిజానికి

'ఈ క్షణం ఒకే ఒక కోరిక
నీ స్వరం వినాలని తీయగ'

కానీ

'మువ్వలా నవ్వకలా ముద్దమందారమా
ముగ్గులో దించకలా మొగ్గసింగారమా'

కానీ

'మెల్లగా తరగనీ రెండు మనసుల దూరం
చల్లగా తెరవనీ గుండెతలపుల ద్వారం'

కానీ

'హృదయం ఓర్చుకోలేనిదీ గాయం
ఇకపై తలచుకోరానిదీ ఈ నిజం'

ఇలాంటి పాటలు ప్రసిద్ధిలోకి రావడానికి కారణం సిరివెన్నెల కలం ముద్ర. చాలా మంది సినీగేయ రచయితల్లా ద్వంద్వార్థాలను ఆశ్రయించకపోవడమే కాకుండా, అంత్యప్రాసల్లో కృత్రిమత్వం లేకుండా చూడడం ఆయన ప్రత్యేకత. భాషలో ఎంత సారళ్యం ఉంటుందో అంతే మాధుర్యాన్ని కాపాడు కోగలగడం కూడా ఆయనకే స్వంతం. తను వందలాది సినిమాలకు రాసిన వేలాది పాటలలో ప్రబోధాత్మక గేయాల సంఖ్యను పెంచుకోగలగడం ఆయన ఒక్కరే సాధించుకున్న ప్రత్యేకత. 'మౌనంగానే ఎదగమని', 'జగమంత కుటుంబం నాది' లాంటి పుంఖాను పుంఖాలుగా వచ్చిన పాటల వల్ల 'లంగా ఓణీ నేటితో రద్దైపోనీ' లాంటి అనవసరపు పాటలు గాలికి కొట్టుకుపోయాయి. 'నిగ్గదీసి అడుగు ఈ సిగ్గులేని జనాన్ని' లాంటి పాటల్లో కొంత కాఠిన్యం ఉన్నట్లు శ్రోతలు మొదట భావించినా అంతరాంతరాల్లో కవికున్న సహృదయతను సమాజం గమనించి ఆహ్వానించింది.



చెంబోలుసీతారామశాస్త్రితనసృజన జీవితానికి ఏ అడ్డంకులూ లేకుండా చూసుకోవడంలో కృతకృత్యులయ్యారు. పోస్టుగ్రాడ్యుయేషన్ పూర్తికాకముందే కే.విశ్వనాధ్ 'జననీజన్మభూమిశ్చ' సినిమాకు పాటలు రాసినా 'విధాత తలపుల ప్రభవించిన అనాది జీవన వేదమే' ఆయన మీద సినిమా ముద్రను బలంగా వేసింది. గేయరచయితగా ఎంతో ప్రసిద్ధుడయినా గాత్రంలో, నటనలలో కూడా అభినివేశం ఉంది. 'తెల్లారింది తెగండోయ్ కొక్కరోకో' పాట ఆయన కాక ఇంకెవరు పాడినా అంత ప్రాశస్త్యం పొందేది కాదన్న బాలు మాట ప్రత్యక్షర సత్యం.

సినీగేయకవుల పాటలు చాలా వరకు పుస్తకరూపంలో వచ్చాయి. ఇటీవలి వరకూ, ఆయన జీవిత చరమాంకంలో పాటలకు తెలుగులో అత్యధిక రెమ్యునరేషన్ తీసుకుంది ఆయనే అంటే ఆశ్చర్యపోవలసింది లేదు కానీ పుస్తక రూపంలో ఆయన పాటలు తక్కువగానే వచ్చాయంటే ఆశ్చర్యపోవలసే ఉంటుంది. ఆయన కేవలం 10 పుస్తకాలు మాత్రమే ప్రచురించారు. మూడు మాత్రమే సినీగేయాలు. పదిసార్లు నంది పురస్కారాలు రావడంవల్ల ఆ పాటలను మాత్రమే నందివర్ధనాలుగా ప్రచురించారు.

బాగా ప్రసిద్ధిలోకి వచ్చిన గేయాల ఆధారంగా పరిశీలించినప్పుడు సినారే లాంటి అంత్యప్రాస సోయగంతోపాటు, మార్దవమైన భాషా ప్రయోగం ఈ కవిలో గమనించవచ్చు. భావంలోనూ, అభివ్యక్తి లోనూ సంప్రదాయముద్ర బలంగా

> సినీగేయకవుల పాటలు చాలా వరకు పుస్తకరూపంలో వచ్చాయి. ఇటీవలి వరకూ, ఆయన జీవిత చరమాంకంలో పాటలకు తెలుగులో అత్యధిక రెమ్యునరేషన్ తీసుకుంది ఆయనే అంటే ఆశ్చర్యపోవలసింది లేదు కానీ పుస్తక రూపంలో ఆయన పాటలు తక్కువగానే వచ్చాయంటే ఆశ్చర్యపోవలసే ఉంటుంది.




ఉంటుంది. సమయం దొరికినప్పుడల్లా సంస్కృతపద ప్రయోగం చేస్తుంటారు. ఈయన పాటలకు పట్టిన మరొక అదృష్టం సంగీతబలం, గొప్ప పిక్చరైజేషన్. ఈ రెంటి వల్ల పాట అనే బంగారానికి సంగీతం, దృశ్యీకరణ అనే పరిమళాలు అబ్బడం వల్ల సిరివెన్నెల చిత్రగీతాలు ప్రేక్షకుల మనసులో చెరగని ముద్రవేసాయి.

సినిమా పాట నిరంతరం ధరించే నగ 'అంత్యప్రాస'. అయితే చివరి పదంలో రెండు మూడు అక్షరాల పోలిక ఉండేలా పదాలు పడుతుంటాయి చాలా సందర్భాలలో చాలా మంది కవులకు. సిరివెన్నెల పద్ధతివేరు. గేయంలో మొదటి పాదం నడిచి రెండవ పాదం పూర్తిగా కావస్తున్నా అంత్యప్రాస జాడ కనిపించదు. కానీ చివరి ఒక్కక్షరం ఆ పాదాన్ని అంత్యప్రాసలోకి తెచ్చేస్తుంది. ఒక్క నకారం మాత్రమే ఆ లక్ష్యాన్ని సాధించే

'నమ్మక తప్పని నిజమైనా
నువ్విక రావని చెబుతున్నా
ఎందుకు వినదో నామది ఇపుడైనా'
అనే గేయం
'నువ్వేం మాయ చేసావో కానీ
ఓ మనసా చెప్పమ్మా నిజాన్ని'

అనేగేయం లాంటివి ఆయన పాటల గుమ్మిలోకొల్లలు. పాటను ఒక్కచోట పూర్తి గ్రామ్యంలోకి, వ్యవహారంలోకి దించగలరు. మరోచోట గొప్ప గ్రాంథిక మయమైన సంస్కృతంలోకి నడిపిస్తారు. ఒక తొలి కౌమార్యం ప్రారంభం కాని బాలిక ప్రకృతిలో మునక వేస్తూ పాడిన పాటలోని ఆటపదాలు తెలుగు పాఠకుల్ని ఉక్కిరి బిక్కిరి చేస్తూ

'తూనీగ తూనీగ ఎందాకా పరుగెడతావే రావే నా వంకా
దూరంగా పోనీక ఉంటాగా నీవెనకాలే రానీ సాయంగా
ఆవంకా ఈవంకా తిరిగావే ఎంచక్కా

ఇంకానా చాలింకా ఇంతేగా నీరెక్కా
ఎగిరేవా ఎప్పటికైనా ఆకాశం దాకా'

అంటూ సాగే పాటలో వ్యక్తమయ్యే పరవశాలకు కారణం గమకాలు, పదబంధాలు. ఇదే ఒడుపు 'తెల్లారింది లేవండో' పాటలోని ప్రతి పాదంలోనూ గమనించవచ్చు. 'బయం నేదు, గేయం నేదు',

'ముడుచుకున్న రెక్కలిరిసి', 'మూసుకున్న రెప్పలిరిసి' లాంటి అలతి అలతి పదాలకు గేయంలో స్థానం కలిపించి విజయవంతమయ్యారు. అదే కలం నుండి పాండితీ ప్రకర్ష ప్రదర్శించిన సందర్భాలున్నాయి. సిరివెన్నెల సినిమాలో మూగ సుహాసినికే గానం చేయాలనే ప్రేరణ కలిగించిన మున్ మున్ సేన్ పాటకు రాసిన ప్రసిద్ధ గేయంలో ఒక చోట

'సరస్వర సురఝురీ గమనమౌ సామవేద సారమిది' అంటారు; అదే పాటలో మరో చరణంలో

'ప్రాగ్దిశ వీణియపైన దినకర మయూఖతంత్రులపైన
జాగృత విహంగ తతులే వినీల గగనపువేదిక పైన
పలికిన కిలకిల స్వనముల స్వరగతి'

లాంటి గొప్ప సంస్కృతాన్ని తెలుగులా చెప్పారు. మరికొన్ని సందర్భాలలో తెలుగు సంస్కృతాల మేలి మేళవింపూ సిరివెన్నెలలో గమనించవచ్చు.

'అందెల రవళిది పదములదా
అంబరమంటిన హృదయముదా
అమృతగానమిది పెదవులదా
అమితానందపు ఎద సడిదా'

> పద మాధుర్యంలో సిరివెన్నెలది ప్రత్యేక ముద్ర. సిరివెన్నెల సినిమాలోనే ఇందుకు అనేక ఉదాహరణలు దొరుకుతాయి. ఒకచోట ' చలువ చందనములు పూయ' చందమామను రమ్మంటారు. మరో చోట 'మునిగిన మానసము వినియోగిని బృందావనం' అంటారు.



పద మాధుర్యంలో సిరివెన్నెలది ప్రత్యేక ముద్ర. సిరివెన్నెల సినిమాలోనే ఇందుకు అనేక ఉదాహరణలు దొరుకుతాయి. ఒకచోట 'చలువ చందనములు పూయ' చందమామను రమ్మంటారు. మరో చోట 'మునిగిన మానసము వినియోగిని బృందావనం' అంటారు. తెలుగు సినీ గేయకారుల్లో కృష్ణ శాస్త్రి మార్దవానికి ఇంత దగ్గరగా వచ్చిన వారు ఒక్క సిరివెన్నెలే అనిపిస్తుంది ఇలాంటి పాటల్ని రాశిపోసుకొని విశ్లేషించినప్పుడు. 'కలువ చెలియ కలలు విరియ/గగనపు విరితోటలోని గోగుపూల' గురించి రాసిన సౌందర్యం వెనుక ప్రఖ్యాత వచన కవి తిలక్ ముద్ర కనిపిస్తుంది. 'చిలకా ఏ తోడులేక','నమ్మకు నమ్మకు', 'తరలి రాదా తనే వసంతం' తదితర పాటల ద్వారా సీతారామశాస్త్రి సినిమా మాధ్యమంగా ఈ సమాజానికి తనేదో చెప్పదలుచుకున్న సంగతిని మనం గమనించవచ్చు. సినిమా పాటలలో 'బోధన' సాధ్యమా అన్న విమర్శకుల ప్రశ్నకు ఔనని జవాబివ్వడానికి చాలా మంది తొలితరం గేయకారులతో పాటు సిరివెన్నెలను కూడా చూపవలసి ఉంటుంది. ధనం మోజులో పడి కౌటుంబిక ఆత్మీయతను దొల్లచేసుకున్న ఓ అజ్ఞానంతో కూడిన అమాయకురాలిని ఉద్దేశించి రాసిన 'చిలుకా' పాటలో ప్రతీపాదం కోటబుల్ అవుతుందంటే ఆశ్చర్యం లేదు. పల్లవిలో చెప్పిన

'మంగళ సూత్రం అంగడి సరుకా
కొనగలవా చెయి జారాకా
లాభం ఎంతొచ్చిందమ్మా
సౌభాగ్యం అమ్మేసాకా'
పాదాలు కానీ
'బతుకంతా బలిచేసే పేరాశను ప్రేమించావే

వెలుగుల్నే వెలివేసే కలలోనే జీవించానే
అమృతమే చెల్లించి ఆ విలువతో
హాలాహలం కొన్నావె అతితెలివితో'

అన్నచరణం కానీ ఏ స్త్రీ మరిచిపోలేదు. గుండెల్ని పిండేసే చివరి వాక్యం 'కురిసే ఈ కాసుల జడిలో తడిసీ నిరుపేదయినావే' విని వెక్కివెక్కి ఏడ్చిన ప్రేక్షకులున్నారు. మరో పాట 'నమ్మకు నమ్మకు'లో 'రవికిరణం కనబడితే తేడాలన్నీ తెలుస్తాయని చెబుతారు. పై మెరుగులకు ఆధారభూతమైన పునాదులను చూడమని చెబుతూ

'ఆకాశం తాకే ఏ మేడకైనా
ఆధారం లేదా ఈ నేలలో
పుడమిని చూడని కన్ను
నడపదు ముందుకు నిన్ను'

అంటారు. అంతే ఆశావాద దృక్పథంలో తన దగ్గరకి రాలేక పోయిన వారి కోసం అడివి సౌందర్యం తనే నడిచి వస్తుందనే పాటలో తరచి చూస్తే మరింత నిగూఢ అర్థాన్ని పొదిగారు సిరివెన్నెల.

'వెన్నెల దీపం కొందరిదా
అడవికి సైతం వెలుగు కదా
ఎల్లలు లేని చల్లని గాలి
అందరికోసం అందును కదా'

అంటారు. ఆయన సినిమా పాటల్లో పొదిగిన ప్రబోధాత్మకతను వెలికి తీస్తే వందలాది సూక్తులు దొరుకుతాయి. 'పంచే గణమే లేకపోతే లోకమే శూన్యం' అంటారీ పాట చివర', 'పదుగురి సౌఖ్యం పండే దినమే పండుగ కాదా' అంటారొక పాటలో, 'పూటకో పుట్టుకనిచ్చే వరం ప్రేమేగా' అంటారొక చోట.

జీవిత గమనంలోనూ, సాహిత్య లక్ష్యంలోనూ గొప్ప నిబద్ధత సిరివెన్నెల సీతారామశాస్త్రిలో గమనించదగిన అంశం. భాషావిన్యాసంలో, సెంటిమెంటును పండించడంలో సిరివెన్నెలకు సిరివెన్నెలే సాటి. ఆయన లేరు. ఆయన ఎగరేసిన పాటలనే 'పంచ వన్నె చిలుకలన్ని' మన చుట్టూ గిరికీలు కొడుతూనే ఉంటాయి.

# తెలుగు పద్య నైవేద్యం



డా. N.Ch. చక్రవర్తి
హైద్రాబాద్
✆ 93999 58069

ఇప్పుడంటే చాలా మంది కవిత్వం వ్రాస్తున్నారు. ఒకప్పుడు కవి అనిపించుకోవడానికి చాలా చదవాలి. భాషా వ్యాకరణ అలంకారాది శాస్త్ర పరిజ్ఞానం ఉండాలి. రసౌచిత్యాది విషయజ్ఞానం ఉండాలి. ప్రతిభ వ్యుత్పత్తి అభ్యాసాలు ఉండాలి. ఈ శక్తులు సమకూర్చుకున్నప్పుడే కవిత్వం పండేది. అప్పటి పాండిత్యాలు అవీ. పామరుడు అని మనమనుకునే వాళ్లకూ గుణగ్రహణ పారీణత ఉండేది. పద్యాలు విని ఆనందించే స్వభావం ఉండేది. కవులనూ కళాకారులనూ పోషించి గౌరవించే సంస్కారం ఉండేది. ఇప్పటి కాలంలో కొన్ని నిర్వచనాలు మారిపోయాయి. అభిరుచులు మారిపోయాయి. ఎవరు ఏది వ్రాసినా కవిత్వమే అనుకోమంటున్నారు.

సుమతీ శతక పద్యాన్ని చూద్దాం.

కం. కవికానివాని వ్రాతయు
నవరస భావములు లేని నాతుల వలపుల్
దవిలి చను పందినేయని
వివిధాయుధ కౌశలంబు వృథరా సుమతీ!!

ఓ సుబుద్ధీ!! కవికాని వాని వ్రాతలూ -శృంగారమూ అలకా సరసభాషణమూ మొదలైనవి తెలియని స్త్రీ వలపూ(పొందు)-పారిపోయే పందిని కొట్టని ఆయుధమూ వ్యర్థాలు అంటాడు సుమతీ శతకకారుడు.

నాతి అంటే స్త్రీ. ఏయు అనే పదం ఆయుధాలు వేసే సందర్భములో వేయు బదులు వాడేవారు. ఇప్పుడు ఏయు అనే పదం వేయు కు పర్యాయపదంగా

వాడుతున్నారు. కవికాని వాని వ్రాత అన్నాడు. ఇక్కడ మనం గ్రహించాల్సిన విషయం ఉంది. పైన చెప్పుకున్న విషయాల పరిజ్ఞానం తో వ్రాసిన వారికే కవి గా లేదా విద్వత్ కవిగా పరిగణన. వ్రాసిన ప్రతీ వ్యక్తీ కవి కారు. "విద్వత్ కవయః కవయః కేవల కవయస్తు కపయః" అన్నారు పూర్వులు. కవిత్వం పేరుతో ఏదేదో వ్రాస్తే వారు కపి శబ్ద వాచ్యులు అన్నారు. అందుకనే అటువంటి వారి వ్రాతలు వ్యర్థం అనడం కవి ఆంతర్యం .

వేట ఒక కళ. పంది వేగంగా పరుగెత్తదు లేడిలాగానో, పులిలాగానో. అలాంటి పందిని కొట్టలేని వాని ఆయుధప్రయోగ నైపుణ్యం ఎంతని చెప్పుకుంటాము? ఇలాగ ప్రతిపద్యంలోనూ సమాజరీతులను ఆవిష్కరించేవారు శతకకవులు.

మరో ఆధునిక శతక పద్యం చూద్దాం.

చం. గళమున కాలకూటమది గాటపు మంటల బాధపెట్టగా
దలపయి గంగచిందులిడ తాలిమి వీడిన పత్ని పోరుచే
బొలుసుల పాము కర్ణముల బుస్సున నూదుచు లొల్లిపెట్టగా
గలకలనవ్వగల్గుటెటు గల్గెనొ దేవర!చంద్రశేఖరా!

చంద్రశేఖరునకు ఎన్ని కష్టాలు?? గొంతులో కాలకూట విషం మంట పెడుతూ ఉంటుంది. తలపై గంగ ఎగసిపడుతూ అల్లకల్లోలం గా ఉంటుంది. ఒకప్రక్క పార్వతి తన సవతి గురించి సతాయిస్తూ ఉంటుంది. మరోపక్క మెడలో పాము పొలుసులతో బుస్సు బుస్సు అంటూ రొద. ఇన్ని గొడవల్లోనూ కూడా నవ్వుతూ ఉండడం శివునకే చెల్లింది. అని కవి చమత్కారం. గాటపు మంట అంటే గాఢమైన వేడి. తాలిమి అంటే ఓర్పు. కర్ణము అంటే చెవి. లొల్లి అంటే గోల. ఇందులో కవి ఏమిచెప్పినట్టు? శివతత్త్వాన్ని చెప్పడం సరే, అన్యాపదేశంగా మనం ఎలా ఉండాలో చెప్పాడు కవి. ఎన్ని

చంద్రశేఖరునకు ఎన్ని కష్టాలు?? గొంతులో కాలకూట విషం మంట పెడుతూ ఉంటుంది. తలపై గంగ ఎగసిపడుతూ అల్లకల్లోలం గా ఉంటుంది. ఒకప్రక్క పార్వతి తన సవతి గురించి సతాయిస్తూ ఉంటుంది.

కష్టాలు చుట్టుముట్టినా చలించరాదు. నవ్వుతూ జీవితాన్ని గడపాలి. కష్టాలు మనను ఒంచరాదు. వాటిని మనం ఒంచాలి. అప్పుడే మనం భగవంతుని అంతటివారం అవుతాం. అని చెప్పడం.

మనోహరంగా పద్యకవిత్వాన్ని పండించిన కవులలో ఒకరు చేమకూరవేంకటకవి. ఈయన ప్రసిద్ధరచనలు రెండే. సారంగధర చరిత్ర, విజయవిలాసం. విజయవిలాసం ప్రతిపద్య చమత్కృతితో వెలయించిన గొప్పకావ్యం. అందులోని ఒక పద్యం చూద్దాం.

ఆవె. నువ్వు బువ్వు నవ్వు జవ్వని నాసిక
చివురు సవురు జవురు నువిద మోవి.
మబ్బునుబ్బు గెబ్బు బిబ్బోకవతి వేణి
మెరపు నొరపుబరపు తెఱవమేను॥

ఉలూచి నాగకన్య. యమునానది తీరాన ఉన్న అర్జునుని చూచి మోహించింది. అమాంతం అర్జునుని ఎత్తుకుపోయింది తన లోకానికి. అక్కడ ఉలూచిని వర్ణిస్తాడు కవి. అర్జునుని అడ్డుపెట్టుకుని. పాదాలవారీగా భావం చెప్పుకుందాం.

యౌవనవతి (ఉలూచి) నాసిక (ముక్కు) నువ్వు పువ్వు ను పరిహసిస్తుంది. ఉవిద మోవి(ఆ స్త్రీ పెదవి) చివురు సవురు జవురున్(చిగురు ఎఱ్ఱదనాన్ని దండిస్తుంది అంటే ఓడిస్తుంది) బిబ్బోకవతి వేణి( ఆ విలాసవతి జడ) మబ్బు నుబ్బు గెబ్బున్ (మేఘం నల్లని కాంతిని గెంటేస్తుంది) తెరవ మేను (అందమైన ఉలూచి దేహం) మెరపు నొరపు బరపున్(మెరపు తీగ కాంతిని పారద్రోలుతుంది) ఇదీ వర్ణన. ఇందులో ఎంతటి అచ్చ తెనుగు నుడి అందం ఉంది. ఎంతటి తెలుగు నుడుల పోహళింపు ఉంది?? ఎంతటి శబ్దాలంకారం ఆవిష్కృతం అయింది??

> చంద్రశేఖరునకు ఎన్ని కష్టాలు?? గొంతులో కాలకూట విషం మంట పెడుతూ ఉంటుంది. తలపై గంగ ఎగసిపడుతూ అల్లకల్లోలం గా ఉంటుంది. ఒకప్రక్క పార్వతి తన సవతి గురించి సతాయిస్తూ ఉంటుంది.

చిన్న పద్యం తన కడుపులో ఎంత కడలిని దాచుకుంది?? ఇవి అన్నీ చదివి ఆస్వాదించిన వాళ్లదే కదా రసరాజ్యం!!

మరో హృద్యపద్యాన్ని పరికిద్దాం.

ఆవె. తెల్లవారినంత నెల్లతోటయు మేలు
కొనెను-పూవు-తావి-కొమ్మ- రెమ్మ-
నేల-నింగి- తీవె-గాలి మరేవేవొ
కాని యా సుమమ్ము కన్నుమూసె.

కవి, విద్వత్కవి డాక్టర్ సూరం శ్రీనివాసులు గారు. హృదయం కరిగితే ఇలాంటి పద్యం పుడుతుంది. తెల్లవారింది. తోట మేల్కొంది. తోట మేలుకోడం అంటే ఏమిటి?? అందులో ఉన్న పూవూ, కొమ్మా, రెమ్మా వాటితో పాటు నేలా నింగీ తీగా అన్నీ కళ్ళు తెరిచాయి. అనుభూతాలైన సువాసనలూ, గాలీ కూడా ఉన్నాయి. కానీ ఒక సుమానికి అది మృత్యు వేళ. విరి ధరణి పై రాలడం కవిని కలచి వేసింది. ఆహ్లాదంగా భావాన్ని ఆస్వాదించేలోపు చివరి పాదం గుండెను పిండేస్తుంది. బతుకు చిత్రాన్ని మనముందు నిలబెడుతుంది. రోజూ పుడుతూ ఉంటారు కొందరు. అందరూ ఆమోదిస్తారు. ఆనందిస్తారు. పోతూ ఉంటారు కొందరు- చుట్టూ ఉన్నవారిని ఏడ్పించి. ఇక్కడ తోట మానవ లోకానికి ప్రతీకగా అనుకోవాలి. అప్పుడే కవి భావన విశ్వానికి అన్వయిస్తుంది.

ఇలాగ తెలుగు కవిత్వం రమణీయ భావ ప్రతిపాదకమై భాసిస్తున్నది. ఎందెందరో కవి శేఖరులు తెలుగు కవిత్వం ద్వారా ప్రాపంచిక విషయాలను ఎరుకపరచారు.

**సూచిక:**


1. సుమతీ శతకం.
2. చంద్రశేఖర శతకం. నారాయణం బాలసుబ్రహ్మణ్య అవధాని. అద్దంకి మండలం. ప్రకాశం జిల్లా.
3. చేమకూర వేంకటకవి విజయవిలాసం ప్రథమాశ్వాసం.
4. సౌమనస్యము పద్య కావ్యం. డా. సూరం శ్రీనివాసులు కొత్తపేట,చీరాల, ప్రకాశం జిల్లా 523157

# ఆధునిక విజ్ఞానశాస్త్రాల ఆవిర్భావం



డా. నాగసూరి వేణుగోపాల్
ఆకాశవాణి పూర్వసంచాలకులు
94407 32392



క్రీస్తుపూర్వం 384 నుంచి 332 వరకు జీవించి వున్న అరిస్టాటిల్‌ను చాలా విజ్ఞాన శాస్త్రరంగాలలో తొలిశాస్త్రవేత్తగా పరిగణిస్తారు. ఒక్క విజ్ఞానశాస్త్ర రంగాలేకాక చాలా యితర శాఖలలో కూడా విశిష్టమైన కృషి చేసినవారు అరిస్టాటిల్. అయితే అరిస్టాటిల్ ముందు వైజ్ఞానిక వైతాళికులు ఎవరూ లేరా?

గ్రీకులలో గణితం, సాహిత్యం, కళలు, వేదాంతం, విజ్ఞానశాస్త్రం, యిలా పలు రంగాలలో గణనీయమైన కృషి చేసినవారున్నారు. అయితే ఒక రకంగా విజ్ఞానశాస్త్ర విషయాలలోనే వారి కృషి సాపేక్షకంగా తక్కువ. వారి భావనలు అస్పష్టంగా వున్నా, ప్రయోగాత్మకంగా పరీక్షించకపోయినా క్రీ.శ.1400 దాకా భౌతిక అంశాలు ఏవైతే తెలుసో అవన్నీ గ్రీకుల రాతలలో కన్పిస్తాయి. అంటే చాలా మౌలికమైన భావనలు` పదార్థనిత్యత్వం, జడత్వం, అణుసిద్ధాంతం, కాంతి నిర్దుష్టవేగం వంటి భావనలను గ్రీకుల రచనలలో చూడవచ్చు.



క్రీ.పూ. 640-546 దాకా జీవించిన థేల్స్ (Thales) గురించి అరిస్టాటిల్ కొన్ని విషయాలు రాశాడు. అయస్కాంతపు ఆకర్షణ శక్తిని పసిగట్టినట్టు చెబుతారు. ఇంకా భూమి కోడిగుడ్డు ఆకారంలో వుందని పేర్కొన్నట్టు చెబుతారు. అయితే స్థూపాకారంలో వుండి, నీటిలో

వుందని థేల్స్ పేర్కొన్నట్టు అరిస్టాటిల్ చెప్పాడు. తర్వాత వచ్చిన గొప్ప శాస్త్రవేత్త పైథాగరస్ (Pythagoras). పైథాగరస్ క్రీ.పూ. 500-428 సిద్ధాంతం ప్రకారం



భూమి గోళాకారంగా వుందని పరిగణించబడినది. అయితే దీనికి ఆధారం ఏమిటో వివరించబడలేదు. అన్ని రూపాలలో గోళాకారం చాలా రకాలుగా సౌష్టవంగా వుందని భావించడం వల్ల అలా భావించాడేమో తెలియదు. ఇంకా సర్వవిశ్వాంతరాళం గోళాకృతిలో వుందని, దానికి భూమి కేంద్రమని, ఇంకా సూర్యుడు, నక్షత్రాలు, గ్రహాలు తమ వృత్తాకార కక్ష్యలలో భూమి కేంద్రంగా పరిభ్రమిస్తున్నాయని కూడా పైథాగరస్ పేర్కొన్నాడు. గణితంలో జ్యామెట్రీలో పైథాగరస్ సిద్ధాంతం - కర్ణవర్గ సిద్ధాంతం చాలా ప్రాచుర్యంలోకి వచ్చింది.



మరో ప్రముఖ గ్రీకు శాస్త్రవేత్త అనాగ్జగోరస్ (Anaxagoras). ఇతని జీవితకాలం 500-428 క్రీ.పూ. విజ్ఞానశాస్త్రం కొరకు అనాగ్జగోరస్ తన ఆస్తిని ధారబోశాడని ప్లేటో పేర్కొన్నాడు. ఇతను చంద్రుడు స్వయంగా ప్రకాశించలేడని భావించాడంటారు. చంద్రునిలో ప్రకాశానికి కారణం సూర్యుడనీ, భూమి మధ్యలో రావడం వల్ల చంద్రగ్రహణం, సూర్యుడికి చంద్రుడు అడ్డంగా రావడం వల్ల సూర్యగ్రహణం అని వివరించాడు. ఇంకా సూర్యుడు భగభగమండే రాయి అనీ, కానీ చంద్రుడు భూమిలాంటి వాడనీ కూడా భావించాడు. ఈ కారణంగా అతనిని ఏథెన్స్ నగరం నుంచి బహిష్కరించారు. తర్వాత తరం వాడయిన డెమోక్రెటెస్ (Democritus) (క్రీ.పూ.460-370) ప్రతిపాదించిన అణుభావనకు మూలం కూడా యితని వాదనలోనే వుందని అంటారు. అంతేకాక పదార్థనాశనం, సృష్టికి సంబంధించి అంతవరకు గ్రీకులకు వున్న భావనలను వీరు ఖండించారు. ఇంకా పదార్థంలోని మార్పులు అనేవి చాలా స్వచ్ఛమైన, కంటికి కనపడని కణాల మార్పిడి వల్ల సాధ్యం అని కూడా వివరించాడు. అటువంటి కణాలను (Spermala) అని పేర్కొన్నాడు. ఈ కణాలు మార్పుకు లోనుకావు. నాశనం చెందవు. అయితే పలురకాలుగా, పలురంగులలో, పలు రుచులలో వుంటాయి. ఈ సిద్ధాంతం ద్రవ్యనిత్యత్వ నియమాన్ని (Law of conservation of matter) వెలుగులోకి రాకుండా చేసింది.



తర్వాత క్రీ.పూ. 484-424 కాలానికి చెందిన ఎంపిడోక్లిస్ (Empedocles) ప్రకారం ప్రధానమూలకాలు - భూమి, నీరు, గాలి, మంట, మిగతావన్నీ నీటినుంచి తయారయినవే. అలాగే కాంతి అనేది ప్రకాశవంతమయిన లేదా కనబడే వస్తువునుంచి వెలువడిన సూక్ష్మకణాలు కంటిలోకి పోవడం, తర్వాత కంటినుంచి ఆ వస్తువుకు చేరడం వల్ల వస్తువులకు ఆ రూపం, రంగు ఏర్పడుతోందని కూడా భావన.

ఇతని ప్రకారం కాంతి ఒకచోటు నుండి మరోచోటుకు పోవడానికి కొంత వ్యవధి పడుతుంది. అయితే ఈ భావనను అరిస్టాటిల్ తిరస్కరించాడు.

తర్వాత వచ్చినవారు గ్రీకు శాస్త్రవేత్త డెమోక్రిటెస్ (Democritus) క్రీ.పూ.460 నుంచి 370 దాకా జీవించి వున్న డెమోక్రిటెస్ స్పష్టమైన అణుప్రతిపాదన చేశాడు. ఈ ప్రపంచం శూన్యమైన అంతరాళం (empty space)తో పాటు రూపు, స్థానం,



నిర్మాణం, వేర్వేరుగా వున్న అనంతమయిన కనబడని, ఖండించడానికి వీలులేని కణాలు కలిగివుందని భావించాడు. అలాగే పదార్థసృష్టి అసాధ్యమని కూడా వివరించాడు. ఎందుకంటే శూన్యం నుంచి శూన్యం రావచ్చుకానీ ఏదీ వున్నదాన్ని నశింప చేయజాలదని ఆలోచించడం వల్ల ఈ భావన రూపుదిద్దుకుంది. అయితే ఈ వాదాన్ని అరిస్టాటిల్ తిరస్కరించాడు.

''అనుభవరాహిత్యం అనేది లభ్యమైన వాస్తవాలనుంచి సమగ్రదృక్పథం, అవగాహన సాధించడానికి ప్రతిబంధకం. అందుకే ఎవరయితే ప్రకృతితో, దాని దృగ్విషయాలతో సన్నిహిత అనుబంధం కల్గివుంటారో వారివల్ల వాటికి సంబంధించిన సిద్ధాంతాలూ, సూత్రాలూ, నియమాలూ మరింత సమగ్రంగా అభివృద్ధి చెందే అవకాశం వుంది. అలాకాక కేవలం చర్చలతో కూడిన సూత్రీకరణల వల్ల ఏర్పడినది సమగ్రం కాకపోవటమే కాక, పిడివాదంగా మారే అవకాశం ఉంది'' అని అరిస్టాటిల్ అంటాడు.

ఈ అభిప్రాయం కేవలం అరిస్టాటిల్ కాలానికేగాక, ఈ శతాబ్దపు శాస్త్రవేత్తలకు కూడా అర్థవంతమూ, ఆచరణీయమూ! ఎందుకంటే విజ్ఞానశాస్త్రంలో ప్రయోగానికి వున్న విశిష్టత అంతటిది. సైన్స్ పెరిగే కొద్దీ మన జ్ఞానేంద్రియాలకు

సహాయకారులధికం కావడంతో మన సైన్స్ చక్షువు పరిధి విస్తరించింది. దాని వల్ల కొత్త అంతరార్థాలు సాధ్యపడుతున్నాయి. తత్ఫలితంగా మన అవగాహనా, విశ్లేషణ మరింత సమగ్రం అవుతోంది. అందువల్ల విజ్ఞానశాస్త్ర అభివృద్ధికి ప్రయోగం ఎంతో ఊతం కల్పిస్తుంది.

గ్రీకు తత్వవేత్త సోక్రటీసు ప్రశిష్యుడు, ప్లేటో శిష్యుడు అయిన అరిస్టాటిల్‌కు అన్ని శాస్త్రశాఖలలో ప్రవేశం వుంది. నేడు లెక్కకు మించి విభిన్నశాఖలు వెలిశాయి. కానీ తొలిదశలో అన్నిటి ప్రాదుర్భావం ఒకటే! అందువల్ల అరిస్టాటిల్‌కు తర్కం, నీతిశాస్త్రం, వేదాంతం, సైకాలజి, విజ్ఞానశాస్త్రం, కళలు యిలా చాలా వాటిల్లో ప్రవేశం మాత్రమే కాదు, నైపుణ్యం కూడా వుంది. అంతేకాదు అతని శక్తి ఎంతటిదంటే అతని ప్రభావం తర్వాత చాలా శతాబ్దాలమీద వుంది. తర్వాతి మేధావులను ప్రభావితం చేసింది. అందువల్ల మనం ఈనాటి దృష్టితో చూసినా అరిస్టాటిల్ కృషి తక్కువగాదు.

గ్రహణాలతీరు ఆధారంగా భూమి గోళాకారంగా వుందని విశ్లేషించాడు అరిస్టాటిల్. ఉత్తరంవైపుగానీ, దక్షిణంవైపుగానీ ప్రయాణం చేసి నక్షత్రాల డోలన పరిమితి (Amplitude)లో వచ్చే మార్పు గమనించి భూమి వృత్తాకారంగా వుందనేకాక, ఆ వృత్తం కూడా చాలా గొప్పదిగాదని వివరించడం అంతసులువుగాదు. అందువల్లనే సైన్స్ అభివృద్ధికి ప్రయోగం (experiment) ప్రాధాన్యత ఎంతో విశదం అవుతోంది.

అరిస్టాటిల్ అభిప్రాయాలన్ని చర్చించడం కుదిరే విషయంగాదు. అందువల్ల ప్రధాన అంశాలు చూద్దాం. అరిస్టాటిల్ ప్రకారం బరువయిన వస్తువు త్వరగా పడుతుంది. అంటే ఒకే ఎత్తు నుంచి బరువయిన, తేలికయిన వస్తువులను ఒకేసారి జారవిడిస్తే అరిస్టాటిల్ ప్రకారం బరువయిన వస్తువు తేలికయిన వస్తువుకన్నా ముందు పడుతుంది. క్రీస్తుపూర్వం 4వ శతాబ్దపు ఈ అభిప్రాయం క్రీ॥శ॥ 16వ శతాబ్దం దాకా నమ్మబడుతూ వచ్చింది. అంటే 20 శతాబ్దాల పాటు ప్రభావితం చేస్తూ వచ్చింది. ఇటలీలోని పీసా గోపురం నుంచి గెలీలియో (1564-1642) ప్రయోగం చేసి, అది కరెక్టు కాదని చెప్పే దాకా అరిస్టాటిల్ అభిప్రాయం గౌరవింపబడుతూ వచ్చింది. రెండూ ఒకే కాలంలో భూమిని చేరుతాయి.

అలాగే అరిస్టాటిల్ ప్రధాన ప్రతిపాదనలలో రెండవది - భూచలనం. అతని ప్రకారం భూమి కదలదు. భూమి కేంద్రంగా సూర్యుడు, నక్షత్రాలు, యితర గ్రహాలు భ్రమణాలు చేస్తున్నాయని వివరించాడు. అది ఒక రకంగా భూకేంద్రక సిద్ధాంతం

(Geo stationary Theory). ఈ భూకేంద్ర భావన కూడా రెండువేల సంవత్సరాలు ప్రభావితం చేసింది. అన్ని మతగ్రంథాలలో చేరిపోయింది. తర్వాత 15వ శతాబ్దపు కోపర్నికస్ (Copernicus) వరకూ ఈ భూకేంద్ర భావన గౌరవింపబడుతూ వచ్చింది. అయితే కోపర్నికస్ ప్రతిపాదనా, గెలీలియో టెలిస్కోప్ ప్రయోగాలూ, కెప్లర్ విశ్లేషణలు కలసి ఈ సిద్ధాంతానికి పాతర వేశాయి.

క్రీ.పూ. 310-230 మధ్యకాలంలో జీవించివున్న అరిస్టార్కస్ (Aristarchus) సూర్యకేంద్రక సిద్ధాంత భావనను ప్రతిపాదించినా అరిస్టాటిల్‌కున్న గౌరవప్రతిష్ఠలు దానికి గ్రహణం పట్టించాయి. ఇతని కృషికి సంబంధించి ఆర్కిమెడిస్ (Archimedes) ఒక పుస్తకం ప్రచురించారు.



అరిస్టార్కస్ తర్వాత వచ్చిన ఆర్కిమెడిస్ క్రీ.పూ, (287-212) గొప్ప గణిత శాస్త్రవేత్త, గొప్ప ఇంజనీర్, అనంతమయిన స్క్రూ, నీటిస్క్రూ, గిలకల చట్రం, కాల్చే అద్దం మొదలైన పరిశోధనలకన్నా మునిగే వస్తువులు కోల్పోయే బరువుకు సంబంధించిన విషయం చాలా ప్రాచుర్యంలోకి వచ్చింది. అంతేకాక స్థితిశాస్త్రం (Statics), ద్రవ్యస్థితి శాస్త్రం (Hydro Statics) లో కూడా ఆర్కిమెడిస్‌ను పేర్కొంటారు.

క్రీస్తుపూర్వం 287-212 కాలంనాటి ఆర్కిమెడిస్ తర్వాత క్రీస్తుశకం 1473-1543 కాలంనాటి నికోలస్ కోపర్నికస్‌ను పేర్కొంటారు. అంటే ఈ మధ్యకాలంలో దాదాపు 1700 సం॥లు శాస్త్రప్రగతి లేదా?

అలెగ్జాండ్రియాకు చెందిన టాలెమి క్రీ.శ. 70-147 కాలంవాడు. దర్పణాలు, కుంభాకార, పుటాకార కటకాల పరావర్తనం, వక్రీభవనం వంటి విషయాలను క్రోడీకరించి పుస్తకం రాశాడు. గాలి, నీరు, గాలి-గాజు, నీరు-గాజు తలాలకు సంబంధించిన పతన, వక్రీభవన కోణాలను డిగ్రీలుగా విభజించారు. ఏ రెండు తలాలకైనా ఈ రెండు కోణాలు అనులోమానుపాతంలో వుంటాయి. వాతావరణపు వక్రీభవనం వల్ల నక్షత్రాల స్థానం కదులుతున్నట్లు కనబడుతుందని కూడా టాలెమి చెప్పాడు. అయితే ఈ నక్షత్రాల దృశ్యచలనం వివరించడానికి గ్రహాలన్నీ భూమి చుట్టూ తిరుగుతాయనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

టాలెమి తర్వాత మనకు విజ్ఞాన శాస్త్ర రంగంలో కనపడే ప్రముఖ వ్యక్తి అరేబియన్ అల్హజెన్. అంటే దాదాపు 9 శతాబ్దాలపాటు మేధో చీకట్లు

ఆవరించాయి. 8వ శతాబ్దంలో అరబ్బులు రసాయన, గణిత, ఖగోళశాస్త్రాల మీద ఆసక్తి చూపారు. గ్రీకుల రచనలను అరబ్ భాషలోకి అనువాదం చేస్తూ కొంత మౌలిక పరిశోధన కూడా సాగించారు. క్రీ.శ.1000 సం.లో అల్హజాన్ దాదాపు ఏడు పుస్తకాలలో దృశ్యశాస్త్రం గురించి రాశాడు. ఈ పుస్తకాలలో కళ్ళు, దృశ్యవ్యవస్థ, కుంభాకార, పుటాకార దర్పణాల సూత్రాలు, వక్రీభవనం వంటి విషయాల గురించి చాలా వివరంగా వివరించాడు.

తర్వాత 500 సం॥లో భౌతికశాస్త్ర పరిశోధనలు కొన్ని జరిగాయి. సైన్స్‌కు సంబంధించిన తత్వసారాన్ని వివరించిన రోజర్ బేకన్ క్రీ.శ.1214-1294 కాలానికి చెందినవాడు. ఇతను సన్యాసి, శాస్త్రవేత్త. ప్రకృతి రహస్యాలు అవగతం చేసుకోవాలంటే పరిశీలించడం నేర్చుకోవాలని వివరించింది బేకనే! అయితే ఈ పరిశీలనలన్నీ సూత్రీకరణలు కావాలంటే ప్రాయోగిత సాక్ష్యం అవసరమని భావించాడు.

రోజర్ బేకన్‌కు సమకాలీనుడైన పిట్రస్ పిరిగ్రైనస్ (Petrus Peregrinus) అయస్కాంత ధ్రువాలు రెండు రకాలని, సజాతి ధ్రువాలు వికర్షించుకుంటాయని విజాతిధ్రువాలు ఆకర్షించుకుంటాయని వివరించాడు.



తర్వాత మనకు కనబడే వ్యక్తి ఇటలీకి చెందిన లియోనార్డో డవిన్సీ (Leonardo Davinici). క్రీ.శ. 1452`1519 కాలానికి చెందిన డవిన్సీ చిత్రకారుడు, శిల్పి, ఇంజనీరు, తత్వవేత్త. అతని శాస్త్ర ప్రతిభ ఇటీవలనే గుర్తించబడిరది. ఏదైనా ఒక విషయాన్ని సార్వత్రికం చేసేముందు ప్రయోగరీత్యా రెండు, మూడుసార్లు పరీక్షించాలని చెప్పింది డవిన్సీ ప్రయోగం ప్రాముఖ్యత అదే కదా! అది నేటికీ విలువైన సత్యం. భాష అస్పష్టం అయినా అతని రచనలలో జడత్వం, బలం, త్వరణం, చలనసూత్రాలు వంటి భావనలు గుణాత్మకంగా కరెక్టే! టాలెమి సిద్ధాంతాన్ని వ్యతిరేకించి, సూర్యుడు చలించక స్థిరంగా ఉన్నాడని వాదించాడు. అయితే అతన్ని శిక్షించలేదు, లేదా బ్రూనో (Bruno)ను చంపినట్టు తగులబెట్టలేదు. ఎందుకంటే అతని ఎందుకంటే అతని సిద్ధాంతాలకు ప్రచారం లేదు. ఏ విద్యాసంస్థలో పనిచేయలేదు. ఎక్కడా బోధించలేదు. దేన్నీ ప్రచురించలేదు.

16వ శతాబ్దంలో సాంస్కృతిక పునరుజ్జీవనం విరిసింది. దీంతో శాస్త్ర విజ్ఞానం కూడా ఒక బలమైన పోకడగా నిలిచింది. దానివల్లనే కోపర్నికస్, టైకోబ్రాహి, కెప్లర్, గెలీలియో, న్యూటన్‌వంటి గొప్ప శాస్త్రవేత్తలు రావడం, అంతవరకు చెలామణి అవుతున్న అసత్యభావనలను చీల్చి చెండాడటం, పేర్కొనడానికి ప్రాయోగిక రుజువులు చూపడం జరిగింది. సూర్యకేంద్రక సిద్ధాంతం వల్ల విశ్వం గురించి, విశ్వంలో మనిషి స్థానం గురించి అవగాహన పూర్తిగా మారింది. అంటే కోపర్నికస్ కొత్త శాస్త్ర బాటకు మార్గం వేశాడు. కోపర్నికస్ తర్వాత గెలీలియో టెలిస్కోపు, కెప్లర్ సూత్రాలు, గెలీలియో పీసాటవర్ నుంచి వస్తువులు వదలి ప్రయోగం చేయడం వంటి గొప్ప గొప్ప శాస్త్ర సంఘటనలు జరిగాయి. దానితో టాలెమి, అరిస్టాటిల్ భావనలు తిరగబడ్డాయి.

> 16వ శతాబ్దంలో సాంస్కృతిక పునరుజ్జీవనం విరిసింది. దీంతో శాస్త్ర విజ్ఞానం కూడా ఒక బలమైన పోకడగా నిలిచింది. దానివల్లనే కోపర్నికస్, టైకోబ్రాహి, కెప్లర్, గెలిలియో, న్యూటన్‌వంటి గొప్ప శాస్త్రవేత్తలు రావడం జరిగింది.

కొలంబస్ (Columbus) సమకాలీనుడైన కోపర్నికస్ (1473-1543) తన జీవిత చరమదశలో సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. భూమి యితర గ్రహాలలాగా ఒక గ్రహం. అంతేగాక సూర్యుని చుట్టూ తిరుగుతున్నదని ప్రతిపాదించడంతో మొత్తం వ్యవస్థను అర్థం చేసుకోవడం చాలా సరళం అయింది. దాని ఫలితంగా రుతువులను అర్థం చేసుకోవడం, గ్రహచలనాలు అర్థం చేసుకోవడం సులువయింది. దాంతో సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలకు సంబంధించి మనం గమనించే విషయాలను వివరించగలిగాడు. సూర్యుని చుట్టూ వున్న గ్రహాలు క్రమం కూడా సరిగా చెప్పాడు కోపర్నికస్.

ఒకరకంగా చెప్పాలంటే కోపర్నికస్ సూర్యకేంద్రక సిద్ధాంతం రావడంతో భౌతికశాస్త్ర చరిత్రలో ఒక అధ్యాయం ముగిసిందని భావించవచ్చు.

# తెలుగులో ఉద్యమకవిత్వం-నేపథ్యం



**ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి**
✆ 94402 22117

ఏ యుగంలో నైనా సమాజాన్ని ఏదో ఒక అంతస్సూత్రం నడిపిస్తూ ఉంటుంది. ఏనాడూ సమాజం గాలిలో దీపంలాగా ఉండదు. నిర్దిష్టమైన చలన సూత్రాల మీద ఆధారపడే సమాజం మనుగడ సాగిస్తుంది. సమాజం ఎల్లవేళలా వ్యవస్థీకృతంగా ప్రయాణం సాగిస్తుంది. సమాజాన్ని నడిపించే అంతస్సూత్రాలను భావజాలం  అనీ,సమాజ నిర్మాణాన్ని వ్యవస్థ అనీ అంటుంటాం. ప్రాచీన భారతదేశం భూస్వామ్య భావజాలం మీద ఆధారపడి కొనసాగింది. అది రాచరిక వ్యవస్థను నడిపించింది. రాచరిక వ్యవస్థ వర్ణ వ్యవస్థను కాపాడుతూ వచ్చింది ధర్మశాస్త్రాలు, నీతి శాస్త్రాలు, కళలు, సాహిత్యం..... అన్నీ

ఆ భూస్వామ్య రాచరిక వర్ణవ్యవస్థను సమర్థించాయి. వర్ణించాయి. వైభవీకరించాయి. ఆ వ్యవస్థ యధాతథంగా కొనసాగలేని పరిస్థితులు ఏర్పడినప్పుడు,అది నిరంకుశంగా మారినప్పుడు,దానికన్నామెరుగైనవ్యవస్థకోసం ప్రజలు ఎదురు చూసినప్పుడు ఆ వ్యవస్థ మీద విమర్శలు బయలుదేరుతాయి. ప్రత్యామ్నాయ భావజాలం పుట్టుకొస్తుంది. ప్రత్యామ్నాయ భావజాలం కూడా కళలు సాహిత్యం ఇతర గ్రంథాల ద్వారా ప్రచారం పొందుతుంది. అయితే ఆ ప్రత్యామ్నాయ భావజాలాన్ని ఆధిపత్య భావజాల సహించదు. అణచివేయడానికి ప్రయత్నిస్తుంది. ఫలితం రెండు భావజాలాల మధ్య సంఘర్షణ. భారతదేశ చరిత్రలో ప్రాచీన కాలంలో బౌద్ధం, భక్తి ఉద్యమాలు ఆధిపత్య భావజాలం మీద తిరుగుబాటుగా వచ్చినవే. బౌద్ధం మానవవాదం. భౌతిక వాదం. భక్తి ఉద్యమం తాత్వికంగా భావవాదం. సాంఘికంగా చైతన్యవాదం. భక్తి ఉద్యమం భగవంతుని విశ్వసిస్తూనే రాచరిక దుర్మార్గాల మీద, సాంఘిక వివక్ష మీద తిరుగుబాటు

చేసింది .వర్ణ వ్యవస్థలోని అమానుషత్వాన్ని విమర్శించింది. అధిక సంఖ్యాకులైన ప్రజల పక్షం వహించింది. ప్రధాన స్రవంతి ఆలోచనలలో ఆచరణలలో మార్పులను ప్రతిపాదించింది. భక్తి ఉద్యమం ఆధునిక సంఘ సంస్కరణ ఉద్యమాలకు దేశీయ పునాది వేసింది భక్తి ఉద్యమం. భక్తి ఉద్యమసాహిత్యానికి దేశీయ ప్రాదేశిక లక్షణం ఉంటుంది.

ఏ భావజాలం అయినా తన సాహిత్యాన్ని తాను సృష్టించుకుంటుంది. భావజాల ప్రచారం కోసమే సాహిత్యం పుడుతుంది. సాహిత్యానికి ఉండే స్వభావమే రాజకీయం. ఈ మాట ఆమోదించినందువల్ల సాహిత్య ఔన్నత్యానికి ఏమీ లోటు రాదు. వేల ఏళ్లుగా భారతీయ సాహిత్యం, కళలు చేస్తున్న పని భావ ప్రచారమే. ఇప్పుడు చేస్తున్నదీ, భవిష్యత్తులో చేయబోయేదీ భావ ప్రచారమే.

పోగొట్టుకున్న చోటనే వెతుక్కోవాలి అన్నట్లు సమస్య పుట్టిన చోట దాని పరిష్కార ప్రయత్నం కూడా జరుగుతుంది. సమస్యలు ఎదురవుతుంటే ప్రజలు వాటిని మౌనంగా అనుభవిస్తూ బతికి పోరు. వాటి పరిష్కారం కోసం బలహీనమైన బలమైనదో, బలమైనదో ప్రయత్నం చేస్తారు. ప్రజలు మౌనంగా ఉన్నా, వాళ్ల తరఫున కొందరు మేధావులో, రచయితలో వాళ్ళ తరఫున వకాల్తా పుచ్చుకుంటారు. ప్రాచీన కాలంలో భక్తి ఉద్యమం నిర్వహించింది ఈ పాత్రే. తెలుగులో పాల్కురికి సోమనాథుడు, తాళ్ళపాక అన్నమాచార్యుడు వీరశైవ వైష్ణవ భక్తులుగా, వేమన, వీరబ్రహ్మంలు తాత్వికకవులుగా సామాజిక రుగ్మతలమీద విమర్శ పెట్టారు. ప్రజల పక్షం వహించారు. వేమన వీరబ్రహ్మంలు మతం పేరు మీద జరుగుతున్న కర్మకాండను, మౌఢ్యాన్ని చీల్చి చెండాడారు. విగ్రహారాధనను తిరస్కరించారు. ఆధిపత్య వాదుల ఆగడాలను ప్రతిఘటించారు. శ్రామికుల పక్షం వహించారు. అంటరానితనాన్ని తీవ్రంగా అధిక్షేపించారు.

> “పోగొట్టుకున్న చోటనే వెతుక్కోవాలి అన్నట్లు సమస్య పుట్టిన చోట దాని పరిష్కార ప్రయత్నం కూడా జరుగుతుంది. సమస్యలు ఎదురవుతుంటే ప్రజలు వాటిని మౌనంగా అనుభవిస్తూ బతికి పోరు.”

పాశ్చాత్య పాలన భారతదేశంలో స్థిరపడిన తర్వాత పాశ్చాత్య ప్రభావం అన్ని సామాజిక రంగాల మీద పడింది. అనేక మార్పులు తీసుకువచ్చింది. సమాజంలో, సాహిత్యంలో, ప్రజల ఆలోచనలలో, ఆచరణలలో, అభిరుచులలో మార్పులు వచ్చాయి. పాశ్చాత్యవిద్యా వ్యవస్థ భారతీయులను ఎక్కువగా ప్రభావితం చేసింది. 18వ శతాబ్దం రెండవ సగం నుంచి 19వ శతాబ్దమంతా భారతదేశాన్ని ఆధునిక చేయటానికి అవసరమైన మేధావులు, ఉద్యమకారులు, రచయితలు, కళాకారులు, శాస్త్రజ్ఞులు పుట్టుకొచ్చారు అన్ని సామాజిక రంగాలలో కదలిక మొదలైంది. సాహిత్య రంగం కూడా కదల బారింది.

> అందివచ్చిన ఆధునిక విజ్ఞానం ప్రభావంతో భారతదేశంలో 19వ శతాబ్దం నుండి అనేక ఉద్యమాలు నెట్టుకొని వచ్చాయి. అనేక భావజాలాలు తోసుకొని వచ్చాయి.

అందివచ్చిన ఆధునిక విజ్ఞానం ప్రభావంతో భారతదేశంలో 19వ శతాబ్దం నుండి అనేక ఉద్యమాలు నెట్టుకొని వచ్చాయి. అనేక భావజాలాలు తోసుకొని వచ్చాయి. ఆధునిక భారతదేశ చరిత్రను, ఆధునిక భారతీయ సాహిత్య చరిత్రను ఆ ఉద్యమాలను, ఆ వాదాలను విస్మరించి అధ్యయనం చేయటం సాధ్యం కాదు. రాష్ట్రీయ, జాతీయ, అంతర్జాతీయ పరిణామాలనూ, వాటిని ప్రతిబింబించిన సాహిత్యాన్నీ ఒక చరిత్రగా రాయాలంటే ఆధునిక ఉద్యమాల వాదాల చరిత్ర తెలియడం అవసరం. సంఘ సంస్కరణోద్యమం ఆధునిక భారతదేశంలో పుట్టిన మొదటి ఉద్యమం. భారతదేశాన్ని మూఢనమ్మకాల నుండి ,మూఢాచారాల నుండి విముక్తం చేసి, భారతీయ సమాజాన్ని మానవీయ సమాజంగా మార్చి, శాస్త్రీయత వైపు నడిపించడం ఈ ఉద్యమ లక్ష్యం. బాల్య వివాహాలు, అసమ వివాహాలు, వితంతు వ్యవస్థ, విగ్రహారాధన, మతమౌఢ్యం, ఆధ్యాత్మిక గురువుల ఆడంబరాలు, విద్యా రాహిత్యం, సాంఘిక వివక్షలు, సతీసహగమనం, వేశ్యావృత్తి వంటి అనేక సమస్యలు మానవ జీవితాన్ని చుట్టుముట్టిన సమయంలో ఆధునిక విద్యావంతులైన మేధావులు వాటికి వ్యతిరేకంగా ఉద్యమించారు. ఈ ఉద్యమ ప్రచారానికి సాహిత్యాన్ని ఒక సాధనంగానే గాక, ఒక ఆయుధంగా కూడా స్వీకరించారు. ఉద్యమంలో పాల్గొంటూ, ఉద్యమాన్ని నడుపుతూ సాహిత్య సృష్టి చేసినవాళ్ళు ఉన్నారు.

ఉద్యమాలను సమర్థిస్తూ, అవసరమైనప్పుడు విమర్శిస్తూ రచన చేసిన వాళ్ళు ఉన్నారు. సంఘ సంస్కరణోద్యమ సాహిత్యం భారతీయ సమాజాన్ని స్తబ్దత నుండి చలనవైపు నడిపించడంలో తొలి అడుగు. సంఘసంస్కరణోద్యమ రచయితలు వలసపాలనను ఆహ్వానించారు. పాశ్చాత్య పాలన భారతీయ సామాజిక జీవితంలో తీసుకువచ్చిన మార్పులు ఇందుకు కారణం.

సంఘ సంస్కరణోద్యమం ఒకవైపు కొనసాగుతుండగానే, వలస పాలన వ్యతిరేక ఉద్యమం కూడా మొదలైంది. పాశ్చాత్య పాలన మీద అది స్థిరపడిననాటి నుంచి తిరుగుబాట్లు మొదలయ్యాయి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఆ తిరుగుబాట్లకు ఒక సంఘటిత రూపం. 20 వ శతాబ్దం మొదట్లో పెల్లుబికిన వందేమాతరం ఉద్యమం ఆ ఉద్యమాన్ని మరింత నిర్దిష్టం చేసింది. భారత స్వాతంత్ర్యోద్యమం, దానికి ఎన్ని పరిమితులు ఉన్నా, ఒక విశిష్టమైన ఉద్యమం. ఎందుకంటే ప్రజలు కుల మత వైరుధ్యాలను పక్కన పెట్టి ఒకే సమస్య పరిష్కారం కోసం కలిసికట్టుగా వీధుల్లోకి వచ్చిన మొదటి ఉద్యమం అది. సంఘ సంస్కరణోద్యమం భారతదేశ ఆంతరంగికరూపాన్ని మార్చే ప్రయత్నం చేసింది. స్వాతంత్ర్యోద్యమం భారతదేశ భౌతిక సమస్య అయిన పరాయి పాలనను నిర్మూలించె ప్రయత్నం చేసింది. స్వాతంత్ర్య ఉద్యమం ఒకవైపు తిలక్, గాంధీల నాయకత్వంలో అతివాద మితవాద ధోరణుల లో సాగింది. మరోవైపు సుభాష్ చంద్రబోస్, గదర్ వీరులు, భగత్ సింగ్, చంద్రశేఖర్ ఆజాద్, అల్లూరి సీతారామరాజు వంటి వాళ్ళ విప్లవ మార్గంలో కొనసాగింది. భారతీయ సాహిత్యం ఈ రెండు ఉద్యమ ధోరణులను ప్రతిబింబించింది. ఎందరో రచయితలు ఉద్యమంలో పాల్గొని, లాఠీ దెబ్బలు తిని జైళ్ళ పాలయ్యారు. భారత స్వాతంత్ర్యోద్యమ సాహిత్యం ఆధునిక భారతీయ సాహిత్యం లో ఒక సుదీర్ఘమైన అధ్యాయం. అందులో తెలుగు

సంఘ సంస్కరణోద్యమం ఒకవైపు కొనసాగుతుండగానే, వలస పాలన వ్యతిరేక ఉద్యమం కూడా మొదలైంది. పాశ్చాత్య పాలన మీద అది స్థిరపడిననాటి నుంచి తిరుగుబాట్లు మొదలయ్యాయి. 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఆ తిరుగుబాట్లకు ఒక సంఘటిత రూపం.

కవుల పాత్ర తక్కువైందేమీ కాదు.

సంఘ సంస్కరణ, స్వాతంత్ర్య ఉద్యమాలు కొనసాగుతుండగానే, 1917 నాటి బోల్షివిక్ విప్లవం ప్రభావం ప్రపంచ దేశాల మీద పడింది. మార్క్సిజం అనే ఆధునిక తాత్త్విక సిద్ధాంతం ప్రపంచ భాషలన్నిటిలో అందుబాటులోకి వచ్చింది. ప్రపంచాన్ని కొత్తగా అర్థం చేసుకోవడం మొదలైంది. 1930 ప్రాంతాలనుండి భారతీయ భాషలలో మార్క్సిజం ప్రభావంతో అభ్యుదయ సాహిత్య మొదలైంది. అప్పటి నుంచి భారతీయ సాహిత్యంలో వస్తువు, రూపం మారిపోయాయి. తెలుగులో 1933 నుండి అభ్యుదయ సాహిత్య మొదలైంది. అందులో కవిత్వం పాత్ర తిరుగులేనిది. గత 89 ఏళ్లలో అభ్యుదయ సాహిత్య ఉద్యమం అనేక ఎగుడుదిగుడులను చవిచూసింది. విమర్శలను ఎదుర్కొంది. అయినా అభ్యుదయ సాహిత్యం ఇంకా కొనసాగుతూనే ఉంది. 1918 ప్రాంతంలో తెలుగు సంస్కృతీ పరిరక్షణ ఉద్యమంగా మొదలై, ఆఖరికి తెలంగాణ విముక్తి పోరాటంగా సాయుధ రూపం తీసుకున్న తెలంగాణ రైతాంగ పోరాటం భారతదేశ చరిత్రలో ఒక కొత్త అధ్యాయం సృష్టించింది. అది పూర్తిగా ప్రజా ఉద్యమం. అందుకే అపారమైన ప్రజా సాహిత్యం వచ్చింది. సాహిత్యానికి రాజకీయాలకు ఉన్న విడదీయరాని సంబంధం మరొకసారి స్పష్టమైంది. స్వాతంత్ర్యోద్యమంతో పాటు ఆంధ్రోద్యమం కూడా మొదలైంది. తమిళనాడులో భాగంగా ఉన్న తెలుగు ప్రాంతానికి ప్రత్యేక రాష్ట్రం కావాలన్న ఆకాంక్ష బలపడింది. దానికోసం పొట్టి శ్రీరాములు ప్రాణాలర్పించారు. 1953 లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడింది. ఈ ఉద్యమం కూడా తన సాహిత్యాన్ని తాను సృష్టించుకున్నది. అప్పటి హైదరాబాదు రాష్ట్రంలోని తెలంగాణను కలుపుకొని విశాలాంధ్ర ప్రాతిపదిక మీద 1956లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. ఈ పరిణామం కూడా తనదైన సాహిత్యాన్ని సృష్టించింది. భారత దేశ స్వాతంత్ర్య ప్రకటన, రాజ్యాంగం అమలు, పంచవర్ష ప్రణాళికలు, తెలంగాణ రైతాంగ పోరాట విరమణ, ఆంధ్ర ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ఆవిర్భావం, 1952, 1955 ఎన్నికలు .....ఇవన్నీ ఒక ఎనిమిదేళ్ల సంశ్లిష్ట పరిణామాలు. ఈ నేపథ్యంలో భారతీయ సమాజంలో రావలసిన మార్పులు సంపూర్ణంగా రాలేదు అన్న అసంతృప్తి మొదలైంది స్వాతంత్ర్యోద్యమ ఫలితాల అనుభవం మీద ప్రశ్నలు సంధించడం మొదలైంది. ఈ సమయంలో దిగంబర కవులు, చేతనావర్త కవులు, పైగంబర కవులు, తిరగబడు కవులు వంటి అనేక కవిబృందాలు ఆవిర్భవించి అనేక ప్రశ్నలను లేవనెత్తాయి. ఈ నేపథ్యంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం మీద అవిశ్వాసం ప్రకటిస్తూ నక్సల్బరీ ఉద్యమం మొదలైంది. పశ్చిమ బెంగాల్లోని డార్జిలింగ్ జిల్లాలో 1965 ప్రాంతాల్లో మొదలైన ఈ పోరాటం, అనతికాలంలోనే ఆంధ్రప్రదేశ్ లోని

శ్రీకాకుళం జిల్లాకు పాకింది.

అక్కడ అణచివేతకు గురై ఆ ఉద్యమం ఉత్తర తెలంగాణకు విస్తరించింది. నూతన ప్రజాస్వామిక విప్లవం లక్ష్యంగా సాగిన ఆ ఉద్యమం కూడా అనేక పర్యాయాలు నిషేధాల కు,నిర్బంధాలకు గురైంది. ఇరుపక్షాల వాళ్ళు అసంఖ్యాకంగా మరణించారు. జూలై 4న విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. విప్లవో ద్యమాన్ని ప్రతిబింబిస్తూ విప్లవ సాహిత్యాన్ని విస్తృతంగా సృష్టిస్తున్నది. ఆధునిక తెలుగు సాహిత్య చరిత్రలో ఇదొక ఒక విశిష్టమైన అధ్యాయం.

ఈ విప్లవోద్యమం కొనసాగుతూ ఉండగానే 1985 తర్వాత అంతర్జాతీయంగా, జాతీయంగా, రాష్ట్రీయంగా పరిస్థితులు మారాయి. ఉత్తర భారతంలో కాన్షీరామ్ దళిత బహుజన ఉద్యమాన్ని ప్రారంభించారు. భారతదేశం ఎమర్జెన్సీచీకటి రోజుల నుంచి అప్పుడే బయట పడింది. భారతదేశంలో లో కాంగ్రెసేతర పాలన మొదలైంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సరికొత్త ప్రాంతీయ పార్టీ పాలన మొదలైంది.

> ఈ విప్లవోద్యమం కొనసాగుతూ ఉండగానే 1985 తర్వాత అంతర్జాతీయంగా, జాతీయంగా, రాష్ట్రీయంగా పరిస్థితులు మారాయి. ఉత్తర భారతంలో కాన్షీరామ్ దళిత బహుజన ఉద్యమాన్ని ప్రారంభించారు.

1991 లో డాక్టర్ బి.ఆర్ అంబేద్కర్ గారి శతజయంతి ఉత్సవాలు జరిగాయి. ఉత్తరాది రాష్ట్రాలలో దళిత పాంథర్స్ ఉద్యమం కొనసాగింది. 1995 లో గుర్రం జాషువా శతజయంతి ఉత్సవాలు వచ్చాయి. 1985 లో కారంచేడులో, 1992లోచుండూరులో దళితుల మీద దాడులు జరిగాయి. దళిత మహాసభ ఆవిర్భవించింది. 1976-1885 మధ్య అంతర్జాతీయ మహిళా దశాబ్దంలో ప్రపంచవ్యాప్తంగా స్త్రీల సమస్యల మీద అనేక సదస్సులు, చర్చలు జరిగాయి. 1992లో బాబ్రీ మసీదు విధ్వంసం జరిగింది. ఆ తర్వాత గుజరాత్ మారణకాండ కొనసాగింది. 1991 తర్వాత రష్యాలో విప్లవం ద్వారా ఏర్పడిన వామపక్ష ప్రభుత్వం అదృశ్యమైంది. అప్పటి రష్యా అధ్యక్షుడు గోర్బచెవ్ పెరిస్త్రోయికా, గ్లాస్త్ నోస్త్ లను ప్రవేశపెట్టారు. అమెరికా అగ్రరాజ్యంగా నిలిచింది. ప్రపంచీకరణ ప్రపంచ దేశాల మీదికి వదిలిపెట్టింది. అప్పట్లో బాగా వినిపించిన

మాట గాట్ ఒప్పందం. 1969లో పుట్ట పగిలినట్లు వచ్చిన ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ఆగి ఆగి 1990 తర్వాత చివరిసారిగా పెల్లుబికి వచ్చింది. దాదాపు వెయ్యి మంది తెలంగాణ యువకులు, ప్రజలు బలిదానం తర్వాత 2014 జూన్ 2న ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పడింది. ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమం తెలుగునాట రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రాంతాలకు రాజకీయ స్ఫూర్తినిచ్చింది. ఈ రకంగా గత మూడు దశాబ్దాలుగా భారతదేశ చరిత్రలోనే గాక తెలుగునేల చరిత్రలోనూ అనేక ఉద్యమాలు వాదాల సంగమం అయింది. ఈ కాలంలో వచ్చిన ఉద్యమాలను అస్తిత్వ ఉద్యమాలని, వాదాలను అస్తిత్వవాదలని పిలిచారు. తెలుగు సాహిత్యం సహజంగానే ఈ ఉద్యమాలకు, ఈ వాదాలకు గొప్పగా స్పందించింది.బలమైన గొంతుక వినిపించింది స్త్రీవాద సాహిత్యం, దళితవాద సాహిత్యం, మైనారిటీ వాద సాహిత్యం ప్రాంతీయ అస్తిత్వ సాహిత్యం, అని నాలుగు పాయలుగా తెలుగు సాహిత్యం విస్తరించింది. ఎస్సీ ఎస్టీ బిసి మైనారిటీలు అందరూ దళితులే అన్న అవగాహనతో దళిత సాహిత్యం మొదలైంది. తర్వాతికాలంలో ఎస్సీ ఎస్టీ బీసీ మైనారిటీలు అందరూ పీడితులే అయినా, వాళ్ళ మధ్య కూడా తేడాలు ఉన్నాయి గనుక వాళ్లంతా ఒకటి కాదు అనే ఆలోచన మొదలైంది. ఈ ఆలోచనల నుంచి విడి విడి ఉద్యమాలు మొదలయ్యాయి.

> ఈ నేపథ్యంలో బహుజన వాద సాహిత్యం అనే మరొక అస్తిత్వ వాద సాహిత్యం పుట్టుకొచ్చింది. దానినే బిసివాదం అనికూడా అన్నారు. గిరిజన సాహిత్యం కూడా క్రమంగా ఒక ప్రత్యేక రూపం సంతరించుకోవడం మొదలైంది.

ఈ నేపథ్యంలో బహుజన వాద సాహిత్యం అనే మరొక అస్తిత్వవాద సాహిత్యం పుట్టుకొచ్చింది. దానినే బిసివాదం అనికూడా అన్నారు. గిరిజన సాహిత్యం కూడా క్రమంగా ఒక ప్రత్యేక రూపం సంతరించుకోవడం మొదలైంది. దళిత ఉద్యమం, దళిత సాహిత్యం ముమ్మరంగా కొనసాగుతూ, వస్తున్న సమయంలో మాదిగ దండోరా ఉద్యమం దూసుకుని వచ్చింది. అదొక పెద్ద ఉద్యమం అయింది. దళితులను ఒకే ముద్దగా భావించి దళితుల లోని

50కి పైగా శాఖలకు చెందాల్సిన అభివృద్ధి ప్రయోజనాలను ఒక శాఖే ఎక్కువగా అనిపిస్తున్నది అన్న ప్రచారంతో దండోరా ఉద్యమం మొదలైంది. దళితులను ఏ బి సి డి వర్గాలుగా విభజించడం న్యాయం అనే వాదన వినిపించింది. దండోరా ఉద్యమం తనదైన విలువైన సాహిత్యాన్ని సృష్టించింది.

ఇంత విస్తృత పరిధిగల ఆధునిక తెలుగు సాహిత్యంలో నుంచి ఉద్యమాలు వాదాలు పునాదిగా వచ్చిన కవిత్వానికి మాత్రమే పరిమితమై “ప్రకాశిక” పత్రికను ఒక ప్రత్యేక సంచిక తీసుకువద్దామని మిత్రులు శ్రీ కొవ్వలి గోపాలకృష్ణ గారు ప్రతిపాదించారు. ఆయన ప్రతిపాదన నాకు నచ్చింది. ఆధునిక తెలుగు కవిత్వంలో కనిపించే 12 ఉద్యమాలను, వాదాలను గుర్తించి 12 వ్యాసాలతో ప్రత్యేక సంచికను తీసుకొద్దామని ఒక నిర్ణయానికి వచ్చాం. ఆధునిక తెలుగు కవిత్వంలో ఇంకా భావ కవిత్వం, మానవతా వాద కవిత్వం,అనుభూతి వాద కవిత్వం, నవ్య సంప్రదాయ కవిత్వం వంటివి అనేక ఉన్నాయి. ప్రస్తుతానికి ఈ సంచిక 12 అంశాలకే పరిమితం అయింది. తక్కినవి మరోసారి సంచికగా వస్తాయి.

ఈ సంచికలోని 12 అంశాలమీద వ్యాసాలు రాయడానికి 12 మందిని ఎన్నుకున్నాం. వాళ్లను సంప్రదించగానే మా ప్రయత్నాన్ని అభినందించి వ్యాసాలు రాయడానికి ఆమోదం తెలిపారు.

డా.విజయ భక్ష్, డా.పాపినేని శివశంకర్, ఆచార్య మేడిపల్లి రవికుమార్, ఆచార్య ఎస్ వి సత్యనారాయణ, డా.గుమ్మా సాంబశివరావు, డా.కె నాగేశ్వరాచారి, డా.కోయి కోటేశ్వరరావు, డా.ఎస్. రఘు,డా. షేక్ ఇబ్రహీం, డా.కందాల శోభారాణి, డా. సుంకిరెడ్డి నారాయణరెడ్డి,శ్రీ కొత్తపల్లి రవిబాబు గారలు ఈ వ్యాస రచయితలు. ఈ వ్యాసకర్తలు నిరంతరం రచనా వ్యాసంగం లో తలమునకలుగా ఉండేవారు. వాళ్లను నేను నాకున్న చనువుతో ఒత్తిడి చేసి త్వరగా వ్యాసాలు రాయిండానికి ప్రయత్నించాను. వాళ్లు ఏ మాత్రం చిరాకు పడకుండా వ్యాసాలు రాసి పంపించారు. అందరికీ పత్రికా సంపాదకుని పక్షాన, నా పక్షాన హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. ఇదివరలోనే ఆధునిక తెలుగు కవిత్వ చరిత్రలు వివిధ సందర్భాలలో, విభిన్న ప్రాతిపదికల మీద కొన్ని వచ్చాయి. వాటినన్నిటినీ గౌరవిస్తూనే ఈ ప్రత్యేక సంచికను తెలుగు పాఠకులకు అందిస్తున్నాం. ఈ సంచికకు సంపాదకత్వ బాధ్యతలు నాకు అప్పగించిన మిత్రులు గోపాలకృష్ణ గారికి ధన్యవాదాలు తెలుపుతున్నాను.

# ఆరు పదుల తెలుగు కవిత



కె. శే .డాక్టర్ ద్వా.నా. శాస్త్రి

స్వాతంత్ర్యోద్యమం, పాశ్చాత్య దేశాలలో పారిశ్రామిక విప్లవం, సాంఘిక పునరుజ్జీవన ఉద్యమం, పాశ్చాత్య రాజకీయ, ఆర్థిక, సామాజిక సిద్ధాంతాలు ఆధునిక కవిత్వావిర్భావానికి దోహదం చేశాయి. మన రాష్ట్రంలో తలెత్తిన రాజకీయ పార్టీలు, సంస్కరణోద్యమాలు తెలుగు కవిత్వ స్వరూపాన్ని మార్చివేశాయి. అభినవ కవిత్వం కొత్త మలుపులతో కొత్త పుంతలు తొక్కింది. 1947 నుంచి నేటివరకు తెలుగు కవిత బహుముఖాలుగా వెలువడుతూ-విస్తరిస్తూ తెలుగు భాషా వైశిష్ట్యాన్ని, తెలుగువారి జీవన సమస్యల్ని, పరిపాలకుల దురాగతాల్ని, జీవన తత్వాల్నీ చాటి చెప్తూనే వుంది. ఎంత ఆధునికమైనా తెలుగు కవిత్వం మూలాల్ని విస్మరించలేదు. నూతన ప్రక్రియలతో పాటు ప్రాచీన ప్రక్రియలైన పురాణం, కావ్యం, శతకం, దండకం, అవధానం వంటివి సమాంతరంగా వెలువడుతూ ఉండటం విశేషం.

1947 నాటికి భావకవిత్వోద్యమం తెరవెనుకకి వెళ్ళింది. ఆ భావజాలం కొందరి కవులలో ఉన్నా- ఉద్యమస్థాయి కనిపించదు. ఈ కాలంలో అభ్యుదయ కవిత్వం తీవ్రస్థాయిలో వెలువడింది. శ్రీశ్రీ ఈ అభ్యుదయ ఉద్యమానికి నాయకత్వం వహిస్తూ తన అసామాన్య ప్రతిభతో తెలుగునాడును ఉర్రూతలూగించాడు. ఎక్కడ విన్నా శ్రీశ్రీ గేయాలే. నాటి యువతరాన్ని అభ్యుదయపథం వైపు తనతో లాక్కుని వెళ్ళినవాడు శ్రీశ్రీ. కత్తికంటే కలం గొప్పదని చాటి చెప్పినవాడు శ్రీశ్రీ. నవ్యసాహిత్య పరిషత్తు, సాహితీ సమితి, తెలంగాణా రచయితల సంఘం, సాధన, అ.ర.సం. వంటి సంస్థలు నవీన కవిత్వానికి అండగా నిలిచాయి. ప్రతిభ, అభ్యుదయ, కళాకేళి, సాహితి, తెలుగు స్వతంత్ర మొదలైన పత్రికలు తెలుగు కవులకు ఆటపట్టులయ్యాయి. కవులకి లోకానుభవం అవసరమైంది. ప్రపంచ

పరిణామాల పట్ల అనుశీలన కవిత్వ హేతువైంది. గత నిరసనకి ప్రాధాన్యం పెరిగింది. సామాజిక స్పృహ (social consciousness) అనే పదానికి ప్రాముఖ్యం వచ్చింది. సమాజ శ్రేయస్సే కవిత్వ ప్రయోజనమైంది. జాతీయ దృష్టి నుంచి అంతర్జాతీయ దృష్టి అలవడింది.

"శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనేలేదు" అన్న అభినవ ఋక్కు కేంద్రబిందువైంది. అలజడి, ఆందోళన, తిరుగుబాటు... కవిత్వ వస్తువులయ్యాయి. "మార్క్సిజం" అభినవ కవిత్వానికి ప్రాణమయ్యింది. కవుల అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలయ్యాయి. దాశరథి, సోమసుందర్, ఆరుద్ర, అనిశెట్టి, కాళోజీ, రెంటాల, గంగినేని, కుందుర్తి, పురిపండా, మల్లారెడ్డి, సినారె వంటివారెందరో కొత్త కవిత్వాన్ని సృష్టించి తెలుగు కవిత్వానికి దిశానిర్దేశం చేశారు. వీరందరివల్ల నవ్య కవిత్వానికి వారసులు ఇబ్బడిముబ్బడిగా తయారయ్యారు.

> "శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనేలేదు" అన్న అభినవ ఋక్కు కేంద్రబిందువైంది. అలజడి, ఆందోళన, తిరుగుబాటు.. కవిత్వ వస్తువులయ్యాయి. "మార్క్సిజం" అభినవ కవిత్వానికి ప్రాణమయ్యింది.

అయితే ఈ అభ్యుదయ ఉద్యమం దాదాపు 1965 వరకు ఉధృతంగా సాగింది. కవితారంగాన్ని చైతన్యపరచింది. సామాజిక రుగ్మతలపై శంఖం పూరించింది. వామపక్ష పార్టీలలో చీలికలు రావటం వల్ల అభ్యుదయ కవులు కూడా చీలిపోయారు. అభ్యుదయ కవులు సినీకవులయ్యారు. రాజీతత్వం అలవరచుకున్నారు. ప్రభుత్వ పదవుల కోసం, మెప్పు కోసం తాపత్రయపడ్డారు. దీంతో అభ్యుదయ ఉద్యమ తీవ్రత తగ్గి బలహీనపడింది.

ఆ తర్వాత ఆరుగురు యువకులు కలిసి దిగంబర కవిత్వోద్యమం తీసుకువచ్చారు. 1965లో నిఖిలేశ్వర్, నగ్నముని, చెరబండరాజు, జ్వాలాముఖి, మహాస్వప్న, భైరవయ్య అనే కవులు "మంచి కోసం, మనిషిలోని నిప్పులాంటి నిజమైన మనిషి కోసం, కపటంలేని చిరునవ్వులు చిందే సమాజం కోసం మా

దిగంబర గొంతుకతో చెప్పదలచుకున్నాం" అంటూ మూడు కవితా సంపుటాలు తెచ్చారు. "నిరుద్యోగం, దారిద్ర్యం, కుహనా రాజకీయాలు, మతకలహాలు, సాహిత్య వ్యాపారం, సెక్స్ రచనలు... వంటి వాటితో కూడుకున్న ఈ కుష్టు వ్యవస్థ" పై దుమ్మెత్తి పోశారు. ఒక షాక్ ట్రీట్‌మెంట్‌గా వచ్చిన దిగంబర కవిత్వంలో చాలామటుకు అశ్లీలంతో అసభ్య పదజాలంతో, దూషణలతో నిండి వుంది. అంత దిగంబరత్వం పనికిరాదని విమర్శకులూ, పాఠకులూ భావించారు. అందుకే 1968 నాటికే ఈ ఉద్యమం కనుమరుగైంది. ఆరుగురితో పుట్టి ఆరుగురితోనే పెరిగింది. "వీళ్లు చేసేది అభ్యుదయ రచన కాదు. జాగృతి కోసం ధ్వంస రచన చేస్తారు", "ఈ దిగంబరుల పైత్యాన్ని కవిత్వమనుకొనేటంతగా (ఈ సమాజం) పతనమైందా?" వంటి విమర్శలతో ఉద్యమంగా కాకుండా ఒక ధోరణిగానే నిలిచిపోయింది. పాలపొంగులాంటి ఆవేశం మాత్రమే సుమా! అనిపించింది.

> 'మావో వజ్రాయుధం' అంటూ 1970లో విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది. విప్లవ కవిత్వం వాడిగా వేడిగా వెలువడింది. దీనికీ శ్రీశ్రీయే నాయకత్వం వహించవలసి వచ్చింది. అప్పటి జనచైనా వీరికి ఆదర్శం.

'మావో వజ్రాయుధం' అంటూ 1970లో విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది. విప్లవ కవిత్వం వాడిగా వేడిగా వెలువడింది. దీనికీ శ్రీశ్రీయే నాయకత్వం వహించవలసి వచ్చింది. అప్పటి జనచైనా వీరికి ఆదర్శం. మావోయిజం, లెనినిజం, మార్క్సిజాల సమ్మేళనం విప్లవ సిద్ధాంతంగా మారింది. సాయుధ పోరాటం ద్వారానే శ్రామికవర్గ విముక్తి కలుగుతుందనీ, సామ్రాజ్యవాద, పెత్తందారీ విధానాలను 'కత్తికి కత్తి' అనే విధంగా సమాధానం చెప్పాలనీ నిర్ణయించారు. ఎన్నికల బూటకపు పద్ధతిని ఎండగట్టారు. ఇటువంటి భావజాలంతో శ్రీశ్రీ, చెరబండరాజు, వరవరరావు, సత్యమూర్తి (శివసాగర్), నగ్నముని, జ్వాలాముఖి, కె.వి.రమణారెడ్డి మొదలైనవారు కవిత్వం రాశారు. దిగంబర కవులుగా వున్న వారు విరసంలో చేరారు. విప్లవ కవిత్వంలో పాట ప్రముఖ పాత్ర వహించింది. సుబ్బారావు పాణిగ్రాహి, వంగపండు ప్రసాదరావు, గద్దర్

మొదలైనవారు విప్లవ భావాలను ప్రజల దగ్గరకు తీసుకెళ్లారు. కొడవటిగంటి కుటుంబరావు, చలసాని ప్రసాద్ వంటివారు విప్లవ కవిత్వం రాయకపోయినా విప్లవ కవులకి పాఠాలు చెప్పే గురువులయ్యారు. ప్రజా కళారూపాలు ఆసరాగా జనం దగ్గరికి విప్లవ కవిత్వం వెళ్ళింది. అయితే ఆ తర్వాత ఇది 'రూటు' మార్చుకుని 'నక్సలైట్' ఉద్యమంగా, 'పీపుల్స్‌వార్' ఉద్యమంగా తయారైంది. విప్లవ కవులలో, నాయకులలో చీలికలు వచ్చాయి. ఎవరి గొడుగు వారిదే అయింది. "ప్రపంచ కార్మికులారా ఏకంకండి" అన్నవారే ఏకం కాకపోవటం ఒక పెద్ద విషాదం! భావజాలం ఎలా వున్నా ప్రజలు హింసను సహించలేరు, స్వాగతించలేరు. అందువల్ల 1980 తర్వాత ఉనికి కోసమే విప్లవ కవిత్వం కొనసాగుతోంది తప్ప అప్పటి ఊపులేదు.

ఇన్ని ఉద్యమాలూ వాదాలూ వచ్చినా "ఆకాశంలో సగం" అయిన స్త్రీలను కవులెవరూ పట్టించుకోలేదన్న ఆవేదనతో, కసితో స్త్రీవాద ఉద్యమం వచ్చింది. ఇంగ్లీషులో గల "ఫెమినిజం" తెలుగులో స్త్రీవాదమైంది. పురుషాధిక్యతపై ధ్వజమెత్తుతూ స్త్రీల విముక్తికై, ఆత్మగౌరవానికై రూపొందించబడిన ఆలోచనా ధోరణి స్త్రీవాదం. స్త్రీని తల్లిగా, భార్యగా మాత్రమే ముద్రవేయబడటం నుంచి మనిషిగా గుర్తింపు పొందే స్థితి రావాలని కవయిత్రులు కలమెత్తారు. లైంగిక వివక్షను నిరసించారు. స్త్రీకి సమానహక్కు, స్వేచ్ఛలు వీరి లక్ష్యాలు. 'గురి చూసి పాడే పాట', 'నీలిమేఘాలు' అనే స్త్రీవాద సంకలనాలు వీరి ధోరణిని వెల్లడిస్తాయి. ఓల్గా, జయప్రభ, కొండేపూడి నిర్మల, విమల, పాటిబండ్ల రజని, ఘంటసాల నిర్మల, మందరపు హైమవతి, కె.గీత వంటివారు తమ కవిత్వంతో కొత్త కోణాలను ఆవిష్కరించారు. పురుషాధిక్య భావజాలం గలవాళ్ళకి కనువిప్పు

> "ఇన్ని ఉద్యమాలూ వాదాలూ వచ్చినా "ఆకాశంలో సగం" అయిన స్త్రీలను కవులెవరూ పట్టించుకోలేదన్న ఆవేదనతో, కసితో స్త్రీవాద ఉద్యమం వచ్చింది. ఇంగ్లీషులో గల "ఫెమినిజం" తెలుగులో స్త్రీవాదమైంది."

కలిగించారు. స్త్రీల సమస్యల్ని, వేదనల్ని 'స్కానింగ్' చేసినట్లు చూపించారు. పెళ్ళి, సంసారం, ఇంటిచాకిరీ, వంట, సంతానోత్పత్తి వంటి విషయాలపై కూడా గొప్ప కవితలు వెలువడ్డాయి. స్త్రీ వాదుల్లో కూడా ఉదారవాదులు, రాడికల్‌వాదులు, మార్క్సిస్టు వాదులు లేకపోలేదు.

1980 నుంచే స్త్రీవాదం ఉద్యమస్థాయిలో ప్రచారం పొందింది. కొంత సంచలనమూ తీసుకువచ్చింది. కానీ ఈ ఉద్యమం కూడా ఆ సంచలనాన్ని, ఆ తీవ్రతను క్రమేణా కోల్పోతూ వచ్చింది. అభ్యుదయ కవులలాగా 'పాడిందే పాట'గా అయింది. పురుష ద్వేషం, శారీరక ధర్మాలకి పురుషులే కారణమనటం, కుటుంబ వ్యవస్థను, వివాహ వ్యవస్థను నిరసించడం లేదా వక్రభాష్యం చెప్పటం, సామ్రాజ్యవాద ప్రభావం ఉండటం వంటి కారణాల వల్ల స్త్రీవాద కవిత్వం విమర్శకు గురైంది. లింగవివక్షకే పరిమితం కాకుండా స్త్రీల స్వేచ్ఛ, హక్కుల కోసం ప్రాధాన్యం వహించి వుంటే మరింత వియవంతమయ్యేదన్న అభిప్రాయం కలిగింది. ఆవేశమూ, సెక్సు, పెళ్ళిపై వ్యతిరేకతల వల్ల స్త్రీవాద సానుభూతిపరులను తగ్గించుకొంది. 2000 సంవత్సరం నాటికి బలహీనపడింది.

"ఒకపక్క స్త్రీవాదం ఉద్వేగంతో, ఉత్తేజంతో వస్తున్న రోజుల్లోనే దళితవాదం మొదలైంది. ఎన్ని ఉద్యమాలు వచ్చినా ఈ దేశంలోని అత్యంత ప్రధాన సమస్య ''కులసమస్య''ను ఎవ్వరూ పట్టించుకోలేదు."

ఒకపక్క స్త్రీవాదం ఉద్వేగంతో, ఉత్తేజంతో వస్తున్న రోజుల్లోనే దళితవాదం మొదలైంది. ఎన్ని ఉద్యమాలు వచ్చినా ఈ దేశంలోని అత్యంత ప్రధాన సమస్య "కులసమస్య"ను ఎవ్వరూ పట్టించుకోలేదు. అసలు గాయం ఎక్కడుందో తెలుసుకోకుండా మందులు పూశారు అంటూ దళితులు తమ గుండె చప్పుళ్ళను వినిపించారు. 1985 ప్రాంతం నుంచి సన్నటి మూలుగులతో ప్రారంభమై 1990-95 ప్రాంతాలలో ఉవ్వెత్తున ఎగసింది. పూలేఇజం, అంబేద్కరిజమ్‌ల సిద్ధాంతాలు ప్రాతిపదికగా దళిత ఉద్యమం బయలుదేరింది. "అంటరానితనానికి గురై మూడు సహస్రాబ్దాలు జైల్లో బతికి పంచములని పిలువబడ్డ షెడ్యూల్డు కులాలకు చెందినవాళ్ళే దళితులు. వాళ్ళు హిందూ, బౌద్ధ, క్రైస్తవ, మహమ్మదీయ

సిక్కు మతాలకు చెందిన దళితులే. కుల సమస్య నిర్మూలన కాంక్షాభివ్యక్తి దళిత సాహిత్యం" అని ప్రకటించారు. మొదట్లో బి.సి.లు, ముస్లిములు కూడా దళితులుగానే చెప్పారు, ఆ తర్వాత బి.సి. కుంపటి వేరు, ముస్లిముల కుంపటి వేరు అయింది. కొంతకాలానికి దళితులలోనే మాల, మాదిగ బేధాలు (పూర్వం నుంచి ఉన్నవే) భగ్గుమన్నాయి. "సంఘటితం కండి" అన్న అంబేద్కర్ పిలుపు గాలికి కొట్టుకుపోయింది.

అగ్రకులాల ఆధిపత్య ధోరణిని ప్రశ్నించడం, ఆత్మగౌరవం పొందడం, కులపీడనపై కన్నెర్రజేయడం, మనువాద సంస్కృతిని బద్దలుకొట్టడం, రాజ్యాధికారం... అనే లక్ష్యాలతో "దళిత కవిత", "చిక్కనవుతున్న పాట", "పదునెక్కిన పాట", "ప్రవహించే పాట" వంటి కవితా సంకలనాలు వెలువడ్డాయి. శివసాగర్, ఎండ్లూరి సుధాకర్, సతీష్‌చందర్, జూలూరు గౌరీశంకర్, కత్తి పద్మారావు, మద్దూరి నగేష్‌బాబు, శిఖామణి, మొదలైన కవులెందరో కొత్తచూపుతో, దళిత జీవితాలలోని బహుముఖ పార్శ్వాలను వెలుగులోకి తెచ్చారు. గద్దర్, మాస్టర్ జీ, గూడ అంజయ్య, అంబటి వెంకన్న, వంగపండు మొదలైన వారు పాటల ద్వారా కులపీడనను ఎండగట్టారు. అయితే 2000 సంవత్సరం తర్వాత దళితుల్లో చీలికలు ఏర్పడ్డాయి. 'ఎ, బి, సి, డి' వర్గీకరణ వీళ్ళల్లో ద్వేషాల్ని రగిలించింది. ఈ అంశంపైనా కవిత్వం వెలువడింది. కానీ అంతకుముందున్న 'సంఘటితం కావడం' కనపడలేదు. కుల నిర్మూలన ధ్యేయం కాస్తా కుల అంతరాలకు దారితీసింది. దళిత బ్రాహ్మణులు తయారయ్యారు. కసి, దూషణలు చోటు చేసుకొన్నాయి. అయినా దళిత కవిత్వం వెలువడుతూనే వుంది.

> అగ్రకులాల ఆధిపత్య ధోరణిని ప్రశ్నించడం, ఆత్మగౌరవం పొందడం, కులపీడనపై కన్నెర్రజేయడం, మనువాద సంస్కృతిని బద్దలుకొట్టడం, రాజ్యాధికారం... అనే లక్ష్యాలతో "దళిత కవిత", "చిక్కనవుతున్న పాట", "పదునెక్కిన పాట", "ప్రవహించే పాట" వంటి కవితా సంకలనాలు వెలువడ్డాయి.

ఎప్పుడైతే దళిత ఉద్యమంలో బి.సి.లు భాగస్వాములు కాలేదో అప్పుడు బి.సి. వాద కవిత సంకలనం వెలువడింది. కానీ ఇది కొనసాగలేదు. ఆ తర్వాత ముస్లింవాదం తలెత్తింది. అభద్రతాభావంతో ఈ దేశంలో హీనంగా జీవించవలసి వస్తోందనీ, హిందువుల ఆధిపత్యం వల్ల దీనంగా బతకవలసి వస్తోందనీ, ముస్లిముల పేదరికం పెరిగిపోతోందనీ, వేధింపులు ఎక్కువవుతున్నాయనీ కవులు ముస్లింవాద కవిత్వం రాయటం 2000వ సంవత్సరంలో మొదలైంది. దీనిని మొదట్లో మైనారిటీవాదంగా పిలిచారు. "నా దేశంలో నేనొక కాందిశీకుణ్ణి" అంటూ ముస్లిం కవులు "జిహాద్", "జల్‌జలా" వంటి సంకలనాలు వెలువడ్డాయి. ఖాదిర్ మొహియుద్దీన్, రసూల్, అఫ్సర్, ఖదీర్, ఖాజా, ఇక్బాల్‌చంద్, హనీఫ్, స్కై బాబా మొదలైనవారు ముస్లింవాద భావజాలంతో కవితా సంపుటాలు వెలువరించారు. షాజహానా, షెహనాజ్ వంటి ముగ్గురు నలుగురు కవయిత్రులు మాత్రమే ముస్లింవాద కవిత్వం రాస్తున్నారు. గుంటూరు ఏసుపాదం, కలేకూరి ప్రసాద్, మద్దూరి వంటి కొద్దిమంది క్రిస్టియన్ మైనారిటీల స్థితిని చిత్రీకరించారు తప్ప క్రిస్టియన్ మైనారిటీ కవిత్వం స్థిరపడలేదు. మైనారిటీల హక్కులు ప్రధాన ధ్యేయంగా ముస్లింవాద కవిత్వం వెలువడినా మొత్తం మీద హిందూమతంపైగల కసి ఎక్కువగా కనిపిస్తుంది. అంటే ముస్లింవాద కవిత్వంలో మత ప్రస్తావన ఎక్కువైంది. పైగా ఉర్దూ పదాల వాడకం అధికం. కరీముల్లా కవి ముస్లింవాదంలోని ఈ ధోరణులకి నిరసనగా "ఇస్లాం వాదం" ప్రారంభించాడు. ఇస్లాంవాద కవితా సంకలనాలూ వెలువడ్డాయి. అయితే ఇదొక వాదంగా స్థిరపడవలసి ఉంది.

> ఈ వాదాలూ ధోరణులూ ఇలా ఉండగా, 'ప్రత్యేక తెలంగాణా' ఉద్యమ ప్రభావంతో తెలంగాణ కవులు ప్రాంతీయ స్పృహతో కవిత్వం రాయటం 1995 ప్రాంతంలో మొదలైంది.

ఈ వాదాలూ ధోరణులూ ఇలా ఉండగా, 'ప్రత్యేక తెలంగాణా' ఉద్యమ ప్రభావంతో తెలంగాణ కవులు ప్రాంతీయ స్పృహతో కవిత్వం రాయటం 1995 ప్రాంతంలో మొదలైంది. తెలంగాణా వివక్షకు గురవుతోందనీ, తెలంగాణీయుల ఉనికి, భద్రత ప్రశ్నార్థకాలవుతున్నాయనీ దిగులు చెందుతూ తమ ప్రాంతం మీద తమకే అధికారం ఉండాలనీ, కోస్తా ఆంధ్రుల పెత్తనం అంతమవ్వాలనీ

ప్రాంతీయ అస్తిత్వవాదం వచ్చింది. తెలంగాణాపై ఎప్పటినుంచో గళమెత్తుతున్న కవి కాళోజీ మరింత బలంగా వక్కాణించారు. "పొక్కిలి", "మత్తడి" వంటి సంకలనాలు ప్రాంతీయ స్పృహను శక్తివంతంగా చిత్రీకరించాయి. జూలూరు గౌరీశంకర్, కోట్ల వెంకటేశ్వరరెడ్డి, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, సిధారెడ్డి, వేణుసుంకోజు, యెన్నం ఉపేందర్, కాసుల ప్రతాపరెడ్డి మొదలైన కవులు తెలంగాణా వాసుల ఆకాంక్షలకు ప్రతిరూపం ఇస్తూ కవితలు రాశారు. తమ ఆత్మగౌరవాన్ని నిర్దిష్టమైన స్వరంతో వెల్లడించారు. కానీ కొద్దిమంది కవితల్లో కోస్తా ప్రాంతంపై ద్వేషం కనిపిస్తుంది. దూషణ కూడా చోటు చేసుకొంది. తమ అస్తిత్వ పోరాటంలో ఆ ఆవేశం తప్పదంటారు. కసి, ద్వేషం వల్ల కవిత్వ వాతావరణం, సహవాసం దెబ్బతింటున్నాయన్నది మర్చిపోకూడదు. తెలంగాణా అస్తిత్వవాదం ప్రభావంతో రాయలసీమ కవులు, ఉత్తరాంధ్ర కవులు తమ ప్రాంతీయ స్పృహను వ్యక్తీకరిస్తూ కవిత్వం రాస్తున్నారు. కవితా సంకలనాలూ వెలువడుతున్నాయి. తెలంగాణాలో వెలువడిన దళిత కవిత్వంలో ఈ ప్రాంతీయ అస్తిత్వ వేదన బాగా ఎక్కువ. ప్రాంతీయ అస్తిత్వవాద కవిత్వంలో ధిక్కార స్వరం ఎక్కువైనా తెలుగు సాహిత్యరంగంలో ఇప్పుడు వీస్తున్న గాలి ఇదే!

కొంతకాలం తెలుగు కవిత్వంలో ఆధునికోత్తరవాదం లేదా ఆధునికానంతరవాదం అనే కొత్త ధోరణి ప్రచారంలో వుంది. ఇంగ్లీషులో దీన్ని "పోస్ట్ మోడర్నిజం" అంటారు. పాశ్చాత్య సాహిత్యంలో ఈ ధోరణి 1960ల నాటికే వుండగా మన తెలుగులోకి 1990 తర్వాత ప్రవేశించింది. సిద్ధాంతాల అఖండతను ప్రశ్నిస్తూ ముందుకు వచ్చిన ఈ సిద్ధాంతం ఒక ఆలోచనా ధోరణి. సత్యం, హేతువు, హేతుబద్ధత, గుర్తింపు, విశ్వజనీనత, మహా కథనాలు వంటివాటిని ఆధునికోత్తరవాదం పూర్తిగా ఒప్పుకోదు, విశ్లేషించాలంటుంది. అఖండత స్థానంలో సాపేక్షత ఉండాలంటుంది. సమగ్రత, సార్వకాలీనతలను అంగీకరించదు. సామూహీకరణను నిరసిస్తుంది. అఖండ అర్థాల అంతరార్థాన్ని, ప్రతి అంశాన్ని

> "కొంతకాలం తెలుగు కవిత్వంలో ఆధునికోత్తరవాదం లేదా ఆధునికానంతర వాదం అనే కొత్త ధోరణి ప్రచారంలో వుంది. ఇంగ్లీషులో దీన్ని "పోస్ట్ మోడర్నిజం" అంటారు."

ఖండఖండాలుగా చూడటాన్ని అంగీకరిస్తుంది. అయితే ఈ ఆధునికోత్తరవాదం ఇవాళ దాదాపుగా లేదని చెప్పాలి. దీనికి పెద్ద ఆదరణా లభించలేదు.

ఈ వాదాలతో పాటు కొంతకాలం "అనుభూతివాదం" తెలుగు కవిత్వంలో ప్రచారం పొందింది. అనుభూతికి ప్రాధాన్యమిచ్చేది లేదా అనుభూతిని సాక్షాత్కరింపజెయ్యాలన్న తపన గలది అనుభూతి కవిత్వం.

ఈ వాదాలతో పాటు కొంతకాలం "అనుభూతివాదం" తెలుగు కవిత్వంలో ప్రచారం పొందింది. అనుభూతికి ప్రాధాన్యమిచ్చేది లేదా అనుభూతిని సాక్షాత్కరింపజెయ్యాలన్న తపన గలది అనుభూతి కవిత్వం. రాజకీయ వాదాలకి, సామాజికస్పృహకి వ్యతిరేకంగా అనుభూతి కవిత్వం వెలువడింది. ఆత్మానుభూతుల్ని 'శుభ్రం'గా వెల్లడించాలనీ, వ్యక్తివాదానికి లేదా శుద్ధ కళావాదానికి ప్రాధాన్యం ఇస్తూ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, ఇస్మాయిల్, వేగుంట మోహనప్రసాద్, కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ మొదలైనవారు అనుభూతి కవిత్వం రాశారు. తొలి అనుభూతి వాద కవిగా "అమృతం కురిసిన రాత్రి" కవి బాలగంగాధర తిలక్‌ను చెప్పాలి. అనుభూతి కవిత్వం, ఆత్మాశ్రయ కవిత్వానికి, అంతర్ముఖత్వానికి చెందుతుంది. అస్పష్టత వుంటుంది. కేవలం స్వప్న కవిత వంటిదనీ, సమాజానికి అంత ప్రయోజనం లేనిదనీ విమర్శకులు వెల్లడించారు. అయినా సీతారాం, సిద్ధార్థ, నామాడి శ్రీధర్, కాశీభట్ల వేణుగోపాల్ మొదలైన వారు అనుభూతి కవిత్వం రాశారు.

పాశ్చాత్యవాదాల ప్రభావం ఆధునిక కవిత్వంపై చాలా ఉంది. వ్యక్తి స్వాతంత్ర్యం ప్రధానంగా వెలువడిన వాదం "అస్తిత్వ వాదం" (Existentialism). ఆర్.ఎస్.సుదర్శనం, వేగుంట, నిఖిలేశ్వర్, మాదిరాజు రంగారావు వంటివారు ఈ ధోరణిలో కవిత్వం రాశారు. 1947 తర్వాత ఆధునిక కవిత్వాన్ని బాగా ప్రభావితం చేసినవాదం "ప్రతీకవాదం" (Symbolism). సంవిధాన శిల్పానికి ప్రతీకవాదం ఉపకరించింది. కవి వాడిన ప్రతీకలు తెలిస్తే ఆనందమే. లేకపోతే అస్పష్టత తప్పదు. వస్తువును వ్యాఖ్యానించటానికి, అనల్ప భావాన్ని సంక్షిప్తంగా వివరించడానికి ప్రతీక తోడ్పడుతుంది. ప్రతీకలు కవిభావాలకు సంబంధించినవై

ఉంటాయి. అంటే వైయుక్తికమై ఉంటాయి. "సమగ్ర భావమయ ప్రపంచం" ప్రతీకలలో దర్శనమిస్తుంది. ఆరుద్ర "త్వమేవాహం" కావ్యం ప్రతీకాత్మక కావ్యం. శ్రీరంగనారాయణబాబు, శ్రీశ్రీ, శేషేంద్ర, సినారె వంటివారు ప్రతీకల్ని సమర్థవంతంగా ప్రయోగించారు. ఆధునిక కవి 'ప్రతీక'లు లేకుండా మంచి కవిత్వం రాయలేడని చెప్పదగినంతగా ప్రతీకవాదం వ్యాపించింది.

ఆధునికకవిత్వంలో భావచిత్రణ లేదా పదచిత్రణ (Imagism) ముఖ్యమైన కవితా శిల్పమైంది. కవిత్వంలో గొప్ప అభివ్యక్తికి ఈ భావచిత్రణ ప్రధానసాధనమైంది. ఇంగ్లాండ్ నుంచి వచ్చిన ఈ "టెక్నిక్"కి ఎజ్రాపౌండ్‌ను చెప్తారు. అతని ప్రభావంతోనే తెలుగులో 'ఇమేజిజమ్'ను కవులు సమర్థవంతంగా ప్రయోగించారు. "భావచిత్రం మనోనయనానికి రూపుకట్టేది, ఇంద్రియ స్పర్శగలది, శబ్దాల ద్వారా రూపుకట్టేది"భావచిత్రం! కవితా నిర్మాణ సామగ్రిలో పదచిత్రణ ముఖ్యమైంది. పాఠకుడ్ని ఉత్తేజపరచటంలో, పాఠకుడిలో సంపూర్ణ అవగాహన, అనుభూతి కలిగించటంలో పదచిత్రణ తోడ్పడుతుందిగానీ ఇక్కడ కూడా అస్పష్టత తప్పదు! డాడాయిజమ్ లేదా విధ్వంసనవాదం అనే ధోరణిలో కొందరు కవిత్వం రాశారుగానీ ఆదరణ లభించలేదు పాఠకుల మెప్పు పొందలేకపోయింది. ఫ్రాయిడ్ మనో విశ్లేషణ శాస్త్రం (Psycho analysis) ఆధారంగా ఆధునికకవిత్వంలో కొంతమంది "అధివాస్తవికతా వాదం" ప్రవేశపెట్టారు. దీనిని 'సర్రియలిజమ్' అంటారు. అన్వయరాహిత్యం, అవ్యక్త ప్రేలాపన, అజ్ఞాతంగా ఉన్నవాటిని బహిరంగపరచడం అధివాస్తవికతా లక్షణం. శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబులు ఈ తరహా కవిత్వం రాశారు. వేగుంట వారి వంటి కవిత్వంలోనూ ఈ ఛాయలు కనిపిస్తాయి. అయితే ఇది కేవలం ప్రయోగవాదంగానే నిలిచిపోయింది.

ఆధునిక కవిత్వంలో భావచిత్రణ లేదా పదచిత్రణ (Imagism) ముఖ్యమైన కవితా శిల్పమైంది. కవిత్వంలో గొప్ప అభివ్యక్తికి ఈ భావచిత్రణ ప్రధానసాధనమైంది. ఇంగ్లాండ్ నుంచి వచ్చిన ఈ "టెక్నిక్"కి ఎజ్రాపౌండ్‌ను చెప్తారు.

ఆధునిక కవిత్వంపై హేతువాద ప్రభావమూ కనిపిస్తుంది. "నిర్హేతుకమైన

భావాలకూ, ప్రమాణాలకూ తావులేకుండా, యదార్థమైన జ్ఞానాన్ని గుర్తించడమే హేతువాదం" అంటారు. త్రిపురనేని రామస్వామి పద్యాలలో ఈ హేతువాద ధోరణిని వ్యాప్తిగావించారు. దళిత వాదంలో హేతుభావాల ఛాయలు కనిపిస్తాయి.

మానవుడే అన్నిటికి మూలం. మానవుడి సంక్షేమమే ప్రధానం. వ్యక్తి సమాజానికి బలి కాకూడదు. వ్యక్తి స్వేచ్ఛ, మానవ సంబంధాలు లేని సమాజం అభివృద్ధి చెందదు. మానవ జీవితం పవిత్రమైంది అనే భావనలతో మానవతావాద కవిత్వం వెలువడింది. శేషేంద్ర, సినారె, కుందుర్తి, కాళోజీ, పాపినేని శివశంకర్, కొప్పర్తి మొదలైన కవుల కవిత్వంలో మానవతావాదం ఎక్కువగా కనిపిస్తుంది.

> సుప్రసన్న, సంపత్కుమార, పేర్వారం జగన్నాథం, నరసింహారెడ్డి అనే నలుగురు కవులు చేతనావర్త ధోరణితో కవితా సంకలనాలు తెచ్చారు. అందుకే వీళ్ళని చేతనావర్త కవులు అంటారు.

సుప్రసన్న, సంపత్కుమార, పేర్వారం జగన్నాథం, నరసింహారెడ్డి అనే నలుగురు కవులు చేతనావర్త ధోరణితో కవితా సంకలనాలు తెచ్చారు. అందుకే వీళ్ళని చేతనావర్త కవులు అంటారు. సంప్రదాయ స్పృహ, దేశభక్తి, ఆధ్యాత్మిక దృష్టి ఈ కవిత్వ లక్షణాలు. విదేశీ "ఇజాల"ని అంగీకరించరు. ప్రగతివాద కవి మార్క్సిస్టు అయి ఉండాలనటం సరికాదంటారు. రాజకీయాలకు అతీతంగా కవి ఉండాలంటారు. 'చేతనావర్త కవిత్వం' అనే బృహత్ సంపుటం వెలువడింది. అయితే ఇది కొంతకాలం ఒక ధోరణిగా పేరుపొందింది తప్ప దీనివల్ల ప్రభావితులైనవారూ, అనుయాయులూ ఉన్నట్టుగానీ బాగా ప్రచారం పొందిందనిగానీ చెప్పటం కష్టం. కొంతమంది 'పైగంబర కవులు'గా, 'దిగంబర కవులు'గా కవిత్వం రాసినా గుర్తింపు రాలేదు.

ఇన్ని ఉద్యమాలూ, ఇన్ని నవీన ధోరణుల మధ్య పద్యకవిత్వం తన స్థానాన్ని పదిలం చేసుకొంది. "నవ్య సంప్రదాయ ఉద్యమం"గా కొందరు ప్రకటించినా దానిని ఉద్యమం అనటం సమంజసం కాదు. ఇదీ ఒక ధోరణి మాత్రమే! ఈ నవ్య సంప్రదాయానికి విశ్వనాథ సత్యనారాయణ నాయకుడు. గడియారం వేంకటశేషశాస్త్రి, పుట్టపర్తి నారాయణాచార్యులు, ముదిగొండ వీరభద్రమూర్తి, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, ఉత్పల సత్యనారాయణాచార్య, కరుణశ్రీ,

పైడిపాటి సుబ్బరాయశాస్త్రి, వానమామలై వరదాచార్యులు మొదలైనవారి కావ్యాలు ఈ నవ్య సంప్రదాయ ధోరణికి చెందుతాయి. జాతీయతకీ, దేశీయతకీ, గత వైభవ సంస్మరణకీ, ప్రాచీన సాహిత్య వైశిష్ట్యానికీ ప్రాధాన్యం ఇస్తుందీ నవ్య సంప్రదాయం. ప్రాచీన సాహిత్యాన్ని నవీనంగా పునఃప్రతిష్ఠించాలని చెప్తుంది. పాశ్చాత్య సాహిత్యానికి బానిస కావద్దంటుంది. మన సంస్కృతినీ, వారసత్వాన్నీ గౌరవించాలని హితవు పలుకుతుంది. 'జాతీయ దృక్పథం' ఈ ధోరణికి పునాది. రాజకీయాలు లేని సాహిత్య సామాజిక స్పృహకి నవ్య సంప్రదాయ కవులు ప్రాధాన్యమిచ్చారు. అయితే మన గత వైభవాన్ని, మూలాల్ని మరచిపోకూడదని బోధించే ఈ వాదం ఉద్యమరూపం పొందలేదన్నది సత్యం.

1947 నుంచి ఆధునిక కవిత్వంలో రూప ప్రాధాన్యం గమనిస్తాం. పద్యరూపం ఆధునిక భావజాల ప్రకటనకి సముచిత రూపంకాదని 'వచనకవిత' అవతరించింది. ఇంగ్లీషులోగల 'ఫ్రీవర్స్' అనేది 'వచన కవిత'గా వచ్చింది. సరళంగా, వాడుక భాషలో, నియమ రహితంగా, స్వేచ్ఛగా రాసే అభినవ రూపంగా 'వచన కవిత' వ్యాప్తి చెందింది. కుందుర్తి 'ఫ్రీవర్స్ ఫ్రంట్' ద్వారా వచన కవితోద్యమాన్ని చేపట్టారు. 'వచన కవిత' బహుళవ్యాప్తి పొందింది. ఇవాళ కవిత్వమంటే వచన కవిత్వమే అన్నంతగా ప్రాచుర్యం పొందింది. 'మినీ కవిత్వం' కూడా కొంతకాలం ఉద్యమస్థాయిలో వెలువడింది. అద్దేపల్లి రామమోహనరావు, రావిరంగారావు, కొల్లూరి, జివి పూర్ణచంద్, గుత్తికొండ సుబ్బారావు మొదలైనవారు మినీ కవిత్వోద్యమ సారథులయ్యారు. వచన కవిత్వాన్ని ఇమేజిజమ్, అస్పష్టత, వచనప్రాయం అనే అవలక్షణాల నుంచి మినీ కవిత్వం వచన కవిత్వాన్ని రక్షించింది. వ్యంగ్యం, క్లుప్తతలు ప్రధానంగా వెలువడిన మినీ కవిత్వం కొత్త కవుల్ని తయారు చేసింది. కొల్లూరి 'మినీ కవిత విప్లవం' అనే సంకలనాన్ని మొదటగా తీసుకొచ్చాడు. నేటికీ రావి రంగారావు మినీ కవిత్వ ప్రచారాన్ని కొనసాగిస్తూనే వున్నారు.

"1947 నుంచి ఆధునిక కవిత్వంలో రూప ప్రాధాన్యం గమనిస్తాం. పద్యరూపం ఆధునిక భావజాల ప్రకటనకి సముచిత రూపం కాదని 'వచన కవిత' అవతరించింది. ఇంగ్లీషులోగల 'ఫ్రీవర్స్' అనేది 'వచన కవిత'గా వచ్చింది."

వచన కవిత్వంలో చెప్పుకోదగిన విశేష పరిణామం 'దీర్ఘ కవిత'. కుందుర్తి కథా కావ్యాలు రావాలని పిలుపునిచ్చినా అప్పటికి ఎవరూ స్పందించలేదు. కథా కావ్యాలతో పాటు ఎక్కువగా దీర్ఘ కవితలు (Long poems) వెలువడ్డాయి-వెలువడుతూ ఉన్నాయి. రాష్ట్రీయ, జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై విశిష్టమైన దీర్ఘ కవితలు వెలువడ్డాయి. తెలంగాణా నుంచి ప్రాంతీయ స్పృహతో చాలా దీర్ఘ కవితలు వెలువడ్డాయి. జూలూరు గౌరీశంకర్, జూగంటి జగన్నాథం, ఛాయారాజ్ వంటివారు దీర్ఘకవితలు బాగా రాశారు. ఆచార్య సి.నారాయణరెడ్డి 'ప్రపంచ పదులు' అనే కొత్త రూపాన్ని సృష్టించారు. శారదా అశోకవర్ధన్ మాత్రమే ఈ కవితారూపంలో కవిత్వం రాశారు.

> గురజాడ సృష్టించిన 'ముత్యాలసరం' రూపంలో కొందరు కావ్యాలు రాశారు. ఆధునిక కవిత్వంలో గేయం ప్రముఖ స్థానం ఆక్రమించుకుంది. గేయం, పాట అనే రూపాలు ఉద్యమ కవిత్వానికి ప్రధాన వాహికలయ్యాయి.

గురజాడ సృష్టించిన 'ముత్యాలసరం' రూపంలో కొందరు కావ్యాలు రాశారు. ఆధునిక కవిత్వంలో గేయం ప్రముఖ స్థానం ఆక్రమించుకుంది. గేయం, పాట అనే రూపాలు ఉద్యమ కవిత్వానికి ప్రధాన వాహికలయ్యాయి. విశ్వనాథ, పుట్టపర్తి, బోయి భీమన్న, సినారె, నాగభైరవ, విద్వాన్ విశ్వం, బాపురెడ్డి మొదలైనవారు గేయ కావ్యాలతో ప్రస్తుతికెక్కారు. బి.వి. నరసింహారావు, చల్లా రాధాకృష్ణశర్మ, మిరియాల రామకృష్ణ, నార్ల చిరంజీవి, మసూనా, కరుణశ్రీ వంటివారు బాలల గేయాలు రాశారు.

ఉర్దూలో గజల్ కమనీయ కవితాలహరి. అయితే ఆ భాషలో ఎక్కువగా ఈ కవితా రూపం శృంగారపరంగా, తాత్త్వికపరంగా వుంది. దాశరథి కృష్ణమాచార్య గాలిబ్ గజల్స్‌ను మొదటగా తెలుగులోకి అనువదించారు. కానీ ఆచార్య సి.నారాయణరెడ్డి తెలుగు గజల్స్ సొంతంగా రాసి, పాడటమే కాకుండా గజల్ ప్రక్రియకి సామాజిక స్పృహను అద్దారు.

జపనీస్ కవితారూపం 'హైకూ' బాగా ప్రచారం పొందింది. 'హైకూ' లక్షణాల్ని

తెలుగులోకి తీసుకురావటం కష్టం కాబట్టి తెలుగు కవులు ఆ లక్షణాలను పాటించకుండా కేవలం మూడు పాదాలలో హైకూలు రాశారు. గాలి నాసరరెడ్డి, ఇస్మాయిల్, పెన్నా శివరామకృష్ణ, బి.వి.వి. ప్రసాద్ వంటివారు హైకూల సంపుటాలు ప్రచురించి హైకూ కవితా రూపానికి వ్యాప్తి కలిగించారు. రావి రంగారావు 'సామాజిక హైకూలు' రాశారు. ఏమైనా హైకూలలో ప్రగతిశీల భావాలకి, సామాజిక స్పృహకీ చోటు లేదనే చెప్పాలి.

ఆచార్య ఎన్.గోపి సొంతంగా 'నానీ'లు అనే కవితా రూపంలో కవితలు రాసి ఎందర్నో ఆకర్షించారు. నానీలు ఇటీవలి కవితారూపంగా స్థిరపడింది. దాదాపు వందమంది కవులు, కవయిత్రులు 'నానీ'లు రాశారు. నానీల కవితా సంపుటాలు డబ్బయి వరకు వెలువడ్డాయి. నాలుగు పాదాలలో 20-25 అక్షరాలతో నానీలుంటాయి. నానీలలో తాత్విక చింతనతోపాటు సామాజిక స్పృహ ఉండటం విశేషం.

వచన కవిత్వం ఎంతగా విస్తృతి చెందినా, మరెంతగా ప్రాచుర్యం పొందినా పద్య కవిత్వం వెలువడుతూనే వుంది. విశ్వనాథ వారి శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఈ కాలంలోనే వెలువడింది. పుట్టపర్తివారి 'శివతాండవం' ప్రజాదరణ పొందింది. ఉత్పల సత్యనారాయణాచార్యులు "ఈ జంట నగరాలు-హేమంత శిఖరాలు" కావ్యం ద్వారా పద్యరచనకి కొత్త సొబగులు సమకూర్చారు. జ్ఞానానందకవి, సంపత్కుమార, బేతవోలు రామబ్రహ్మం, రసరాజు, ఆశావాది ప్రకాశరావు, బండ్లమూడి సత్యనారాయణ, అనుమాండ్ల భూమయ్య, నాగభైరవ, ఆచార్య తిరుమల, కులపతి, గరికిపాటి నరసింహారావు, వేముగంటి నరసింహాచార్యులు, కడిమిళ్ళ వరప్రసాద్ మొదలైనవారెందరో పద్య కవిత్వానికి వన్నెచిన్నెలు సమకూర్చి పద్యం తెలుగువాడి నాల్క అని చాటి చెప్పారు.

> "వచన కవిత్వం ఎంతగా విస్తృతి చెందినా, మరెంతగా ప్రాచుర్యం పొందినా పద్య కవిత్వం వెలువడుతూనే వుంది. విశ్వనాథ వారి శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఈ కాలంలోనే వెలువడింది."

ఈ అరవై సంవత్సరాల తెలుగు కవిత్వంలో మరొక ముఖ్యమైన ఉద్యమం తెలంగాణా విముక్తి పోరాటం. దేశానికి స్వాతంత్ర్యం లభించినా తెలంగాణా హైదరాబాద్ సంస్థానపు నిజాం నవాబు నిరంకుశ పాలనలోనే మగ్గిపోతోంది. నిజాం దుష్ట, నిరంకుశ పరిపాలనకి వ్యతిరేకంగా కవులు ఉద్యమించారు. దాశరథి, సోమసుందర్, కాళోజీ, ఆరుద్ర, రెంటాల మొదలైన కవులతో పాటు యాదగిరి వంటి ప్రజాకవులు నిజాం వ్యతిరేక కవిత్వం రాశారు. తెలంగాణా సాయుధ పోరాట కవిత్వం ప్రత్యేక స్థానం సంపాదించింది.

> భాష విషయానికి వస్తే ఉద్యమాల ప్రభావంతో 'భాషాస్వేచ్ఛ' లభించింది. వ్యాకరణ సంకెళ్ళు విడిపోయాయి. 'సారళ్యం' ప్రాముఖ్యం వహించింది.

భాష విషయానికి వస్తే ఉద్యమాల ప్రభావంతో 'భాషాస్వేచ్ఛ' లభించింది. వ్యాకరణ సంకెళ్ళు విడిపోయాయి. 'సారళ్యం' ప్రాముఖ్యం వహించింది. ప్రజా కవిత్వం వల్ల, అభ్యుదయ, విప్లవ, దళిత ఉద్యమాల వల్ల ప్రజల భాషకి, వాడుక భాషకీ, మాండలికాలకీ ఆదరణ లభించింది. కోస్తా మాండలికేతర మాండలిక భాషలలో విశిష్టమైన కావ్యాలు వెలువడ్డాయి. ముఖ్యంగా తెలంగాణా మాండలికంలో విలక్షణమైన, ఉదాత్తమైన కావ్యాలు వచ్చాయి. గత అరవై సంవత్సరాల తెలుగు కవిత్వాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తే బహుముఖాలుగా విస్తరిల్లుతోందనీ, ఇతర భాషలలోని కవిత్వంకంటే వస్తుపరంగా భాషాపరంగా ముందు వరుసలోనే ఉందనీ, ఈ ఆధునిక కవిత్వం సమాజపరమై మనిషి మనుగడ కోసం, మానవత్వం కోసం పరితపిస్తోందనీ, 'కాదేదీ కవిత్వానికి అనర్హం', 'కవిత్వమొక తీరని దాహం' అనేవి అక్షర సత్యాలనీ నిరూపిస్తూ దినదినాభివృద్ధి చెందుతోందని తెలుస్తుంది.

గమనిక:

కీ. శే. ద్వానా శాస్త్రి గారు 2009 లో ఒక అంతర్జాల స్వగత పుట (బ్లాగ్) లో పొందు పరచిన విశ్లేషణాత్మక వ్యాసాన్ని ఇక్కడ ప్రచురిస్తున్నాము. ఈ వ్యాసం వేరే పత్రికలో ప్రచురించబడలేదు. ప్రకాశికలో ప్రచురించడానికి అనుమతిని ఇచ్చిన ద్వానా శాస్త్రి గారి కుమారుడు శ్రీ శశికాంత్ గారికి కృతజ్ఞతలు.

# సంఘసంస్కరణోద్యమ కవిత్వం




**డా. కనుపర్తి విజయబక్ష్**
విశ్రాంత రీడర్
✆ 94413 82303


ప్రాచీన భారతదేశం వేదాలను ప్రమాణంగా స్వీకరించింది. వేదయుగానంతరం ప్రభవించిన తాత్విక చర్చల ఫలితంగా ఏర్పడ్డ సుదర్శనాలు సైతం వేద ప్రామాణ్యాన్నే అంగీకరించాయి. వేద ప్రామాణ్యాన్ని త్రోసి రాజన్న చార్వాకం, బౌద్ధం, జైనం, నాస్తిక దర్శనాలు అనబడ్డాయి. (నాస్తికో వేద నిందకః). యజ్ఞయాగాది క్రతువులను నిరసించటమే కాక దైవం, మూఢ విశ్వాసాది భావాలను తనదైన కొత్త కోణంలో ఈ దర్శనాలు వివరించేయి.

దైవాన్ని, కర్మకాండలను, యజ్ఞయాగాది క్రతువులను నిరసించడమే కాక దైవం, మూఢ విశ్వాసాది భావాలను తనదైన కొత్త కోణంలో ఈ దర్శనాలు వివరించేయి.

దైవాన్ని, కర్మకాండలను, యజ్ఞయాగాది క్రతువులను విగ్రహారాధనను, వర్ణవ్యవస్థను ఖండించినాయి. వర్ణం పేరుతో సమాజంలో నెలకొన్న అసమానతలపై తీవ్రంగా ధ్వజమెత్తాయి. ఒక రకంగా సాంఘిక విప్లవానికి నాంది పలికేయి.

## సంఘసంస్కరణ బీజాలు :-

భారతదేశంలో మత సాంఘిక రంగాల్లో సంస్కరణవాదాలుగా బయలుదేరిన సిద్ధాంతాలన్ని చివరకు మతవాదాలుగానే పరిణమించేయి. మతం నుండి దూరంగా జరగకుండా కొన్ని సంస్కరణలు చేపట్టి ప్రజాజీవన విధానంలో కొంత కదలికను తీసుకువచ్చేరు మతవాదులు. హిందు మతంలో బలంగా నాటుకుపోయిన వర్ణవ్యవస్థను, మూఢ విశ్వాసాలను మాత్రమే ప్రశ్నిస్తూ దైవభావనకు దూరం కాలేకపోయినవారు కొందరున్నారు. వారి ఆలోచన కొంత పరిధిని దాటి ముందుకు పోలేకపోయింది. అట్టివారిలో మనకు ప్రాచీనకాలపు

కవుల్లో శివకవులు ప్రముఖంగా కనిపిస్తారు. దైవాన్ని కాదనలేకపోయినా ఆచార సంప్రదాయాలను, కులాన్ని ప్రశ్నించినవారు శివకవుల్లో బయలుదేరారు.

12వ శతాబ్దంలో బసవన్న కన్నడ దేశంలో వీరశైవం స్థాపించాడు. ఆ కాలంలో శక్తివంతమైన సంస్కరణ సాధనంగా వీరశైవం పుట్టింది. పుట్టటం సంస్కరణ సాధనంగా పుట్టినా రాను రాను వాటిలో తత్త్వం అడుగంటింది. శివపారమ్య కీర్తనం, వేదవిహితమైన యజ్ఞయాగాదుల నిరసన, కులభేదాల నిరాకరణ, స్త్రీ పురుష అసమాన తిరస్కరణ, అస్పృశ్యతపైన ధ్వజమెత్తడం వంటి సూత్రాలతో వీరశైవం ఆవిర్భవించింది. కులమత భేదాలకు వ్యతిరేకంగా కులాంతరవివాహాలు జరిపించారు వీరశైవులు. మానవతావాదాన్ని సర్వమానవ సౌభ్రాత్వాన్ని ప్రబోధించారు. అప్పటి ప్రత్యేక చారిత్రక సామాజిక పరిస్థితుల్లో వారికున్న పరిమితుల మేరకు కొంతవరకైన అభివృద్ధికరమైన ఆచరణకు పూనుకున్నారు శివకవులు. భక్తిని ఆలంబనగా చేసుకొని మాత్రమే కులవ్యవస్థను, అగ్రవర్ణాధిపత్యాన్ని ప్రశ్నించేరు. వర్ణవ్యవస్థ బలంగా నాటుకపోయిన ఆ పరిస్థితుల్లో దానిమీద ధ్వజమెత్తటం అనేది ఒక సాహసం. వీరశైవుడైతే ఏ కులం వాడైనా ఫర్వాలేదు. వృత్తితో పనిలేదు.

అదే విధానం వేమనకు వైష్ణవంలోను కనిపిస్తోంది.

పరమగు వేదాంత పఠన దొరికియు సదా
హరిదలచలేని సన్యాసి కంటె
మరిగి పసరము దినెడి మూలలయైనను వాడె
పరమాత్మ గొలిచినను బ్రాహ్మణోత్తముడు

అన్న కృష్ణమాచార్యుని భావనలో భక్తిని మించింది లేదని, విష్ణుభక్తి ముందు ఏది సరిరావనే భావం కనిపిస్తోంది. ప్రసిద్ధ సంకీర్తనాచార్యుడు, పదకవితాపితామహుడు అన్నమాచార్యుడు కూడా ఇటువంటి ఉదార భావాలనే తన సంకీర్తనల్లోను వెల్లడించారు.

### వేమనపద్యాలు : సంస్కరణభావాలు:

శైవకవుల వలె సామాన్య ప్రజానీకానికి అర్థమయ్యే రీతిలో కవిత్వాన్ని చెప్పిన వారిలో పూర్వ యుగపు కవులెవరు లేరు. మధ్యయుగాల నాటికి అంటే 15 - 16 శతాబ్దుల కాలం నాటికి ఆ వెలితిని పూర్తిచేసినవాడు వేమన. వేమనను మించిన 'ప్రజాకవి' మన తెలుగు కవులలో లేడు అంటే అతిశయోక్తి కాదు. శివకవుల

కవిత్వంలో బీజం పడిన సంస్కరణ భావాలు వేమన కవిత్వంలో ప్రాణం పోసుకొని మొక్కలై మొగ్గతొడిగి, పూవులై పరిమళాలను అంతటా వ్యాపింపచేశాయి.

మన తన కాలం నాటి అసంబద్ధమైన అన్ని విషయాలను తూర్పారబట్టాడు. అట్లా ప్రశ్నించటంలో దేవుళ్ళు, దయ్యాలు, స్వర్గనరకాలు, ఆత్మ పరమాత్మలను, మత సంబంధమైన దురాచారాలను ప్రశ్నించాడు. రాళ్ళు, రప్పలకు, చెట్లకు, పుట్లకు, గట్లకు మ్రొక్కడాన్ని నిరసించాడు. విగ్రహారాధనను నిర్ద్వంద్వంగ ఖండించాడు. వీరశైవం, వైష్ణవం పుట్టటం అడుగంటింది. ఆ వచ్చిన మార్పుల్ని గమనించిన వేమన -

ఆరుమతముల కన్న నధికమైన మతము
లింగమతముకన్న లేదు జగతి
లింగధారికన్న దొంగలు లేరురా
పట్టుచీరెగట్టి పట్టె తిరుమణి బెట్టి
సృష్టి వైష్ణవంబు శిఖలుమించె
చిన్నెలెన్నో జేసి చెరచె వైష్ణవమట్ల
అని రెండు మతాల్లో వున్న చెడుగులను విమర్శించాడు.
శిలను ప్రతిమచేసి చీకటింటను బెట్టి
మ్రొక్కవలదు వెర్రి మూఢులార
యుల్లమందు బ్రహ్మయుండుట తెలియదు

కొండరాళ్ళదెచ్చి కోరికగట్టిన
గుళ్ళలోన దిరిగి కుళ్ళనేల
పాయరాని శివుడు ప్రాణియై యుండగ
రాతి బసవని గని రంగుగా మ్రొక్కుచు
బసవ భక్తులెల్ల పాపులు తలపోయ

వేమనకాలం నాటికి ఆంధ్ర దేశమంతా అరాచకం నిండి వుంది. సుస్థిర పాలన లేదు. అనేకమంది చిల్లర మల్లర రాజుల పాలనలో దేశమంతా అల్లకల్లోలంగ వుంది. శాంతి భద్రతలు లేవు. మతం పేరుతో, భక్తి పేరుతో, అధికారం పేరుతో, ఆచారం పేరుతో జరుగుతోన్న దమనకాండనంతా, సరససరళమైన కవితతో వాస్తవికతనంతా కళ్ళకు కట్టినట్లు విమర్శ, వ్యంగ్యాస్త్రాలను సంధిస్తూ చెప్పాడు.

కాశికాశియంచు కడువేడ్కతో బోదు
రందుగల్గు దేవుడిందు లేడె
యిందునందుగలడు హృదయంబు లెస్సైతె

మతం ఆమోదం పొందిన విశ్వాసాలను, ఏ విధమైన ఋజువు లేకుండా తరతరాలుగా ఆమోదించి ఆచరించటం అనేది అనాదిగా వస్తుంది. అటువంటి వాటినే గుడ్డినమ్మకాలు అంటాం. ఎందుకట్లా ఆచరించాలి అనేది వేమన ప్రశ్న.

గూబయెక్కిన గృహము పాడుగబెట్టి
వెళ్ళిపోదురంత వెర్రివారు
గూబయేమి చేసె గృహము యేమిచేసె

పిండములను చేసి పితరుల దలపోసి
కాకులకును బెట్టు గాడ్దెలార
పియ్యిదినెడు కాకి పితరుడెట్లాయరా!

అని తద్దినాలను కర్మకాండను నిరసించాడు. ముహూర్తాలు బెట్టి అతి నియమనిష్టతో చేసే పనులు ఎందుకు తారుమారవుతున్నాయో చెప్పమంటాడు.

విప్రులెల్ల జేరి వెర్రికూతలుకూసి
సతిపతులనుగూర్చి సమ్మతమున
మును ముహూర్తముంచ ముండెట్లు మోసరా,

అస్పృశ్యత హిందూమతానికి మచ్చ తెచ్చి పెట్టింది. వేమనను ఈ ఆచారం కలత పెట్టి వుండవచ్చు.

మాలవాని నేల మరిమరి నిందింప
ఒడలనున్న మాంసమొక్కటిగాదె
వానిలోన వెలుగువాని కులంబేది

కులాలు మతాలకు అతీతంగా మానవులంతా ఒకటే అని చెప్పే విశాల దృక్పథంతో

ఉర్వివారికెల్ల నొక్కకంచముబెట్టి
పొత్తుగుడిపికులముపాలయజేసి
తలను చెయ్యిబెట్టి తగనమ్మజెప్పరా.

వాక్శుద్ధి లేనివాడు చండాలుడవుతాడని, గుణాన్ని బట్టి మనిషి మంచి, చెడులు నిర్ణయించాలి గాని, కులాన్ని బట్టి కాదని అభిప్రాయపడతాడు.

మాలమాలగాడు మహిమీదనే ప్రొద్దు
మాట తిరుగువాడు మాలగాక
వాని మాలయన్నవాడెపో పెనుమాల

వేమన వలె సామాజిక స్పృహ ఆనాటి కవులెవరిలోను లేదనేది వాస్తవం. ఆయన పద్యాలకు ప్రేరణ ఆనాటి సమాజమే. మత మౌఢ్యాన్ని, కులపు కుళ్ళును, కుహనాయోగుల జారత్వాన్ని చోరత్వాన్ని..... ఒకటేమిటి సమస్త విషయాలను అతి అలవోకగా సామాన్యులకు సైతము అర్థమయ్యేలాగ చెప్పిన కవి మరొకరు లేరు. సంఘ సంస్కార్థమై కవిత్వాన్ని యింత సౌలభ్యంగా ఉపయోగించుకొన్న వేమన ప్రజల కోసమే కవిత్వం రాసి 'ప్రజాకవి' అయినాడు.

'వేమన్న లేకుండా వుంటే మన జీవితం లోనే గాదు తెలుగు సాహిత్య ప్రపంచంలోనే ఒక పెద్ద ఖాళీ ఏర్పడి ఉండేది' అని విజ్ఞుల అభిప్రాయం.

## సంఘసంస్కరణోద్యమ పతాక రెపరెపలాడిన కాలము :

ఆంధ్రదేశములో తెలుగు కవిత్వంలో ఇప్పటివరకు పొడచూపిన సంఘసంస్కరణ కార్యకలాపాలు 19వ శతాబ్దపు చిట్టచివరి దశాబ్దుల్లో, 20వ శతాబ్దపు మొదటిపాదంలో ఉవ్వెత్తున ఎగసిపడ్డాయి. శివకవుల నాటికి బీజవాపమైన సంస్కరణ వేమన నాటికి మొక్క అయి మొగ్గతొడిగి, పూవులై వికసించి పరిమళాలు వెదజల్లగా, ఆధునిక కాలంలో కందుకూరి, గురజాడ కాలం నాటికి సంస్కరణ కవితా వృక్షమై శాఖోపశాఖలుగా ఒక ఉద్యమంగా విస్తరిల్లి ఎందరో గొప్ప కవులను తీర్చి దిద్దటమే కాక ఉద్యమకారులుగా కూడా సంస్కరణ కార్యకలాపాల్లో భాగమయ్యారు.

వంగదేశమున రాజారామోహనరాయలు మానవోద్యమాన్ని మహోన్నతస్థితికి తీసుకువెళ్ళిన మహనీయుడు. ఈ మానవోద్యమానికి Italian Humanismనకు దగ్గర పోలికలున్నాయి. ఈ ఉద్యమం యొక్క ముఖ్య లక్షణము మానవుడు

పరిపూర్ణ స్వేచ్ఛననుభవించుట, వ్యక్తికి వ్యక్తికి మధ్యనున్న ఎల్లలను తుడిచివేయటం, అడ్డుగోడలను పడగొట్టడం, కులమత వ్యత్యాసములు, వ్యక్తి జ్ఞానవికాసాలకు నిరోధకములు కాగూడదు వ్యక్తిస్వేచ్ఛకు అడ్డువచ్చే సంఘ దురాచారములను, మూఢ విశ్వాసములను కూకటి వేళ్ళతో పెకలించుటకు ప్రయత్నించిన ఉద్యమమిది. మామూలు మానవుని మకుటధారి చేయుటకు ప్రయత్నించిన ఉద్యమమిది. రామమోహనుడు వంగదేశమున ప్రారంభించిన ఈ పునర్వికాసోద్యమాన్ని మొట్టమొదటగా తనదిగా చేసుకొన్నది కందుకూరి వీరేశలింగం. బ్రహ్మసమాజము ద్వారా తెలుగుదేశంలో సంస్కరణ కార్యకలాపాలు చేపట్టిన కందుకూరికి తోడుగా రఘుపతి వెంకటరత్నం నాయుడు ఎనలేని సహాయ సహకారాలను అందించాడు. బాల్య వివాహ ఖండనను, కన్యాశుల్క నిరసనము, వర్ణభేద నిర్మూలనము, ఆశయాలుగా ఈ ఉద్యమం పని చేయటమే కాక స్త్రీ విద్య, వితంతు పునర్వివాహ విషయంలోను గట్టి కృషి చేసింది.

కార్యాచారణ ద్వారా ఏయే విషయాలనైతే కందుకూరి, రఘుపతి వెంకటరత్నం నాయుడు చేపట్టారో ఆ దురాచారాలనన్నింటిని ఖండిస్తూ, రచనా రూపంలో అక్షర బద్ధం చేస్తూ ఆనాటి సమాజపు వింతపోకడలకు శాశ్వతత్వం కల్పిస్తూ, నాటక, కథ, గేయ ప్రక్రియా రూపాలతో తన కాలపు కవులకే కాక రాబోయే తరపు కవులకు ఒక మార్గ నిర్దేశనం చేసి 'మహాకవి' అనిపించుకొన్న గురుజాడ - గురుజాడ అప్పారావు.

> కన్యాశుల్కం నాటకం ద్వారా సమాజంలో ఆనాటి రుగ్మతలన్నీ ప్రస్తావించాడు. బాల్యవివాహాలు, సానిరకం, వితంతువుల దుస్థితిని కన్యాశుల్కంలో ఆయన వర్ణించిన తీరు అమోఘం.

కన్యాశుల్కం నాటకం ద్వారా సమాజంలో ఆనాటి రుగ్మతలన్నీ ప్రస్తావించాడు. బాల్యవివాహాలు, సానిరకం, వితంతువుల దుస్థితిని కన్యాశుల్కంలో ఆయన వర్ణించిన తీరు అమోఘం. తోకచుక్క ఆవిర్భావము ఏదో ఒక అనర్థాన్ని కొని తెస్తుందనే మూఢనమ్మకాన్ని నిరసిస్తూ దానిని 'నింగితొడవు'గ 'వేల్పులలనల కేలివెలితొగ' గ భావించటమే కాక, 'తలతు నేనిది సంఘ సంస్కరణ ప్రయాణ పతాక'గా అవటం ఈ రోజుల్లో సాగుతున్న సంస్కరణ కార్యకలాపాలనుద్దేశించి అనిపిస్తుంది.

వసుధైక కుటుంబం ఆయన కోరిక అందుకే అంటాడు.

యెల్ల లోకము లొక్కయిల్లై
వర్ణభేదములెల్ల కల్లై
మేల మెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియు

మతం కంటె మనిషి ముఖ్యం అని చెప్పటం ఆయనలోకి మానవతావాదానికి నిదర్శనం 'మతములన్నియు మాసిపోవును జ్ఞాన మొక్కట నిలిచి వెలుగును' అని. మన కళ్ళెదుట కనిపించే మానవులను ప్రేమించటం మానవత్వ లక్షణం. కాని మనుషులను వదిలి వేసి రాతిరూపంలోని దైవాన్ని పూజించటమే గొప్ప పుణ్యమని అదే ధర్మమని నమ్మినవారిని ప్రశ్నిస్తాడు.

మనిషి చేసిన రాయిరప్పకి
మహిమ కలదని సాగిమ్రొక్కుతు
మనుషులంటే రాయిరప్పలకన్న కనిష్టంగా చూస్తావేం
దేవుడెవడో దాగెనంటూ
కొండకోనల వెదుకులాడే
కన్నుతెరచిన కానబడదో
మనిషి మాత్రుడి యందులేడో
యెరిగి కోరిన కరగియాడో ముక్తి

జాతీయోద్యమంలో ముఖ్యాంశమైన అస్పృశ్యతా సమస్యను గాంధీ కంటె ముందుగా బ్రహ్మసమాజస్థులు స్వీకరించారు. స్వీకరించటమే కాకుండా నిర్మాణాత్మక కృషి ప్రారంభించారు. వీరేశలింగం పాఠశాలలో అట్టి బాలలకు ప్రవేశం కల్పించారు. చిలకమర్తి లక్ష్మీనరసింహం ప్రత్యేకంగా హరిజనులకొక పాఠశాల ప్రారంభించాడు. పిఠాపురం రాజా కళాశాలలో హరిజనులను చేర్చుకోవడమే కాక, వారికి ఫీజులు లేకుండా చేశారు. కాకినాడ, పిఠాపురం,లో వసతి గృహాలు ఏర్పాటు చేశారు. ఇవన్నీ గురజాడ దృష్టి పథంలో పడి వుండవచ్చు. అసలే ఆయన అభిప్రాయాలకు జవం, జీవం, శక్తి అన్ని మానవత్వం కేంద్రంగానే నడిచేయి. ఆయన భావం, భాష, చంధస్సు అన్ని అభ్యుదయం వైపే నడిచేయి. అందుకే మానవజాతి సమస్తాన్ని మంచి చెడ్డలుగా విభజించగల ధైర్యం వచ్చింది.

మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండెకులములు
మంచియన్నది మాలయైతే
మాలనే నగుదున్.

ఈ కాలంలోనే బాల్య వివాహాలను, కన్యాశుల్కాన్ని నిరసిస్తూ ఎందరో కవులు పద్యాలు రాశారు. వీరిలో కొందరు సాంప్రదాయాలను, గ్రాంధికభాషను అభిమానించే వారయిన ఆడపిల్లల దుస్థితికి నొచ్చుకున్నవారు వున్నారు. విధవావిలాపము, బాల వితంతు విలాపము, అబలా విలాపము అనే శీర్షికతో పద్యాలు రాశారు. కందుకూరి స్త్రీ విద్యావ్యాప్తికై ఎంతో కృషి చేయటమే కాక బాలికల కోసం ప్రత్యేక పాఠశాలలు స్థాపించారు. వనితలను వంటింటి కుందేళ్ళుగా కాక విజ్ఞానవంతులుగా చేయాలనే అభిలాషతో తాను స్థాపించిన వితంతుశరణాలయంలోను ఆడపిల్లలకు చదువు, వృత్తి విద్యలు నేర్పాడు.

మంగిపూడి వెంకటశర్మ అనే కవి తన అబలా విలాపము (1914 - ఆంధ్రపత్రిక) లో ఆడపిల్లలకు విద్య అవసరమని చెపుతూ-

బాలుర కెట్టులో బాలలకట్టులే
యున్నత విద్యల నొసగుడయ్య
యువకులకెట్టులో యువతుల కట్టులే
స్వేఛ్ఛా ప్రదానంబు సేయరయ్య' అంటాడు.

కవయిత్రులు - సంఘసంస్కరణాభిలాష :-

స్త్రీ విద్యావశ్యకతను పురుషులే కాక స్త్రీలు కూడ గుర్తించటం జరిగింది. స్త్రీల వికాసానికి చదువు అత్యంత ఆవశ్యకమని స్త్రీలే రచనలు చేశారు.

వేమురి శారదాంబ (1881 -99) అనే ఆమె 'మాధవశతకం' పేరుతో స్త్రీ విద్యను కోరుతూ రాసినది మొదట స్త్రీలు రాసిన శతకంగా చెప్పవచ్చు.

"వలదనుటెట్లు విద్య మగవారలకెట్లులనట్లేకదా
పొలతులు విద్యయందు రుచి పూనకయుండుట తప్పిదంబుగా
లలనలు నాలుగక్షరములం జదవంగనె విద్యకాదుగా
తెలివి సమమ్ము పూనగను స్త్రీ పురుషుల్దరయందు మాధవా"

విద్య పురుషుల పాలిట అమృతమైతే స్త్రీల పాలిట హానికరం ఎందుకవుతుందని ఉప్పల నరసమాంబ 'స్త్రీ విద్యాపంచరత్నాలు' (1910 - సావిత్రి పత్రిక) రాసింది. 'చేడె చదివినప్పుడు సేమ మొరవు, కీడులెవ్వియునెన్నడు మూడబోవు కాన ఘనులారా కాంతలకు విద్య నేర్పింపగడకవలయు.' స్త్రీలు వ్యాసాలు, నాటకములు, కథలు రాయటం కూడా నెమ్మదిగా మొదలయింది. విద్యావంతులైన స్త్రీలు సాంఘిక సంస్కరణ కార్యక్రమాలకు పాటుపడ్డారు.

శ్రీమతి ఆత్మూరి అన్నపూర్ణమ్మ 'కుమారసుగుణ బోధిని' అనే శతకంలో; స్త్రీలకు నీతులు చెప్పటానికి అందరు పెద్దలే అని అంటుంది.

'పిచ్చికపై బ్రహ్మాస్త్రము
విచ్చలవిడి వేయునట్లు విరివిగా సుకవుల్
హెచ్చుగా విద్యల నేరిచి
వచ్చిరె స్త్రీ నీతి గఱుప వసుధ కుమారా!

బ్రహ్మాండం కనకసుందరమ్మ 'అబలా విలాపం (1919) అనే సుదీర్ఘ కవితలో పురాణ, చారిత్రక స్త్రీలలో కొందరు శస్త్రాస్త్ర విద్యలు నేర్చి పరిపాలన చేసిన వారు వున్నారు, స్త్రీలని అజ్ఞానులు అనవద్దని విద్యకు దూరం చేయటం అన్యాయమని అంటుంది. పురుషులు ఎన్ని వివాహాలైనా చేసుకోవచ్చు, కాని స్త్రీలు పునర్వివాహం చేసుకోరాదనే అధికారం మగవారికెక్కడిది అని ప్రశ్నించింది.

ఇట్లా 20వ శ. మొదటి దశాబ్దుల్లోనే స్త్రీ విద్యావశ్యకతను గురించి, స్త్రీలపై పురుషులకన్న అధికారాన్ని గురించిన ప్రశ్నలుత్పన్నమయ్యాయి.

స్త్రీ విద్యావంతురాలైతేనే దేశాభివృద్ధి జరిగినట్లనీ, విద్యావంతులైన స్త్రీలు స్వతంత్ర జీవన విధానము, ఆలోచన కలిగి వుంటారనే అభిప్రాయం వ్యక్తం చేశారు ఆనాటి కవయిత్రులు

## సంస్కరణవాదం : హేతువాదం :

కందుకూరి వీరేశలింగం నాటికి భావ స్వాతంత్ర్యం యొక్క ప్రాధాన్యం గుర్తింపబడగా త్రిపురనేని రామస్వామి భావ విప్లవావశ్యకతను ప్రచారం చేశాడు. ఆ ప్రచారార్థం ఆయన ఎంతో సాహిత్యాన్ని సృష్టించాడు బ్రాహ్మణేతరులు వేదధ్యయనానికి, స్వసంఘపౌరోహిత్యానికి తలపడ్డారు. తమిళనాట బ్రాహ్మణాధిక్యానికి వ్యతిరేకంగా రామస్వామి నాయకర్ పెద్ద ఉద్యమాన్ని లేవదీశారు. అది కొంత ప్రేరణ అయింది.

త్రిపురనేని పూజనీయ గ్రంథాలని చెప్పబడే రామాయణ భారత, భాగవత, పురాణాల్లోని విషయాలను ప్రశ్నిస్తూ సృజనాత్మకమైన రచనలు చేశాడు. సాంఘిక న్యాయం కోసం ప్రారంభమైన ఆయన రచనల్లో హేతువాద భావాలు అంతర్లీనంగా వుంటూ రానురాను ప్రస్ఫుటమై కనిపిస్తాయి. సూతపురాణం, భగవద్గీత, కుప్పుస్వామి శతకం, ధూర్తమానవ పద్యగ్రంథాలు. శాస్త్రీయ దృష్టి, మూఢ విశ్వాసాల నిరాసనం లక్ష్యంగా రాయబడినవి. 'శంబుకవధ' 'ఖూనీ' నాటకాలు.

ఏ మతానికో, వర్గానికో, కులానికో జ్ఞానమనేది పరిమితం అవరాదని అది అందరికి అందుబాటులోకి రావాలని ఆయన ఆకాంక్ష. హిందూ సంస్కృతికి మూలాధారాలైన ఇతిహాసాలు, ధర్మశాస్త్రాలు, పురాణాల్లో ఒకచోట చెప్పిన విషయానికి మరొకచోట చెప్పినదానికి పొంతన లేదు అంటాడు. దేవుళ్ళకు ఇళ్ళు, వాకిళ్ళు కట్టించే పద్ధతిని వేమన వలె తెగనాడాడు.

మలమలమాడు పొట్టతెగమాసినబట్టకలంతపెట్టగా
విలవిల యేడ్చుచున్న నిఱుపేదకు జాలిని జూపకుండ, ను
త్తల పడిపోయి, జీవరహితంబగు బొమ్మకు నిండ్లు వాకిలుల్
పొలమును బుట్ర నిచ్చెడి ప్రబుద్ధ వదాన్యుల నిచ్చమెచ్చుదన్.

యజ్ఞయాగాదుల వల్ల మోక్షం లభిస్తుందనటం ఖండించాడు. "మతములెపుట్టకున్న యెడ మారణకర్మము లిన్ని సాగునే ప్రతిదివసమ్ము భారత ధరాస్థలి?" అని మతాల మాయను, మారణహోమాన్ని ప్రశ్నిస్తాడు.

స్త్రీలకు కూడ చదువు సంధ్య స్వేఛ్ఛ కావాలని 'కుప్పుస్వామి శతకం'లో అంటాడు.

'చదువు చెప్పకుండా జడురాండ్రుగా జేసి స్త్రీల దిట్టిపోయజెల్లుచుండె, దోసమెవరియందు దొరలాడుచుండునో చెప్పబోవనెవరు కుప్పుస్వామి"

"చదువు లేని జాయ సల్లాపము కన్న
చదువు కొన్న జాయ చలముమేలు
వీనువిందుగాక వినవచ్చు నొకమాట
నప్పుడప్పుడైన గుప్పుస్వామి."

ప్రథమ దశలో తెలుగునాట బయలుదేరిన కందుకూరి సంఘ సంస్కణోద్యమం, త్రిపురనేని ఆత్మగౌరవ ఉద్యమం సామాజిక రంగాన్ని ఆర్థిక దృష్టితో

కాక సాంఘిక దృష్టితో చూచినట్లే కనబడుతోంది. సమాజంలో హెచ్చుతగ్గులకు లొసుగులకు కారణాలు మతం, కులం, అవిద్య సృష్టించిన అసమానతల వల్ల ఏర్పడినవనే భావించారు.

## మరికొందరు కవులు :

బ్రహ్మసమాజ వాహికగా కందుకూరి, వెంకటరత్నం నాయుడు సంస్కరణోద్యమాలు చేపట్టి విజయపతాక నెగురవేశారు. వెంకటరత్నం నాయుడు శిష్యరికంలో కృష్ణశాస్త్రి తెలుగువారు గర్వించే మానవత్వం మూర్తీభవించిన కవిగా తయారయ్యేడు. వేదాలు, ఇతిహాసాలు, స్మృతులు, పురాణాలు అన్నీ మానవ నిర్మితం, కల్పితాలు అని నమ్మబట్టే మతాల్ని, కులాల్ని, కర్మకాండలన్ని, అసమానతలని ధైర్యంగా ప్రశ్నించగలిగేరు.

"ద్వేషమున్న చోట దేవుడు వెలయుడు
మతులు గతులు తప్పమతము లేదు."

"ఇంటింటిలో దేవుడుంటే, నీవు, నేనూ నరులమంటే జగతి అంతా ఒకే సంసారమే కదా, ఎవడు హెచ్చవడు లొచ్చు" మనుషులను వేరు చేసేది మతమేనని అటువంటి మతం మనకొద్దు అనే విశాల దృక్పథంతో-

"మతమన్నది నాకంటికి మసకైతే
మతమన్నది నా మనసుకు మచ్చైతే
మతం వద్దు గితం వద్దు మాయామర్మం వద్దు
ద్వేషాలు రోషాలు తెచ్చేదె మతమైతే
మతం వద్దు గతం వద్దు మారణహోమం వద్దు.

అంతేకాదు దేవుడు గుడిలో మాత్రమే లేడు. అన్నింటా, అంతటా, అందరిలో వున్నాడనే భావించాలి. సర్వవ్యాపి అంటు 'శిథిలాయమ్ములో శివుడు లేడోయి, వాడలవాడలవాడె జాడలన్నిటవాడె, ఇంటి ముంగిటవాడె, ఇంటిలోనవాడె శిథిలాయమ్ములో శిలలను సందిటబట్టె పూజారి దానికై పోంచి ఉన్నాడోయి"

1918లో హరిజనులతో సహపంక్తి భోజనం చేసినందుకు కులం నుంచి వెలిబెట్టారు కృష్ణశాస్త్రిని. ఆయన కులాన్ని నిరసిస్తూ కవితలు చెప్పాడు. మత వైషమ్యాలకు, వైరాలకు యుద్ధాలకు కారణం ఎక్కడో లేదు. అన్ని అన్ని మనిషిలో పుట్టే ఆలోచనలే అంటాడు.

'మనిషిలోనే పెద్దమడతుంది
మనిషికే పెడబుద్ధి పుడుతుంది'

రఘుపతి వెంకటరత్నం నాయుడ్ని గురుభావంతో కొలిచే వారిలో వెంకట పార్వతీశ కవులు ముఖ్యులు. బ్రహ్మ సమాజం ఆనాడు సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేయటం, ప్రత్యేకంగ హరిజనులకై వసతి గృహాలు నడపటం చూచి వారు 'పంచమాభివందనము' 'ప్రబోధము' అనే కావ్య ఖండికల్లో అస్పృశ్యులని గూర్చి యిట్లా అంటారు.

పంచమనామ వేదమయ
భారతముత్తమమై పొసంగా
బంచమ సుస్వరంబది ప్ర
పంచమనోహరమై యెసంగా
బంచమ నామమూర్తి యతి
పావన దేవతయై సెలగంగా
బంచముడే నికృష్టుడని
పల్కుట వంచనగాదె చూడగానే

పంచమమనే పేరు ఎంత గొప్పదో చెపుతు, అటువంటి పంచములను నికృష్టంగ చూడవద్దు: అంతేకాదు; 'విశ్వమానవ సంపూర్ణ విగ్రహంలో అంత్యజుడు కూడా ఒక అవయవమే సుమా అంటారు. ఆనాటి సంఘ సంస్కర్తలు ఒకసారి 'అన్న' అని పిలిచినంతనే, ఒకసారి దగ్గర చేర్చినంత మాత్రం చేతనే సమానత్వం యిచ్చినట్లు కాదని అంటారు.

ఇట్లాగ దైవభావాన్ని విడిచిపెట్టలేని వీరంతా మానవత్వాన్ని పరమ దైవంగా స్వీకరిస్తూ చాతుర్వర్ణ వ్యవస్థను వ్యతిరేకించారు. ప్రాచీన కవులలో కొందరు ముఖ్యంగా శివకవులు భక్తి జ్ఞాన సంపాదనలో, భగవత్సాన్నిధ్యంలో కులాల ప్రసక్తి లేదని అంటే ఆధునిక కవులు సాంఘిక చైతన్య దృష్టితో కులభేదాన్ని నిరసించేరు.

ఇప్పటివరకు కవిత్వం చెప్పినవారికి భిన్నంగా స్వయంగా తాననుభవించిన కష్టనష్టాలను తానే గ్రంథస్థం చేస్తూ కవిత చెప్పిన వారిలో ముఖ్యుడు జాషువ. మత మౌఢ్యాన్ని, కులవ్యవస్థను, పిచ్చి నమ్మకాలను నిరసిస్తూ అట్టడుగున పడివున్న జాతి యొక్క హీన దీన స్థితిని తెలియజెప్పే కవితలు చెప్పాడు. సాంఘిక న్యాయానికి పెద్ద అవరోధంగా పరిణమించిన అస్పృశ్యత అంటే ఆయనకు తలనొప్పి

హిందుమతత్వంలోని ప్రధానజాడ్యం అదే; అందుకే ఆయన ఇలాంటి కుల, మత శక్తులను విమర్శిస్తూ

పాముకు పాలు, చీమకు పంచదార మేపే కర్మభూమిలో జనించిన ధర్మదేవత కూడ అస్పృశ్యుడంటే ఉలికి పడుతుంది. అంటరాని తనమనే వ్రణమ్ము పట్టి పీడిస్తుంది ఈ భరత జాతిని అంటాడు. పంచముడిగా పుట్టి అనేక బాధల నెదుర్కొన్న జాషువా కడు దయనీయమైన ఆ పంచముల స్థితిని వర్ణించేటపుడు కనబరచే తాదాత్మ్యం స్ఫుటంగా కనబడుతోంది. శాస్త్రీయ దృక్పథం లేని విద్యావిధానం వల్ల లాభం లేదనే అభిప్రాయాన్ని ఆయన వెల్లడించాడు.

> పాముకు పాలు, చీమకు పంచదార మేపే కర్మభూమిలో జనించిన ధర్మదేవత కూడ అస్పృశ్యుడంటే ఉలికి పడుతుంది. అంటరాని తనమనే వ్రణమ్ము పట్టి పీడిస్తుంది ఈ భరత జాతిని అంటాడు.

జనులం బీలచి పిప్పిజేసేడు దురాచారాంబులన్ గాలమ
ట్టని విద్యా బలమేల? విద్యయన మూఢ్యవ్యాఘ్రికింపైన భో
జనమా? మోసపు వ్రాతకోతలకు రక్షాబంధమా యెందుకీ
మనుజత్వంబునొసంగలేని చదువుల్ మైరేయంపు మైకముల్

జాషువా లోని అస్పృశ్యతా నిరాసనం 'గబ్బిలం' కావ్యంలో చాలా విపులంగా విదితమౌతోంది.

జాతీయోద్యమం బాగా ఊపందుకొన్న తర్వాత సంఘ సంస్కరణోద్యమంలోని అంశాలన్ని యించుమించుగ జాతీయోద్యమంలోను ప్రతిఫలించేయి. 19వ శతాబ్దపు చివరన 20వ శతాబ్దపు మొదటి రెండు మూడు దశాబ్దుల్లో వచ్చిన సంఘ సంస్కరణ కార్యకలాపాలు జాతీయోద్యమంలో యిమిడిపోయాయి. అయితే ఇక్కడ మనం గమనించవలసిన ముఖ్యమైన విషయం ఏమంటే దేశ స్వాతంత్ర్య భావాల కంటె ముందే స్త్రీ విద్య, హరిజనపునరోద్ధరణ, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వం వంటి భావాలు బ్రహ్మసమాజ వాహికగా సంఘ సంస్కరణోద్యమంగా తెలుగునాట బాగా విస్తరిల్లింది. దాని ఆలంబనగా అనేక సాహిత్య ప్రక్రియలు ఆవిర్భవించాయి. రాబోయే సంస్కరణకలాపాలకు ఇదొక వేదికగా పనిచేసింది.

# స్వాతంత్ర్యోద్యమ కవిత్వం



డా. పాపినేని శివశంకర్
85008 84400

స్వాతంత్ర్యోద్యమం అనగానే ముందుగా జాతీయత, దేశభక్తి అనే భావనల గురించి మాట్లాడుకోవాల్సి ఉంటుంది. ఈ సందర్భంలో నాకు గుర్తొచ్చే వీనుల విందైన గేయం దేవులపల్లి కృష్ణశాస్త్రిది.

జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ! దివ్యధాత్రి!
జయ జయ జయ శతసహస్ర నరనారీ హృదయనేత్రి!

ఆమె ఆకుపచ్చ పంటచేల చీర చెంగుల క్షేత్రలక్ష్మి. ఆమె వసంత కాలపు పూలతీగల కేశపాశం గలది. దిగంతాల దాక ఆమె కీర్తిగానం వినిపిస్తున్నాయి పక్షులు. గాయకులు, వైతాళికుల మధుర కంఠస్వరాల్లో ఆమె విహరిస్తుంది. ఆమె పాదాలకు లత్తుక దిద్దుతుంది నా హృదయాశయం. ఆమె అందమైన పాదాలను ముద్దిడుతుంది నా మధుర గేయం.

అద్భుతమైన కవి ఊహలోనుంచి దేశమాత మూర్తీభవించి మన కన్నులముందు కదలాడుతుంది. జాతీయగీతం కాదగిన, వందేమాతరానికి దీటైన గేయం. లలితమైన హిందోళంలో ఎన్నిసార్లు విన్నా తనివి తీరదు. అదే సమయంలో 'జనగణ మన...' ఎన్నిసార్లు విన్నా ఆ అధినాయకుడెవ్వడో అంతుపట్టదు. (ఆయన పంచమ జార్జి చక్రవర్తి అని అభిజ్ఞులంటారు.) రవీంద్రనాథ టాగూర్ నా అభిమాన కవి. అయినా సంశయం.

అదలా ఉంచితే ఒకప్పుడు గాని, ఇప్పుడు గాని ఈ దేశం అనేక జాతుల సమాహారంగానే అవపడుతుంది నాకు. ఆంగ్లేయులు ఇక్కడికి రాక ముందు గాని, వచ్చినాక నూటయాభై యేళ్లు గడిచేదాక గాని మనకు ఏకజాతి భావన, ఏకదేశ భావన రాలేదనటం వాస్తవం. ప్రదేశాలని, ప్రజలనీ ఒక కాడి కిందకి దెచ్చిన

దొరల పెత్తనం వల్లనే ఈ సరికొత్త భావన మనలో ఏర్పడిరది. అందుకు ఒకప్పుడు రవి అస్తమించని, ఇప్పుడు 'రవి తేజం' సమస్తం అణగారిన శ్రీమాన్ తెల్ల దొరవారికి సదా కృతజ్ఞులమై ఉండాలి!

1857 మే 10 భారత చరిత్రలో మరుపు రాని రోజు. మీరట్‌లో ఒక సిపాయిదళం యూరోపియన్ అధికారుల్ని ధిక్కరించి చంపి, యమునానది దాటి పన్నుల భవంతికి నిప్పంటించి, ఎర్రకోట చేరింది. ఆంగ్లేయ పరిపాలనకి ఒక ధిక్కార సంకేతం పంపిన ఆ సిపాయిల తిరుగుబాటు కచ్చితంగా మొదటి స్వాతంత్ర్య సమరమే. 1885లో జాతీయ కాంగ్రెస్ స్థాపన జాతీయోద్యమానికి తొలి సంకేతం. తద్వారా భారత దేశాన్ని ఒకే జాతిగా కూడగట్టే సుదీర్ఘ చారిత్రక ప్రకియ ప్రారంభమైంది.

20వ శతాబ్ది మొగదల తెల్ల వలస పాలనలో ప్రజాస్వామిక, మానవతావాద భావాలతో కూడిన ఆధునికత ఏర్పడిరది. మధ్యతరగతినుంచి ప్రగతిశీలక ఆలోచనారీతులు మొదలయ్యాయి. ఈ సంఘం, ఈ దేశం గురించిన తపన మొదలైంది. తత్ఫలితమే జాతీయోద్యమం. అది అంతకు మునుపు లేని భారతజాతి అనే ఐక్యభావనను కల్పించి, దేశ సంస్కృతికి కొత్త సారం ఇచ్చింది. మతదృక్పథాన్ని విశాలం చేసింది.

**జాతీయతా భావన:**

జాతీయోద్యమ తొలి సంకేతాన్ని తెలుగువారు బాగానే గుర్తించారు. 'వందే మాతరం' ఉద్యమంతోనే అది మొదలైంది. 1907 ఏప్రిల్‌లో బిపిన్ చంద్రపాల్ రాజమండ్రిలో ప్రసంగించిన సభలో చిలకమర్తి లక్ష్మీనరసింహము నోటివెంట అశువుగా ఉబికిన 'భరతఖండంబు చక్కని పాడియావు..' పద్యం తెలుగువారి నాలుకలపై నర్తించింది. భరతఖండం అనే పదబంధంలో ఏకజాతి భావన ప్రస్ఫుటమవుతుంది. మూతులు బిగబట్టి భారతీ సంపత్ క్షీరాన్ని కాజేస్తున్న తెల్లవారినుంచి విడుదలని ఆ పద్యం పరోక్షంగా సూచిస్తున్నది. అటు పిమ్మట ఆ కవే చెప్పిన కింది పద్యంలో భరతఖండం చెరసాల అయ్యింది.

భరతఖండంబె యొక పెద్ద బందెఖాన
అందులోనున్న ఖయిదీలు హిందుజనులు
ఒక్క గదినుండి మార్చి వేరొక్క గదిని
బెట్టుటే గాక చెర యంచు వేరె గలదె?

భారతీయుల దుస్థితిని, చిలకమర్తిలో వచ్చిన భావపరిణామాన్ని ఒకేసారి తెలిపే పద్యం ఇది.

మేలుకొనుమీ భరతపుత్రుడ!
మేలుకొనుమీ సుజన మిత్రుడ!
మేలుకొనుమీ సచ్చరిత్రుడ!
మేలుకొనవయ్యా! వత్సా! ॥మేలుకో॥
వేడుకను జాతీయతా యను
వేగుచుక్క పొడిచె నదిగో
కూడి 'వందేమాతరం' బని
కుక్కుటము లరచెన్ ॥మేలుకో॥

1909లో 'ఆంధ్రభారతి'లో అజ్ఞాత కవి రచనగా వచ్చిన గేయం ఇది. రచించింది మంగిపూడి వేంకటశర్మ అని తెలుస్తుంది. దీనిలో జాతీయత అనే వేగుచుక్క, భరతమాత అనే భావన గమనించవచ్చు. ఆ యేడాది అదే పత్రికలో అజ్ఞాత కవి రచనగా వచ్చిన 'అందారు పుట్టిరి హిందమ్మ తల్లీకి / అందారు ఒక్కటై ఉండాలి సక్కంగ' అన్న 'మాలవాండ్ర పాట'లోను, 'నమో!హిందుమాతా!`సుజాతా! / నమో! జగన్మాతా! / అమోఘ దివ్య మహిమాసమేతా! / అఖండవర భరతఖండ మాతా!' (వడ్డాది సీతారామాంజనేయులు), 'దండాలు దండాలు భారతమాత / అవి అందుకొని దీవించు భారతమాత' (వడ్డాది సీతారామాంజనేయులు, పూడిపెద్ది కాశీవిశ్వనాథశాస్త్రి) మొదలైన గేయాల్లోనూ అదే భావన.

## దేశమంటే:

చిలకమర్తి మొదలైనవాళ్లు భరతఖండం అంటే గురజాడ దేశం అన్నాడు. దేశాన్ని ప్రేమించమన్నాడు. మధ్యయుగాల రాజభక్తి భావన నుంచి దేశభక్తి భావనకి మళ్లటమే ఆధునికతలోని ఒక ప్రధానాంశం. అప్పటికే దేశాన్ని మాతగా బంకించంద్రుడు భావించటం నూతనాంశమే. అయితే నదీనదాలు, అడవులు, కొండలు మొదలైనవి దేశం కాదని, దేశమంటే మనుషులే అని ప్రతిపాదించటంలో గురజాడ కొత్త ఆలోచన ఉంది. ప్రజాభ్యుదయమే దేశాభ్యుదయం కనుక ఆ మనుషులు ఈసురోమంటూ ఈడిగిలబడకుండా తిండి పుష్టితో, కండ పుష్టితో బలమైన జాతి కావాలి. ఐకమత్యంతో ముందుకు సాగాలి. 'అన్నదమ్ముల వలెను జాతులు మతములన్నీ' మెలగాలి.'నరుల చమటను తడిసి మూలం

ధనం పంటలు' పండాలి. రాజకీయార్థిక, సాంఘిక విషయాలన్నీ ప్రస్తావిస్తూ ప్రగతిశీల దృక్పథంలో సాగిన 'దేశభక్తి' గేయం ఆ కాలానికి అపురూపమైంది. దేశభక్తులమనుకొనే వారికి ఇది కనువిప్పుగా, తెలుగువారికి అనధికార జాతీయగీతంగా కె.వి. రమణారెడ్డి భావించాడు. జాతీయోద్యమ తరంగాగ్రాన నిలిచి ఉన్న 'వందేమాతరం' గేయానికి 'విరుగుడుగా' గురజాడ దేశభక్తి గేయం రాశాడని ఆయన అభిప్రాయం. (చూ.మహోదయం). శ్రీశ్రీ అయితే ఇంకా నాలుగడుగులు ముందుకు పోయి, 'దేశభక్తి గీతం ఒక్క తెలుగువారికే కాదు, సమస్త మానవ సమాజానికి జాతీయగీతం కాగల అర్హత గలది' అని ఆకాశానికెత్తాడు. (చూ. శ్రీశ్రీ వ్యాసాలు).

1907 నాటికే వందేమాతరానికి తెలుగు అనువాదం వచ్చింది. బంకించంద్ర గేయం గురించి గురజాడ గిడుగు రామ్మూర్తితో ఇట్లా ముచ్చటించాడట. 'పెద్ద కొండలు, నదులు, వృక్షాలు, నా మాతలు ` ఇవా ప్రజలకు ధైర్యసాహసాలు, ఉత్తేజమూ కలిగించేవి? అన్ని కాలాలలోను ఇవి స్థిరంగా ఉండేవే. ఒక్కొయుగంలో ఒక్కో జాతి ప్రజలు ఆయా ప్రదేశాలలో ఉంటారు. వారిలో మహానుభావులు, వారి గుణగణాలు, జాతి జీవితం ` ఇవే వర్ణనీయమైనవి. ప్రజలలో చైతన్యం లేవగొట్టేవి'. ఈ సంగతి గురజాడ కుమారుడు రామదాసు పంతులుగారు చెప్పినట్టు 'మహోదయం'లో కె.వి.ఆర్. పేర్కొన్నాడు.

ఆధునిక భావజాలంలో మానవకేంద్రంగా ప్రపంచాన్ని దర్శించటం ఒక ప్రధానాంశం. మానవుడే చరిత్ర నిర్మాత. కనుక మానవజాతి జీవితమే వర్ణనీయం, చైతన్యదాయకం. ఆధునికత పరిధిలో ఆలోచిస్తే ఈ భావన ఎంతో వాస్తవికమే. దేశభక్తి అనేది మానవ సమాజానికి సంబంధించింది. అయితే 'వందే మాతరం'లో మానవశక్తుల ప్రమేయం కూడా ఉంది. ఏడుకోట్ల కంఠాల వీర నినాదాలతో, పద్నాలుగు కోట్ల చేతుల్లోని కరవాలాలతో వెలిగే దేశమాతని తన గేయంలో వర్ణిస్తున్నాడు బంకిం. (1871లో బెంగాల్ జనాభా 6.7 కోట్లు). ఎవరమ్మా నిన్ను అబల అన్నది? అని అడుగుతున్నాడు. అమిత శక్తిశాలినై శత్రుదళాలను నిర్జించి, బిడ్డలను కాపాడే దేశమాతకు నమస్కరిస్తున్నాడు. 'మాతృభూమి' అనే భావనకు బంకిం నూతనమైన అర్థం, ప్రాచుర్యం కలిగించాడని వందేమాతర గేయగాథ పరిశోధించిన సవ్యసాచి ముఖర్జీ చెపుతున్నాడు. దేశానికి మాతృరూపం కల్పించటమే ఆ ప్రత్యేకత.

దేశమంటే మనుషులే కాదు, మట్టి కూడా! (మనిషిలో పంచభూతాలున్నాయి.)

బంకిం గేయంలోని 'సుజలాం, సుఫలాం' అనే మాటలు భూమియొక్క సృజనశక్తిని గూర్చి చెపుతున్నాయి. ఆ నీరు, ఆ ఫలాలు, చల్లని గాలులు, ఆకుపచ్చని చేలు, వెన్నెల్లో పులకించే రాత్రులు, పుష్పించిన చెట్లు ` ఇవన్నీ దేశం అనే అమూర్త భావనకి మూర్తిమత్వాన్ని (concreteness), పునాదిని సమకూర్చేవే. దేశాన్ని మాతృభూమిగా వర్ణించటంతో అందులోని భావోద్వేగం దేశమంతా వ్యాపించింది. జాతీయోద్యమానికి గొప్ప నినాదం సమకూరింది. గురజాడ దేశభక్తి గేయం తెలుగువారిలో చైతన్యం కల్గించింది. వందేమాతరం దేశవ్యాప్తంగా ప్రజానీకంలో గొప్ప జాతీయచైతన్యం కల్గించింది. వందేమాతరంలో లేని ప్రజాస్వామిక భావనలు 'దేశభక్తి' గేయంలో చిగురించాయి. గురజాడ చేసింది 'విరుగుడు' కాదుÑ సవరణ. మొత్తం మీద బంకిం చూపిన మట్టి కావాల్సిందేÑ గురజాడ చూపించిన మనుషులూ కావాల్సిందే. వందేమాతరం, దేశభక్తి ` ఈ రెండు విశిష్ట గేయాలు నా దృష్టిలో పరస్పర పూరకాలు (ఎబ్‌బaశ్రీ షశీఎజూశ్రీవఎవత్‌ం).

'భరతమాత... తెలుగుతల్లి..! ... ఈ పద్యాలు...మాటలకేం గాని ఆ మట్టిని చూసి నీకు తల్లిలా అనిపించిందా?... ఏదో మాతట. వీళ్లకి స్తన్యం ఇస్తోందట... లేని మాతల్నీ అక్కల్నీ కల్పించుకొని ఎందుకా ఏడుపులు?' అని చలం ఈసడిరచాడు. మహాప్రస్థానానికి రాసిన 'యోగ్యతాపత్రం'లో దేశభక్తిని పాపంగా పరిగణించాడు. మనం తెలుసుకోవలసిందేమంటే - తెలుగుతల్లి, దేశమాత మొదలైనవి భావనలు. వాటికి భౌతికస్థితి ఉండదు. తల్లితో పేగు బంధం, ప్రేమా పెనవేసుకొని ఉంటాయి. వాటితో భావోద్వేగాలుంటాయి. దేశాన్ని తల్లిగా తలచినప్పుడు ఆ భావాలు, ఉద్వేగాలు మనలో ఆవరిస్తాయి. ఆలోచనాపుష్టినిస్తాయి. తల్లి కష్టం తీర్చాలనే ఆచరణకి దారితీస్తాయి. మాత అనే రూపాన్ని మనస్సులో నిల్పుకోగలిగినప్పుడే ఆ విషయం పట్ల మనకు గౌరవం కలుగుతుంది. దేహభక్తి తప్ప దేశభక్తి లేకపోతే అది చెడుమాటగా విన్పించవచ్చు.

మాతృదేశము మాట ముచ్చట
ముదము గూర్చదు మదికి ననియెడి
పరమ నీచుడు ధరణినంతట
గలయ వెదకిన గాననగునా? (కాళోజీ)

రాయప్రోలు సుబ్బారావు అల్లిన 'జన్మభూమి' గేయం జాతీయ కవిత్వానికి శిరోభూషణం వంటిదని సి. నారాయణ రెడ్డి మెచ్చుకొన్నాడు. (చూ. ఆధునికాంధ్ర కవిత్వముÑ సంప్రదాయములు, ప్రయోగములు.)

ఏ దేశమేగినా ఎందు కాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వరేమనిన
పొగడరా నీ తల్లి భూమిభారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము

జాతీయతాభావనలో ముఖ్యమైన భారతదేశ పూర్వ సంస్కృతీవైభవ స్మరణ ఈ గేయంలో ఉంది.

**'తరి గాంధియుగమేగుదెంచె':**

దేశంలోని కుల మత జాతుల విభిన్న సంస్కృతుల మధ్య గల వైవిధ్య, వైరుధ్యాల నేపథ్యంలో ఒకే జాతి అనే భావన బలపడటం అంత తేలికైన పనేమీ కాదు. అక్కడే మోహనదాస్ కరంచంద్ గాంధీ విశిష్టతని గుర్తించాల్సి ఉంటుంది. 1918 తర్వాత గాంధీ నాయకత్వంలో లౌకికవాద దృక్పథంతో జాతీయతాభావన వృద్ధి చెందింది. సత్యాగ్రహరూపం సంతరించుకొంది. ప్రజలలో త్యాగనిరతిని పెంపొందించింది. జాతీయోద్యమం ప్రపంచచరిత్రలోనే మిక్కిలి పెద్ద ఉద్యమాలలో ఒకటిగా చరిత్రకారులు గుర్తించారు. (చూ: బిపన్ చంద్ర మొ॥, భారత స్వతంత్ర పోరాటం.)

1919లో జరిగిన అమృతసర్ కాంగ్రెస్ మహాసభతో 'మహాత్మ గాంధీకీ జై' అనే నినాదం భారత రాజకీయ దిగంతాన మారుమోగసాగిందని జవహర్‌లాల్ నెహ్రూ స్వీయచరిత్రలో చెప్పాడు. అదే ఏడాది ఏప్రిల్ 13న జరిగిన జలియన్‌వాలాబాగ్ దురంతం తర్వాత 'మహాత్ముడి ప్రయోగం భారతదేశంలో ఆరంభమైంది.' (చూ: బిపన్ చంద్ర మొ॥, భారత స్వతంత్ర పోరాటం) ప్రజల ఆకాంక్షలనుంచే ఉద్యమాలు రూపుదాల్చుతాయని, అవి లేకుండా కేవలం నాయకుడు వాటిని రూపొందించజాలడనీ గాంధీ చెప్పాడు. అయితే ఆ ప్రజల ఆకాంక్షలని, ఆవేశాలని సమీకరించి, ఒక శాంతి సమరానికి ఉద్యుక్తుల్ని చెయ్యటంలో నాయకుడి గొప్పతనం ఉంటుంది. యూరప్‌లో మాదిరి భారతదేశంలో మిలిటెంట్ పోరాటాలు తక్కువ. కర్మసిద్ధాంత భావనతో కూడిన శాంత జీవన విధానం భారతీయసంస్కృతిలో కనపడుతుంది. గాంధీ ఆచరణమార్గంతో అది సంవదించింది. అందుకనే కోట్లకొలది భారతీయులు గాంధీని మహాత్ముడుగా భావించి ఆయన అడుగుజాడల్లో నడిచారు. బలిజేపల్లి లక్ష్మీకాంతకవి అన్నట్టు 'తరి గాంధీయుగమేగుదెంచె'.

'గాంధి మహాత్మకుండనగ కారణజన్ముడు' అన్నాడు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి.

'గాంధి పలుకు ధర్మగంధమొలుకు'నని మెచ్చుకొన్నాడు కాటూరి వేంకటేశ్వరరావు. 'హిందూ ముసల్మాను లేకమైనారన్న గాంధీ మహాత్ముని కతన గాదె?' అన్నాడు ఉమర్ ఆలీషా కవి. 'కలియుగ రామావతార గాంధిమహాత్మా!' అని ఆయనని అవతారపురుషుడుగా సంభావించాడు మంగిపూడి వేంకటశర్మ 'గాంధీ శతకము'లో.

'కొల్లాయి గట్టితే నేమి - మా గాంధి
కోమటై పుట్టితే నేమి
వెన్నపూసా మనసు - కన్నతల్లీ ప్రేమ
పండంటి మోముపై బ్రహ్మతేజస్సు'

అంటూ సాగిన బసవరాజు అప్పారావు గేయం నలుగురికీ తెలిసిందే.

గోచిపాత గట్టుకొని జాతి మానంబు
నిలిపినట్టి ఖదరు నేతగాడు
విశ్వసామరస్య విజ్ఞాన సంధాత
కామితప్రదాత గాంధి తాత (జాషువ)

'ఎవరి పాదచిహ్నములివి ఎవరి పాదచిహ్నములు...రాటంతో రణశూరుల ఈటెల నెదిరించెనతడు' అంటూ గాంధీ పథాన్ని వ్యంగ్యంగా స్ఫురింపజేసిన గొప్ప గేయం దాశరథిది. అన్నిటికన్న మహాత్మ గాంధీ విశిష్టతని నిర్వచించిన మా పరమ గురువు, తెనుగులెంక తుమ్మల సీతారామమూర్తి పద్యం తలమానికమైంది.

ఉత్తమవాగ్మినా నొప్పారె నురక గ
ర్జించియా? కాదు, వర్జించి నుడులు
అతిలోక బల సమంచితుడయ్యె కండలు
పెంచియా? కా, దలయించి యొడలు
చిర జయశ్రీ ధురంధరుడయ్యె రిపుల
ఖండిరచియా? కాదు, పండిరచి కృపలు
అమృతత్వమందె యాగములాచరించియా?
కాదు, నిష్కామయోగము వరించి
అతడు సామాన్యుడెట్లు? వీరత కపూర్వ

జీవములు వోసి వాసి దెచ్చిన మహాత్ము
డతని నడచిన బాటలయందు నడచి
పందయును విక్రమక్రమాస్పందుడయ్యె

కవి చూపులో - మౌనదీక్షతో ఉండికూడా మహావక్త అయిన, ఉపవాసదీక్ష చేసి మహాబలుడైన, అహింసతో యోధుడైన, నిష్కామ యోగంతో అమరుడైన మహాత్ముడు గాంధీ. విరోధభాసాలంకారం.

**జాతీయోద్యమ / స్వాతంత్రోద్యమ బహుముఖీనత:**

జాతీయోద్యమం స్వాతంత్ర్యోద్యమంగా విస్తరించింది. అది ఏకముఖం కాదు. దానికి సామాజిక విస్తృతినిచ్చాడు గాంధీ. అందులో హరిజనోద్ధరణ, మద్యపాన నిరసన, స్త్రీవిద్య, స్వదేశ వస్త్రధారణ మొదలైనవి భాగమయ్యాయి.

జాలా రంగస్వామి గేయకావ్యం 'అంటరాని వారెవరు'లో 'మన దేశస్థులు మాల మాదిగల మరచిపోయినారా? / అయ్యయ్యో యిది ఘోరము కాదా అన్యాయము కాదా?' అని ప్రశ్నించాడు. 'అంటరానివారెవరు / మా వెంట రానివారు' అన్న మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి పాట ఆ రోజుల్లో బాగా ప్రచారమైంది. మద్యపాన వ్యతిరేకసాహిత్యం కూడా వెలువడిరది. 'భజన చేసే విధము దెలియండి' అనే పాట వరుసలో 'కల్లు మానే విధము దెలియండి - జనులార కల్లు / జబ్బులకు ప్రఖ్యాతి బడెనండి' (జాలా రంగస్వామి) అంటూ పాటలు వెలువడ్డాయి. 'ముంతా మాయమ్మ నిన్ను మరువజాలనే / కల్లుముంతా మాయమ్మ నిన్ను మరువజాలనే' అని నక్కా చినవెంకయ్య కీర్తనలు రాశాడు. స్వదేశ వస్త్రధారణకై నూలు వడికే రాట్నం మీద కూడా పాటలు గట్టారు. దసరా పద్యాల వరసలో 'మా పాలి మహలక్ష్మి - మా అన్నపూర్ణ / మా సరస్వతీదేవి - మా రాజ్యలక్ష్మి /...సౌఖ్యశాంతములిచ్చి - స్వాతంత్ర్యమిచ్చి / రక్షించు మా తల్లి - రాట్నమా! నీవు' అని పాడాడు చెరుకువాడ వేంకటనరసింహము. 'ఏకులు కావలెనా? దాస్యపు ` మోకులు కావలెనా?' అని ప్రశ్నించాడు వెన్నెలకంటి రాఘవయ్య.

1920 నాటికే జాతీయతాభావన, దేశభక్తి బలపడి స్వాతంత్ర్యేచ్ఛగా మారటం గమనించవచ్చు. గరిమెళ్ల సత్యనారాయణ కట్టిన, పాడిన, చాటి చెప్పిన ప్రసిద్ధ గేయమే గొప్ప ఉదాహరణ.

మాకొద్దీ తెల్లదొరతనము - దేవ
మాకొద్దీ తెల్లదొరతనము - మా
ప్రాణాలపై పొంచి మానాలు హరియించె ॥మాకొద్దీ॥
న్నెండు దేశాలు పండుచున్నా గాని
పట్టెడన్నమె లోపమండి - ఉప్పు
ముట్టుకుంటే దోషమండి - నోట
మట్టి కొట్టి పోతడండి - అయ్యొ
కుక్కలతో పోరాడి కూడు తింటామండి ॥మాకొద్దీ॥

> గరిమెళ్ల పాటకి ఎదురు బొదురుగా అదే బాణీలో కాస్త తర్వాత కాలంలో 'మాకొద్దీ నల్ల దొరతనము' (కుసుమ ధర్మన్న) అన్న ప్రబల దళితస్వరం వినపడటం ఆశ్చర్యమే. వేదనాగ్నిపూరితమైన ఆ కంఠం అగ్రవర్ణాలు పాటించే అంటరానితనంలోని వైరుధ్యాలను వినయంగా ప్రశ్నించింది.

గరిమెళ్ల పాటకి ఎదురు బొదురుగా అదే బాణీలో కాస్త తర్వాత కాలంలో 'మాకొద్దీ నల్ల దొరతనము' (కుసుమ ధర్మన్న) అన్న ప్రబల దళితస్వరం వినపడటం ఆశ్చర్యమే. వేదనాగ్నిపూరితమైన ఆ కంఠం అగ్రవర్ణాలు పాటించే అంటరానితనంలోని వైరుధ్యాలను వినయంగా ప్రశ్నించింది. 'వారు వీరను వాదభేదమేమీ లేక భూమి మోయుచున్నదండి...సృష్టిలో భేదమేదీ చూపండి' అని నిగ్గదీసింది. 56 చరణాల సుదీర్ఘ గేయం. ధర్మన్న కవి ఆవేదనే కాలక్రమంలో దళిత చైతన్యంగా విప్పారింది. అనేక సాహిత్యరూపాలు పుట్టుకొచ్చాయి స్వాతంత్ర్యోద్యమ కాలంలో. జలియన్‌వాలాబాగ్ దురంతం సందర్భంగా 'పాంచాలీ పరాభవం' (దామరాజు పుండరీకాక్షుడు) వంటి నాటకాలూ వచ్చాయి. అయితే పాట వ్యాప్తి చెందినంతగా తక్కిన కళారూపాలు చెందలేదు. పాట చెవికింపు కావటం ముఖ్యకారణం. ఆ పాటలు చదువు సంధ్యలు లేని పామర వర్గాలకు కూడా

తేలిగ్గా చేరటానికి వీలుగా దేశభక్తులైన కవులు అప్పటికే జనం నోళ్లలో నానుతున్న భక్తి / జానపద బాణీలను తీసుకొన్నారు. 'శ్రీరామ నామం మరువాం మరువాం' అనే భజన వరసలో వచ్చిన 'శ్రీ గాంధి నామం మరువం మరువం / సిద్ధము జైలుకు వెరువాం వెరువాం (దామరాజు) అనే పాట ఒక ఉదాహరణ. 1920లో మొదలైన సహాయ నిరాకరణాన్ని ప్రచారం చేస్తూ కొన్ని గేయాలు వెలువడ్డాయి.

నిరాకరణమను మిఠాయి యిదుగో - బిరాన రుచి చూడండీ
వేరే పోయి కొనబని లేదిక - చీరాల పురిలో కొల్లగ దొరకును
సత్యాగ్రహమను గోధుమపిండిలొ - సత్యసారమను ఆజ్యము పోసి
సాత్త్వికమను పెద భాండములోపల - సత్యాగ్రహులు పాకము బట్టిన ॥నిరా॥
అని 'మిఠాయి పాకం' బట్టాడు కొండపల్లి జగన్నాథదాసు.

1921 మార్చిలో బెజవాడలో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభల సందర్భంలో పింగళి వెంకయ్య చేసి యిచ్చిన జాతీయ జెండా రూపకల్పన ఒక చారిత్రకాంశం. స్వేచ్ఛాభావనకి గుర్తుగా త్రివర్ణపతాకపై కవితలూ వచ్చాయి. 'ఎగురవే వినువీథి ఎగురవే జండా / శాంతిదూతగ నేడు జాతీయ జండా' (సుంకర సత్యనారాయణ). 'అదుగో మన జయధ్వజం / అదుగదుగో భద్రగజం' (వానమామలై వరదాచార్యులు).

స్వాతంత్ర్యోద్యమంలో ఒక మహోజ్వల ఘట్టం అల్లూరి సీతారామరాజు సాయుధ పోరాటం. అది 1922-1924 మధ్యకాలంలో జరిగింది. దానినే మన్యం పితూరీ, రంప పితూరీ అన్నారు. మన్యం ప్రాంతంలో జరిగిన ఆ తిరుగుబాటు తెలుగువారిలో తెగువను పెంచింది. తెల్ల దొరతనం ఉలిక్కిపడిరది. అల్లూరి మరణానంతరం ఎన్నెన్నో పాటలు, ఏకపాత్ర రచనలు, నాటకాలు వెలువడ్డాయి. (ఈ రచయిత కూడా చిన్నప్పుడు అల్లూరి సీతారామరాజు ఏకపాత్రాభినయ రచన చేశాడు.) పడాల రామారావు రాసిన 'అల్లూరి సీతారామరాజు' నాటకం ఊరూ వాడల వందలసార్లు ప్రదర్శించబడిరది. 1960 ప్రాంతంలో అల్లూరి సీతారామరాజు రూపకం హెచ్.ఎం.వి. రికార్డుగా వెలువడి పల్లెటూళ్లలో ప్రతిధ్వనించింది. కొంగర జగ్గయ్య మొదలైన మేటి నటులు  అందులో వాచికాభినయం చేశారు. గబ్బిట వెంకటరావు రచయిత. అందులో ఒక పాట విందాం.

అల్లూరి సీతారామరాజా! - అల్లూరి సీతారామరాజా!
కల్లా కపటం లేని - చల్ల గుండె నీదయ్యా! ॥అల్లూరి॥
స్వారాజ్య యుద్ధాన - జయభేరి మ్రోగింప
జన్మమెత్తిన దొరవు నీవు – తెల్ల
దొరలను ఎదిరించినావు – మన్నె
జనులను పురికొల్పినావు – మమ్ము
మనసార దీవించినావు
తెల్ల దొరల గుండె - తల్లడిల్ల జేసినావు ॥అల్లూరి॥...

1930లో దండి సత్యాగ్రహంలో 'స్వరాజ్య లవణం' గురించి పాటలు పాడారు కవులు.

ఉప్పు కొనండయ్యా! స్వరాజ్యపు - ఉప్పు కొనండయ్యా!
ఉప్పు చట్టమును ధిక్కరించితే - తప్పక మనకు స్వరాజ్యము వచ్చు
అని గానం చేశాడు మంగిపూడి పురుషోత్తమశర్మ.

హేతువాదప్రవక్త త్రిపురనేని రామస్వామి దండి సత్యాగ్రహులకు 'వీరగంధము' పూశాడు.

వీరగంధము తెచ్చినారము
వీరుడెవ్వడొ తెల్పుడీ
పూసిపోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో

ఆంగ్ల రాజశాసనాన్ని శాంతియుతంగా ధిక్కరించి దండియాత్రలో పాల్గొని ఉప్పు తేవటమే వీరత్వం. ఆలంకారిక పరిభాషలో చెప్పాలంటే ధర్మవీరం. అదే గాంధీ మూర్తిమత్వం. అలాగే 'మరచిపోవద్దోయి' అని త్రిపురనేని హెచ్చరించిన గీతం చూడండి.

పగవారు మనపైకి వచ్చిపడ్డారు
కోయంచు మన యూళ్లు కొల్లగొట్టారు
గూటిలో పిట్టల్ని కూల్చివైచారు

పొలములో పసిలేళ్ల పొడిచిపైచారు
మరచిపోవద్దోయి మరచిపోవద్దు
మన జాతి యగచాట్లు మరచిపోవద్దు

1942 నాటి క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంగా కూడా బోలెడన్ని రచనలు ఉద్యమాభిమానులైన కవులనుంచి వచ్చాయి. 'వీరావేశం జెందినారమిక - వీరవిహారం చేస్తాము / పరాధీనతన్ బాపుకొనంగా - ప్రళయభేరి మ్రోగిస్తాము' (మల్లాది రామచంద్రశాస్త్రి). కఠిన శిక్షలకు బెదరకపోగా, 'జన్మమదేలా? - జైలుకు పోని / జన్మమదేలా?' (యనమండ్ర కృష్ణారావు) అని పాడుకొంటూ కారాగారాలకు తరలారు దేశభక్తులు.

కృష్ణశాస్త్రి, వేదుల, జాషువ, తుమ్మల, దువ్వూరి, ఏటుకూరి, దాశరథి, వానమామలై మొదలైన గొప్ప కవులందరిలో స్వాతంత్ర్యాకాంక్ష మెరిసింది, బెరసింది. స్వాతంత్ర్యం రాగానే కవులు పులకించిపోయారు. 'తెలవారెం దెలవారె పీడకల్పెం త్రెళ్లెన్ బరాధీనతా కలుషంబు' (కాటూరి వేంకటేశ్వరరావు). 'ప్రభవించిన నూతనభారత పతాకకభివాదం / భవిష్యదుజ్జ్వల భర్మయుగానికి ఆహ్వానం' (శ్రీ శ్రీ).

గణగణ మ్రోగెరా విజయఘంటలు భారతమాత మందిరాం
గణమునN ద్వారబంధముల గట్టిరి చిత్రవిచిత్ర రత్న తో
రణ తతిN వీథివీథుల విరాజిలుచున్నవవే త్రివర్ణ కే
తనములుN మేలుకాంచె పరతంత్ర పరాఙ్ముఖ సుప్తకంఠముల్ (కరుణశ్రీ)

మహాత్మ గాంధీ హత్యతో దేశమంతా ఒక్కసారి తుళ్లిపడిరది. వందలమంది కవుల కలాలు కన్నీళ్లు గార్చాయి. 'అమరజ్యోతి' (తుమ్మల) వంటి అశ్రుతర్పణలు జరిగాయి.

## స్వాతంత్ర్యానంతర స్ఫూర్తి:

భారత స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తి స్వరాజ్యం వచ్చినాక కూడా కొనసాగటం గమనించదగింది. స్వరాజ్యం సిద్ధించగానే 'మాదీ స్వతంత్రదేశం / మాదీ స్వతంత్ర జాతి' (బాలాంత్రపు రజనీకాంతరావు) అంటూ ఉప్పొంగిపోయారు కవులు. కథలు, కవితలు, గేయాలు, కావ్యాలు వెల్లువలయ్యాయి. స్వరాజ్యానికి ముందూ వెనక కూడా సభల ప్రారంభంలో 'బోలో స్వతంత్ర భారత్‌కీ జై', 'మహాత్మా గాంధీకీ జై' అనే నినాదాలు మైకుల్లో వినపడేవి.

అదే స్ఫూర్తికి కొనసాగింపుగా భారత్‌`చైనా యుద్ధ సందర్భంలో (1962) దేశభక్తి సాహిత్యం పెల్లుబికింది. అయితే సంకలనకారులు వాటిపై 'శీతకన్ను' వేశారు. అటువంటి పాటల్లో ఒక ఆగ్రహగీతం 'మంచుకొండను మ్రింగవచ్చిందిరా చైన.... పొంగరా జలధిపై మ్రింగరా అరుల' (దాశరథి రంగాచార్య) అని ఉద్రేకించింది. మరో గొంతు 'పద పదరా! భారత వీరా! / పథమంతా నీ వశమేరా!' (యస్వీ జోగారావు) అని వెన్ను తట్టింది. అన్నిటిలోకి 'జయం మనదిరా' అంటూ ఘంటసాల గొంతు చీల్చుకు వచ్చిన ఉత్తేజకరమైన పాట ఆ రోజుల్లో తెలుగునాట మార్మోగింది. (తుళ్లూరు టూరింగ్ టాకీస్ మైకులో సాయంత్రం పూట ఈ పాట వినటం నా చిన్నప్పటి అనుభవం.)

జయం మనది జయం మనది జయం మనదిరా!
నవభారత రథసారథి నెహ్రూ సారథ్యంలో ॥జయం॥
చైనీయులు ముష్కరులై ముట్టడిరచినారురా
పంచశీల సూత్రాలను మంటగలిపినారురా
స్నేహితులై చేరి మనల మోసగించినారురా
ద్రోహులు దీనికి ఫలితం పొంది తీరుతారురా! (పి.ఎస్. గోపాల్)

అదే సమయంలో చైనాని వెనకేసుకొచ్చిన భారతీయ మేధావులూ ఉన్నారని తెలిసినప్పుడు బాధ కలగక మానదు. జాతీయత పిమ్మటనే అంతర్జాతీయత అని, ఏ సిద్ధాంతమైనా స్వదేశక్షేమాన్ని తృణీకరించరాదనీ తెలుసుకొంటే మంచిది.

## దేశభక్తి కవిత్వం - భావకవిత్వం:

దేశభక్తి సాహిత్యానికి సమాంతరంగా 1915 ప్రాంతం నుంచి భావకవిత్వ వాహిని కూడ తెలుగునేలపై సాగింది. రాయప్రోలు దీనికి ఆద్యుడు. ఈ కవిత్వాన్ని విశ్లేషిస్తూ సాహిత్య విమర్శకులు - సి॥ నారాయణ రెడ్డి మొదలైన వారు - భావకవిత్వంలోనే దేశభక్తి కవిత్వం ఒక పాయగా కలిపేశారు. ఈ నిర్ధారణ సరైనదేనా?

నిర్దిష్టమైన భౌతికాశయంతో కొనసాగే సమిష్టి ప్రయత్నాల, చర్యల పరంపరే ఉద్యమం. దానికొక రాజకీయ, సామాజిక లక్ష్యం ఉంటుంది. సంస్థాగత నిర్మాణం ఉంటుంది. అట్లా జాతీయోద్యమానికి / స్వాతంత్ర్యోద్యమానికి పరజాతినుంచి స్వేచ్ఛా స్వాతంత్ర్య సాధన అనే స్పష్టమైన ఆశయం ఉంది. అందుకవసరమైన రాజకీయ సంస్థా నిర్మాణం ఉంది. హరిజనోద్ధరణ, స్త్రీ విద్య, మద్యపాన నిర్మూలన మొదలైన

సామాజిక సంస్కరణ భావజాలం ఉంది. దానికి అనుగుణంగా కావ్యాలు, గేయాలు, కథలు, హరికథలు, నవలలు మొదలైనవి వెల్లువలయ్యాయి.

భావకవిత్వం తెలుగు సాహిత్యానికి అపూర్వ దోహదం చేసిందనటంలో అనుమానం లేదు. అయితే అది భావోద్యమం. భౌతిక ఉద్యమం కాదు. సామాజిక ఆచరణ భావకవిత్వానికి లేదు. భావకవిత మధ్య తరగతి వ్యక్తిభావ ప్రధానం. అందులో ప్రణయం ప్రధానం. జాతీయోద్యమ కవిత్వం సమూహ చైతన్య ప్రధానం. భావకవిత్వమే ఉంది గాని 'భావ కథలు, భావ నవలలు' మొదలైనవి లేవు. అంటే తక్కిన సాహిత్య ప్రక్రియలతో దానికి స్నేహ సంవాదం లేదు. భావకవులు ఆనాటి జాతీయోద్యమ ప్రభావంతో కొన్ని దేశభక్తిపూరిత రచనలు చేశారు. అయితే అది వారి ప్రధాన ప్రమేయం కాదు. జాతీయోద్యమానికి గల సామాజిక, రాజకీయ భూమిక భావకవిత్వానికి లేదు. కనుక జాతీయోద్యమ సాహిత్యాన్ని భావకవిత్వంలో కలిపెయ్యటం పెద్ద తప్పిదం. ఆ రెండు పాయల్నీ వేర్వేరుగానే చూడాలి. వేరుగానే విలువ కట్టాలి.

భావకవిత్వం తెలుగు సాహిత్యానికి అపూర్వ దోహదం చేసిందనటంలో అనుమానం లేదు. అయితే అది భావోద్యమం. భౌతిక ఉద్యమం కాదు. సామాజిక ఆచరణ భావకవిత్వానికి లేదు. భావకవిత మధ్య తరగతి వ్యక్తిభావ ప్రధానం. అందులో ప్రణయం ప్రధానం.

అంతే కాదు. దేశభక్తి కవిత్వం రచించిన వాళ్లలో స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న, జైలు పాలైన కవులున్నారు. ఉద్యమాచరణ లేని కవులూ ఉన్నారు. కనుక ఈ కవిత్వాన్ని బాహిర్గత దేశభక్తి కవిత్వం (outsider patriotic poetry), అంతర్గత దేశభక్తి కవిత్వం (insider patriotic poetry) అని కూడా వింగడిరచి పరిశీలించవచ్చు. ఈ విభజన సౌలభ్యానికి సంబంధించిందే గాని ఆ యా రచనల స్థాయికి, రచయితల నిజాయితీకి సంబంధించింది కాదు.

# తెలంగాణ సాయుధ పోరాట కవిత్వం



ఆచార్య ఎస్వీ సత్యనారాయణ
✆ 96180 32390

తెలుగు నేలపై తలెత్తిన ఉద్యమాలలో తెలంగాణా విమోచనోద్యమం విశిష్టమైనది. శతాబ్దాలుగా కొనసాగిన రాజరిక వ్యవస్థకూ, అణచివేతకూ వ్యతిరేకంగా పోరాడిన తెలుగు ప్రజల పోరాట శీలాన్ని ప్రపంచానికి చాటిన తిరుగుబాటు ఉద్యమం తెలంగాణా విమోచనోద్యమం. భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా సాగుతూ, ఉద్యమాల చరిత్రలో ఒక ప్రత్యేకమైన అధ్యాయాన్ని లిఖించుకున్న పోరాటమిది, తెలంగాణకు అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు తెచ్చిన ప్రజా పోరాటమిది. ఫాబ్లో నెరూడా చేత అనేకమంది రష్యన్, స్పానిష్, పోలీష్ రచయితల చేత గీతాలు రాయించుకున్నదీ, స్టాలిన్ మన్ననలు పొందిందీ పోరాటం, హరీంద్రనాథ్ చటోపాధ్యాయ, చిత్తప్రసాద్ వంటి జాతీయ స్థాయి కవులను, కళాకారులను ప్రభావితం చేసిన ప్రజోద్యమమిది. ఉద్యమకాలంలోనూ, ఉద్యమానంతర కాలంలోనూ తెలంగాణా విమోచనోద్యమంపై, తెలంగాణా జన జీవితంపై ప్రతిభావంతమైన సాహిత్యం వెలువడింది; నేటికీ వెలువడుతూనే ఉన్నది. మట్టిమనుషుల నుండి మహా కవులు, గాయకులు రూపొందారు. సామాన్య మానవుల నుండి మాన్యులైన ప్రజానాయకులు తయారయ్యారు. 'కాల్మొక్త గులాపోన్ని బాంచన్' అంటూ బానిసలుగా తలవంచి బతికిన సంస్థాన పజలు, 'ఆంధ్ర మహాసభ' నాయకత్వంలో చైతన్య వంతులైనారు. సత్యాగ్రహాలు మొదలుకొని సాయుధ పోరాటం దాకా ఉద్యమాలు కొనసాగించారు. నిజాం నవాబు రాజరిక పరిపాలన నుండి, భూస్వాముల పీడన నుండి విముక్తులయ్యారు. తెలంగాణ విమోచనోద్యమానికి మూడు పార్శ్వాల ఉన్నాయి.

1. రాజకీయ పార్శ్వం - నిజాం నిరంకుశ పాలన నుండి విముక్తి, ప్రజా ప్రభుత్వ ఏర్పాటు లక్ష్యాలు.

2. ఆర్థిక పార్శ్వం - భూస్వామ్య అణచివేత నుండి, వెట్టిచాకిరి నుండి విముక్తి. దున్నేవానికే భూమి అన్నది నినాదం.

3. సాంస్కృతిక పార్శ్వం - అసఫ్జాహీ నవాబుల పాలనలో నిర్లక్ష్యానికి గురైన అత్యధిక ప్రజల మాతృభాష తెలుగు పరిరక్షణ, సాహిత్యం, సంస్కృతుల సంరక్షణ ధ్యేయం.

ఉద్యమంలో నాలుగు దశలున్నాయి.

1. ప్రారంభదశ (1921-30): దేశాభిమాన చైతన్యం, వివిధ సంఘాల నిర్మాణం, ప్రజలను సమీకరించడానికి జరిగిన కృషి ఈ దశలో ప్రధానమైనది.

2. భూస్వామ్య నిరసన (1930-46) : అనేక గ్రామాల్లో భూస్వామ్య పీడనకు, వెట్టి చాకిరికి వ్యతిరేకంగా ప్రజలు పోరాట శీలాన్ని ప్రదర్శించిన దశ ఇది.

3. నిజాం ప్రభుత్వంపై వ్యతిరేకత (1946 - 47): ఒకవైపు భూస్వాముల దౌర్జన్యాలను ప్రతిఘటిస్తూనే, మరోవైపు భూస్వాములకు ర?జాకారూ గూండాలకు అండగా నిలిచిన రాజరిక నిజాం నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా 'ఆంధ్ర మహాసభ' నాయకత్వాన ప్రజలు తిరుగుబాట్లను తీవ్రతరం చేశారు. శత్రువులెవరో తెలుసుకుని, సమర శీల సంఘటిత పోరాటం నిర్వహించారు.

4. సాయుధ పోరాటం (1947-51) :ఆగస్టు 15 నాడు భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది. బ్రిటీష్ ప్రభుత్వం విశాల భారతావనిని రెండుగా చీల్చి ఇండియా, పాకిస్తాన్లుగా విభజించింది. దేశంలోని సంస్థానాధిపతులు భారతదేశంలో కానీ, పాకిస్తాన్లో కానీ చేరవచ్చు. స్వతంత్ర దేశాలుగానైనా కొనసాగవచ్చుననే స్వేచ్ఛను ప్రకటించింది. నిజాం నవాబు మీర్ ఉస్మానలీఖాన్, 'హైదరాబాద్ సంస్థానం స్వతంత్రదేశంగా ఉంటుంది' అని ప్రకటించాడు. 'ఆజాద్ హైదరాబాద్' అన్నాడు..

దేశవ్యాప్తంగా ప్రజలు ఆనందోత్సాహాలు జరుపుకుంటూ ఉంటే, హైదరాబాద్ సంస్థాన ప్రజలు స్వేచ్ఛ , స్వాతంత్ర్యాల కోసం తుదిసమరం జరపవలసి వచ్చింది. 'హైదరాబాద్ సంస్థానం ఇండియన్ యూనియన్లో విలీనం కావాలి' అనే నినాదం ప్రజల సమరనాదమయ్యింది. అన్ని రాజకీయ పార్టీలు ఈ నినాదాన్ని రణన్నినాదం చేశాయి.

తెలంగాణ సంస్థానంలోని ప్రజల మాన, ప్రా ణాలను కాపాడేందుకు; నిజాం సైన్యాలను, రజాకార్ మూకలను ఎదిరించేందుకు 'సాయుధ పతిఘటనే

ఏకైక మార్గం' అని ప్రజలు అభిప్రాయపడ్డారు. 11 సెప్టెంబర్ 1947న 'ఆంధ్ర మహాసభ', 'కమ్యూనిస్టు పార్టీ'లు సాయుధ పోరాటానికి పిలుపునిచ్చాయి. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, మద్దూం మొహియుద్దీన్లు తమ సంయుక్త ప్రకటనలో ఈ చారిత్రాత్మకమైన పిలుపునిచ్చారు.

> నిజాం ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు సాయుధ పోరాటం సాగించాలి. సాయుధపోరాట శిక్షణా తరగతులు నిర్వహించాలి. భూస్వాముల భూములను నిరుపేదలకు, వ్యవసాయ కార్మికులకు పంపకం చేయాలి.

నిజాం ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు సాయుధ పోరాటం సాగించాలి. సాయుధపోరాట శిక్షణా తరగతులు నిర్వహించాలి. భూస్వాముల భూములను నిరుపేదలకు, వ్యవసాయ కార్మికులకు పంపకం చేయాలి. దున్నేవాడిదే భూమి, ప్రభుత్వ ఆజ్ఞలను ధిక్కరించి గ్రామగ్రామాన జాతీయ జెండా, కమ్యూనిస్టు పార్టీ జెండా రెండింటినీ ఆవిష్కరించాలి. ఈ ప్రకటన కార్యక్రమాన్ని ఆధారం చేసుకుని నిజాం రాజరికపరిపాలనకు వ్యతిరేకంగా తెలంగాణా ప్రజల సాయుధ పోరాటం ప్రారంభమయింది. ప్రజాకమిటీలు, సాయుధ గెరిల్లా దళాలు ఏర్పడ్డాయి. దాదాపు నాలుగువేలమంది దళ సభ్యులు సమీకృతమయ్యారు. గ్రామరక్షక దళాలేర్పడ్డాయి. కొన్ని విధ్వంసక దళాలు కూడా నిర్మితమయ్యాయి. మరోవైపు గ్రామాలపై రజాకార్లదాడులు, పోలీసుల దాడులు అధికమయ్యాయి. ప్రజలను కాల్చి చంపడం, స్త్రీలను అవమానపరచడం, ఆస్తులను దోచుకోవడం, గ్రామాలను తగులబెట్టడం ఎక్కువయింది. ఆంధ్ర మహాసభ (సంగం, గుత్పల సంగం) నేతృత్వంలో ప్రజలు ఎదురుదాడి చేశారు. ఈ పోరాటం వల్ల నల్లగొండ, వరంగల్, కరీంనగర్, అదిలాబాద్ జిల్లాలకు చెందిన మూడు వేల గ్రామాలు భూస్వాముల పీడన నుండి విముక్తమయ్యాయి. దాదాపు పది లక్షల ఎకరాల భూమి వ్యవసాయ కూలీలకు, పేద, మధ్యతరగతి రైతులకు పంచారు. వ్యవసాయ కార్మికుల కూలిరేట్లు పెంచారు. గ్రామాల్లో భూమిశిస్తు రద్దు చేయబడింది. ప్రజలలో రాజకీయ ప్రచారం, వై జ్ఞానిక ప్రచారం పెద్ద ఎత్తున

సాగింది. రాత్రి పాఠశాలలు విరివిగా నెలకొల్పబడ్డాయి. అనేకమంది నిరక్షరాస్యులు అక్షరాస్యులయ్యారు. విజ్ఞానవంతులయ్యారు.

### పోలీస్ చర్య :

నిజాం సంస్థానం 'ఇండియన్ యూనియన్లో విలీనం కావాలి' అన్న ప్రజల కోర్కెకు ప్రతిబింబంగా సాగిన పోరాటానికి పర్యవసానంగానూ, స్టేట్ కాంగ్రెస్ పార్టీ వారి సత్యాగ్రహాల స్వాగతాల ఫలితంగాను 1948 సెప్టెంబర్ 13న భారత సైన్యాలు మేజర్ జనరల్ జయంత్నాథ్ చౌదరి నాయకత్వాన హైదరాబాద్ సంస్థానంలోకి ప్రవేశించాయి. నిజాం మిలటరీ, నిజాం పోలీసులు, రజాకార్లు యూనియన్ సైన్యాలను ఎదిరించలేకపోయారు. పర్యవసానంగా సెప్టెంబర్ 17 నాటి సాయంత్రం 5 గంటలకు నిజాం నవాబు హైదరాబాద్ రేడియో ద్వారా యుద్ధ విరమణను ప్రకటించి, భారత సైన్యాలకు లొంగిపోయాడు. రజాకార్ల నాయకుడు ఖాసీం రజ్వీని భారత ప్రభుత్వానికి అప్పగించాడు. భారత ప్రజలు ఈ విజయానికి స్వాగతం పలికారు. సంస్థానంలోని ప్రజలు పండుగలు జరుపుకున్నారు.

### సాయుధ పోరాటం అణచివేత:

నిజాం ప్రభుత్వాన్ని ఇండియన్ యూనియన్లో విలీనం చేయగానే యూనియన్ సైన్యం వెనుదిరిగిపోలేదు. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన కొనసాగుతున్న ప్రజల పోరాటాన్ని అణచివేయడం ప్రారంభించింది. యూనియన్ సైన్యం కనబడ్డ కమ్యూనిస్టునల్లా కాల్చి చంపింది. జైళ్ళలో కుక్కింది. చిత్రహింసలు పెట్టింది.

నిజాం వ్యతిరేక సాయుధపోరాటకాలంలో రెండు వేల మంది కమ్యూనిస్టులు, వారి అభిమానులు మరణిస్తే, యూనియన్ మిలటరీ పాలన కాలం (1948-51)లో మరో రెండు వేలమంది అసువులు వీడారు. ఇంత రక్తతర్పణ, ఇన్ని వేలమంది ఆత్మార్పణ జరిపిన ఘట్టం భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామంలో మరొకటి లేదు.

### పోరాట విరమణ :

ఒకవైపు గెరిల్లా దళాలపైన, అమాయక ప్రజలపైన యూనియన్ సైన్యాల, రిజర్వు పోలీసుల అమానుష దౌర్జన్యకాండను, మరోవైపు మారుతున్న రాజకీయ పరిస్థితులను అధ్యయనం చేసిన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం, అనేక తర్జనభర్జనల తరువాత, చర్చల తరువాత 1951 అక్టోబర్ 21న సాయుధ పోరాటాన్ని విరమిస్తున్నట్లు ప్రకటించింది. భూస్వామ్య వ్యవస్థపై తిరుగుబాటుగా ప్రారంభమైన తెలంగాణా విమోచనోద్యమం పీడిత ప్రజల రాజ్య నిర్మాణాకాంక్షతో

కొత్త మలుపు తిరిగింది. నిజాం రాజరిక వ్యవస్థను అంతం చేసింది. యూనియన్ సైన్యం దాడులను ఎదుర్కొన్నది. గ్రామాలను విముక్తం చేసింది. వెట్టిచాకిరిని రద్దు చేసింది. దున్నేవాడికి భూమి నినాదాన్ని దేశానికి ఒక ఎజెండాగా అందించింది. సాహిత్యాన్నీ, కళారూపాలనూ ప్రభావితం చేసింది. తెలుగు సాహిత్యానికి పోరాట సాహిత్య వారసత్వాన్నిచ్చింది. చారిత్రాత్మక తెలంగాణ విమోచనోద్యమంలోకి ప్రజానీకాన్ని సమీకరించడానికి సాహిత్య ప్రక్రియలు, కళారూపాలు ఇతోధికంగా తోడ్పడినాయి. ప్రజల నుండి కవులు, గాయకులు, నటీనటులు, బుర్రకథకులు, ఒగ్గుకథకులు, గొల్లసుద్దులు చెప్పేవారు రూపొందారు. ఆయా సందర్భాలకు అనువైన కళారూపాలను సృష్టించుకుని ప్రజల మధ్య ప్రదర్శించారు. ప్రజలు కదిలారు. లాఠీలనూ, తూటాలను ఎదిరించారు. పోరాటాలు ఈ ఉద్యమ కవులను ఉత్తేజపరిచాయి. మరిన్ని పోరాట గీతాలు పుట్టాయి. ప్రజలు పాడుకున్నారు. పాడుతూ పోరాడారు. ఈ పోరాట పాటలను ప్రజలు సొంతం చేసుకున్నారు.

## తెలంగాణ విమోచనోద్యమ కావ్యాలు:

వజ్రాయుధం
'తన చరిత్ర తనె పఠించి
ఫక్కున నవ్వింది ధరణి
తన గాథను తనె స్మరించి
భోరున ఏడ్చింది ధరణి'
అనే అవగాహనతో పాటు...
''వృద్ధ జగతి సమాధిపై సమధర్మం ప్రభవించును
నిద్దుర చీకటి వెలుపల వేకువ మెళుకువ పుట్టును"

అన్న చారిత్రక ఆశావాదంతో 1949 మార్చి మాసంలో వెలువడిన అభ్యుదయ కావ్యం, 'వజ్రాయుధం'. ఆవంత్స సోమసుందర్ రచించిన ఈ కావ్యం 'కళాకేళి ప్రచురణలు' ద్వారా ప్రచురింపబడినది. 'నైజాం పైశాచిక నిర్బంధాల నుంచి తెలుగు జాతిని విముక్తం చేయడానికి అకుంఠిత దీక్షతో పోరాడి తమ సర్వస్వాన్నీ సమర్పించిన అమర వీరులందరికీ తెలంగాణ పోరాట జ్యోతిగా భాసించిన శ్రామిక జన మహానాయకులు శ్రీరావి నారాయణ రెడ్డిగారికి హృదయ నీరాజనంగా ఈ కృతిని సోమసుందర్ అంకితమిచ్చారు.

ఇందులో మూడు విభాగాలున్నాయి. 1.సమధర్మం, 2.బానిసల దండయాత్ర,

3.మలయా ప్రభంజనం. నిజాం రాజరిక వ్యవస్థపై ధర్మాగ్రహం పెట్టుబడిదారీ అసమసమాజ చిత్రణ, సమసమాజ నిర్మాణ ఆకాంక్ష ఈ కావ్య వస్తువులు.

'యుగ ధర్మం చైతన్యం
జన హృదయం పోరాటం'
అని నిర్వచిస్తూ....
''ఉన్నదొక్క జీవితమే
మానవునిగ వీరునిగా బ్రతుకుము
నరుడా! చరిత్ర నీ కోసం ప్రసవ బాధ పడుతున్నది.
భవిష్యత్తు నీ కోసం పడిగాపులు పడుతున్నది.
నీ త్యాగం వృధాకాదు
నీ త్యాగం వృధాకాదు''
అన్న ఉత్తేజకరమైన సందేశాన్నందించిన కావ్యం - 'వజ్రాయుధం'.
త్వమే వాహమ్:
''బ్రెయిన్ స్టెన్గన్ లా
చెట్లు చిట్టెలుకలు
చెయిన్స్లో మగవాళ్ళు
చెరచబడ్డ ఆడవాళ్ళు
చెద పురగులు
మదమెక్కిన సోల్జర్లు''

మగవాళ్ళను బంధించి, ఆడవాళ్ళను దారుణంగా చెరచిన నిజాం నవాబు మిలటరీ సైనికుల దుశ్చర్యలను, ప్రజల ప్రతిఘటన చైతన్యాన్ని ఆరుద్ర 'త్వమేవాహమ్' చిత్రించింది.

ఆరుద్రలో ఆలోచనల ట్రెయిన్ కదలడానికి తెలంగాణలో నిజాం రాక్షసమూకలచే చెరచబడ్డ స్త్రీ కథనం కారణం. 1948వ సంవత్సరం జూలై పదవ తేదీన కృష్ణాపత్రికలో 'నాకా సిగ్గు? నా స్త్రీత్వం ఎప్పుడో పోయింది" అనే పతాక శీర్షికతో 'రజాకార్లచే చెరచబడ్డ స్త్రీ కథనం' అచ్చయింది. 'సుమారు పది పన్నెండు రోజుల కిందటి విషయం. రైలు గుడివాడ దాటి వెళుతోంది. ఇందుపల్లి సమీపంలోకి వచ్చింది. రైలు పెట్టెలో ఉన్న ప్రయాణీకులు హైదరాబాదు

విషయాలు చెప్పుకుంటున్నారు. ఖాసిం రజ్వీ దురంతాలు, కాందిశీకుల కష్టాలు వర్ణించి, విషాద భరితులవుతున్నారు. ఇంతలో ఆ పెట్టెలోనే ఉన్న ఒక వనిత లేచి నిలబడింది. వలువలు తీసివేసింది. నగ్నంగా నిలబడింది. ఏమిటీ ఘోరమని అంతా తలలు వంచుకున్నారు. ఆమె అలాగే నిలబడింది. ఆ పెట్టెలో ఉన్న ఒక వృద్ధుడు ధైర్యం చేసి, 'అదేమిటమ్మా! ఆడపిల్లవు. అలా నగ్నంగా ఉన్నావు - తప్పుకాదూ? అన్నాడు.

ఆ మాటతో ఆమె తోక త్రొక్కిన రీతిగా లేచింది. 'తప్పా! నాకు తప్పా? ఏ నోటితో చెప్తున్నారామాట నేను ఆడదాన్నా? నైజాం కిరాతకులు నన్ను వారం రోజులిలా నగ్నంగా చెట్టుకు కట్టివేసి అట్టేపెట్టారు. నా స్త్రీత్వాన్ని ఆనాడే దొంగిలించారు. నా ఆడతనం ఆనాడే పోయింది. ఇంకా ఆడదాని నంటా? నా వంటినిండా గాయాలు. స్త్రీత్వం ఒకసారి పోయిం తర్వాత మళ్ళా వస్తుందా? ఇలా ఉన్నది మా స్థితి. మీరిలా కూర్చుని కబుర్లు వింటున్నారు. నేనేం సిగ్గుపడవలసిన పనిలేదిక. మీరు పడవలసింది' అని ఒక్కొక్క ప్రయాణీకుని దగ్గరకు వెళ్ళి, తన వంటిని ఉన్న గాయాలు చూపింది. పెట్టెలో వాళ్లంతా సిగ్గుతో తలవంచుకున్నారు. ఆమె విషాద గాథవిని కన్నీరు కార్చారు. తరువాత ఆమె వలువలు ధరించి వెళ్ళి ఒకచోట కూర్చుంది.

ఆ దృశ్యం కళ్ళారా చూసి, ఆమె వాక్కులు విని, కన్నీరు కార్చిన ఒక ప్రయాణీకుడు పంపిన రిపోర్టు అది. ఈ వార్త చదివాక ఆరుద్ర 'త్వమేవాహం' రచన మొదలెట్టారు. ఆ రిపోర్టును అధునాతన పరిభాషలో ప్రతీకాత్మకంగా ఆరుద్ర కవిత్వీకరించారు.

"ఆలోచన ట్రెయిన్లో
ట్రెయిన్లో
పురుషుల థర్డ్ క్లాస్ బోగీలో
చెట్ల గురించి
చిట్టెలుకల గురించి
చెద పురుగుల గురించి
చిన్న చిన్న చీమల గురించి
సంభాషణల రెయిన్లో
రెయిల్లో

చెయిన్స్ లేని మగాళ్ళ ముందు

చెదపురుగులు కాని మగాళ్ళ ముందు నిటారుగా నుంచొని

తన బట్టలు నింపాదిగా తాపీగా

ఒలుచుకునే

నిటారుగా, నిస్సిగ్గుగా

నించొనే నీతిమంతురాలు" అంటూ సాగుతుందీ కావ్యం.

ఆరుద్ర త్వమేవాహం కావ్యాన్ని ఒక ప్రవాహంగా ఊహించారు. మొదటి దశ పర్వత దశ, రెండవది ఉపనదులు. మూడవది ప్రవాహదశ అంటారు డా॥ఎల్. సంగయ్య.

"ఖైయాసు ఎడారిలోపల

ఒయాసిస్సు పొయెట్రీ'

అంటాడు ఆరుద్ర. నైజాం నవాబు సృష్టించిన ఆందోళనకర ఎడారిలో, తెలంగాణ పౌరులకు బాసటగా నిలిచి ఆలోచనామృతాన్ని పంచే మేధోజనిత సందేశాత్మకమైనది కవిత్వం. సామాన్య జనుల ఆర్తిని తొలగిస్తుంది కవిత్వం. నవాబుల ఎడారి వంటి మోటు రాజ్యంలో ఒయాసిస్సు వంటి కవిత్వాన్ని రచించాడు ఆరుద్ర, తెలంగాణ ప్రజల దుర్భర జన జీవితానికి ప్రతీకాత్మక వ్యక్తీకరణ త్వమేవాహం'.

**అగ్నిధార:**

'అనాదిగా సాగుతోంది

అనంత సంగ్రామం

అన్నా ధుడికీ, ఆగర్భ

శ్రీనాధుడికీ మధ్య' అన్న శ్రామిక వర్గ దృక్పథంతో అన్నార్తులు, అనాథలుండని నవయుగాన్ని ఆకాంక్షిస్తూ, తెలంగాణా సాయుధ రైతాంగ పోరాట కాలంలో కఠినమైన కారాగార శిక్షా కాలంలో దాశరథి కృష్ణమాచార్య రచించిన ఖండ కావ్యసంపుటి - 'అగ్నిధార'. సాయుధ పోరాటం కొనసాగుతున్న రోజుల్లోనే 1949లో సాహితీ మేఖల పక్షాన ఈ సంపుటి ప్రచురింపబడింది. దాశరథి రచనల్లో అచ్చయిన మొట్టమొదటి పుస్తకమిది.

'అంగారం, శృంగారం దాశరథి రచనల్లో కలిసి ఉంటాయి' అంటారు. శ్రీ డి.రామలింగం. నిప్పులు కురిపించే ఆగ్రహజ్వాలలు, సున్నితమైన భావుకతతో అలరారే కవితా సుమాల సంపుటి - 'అగ్నిధార'. జైలు గోడల మీద కవితా పంక్తులు రాసిన ప్రతిభావంతుడు దాశరథి కృష్ణమాచార్య.

**రుద్రవీణ:**

'రానున్నది యేది నిజం
అది ఒకటే; సోషలిజం
కలపండోయ్ బుజం బుజం
కదలండోయ్ గంజం గజం

అన్న స్పష్టమైన సామ్యవాద అవగాహనతో దాశరథి కృష్ణమాచార్య రచించిన ఖండకావ్య సంపుటి - 'రుద్రవీణ', 1950లో వెలువడిన ఈ కృతి తెలంగాణకు అంకితం చేశారు కవి.

"దాశరథి గీతాలు వినని రసికులు తెలంగాణ మందుండరు. దాశరథిని ప్రేమించని సాహిత్యకులు తెలంగాణలో లేరు. దాశరథిచే స్వీకరింపబడని కావ్య వస్తువు తెలంగాణలో లేదు. దాశరథియే తెలంగాణము, తెలంగాణమే దాశరథి. ఆయన గీతములు మహా నగరముల నుండి పల్లెపట్టుల దాకా, శిథిలాలయముల నుండి జైళ్ళ దాకా, ధనికుల నుండి పేదవాని దాకా, మితవాది నుండి తీవ్రవాది దాకా ప్రసరించినవి" అని గ్రంథ ప్రకాశకులు పండిత చిలుకూరు శ్రీరాములు తమ పరిచయ వాక్యాల్లో విశ్లేషించారు.

"నను గని పెంచినట్టి కరుణామయి నా తెలంగాణ! నీ గృహం
గణ వనసీమలో బరుసుకంపలు నాటి న మా నిజాము రా
జును పడద్రోసినట్టి రణ శూర ల వెచ్చని నెత్రుచుక్కలే
మణికృత దీపమాలికల మాదిరి నీకు వెలుంగు లిచ్చెడిన్"

"పాటలు పాడితిన్ తెలుగు బాబులు నిద్దురమేలుకోగ, పో
రాటము సేయగా, కరకు రాచరికమ్ము్మను కూలద్రోయగా
కోటి గళాల నొక్కకడ గూర్చితి విప్లవ శంఖ మెత్తితిన్
నాటికి నేటికిన్ తెలుగు నాటికి వెచ్చదనమ్ములూదితిన్"

"నాకు తల్లివి నీవు, నేనీకు సుతుడ,
"నల్లనాటికి నేటికి ననుదినమ్ము
మ్రోయుచున్నావు నా గళమ్మున, కలాన

నా తెలంగాణ కోటి రత్నాల వీణ" అని వినమ్రంగా దాశరథి కృష్ణమాచార్య ప్రకటించారు.

"రెండు వందల యేండ్ల చరిత్ర పుటల
కప్పుకొనియున్న గాఢాంధకారమెల్ల
కొట్టుకొనిపోయె, తూరుపు మిట్టనుండి

పారివచ్చిన వెలుతురు వాగులోన" అంటూ నిజాం నిరంకుశ రాజరిక పరిపాలన నుండి విముక్తమయిన తెలంగాణ తల్లికి నీరాజనాలందిస్తున్న కావ్య సంపుటి - 'రుద్రవీణ'.

**ఉదయిని:**

"సింహం లా విక్రమించిన
మహా ప్రజ
నా మహా కవిత!
ఎర్ర గన్నేరు హారంతో
వూరేగే దొరల గుంపు
నా ఆగర్భ శత్రుతతి!
పాలకుల గుండెలు నమిలే
బుల్లెట్స్ నా మాటలు
ఏలికల కండలు కరిచే
బాయినెట్స్ నా పాటలు!
సింహాసనాలు కూల్చే
శతఘ్నులు నా ఊహలు!
బలిపీఠాలు పగిల్చే
బాంబర్లు నా వాక్కులు!
శత్రు సంహార యాత్రలు

నే వ్రాసే చరిత్రలు!
పొలి చల్లిన రాత్రులు
నా విహార యాత్రలు!
నా పేరు కమ్యూనిస్టు!
నేను భవిష్యత్తును!"

అని ప్రకటించుకున్న గంగినేని వెంకటేశ్వరరావు రచించిన కావ్యసంపుటి - 'ఉదయిని', దీనిని 1950 అక్టోబర్ మాసంలో ఆంధ్ర రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘం వారు ప్రచురించారు. ఇందులో మూడు పర్వాలున్నాయి. 1.అరణ్యపర్వం, 2. యుద్ధ పర్వం, 3. శాంతి పర్వం.

నిజాం వ్యతిరేక సాయుధ రైతాంగ పోరాట ఆటు పోట్లకు గురయిన వారిలో గంగినేని ఒకరు. పోరాట ప్రాంతాలను సందర్శించి, ప్రేరణ పొందారు. పోలీస్ క్యాంప్ చిత్రహింసలను అనుభవించారు. పోరాటంలో ప్రాణాలర్పించిన వీరుల గాథలు విన్నారు. వీరుల భార్యల మానభంగాలు, హత్యలను గురించి తెలుసుకున్నారు. వీరులను కన్న తల్లులపై జరిగిన హింసను, వారి దయనీయ స్థితిగతులను విని గంగినేని హృదయంలో

సంచలనం కలిగింది. దానికి అక్షరరూపమే 'ఉదయిని'.

అరణ్యపర్వంలో ప్రియుడు ప్రియురాలికి రాసిన లేఖ, తల్లి తనయునికి రాసిన లేఖలు పాఠకుల హృదయాలను ద్రవింపజేస్తాయి. యుద్ధపర్వంలో తెలంగాణాపై కవిగారికున్న ఆదరణతో పాటు....

'ఎందుకు అమ్మా!
కంటతడి పెట్టావు?
ముక్కోటి సంతతి ఉన్నామే!
షట్కోటి హస్తాలున్నాయే!"  అన్న ఓదార్పు కనబడతుంది.

గెరిల్లాలతో ఒక నిమిషం', 'బహిరంగలేఖ-1', 'బహిరంగలేఖ - 2', 'అరిచేతిలో మృత్యువు', 'శిక్షాపత్రము' వంటి కవితా ఖండికలు, పోరాట కాలం నాటి పరిస్థితులకు అద్దం పడుతున్నాయి.

శాంతిపర్వంలో అజేయ జనచైనాకు జోహార్లర్పించారు. ప్రపంచశాంతిని

ఆకాంక్షించారు. లోకగీతం శాంతి, లోకకంఠం శాంతి, బ్రతుకుబాట శాంతి, మనగమ్యం శాంతిగా గంగినేని అభివర్ణించారు. తెలంగాణ సాయుధ పోరాటం కొనసాగుతున్న రోజుల్లోనే వెలువడిన ఉత్తమ కావ్యసంపుటి - 'ఉదయిని'

**తెలంగాణ:**

'ఒకరాజు మొగాన్నే ప్రొద్దు పొడిచిందా? దేశంలో
ప్రతిరాజు కటికి గుండెలో
పొంగిన అధర్మపుటావేశంలో
పరిపాలన సాగింది
స్వార్థం కట్టిన గులకరాళ్ళ వంతెన ఆలంబంగా
సామాన్యుల బ్రతుకుబాటకొక లంబంగా
ప్రజా జలధి కడదాటే కాంక్షలతో
ప్రతి నిముసం బ్రతుకు మీద ఆంక్షలతో

పరిపాలన సాగింది' అంటూ ప్రస్తావనగా ప్రారంభమైన ఆధునిక ఉద్యమ ఇతిహాసం కుందుర్తి ఆంజనేయులు రచించిన 'తెలంగాణ'. ప్రథమ ముద్రణ 1956 డిసెంబర్ లో కాగడా ప్రచురణలు, కర్నూలు వారు ప్రకటించారు. 1955 డిసెంబర్ 25న రచయిత విజ్ఞప్తి రాసుకున్నారు.

'ఇది తెలంగాణలో జరిగిన విప్లవోద్యమ కథ. తెలంగాణ ఉద్యమంతో నాకు ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని సంబంధం లేదు. ఈ కావ్యం కేవలం నేను భావించుకున్న ఊహలకు కవితా కల్పన. కావ్య రచనకు కథా వస్తువు, కల్పనా ప్రతిభ - రెండూ ముఖ్యమే. పనికిమాలినదని ఏనాడో ఋజువై, చారిత్రక పరిణామంలో మరీ పాతదైపోయిన ఫ్యూడల్ వ్యవస్థ మీద ఒక పెద్ద తిరుగుబాటుగా తెలంగాణా ఉద్యమాన్ని నేను భావించాను. పోతే దానిని గురించి కొంతవరకైనా ప్రతిభావంతంగా

'ఇది తెలంగాణలో జరిగిన విప్లవోద్యమ కథ. తెలంగాణ ఉద్యమంతో నాకు ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని సంబంధం లేదు. ఈ కావ్యం కేవలం నేను భావించుకున్న ఊహలకు కవితా కల్పన.

చిత్రించగలిగివుంటే - అనే అనుకుంటాను. కృతకృత్యుణ్ణి' అంటూ కుందుర్తి రాసుకున్నారు.

ఛందోబద్ధమైన పద్య కవిత్వాన్ని అతి సున్నితంగానూ, ప్రౌఢంగాను రాయగల కుందుర్తి ఈ కావ్యాన్ని వచన కవితారూపంలో రచించారు. ఇదొక కొత్త ప్రయోగం.

ఈ కావ్యంలో పద్దెనిమిది పర్వాలున్నాయి. ప్రస్తావన, సింహాసన, బీజోత్పన్న, సంఘోదయ, ప్రజోద్యమ, రాయబార, బహిష్కార, అజ్ఞాత, మానభంగ, గృహదహన, ప్రతిఘటన, దిగ్విజయ, భూదాన, న్యాయదాన, రజాకార, దురాగత, దండయాత్ర, ఉపసంహార పర్వాలు.

రాజరిక వ్యవస్థ ప్రస్తావనతో ప్రారంభమయ్యే ఈ కావ్యంలో హైదరాబాద్ సంస్థానంలో నిజాం నవాబు నిరంకుశ పరిపాలన, భూస్వాముల దౌర్జన్యాలు, ఆంధ్రమహాసభ ఆవిర్భావం, పెల్లుబికిన ప్రజోద్యమం, రజాకారు మూకల దాడులు, మానభంగాలు, గృహదహనాలు, ప్రజల ప్రతిఘటన పోరాటాలు, అరణ్య - అజ్ఞాతవాసాలు, సంఘం నేతృత్వంలో సామాన్య ప్రజల సాహసాలు, అంతిమంగా ప్రజా విజయం వర్ణింపబడినాయి.

''ఈ నేల ఎవరిది? కోటి ప్రజల సొత్తు గదా
కొందరు వద్దంటే ఒప్పుకోని చరిత్రా!
ముందుకు పదా!" అంటున్నదీ కావ్యం.

''క్రమ క్రమాగత చైతన్య
ధనుష్పాణులు ప్రజలు నేడు
సమాజ సమిష్టి ప్రయో జన
నిశిత బాణులు ప్రజలు నేడు
సరికొత్త సమాజం శిశువును
పలకరిస్తున్న పట్టు చిలకలు
తమ పక్షాలతో రక్షించే
ఉయ్యాల పట్టు చిలకలకు కృతజ్ఞత
మన శిశువు చిరంజీవి, మృత్యువును జయిస్తుంది.
నిజం జయిస్తుంది, ధర్మం జయిస్తుంది.
వెలుగు జయిస్తుంది, తెలుగు జయిస్తుంది"

అంటూ కావ్యాన్ని ముగించారు కుందుర్తి ఆంజనేయులు. 'తెలుగు నేల ప్రతి ఊరిలో ఒక సంఘం ఉంది. తెలుగువారి ప్రతి మనసులో ఒక ఉదయం ఉంది' అన్న వాస్తవికతను వ్యక్తీకరించిన వచన కథా కావ్యం - 'తెలంగాణ'

1973 డిసెంబర్ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ తెలంగాణ 'పోరాట గేయాలు' వెలువరించింది. ఆ తరువాత విప్లవ రచయితల సంఘం తెలంగాణ పోరాట గీతాలను ప్రచురించింది. అలాగే సాహితీ సర్కిల్, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ విడివిడిగా 'సుద్దాల హనుమంతు పాటలు' ప్రకటించాయి. ఆం.ప్ర. అభ్యుదయ రచయితల సంఘ  గుంటూరుజిల్లా శాఖ తిరునగరి రామాంజనేయులుగారి 'జ్వలిత జ్వాల'ను వెలువరించింది. 'కల్పన' వంటి సంకలనాల్లో తెలంగాణ పోరాట కవితలు కొన్ని అచ్చయ్యాయి. సుంకర 'జయగీతి' కాంచినేపల్లి 'అరుణరేఖలు', 'మఖ్దూం కవిత', ఎల్లూరాజు మాధవాచార్యుల పద్య కావ్యం, 'మఘ వలయము' వెలువడినాయి. రెంటాల గోపాలకృష్ణ 'సర్పయాగం'లో....

"పగలేయ్ నిజాం కోటను
ఎగరేయ్ ఎర్రబావుటా" అని పిలుపిచ్చాడు.

ఇలా ఎందరో కవులు, కథారచయితలు, నవలా రచయితలు, నాటక రచయితలు తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంతో ప్రభావితులయ్యారు. గొప్ప సాహిత్యాన్ని సృష్టించారు.

### పోరాట గీతాలు:

గానయోగ్యమై, లయబద్ధమైన గీతాలు ఇతర సాహితీ ప్రక్రియలకన్నా, ఇతర కళారూపాల కన్నా కొంత ఎక్కువ పాత్రనే పోరాటకాలంలో వహించాయి. అప్పటికప్పుడు సందర్భానుసారంగా అల్లి ప్రజల్లో వినిపించడానికి అనువైన కళారూపం గీతం. ఒకే ఒక్క గాయకుడు గానం చేయడానికి వీలైన సాధనం గీతం. ప్రక్క వాయిద్యాలు, వంతలు లేకుండా ప్రచారం చేయడానికి వీలైన గీతాలు వందలాదిగా పోరాటకాలంలో వెలువడ్డాయి. ఉద్యమస్ఫూర్తికి దోహదం చేశాయి. వాటిలో పోయినవి పోగా, దొరికిన వాటిలో కనబడుతున్న సాధారణ లక్షణాలను బట్టి ఈ క్రింది విధంగా విశ్లేషించవచ్చు.

### భూస్వామ్య వ్యతిరేకత:

నిరంకుశ భూస్వామ్య విధానాన్ని నిరసిస్తూ తెలంగాణా ప్రజాకవులు ఆగ్రహగీతాలు గానం చేశారు.

"ఓ ధనికులారా!
ఓ పెత్తందారులార! మీరలింక
కనులు దెరవరెందుకోయ్? భూస్వాములార - మీ
పనులు మానరెందుకోయ్?' ॥ఓ ధనిక॥

అని ప్రశ్నించారు సుద్దాల హన్మంతు. అలాగే

"ఒహెూ ఒహెూ పల్లెదొరా!
ఒహెూ ఒహెూ పాతదొరా!
ఒంటరి తుంటరి తొండి దొరా!
ఎంతకు మారని మొండి దొరా!
చాలు చాలు నీ పెత్తనమిక
సాగించగ బోకుమోయ్'' - అని హెచ్చరించారు హన్మంతు.

"గ్రామాధికారులు భీమస్వరూపులై
పెక్కుటక్కుల వెతల్ బెట్టుచుండ
వ్యాపార వర్గంబులా పూర్తి ధూర్తులై
లాభంబు పూర్తిగా లాగుచుండ పాలకోద్యోగులు పట్టాభిషిక్తులై

చిప్పముంతల పాలు సేయుచుండ" - అంటూ పరిస్థితిని గంగుల శాయిరెడ్డి పద్యకావ్యంలో వర్ణించారు.

## వెట్టిచాకిరీ చిత్రణ:

నిజామ్ నవాబు పరిపాలన కింద తెలంగాణా గ్రామసీమలు భయంకరమైన సామాజిక పరిస్థితులు కొనసాగాయి. గ్రామంలోని ప్రజలంతా అక్కడి నలుగురైదుగురు పెత్తందార్లకు బానిసలుగా బతికేవారు. దుర్భరమైన వెట్టిచాకిరి, దారుణమైన అధికారుల జులుం, నిత్యం తన్నులు, చెవులు పగిలిపోయే తిట్లు, కచేరి చావిళ్ళ వద్ద వంగబెట్టి మూపున బండలు, కొన్ని సందర్భాల్లో రైతుల మూపున గామ పెట్టి వానిని ఎక్కించి తొక్కించటం వంటివి నిత్యకృత్యాలుగా సాగేవి. గ్రామంలోని అన్ని కులాలవారు భూస్వాములకు, జాగీర్దార్లకు వెట్టిచాకిరీ చేయాల్సివుండేది. ఆ వెట్టిని వర్ణిస్తూ.....

"వెట్టి చాకిరి విధానమో రైతన్న
ఎంత జెప్పినా తీరదో కూలన్న
మాదిగన్న మంగలన్న మాలన్న చాకలన్న
వడ్రంగి వడ్డెరన్న వసిమాలిన బేగరన్న
కుమ్మరన్న కమ్మరన్న కూలన్న రైతన్న
అన్ని పనులు వాళ్ళతో - దొర
లందరు చేయించుకొనెడి'' ॥వెట్టి॥

అని ప్రారంభమయ్యే గీతంలో చాకలన్న, మంగలన్న, కుమ్మరన్న, మాదిగన్న మొదలైన వాళ్లంతా భూస్వాముల ఇళ్ళల్లో పైసా ప్రతిఫలం ఆశించకుండా చేసిన 'వెట్టి'ని గుండెలు అవిసిపోయేలా వివరించారు హన్మంతు.

## నైజామ్ వ్యతిరేకత:

ప్రజల నిరసన కేవలం భూస్వాముల వ్యతిరేకతగా పరిమితం కాలేదు. భూస్వామ్య విధానానికి మూలవిరాట్టుగా మిగిలిన నైజాం నవాబు మీదా, రాజరిక వ్యవస్థ మీద కూడా ఆగ్రహగీతాలు పాడి తమ అసహనాన్ని వినిపించారు.

"నైజాం సర్కారురా, ఓరన్న
నాజీల మించిందిరా
ప్రజా రాజ్యానికై పోరాడు ప్రజలపై

రాక్షసా చర్యలను రకరకాల్ చేస్తుండే'' అని తిరునగరి రామాంజనేయులు వర్ణిస్తే-

"ఓ నిజాం పిశాచమా! కానరాడు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు

నా తెలంగాణ, కోటి రత్నాల వీణ'" అని జైలు గోడలపై పద్యాలు రాసిన దాశరథి -

ప్రాణములొడ్డి ఘోర గహ
నాటవుల్ ఐడగొట్టి, మంచి మా
గాణములన్ సృజించి, ఎము

కల్ నుసి జేసి పొలాలు దున్ని, భో
షాణములన్ నవాబునకు
స్వర్ణము నింపిన రైతుదే, తెలంగాణము రైతుదే, ముసలి
నక్కకు రాజరికంబు దక్కునే?" - అని ప్రశ్నించారు. అంతటితో ఆగకుండా..
"మా నిజాము రాజు తరతరాల బూజు" అని నిర్వచించారు.
''ఈ కనులవోలెనే హిందూ ముసల్మాను
లిరుపక్షములు నేత్రములు రెండు నాకంచు
అమిత ప్రేమ నటించి సమత మంత్రము పఠించి
వంచించినావురో ఓ నిజాము నియంత!
ఓరి మాతృద్రోహి! - ఓరి కాలాహీ!'' అన్నారు హీరాలాల్ మోరియా..
"ఖబడ్దార్! ఖబడ్దార్
నైజాం పాదుషాయే!
బానిసత్వ విముక్తికై - రాక్షసత్వ నాశముకై
హిందూ ముస్లిం పీడిత శ్రమజీవులు ఏకమైరి
తమపై స్వారీ జేసే దేశముఖులు ప్రతిఘటించి

ప్రజాకోటి పోరుతోంది ఖబడ్డార్! ఖబడ్దార్!'' అని హెచ్చరించారు సోమసుందర్...

"ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభవింతురు

ఒక నెత్తుటి బొట్టులోనే ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు" - అనే చారిత్రక సత్యాన్ని చాటి చెప్పారు.

నిజామ్ పాలనపై, నిజామ్ ప్రభువుపై వెలువడిన గీతాల పరాకాష్ట 'యాదగిరి' గానం చేసిన 'నైజాం సర్కారోడా! గీతం. 1948 సంవత్సరం విశాలాంధ్ర మాసపత్రికలో అచ్చయిన ఈ గీతం ప్రజల ఉద్యమావేశానికి సంకేతంగా తెలంగాణా అంతటా ప్రజల గొంతుల్లో ప్రతిధ్వనించింది.

"నైజాము సర్కరోడా
నాజీల మించినోడా
యమబాధ పెడ్తివి కొడుకో

నైజాం సర్కారోడా!! అంటూ ప్రారంభమయ్యే ఈ గీతం ముగింపులో...

"చుట్టు పట్టు సూర్యపేట
నట్టనడుమ నల్లగొండ
ఆవాల హైద్రాబాదు
తర్వాత గోలకొండ
గోలకొండ ఖిల్లా కింద - నీ
గోరి కడ్తమ్ కొడుకో

నైజాము సర్కారోడా!" - అన్న ప్రజల దృఢ సంకల్పాన్ని సదాగ్రహాన్ని స్పష్టంగా గానం చేసిన యాదగిరి నిజామ్ పోలీసుల గుళ్లకు బలయి అమరుడయినా, ఈ పాట ద్వారా చిరంజీవిగా నిలిచాడు.

## ఆంధ్ర మహాసభ గీతాలు:

1944లో భువనగిరిలో శ్రీ రావి నారాయణరెడ్డి గారి అధ్యక్షతన జరిగిన 'ఆంధ్ర మహాసభ' ఎందరో యువకుల్ని ప్రభావితం చేసింది. సుద్దాల హన్మంతు, తిరునగరి రామాంజనేయులు, యాదగిరి వంటి ప్రజాకళాకారుల ఆవేశానికి ఊపిరిలూదింది.

'ఆంధ్ర మహాసభకరుదెంచండీ - జనులారా మీరు!' అంటూ దాశరథి రాసిన ప్రబోధగీతాన్ని పాడుకునే ఆనాటి రామాంజనేయులు శ్రీ శ్రీగారి బాణీ, దాశరథి గారి ప్రబోధం జోడించి..

''ఆంధ్ర మహాసభ
ఆంధ్ర మహాసభ
ఆంధ్ర మహాసభ అదిగదిగో
చంద్ర కిరణ కళ
ఇంధనుస్సున

ఆంధ్రస్టేటులో వెలిసింది" - అనే గీతం రాశారు. ఇదే ప్రజాకవి తిరునగరి రామాంజనేయులు గారి తొలిరచన. ఈ గేయాన్ని గ్రామాల్లో పాడుతుంటే ప్రజల్లో హర్షధ్వానాల ద్వారా ప్రకటితమైన ప్రతిస్పందన ఈ కవిలో కొత్త ఉత్సాహాన్ని నింపింది. దాంతో మరొక గీతం ఆ గొంతునుండి వెలువడింది.

"ఎక్కు బాబా పడవెక్కు బాబా
ఆంధ్రమహాసభ యను పడవెక్కు బాబా
చుక్కాని బట్టె రావి నారాయణ రెడ్డి
పెద్ద తెరచాప బట్టె బద్ధం ఎల్లారెడ్డి
గడలు పట్టిరి కార్యకర్తలు ప్రాణాలొడ్డి
కదులుతుందీ పడవ గమ్యస్థానము చేర" ॥ఎక్కు బాబా॥

అనే పాట నల్లగొండ జిల్లా అంతటా మారుమ్రోగింది. ఈ పాటల్ని ఎందరెందరో ప్రజాగాయకులు పాడుకోవడం విన్న రామాంజనేయులు కొత్త ఆత్మవిశ్వాసాన్ని, ఉత్సాహాన్ని పొంది ఎన్నో పోరాట పాటలల్లారు. ప్రజల్ని ఉత్తేజపరిచారు. ఆంధ్రమహాసభ ప్రజల్లో 'సంఘం'గా, 'గుత్పల సంఘం'గా ప్రాచుర్యం పొందింది.

"సంగం వచ్చిందిరో రైతన్న మనకు మేలు
చాలా చేసిందిరో కూలన్న మనకు మేలు ||సంగం||
సంగం వచ్చింది మనకు చాల బలం తెచ్చింది
దొంగల దోపిడి దొరల దుమ్ము దులిపి వేసింది
నంగనాచి నైజాము నడుము విరగగొట్టింది ||సంగం॥

అని సుద్దాల హనుమంతు రాసిన గీతం సంఘం ఆశయాలను, ఆదర్శాలను ప్రజల్లో ప్రచారం చేసింది.

### జనచైతన్య గీతాలు:

1941 నుండే సూర్యాపేట తాలూకాలోని అనేక గ్రామాల్లో ఆంధ్రమహాసభ నాయకత్వాన రైతులు, కచాలీలు, సామాన్య ప్రజలు ఉద్యమాలు నిర్వహించసాగారు. భువనగిరిలో జరిగిన 11వ ఆంధ్రమహాసభ తరువాత గ్రామగ్రామాన 'సంఘం' పేరుతో ఆంధ్ర మహాసభ వృద్ధి చెందసాగింది. జనగామ తాలూకాలో ప్రజాపోరాటాలు మొదలయ్యాయి. హుజూర్ నగర్ తాలూకా వరకు రైతాంగ పోరాటాలు వ్యాపించసాగాయి. తెలుగునేలపై కలం పట్టిన కమ్యూనిస్టు రచయితలు, ప్రగతిశీల రచయితలు, ప్రజానాట్యమండలి కళాకారులు ఈ పోరాటాలను ప్రశంసిస్తూ, జనాన్ని చైతన్యపరచడానికి కలాలనూ, గళాలనూ అంకితం చేశారు. తెలుగునేల నలుమూలల నుండి ప్రజల్ని సమరోన్ముఖుల్ని చేయడానికి జనచైతన్య గీతాలను గానం చేశారు.

''ప్రజలు దళాలుగా కూడాలోయ్
పోలీసు క్యాంపులు చూడాలోయ్
శత్రుని ఆయుధాలు మనవేనోయ్
తుపాకి, రైఫిల్, తూటాల్ బాంబులు
విరివిగ దొరకును మనకండోయ్

విజయం మనదే రారండోయ్!" - అని పోరాటానికి పిలుపునిచ్చిన రామాంజనేయులు.....

''మోసపోబోకోయ్ ఆంధ్రుడా!
మ్రోగించు రణభేరి వీరుడా!

సాగించవోయ్, ప్రజాశాంతికై సమరమ్ము నాజీ జర్మను వలె నైజాము పడిపోవు'' - అనే ఆత్మ విశ్వాసాన్ని జనంలో నింపుతూనే...

"ఎవడు ఈ నైజాము
ఎవరు ఈ దొరలంత
జవసత్వములను పీల్చి శవములను చేయంగ?
ఈ భూమి నీదెరా, ఈ గనులు నీవెరా

సర్వసౌఖ్యములు విలసిల్ల పోరాడరా!" - అంటూ మార్గనిర్దేశం చేశారు. దాదాపు ఇదే భావాన్ని 1946లోనే వ్యక్తం చేస్తూ....

"ఈ భూమి నీదిరా
ఈ నిజాం ఎవడురా??
ఈ జులుం -ఈ జబర్దస్తి
నెగురదన్ని వేయరా

లెమ్ము తెలుగు వీరుడా - రణమ్ము చేయ లెమ్మురా" - అని విప్లవాహ్వానం పలికారు సుద్దాల హనుమంతు.

1946లోనే తెలుగుజాతికి సమరమార్గం చూపిన మరో ప్రజాకవి సుంకర సత్యనారాయణ.

'తెలుగుబిడ్డా! మేలుకోవోయ్

నైజాము తెలుగుబిడ్డా! లేచి రావోయ్ ||తెలుగు||
నదులు నగములు గనులు - నల్ల నల్ల భూములు
కలవు నీ దేశాన గంజినీళ్ళే కరువ? మాది చచ్చే
వారి మతములన్నీ ఒకటెకొంపలార్చేవారి కుట్రలో పడబోకు
కదిలించి బలగాన్ని ఎదిరించి వైరులను
శక్తి చూపించగల - సమయమిదె లే! లెమ్ము!" ||తెలుగు||
అంటూ మేల్కొల్పు గీతాలు పాడిన సుంకర...
'బిరాన లేచి రండు తెలుగు బిడ్డలార ఒకటిగా
దురాగతాలు చేయు దేశద్రోహి నణచివైవగా
ప్రజావిరోధి యెవ్వడైన బ్రతుకలేడు నిశ్చయం

ప్రజా బలాల ధాటినాప బ్రహ్మతరము గాదుపో' - అనే మార్చింగ్ గీతాన్ని తెలంగాణా యోధులకు అందించారు. అలాగే తెలంగాణా పోరాటవీరుల్ని కదిలించి, పోరుపాటల పల్లవిగా ప్రతిధ్వనించిన మరో మార్చింగ్ గీతం కొండేపూడి లక్ష్మీనారాయణగారు రాసింది.

'తెలుగు తల్లి బిడ్డలం
తెలంగాణ వీరులం
మాతృదేశ ముక్తి కొరకు
పోరుసల్ప కదిలినాం, కదిలినాం వెట్టిపనులు కట్టిపెట్టి
జబర్ దస్తి నెగురగొట్టి
సాగుతున్న దేశముఖుల

సాగనంప కదిలినాం, కదిలినాం . - అనే అష్టపది ఆనాడు ఊరూరా, వాడవాడా ప్రజల గొంతుల్లో ప్రవహించింది.

'నల్లగొండలో నాజీవృత్తుల
నగ్ననృత్య మింకెన్నాళ్ళు?
దమననీతితో దౌర్జన్యాలకు దాగిలిమూతలిదెన్నాళ్ళు
దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకుని
దొరలై వెలిగేదెన్నాళ్ళు?

హింసను పాపమనెంచు దేశమున
హిట్లరత్వమింకెన్నాళ్ళు?"     అని కాళోజీ ప్రశ్నించారు.

'కదలండి, కదలండి - కదిలి పోరాడండి

కాకతీయుల శౌర్యపటిమ చూపించండి తెలగాణ తెలగాణ - ధీరులకు మొగసాల

తెలగాణ తెలగాణ విప్లవోజ్వల గాథ' - అంటూ కదనకవనం వినిపించిన వజ్రాయుధుడు సోమసుందర్.

'కదలండోయ్ కదలండోయ్
కార్ముఖ్బుల జీల్చివేసి
అరుణ కిరణ కేళావళి
నంతట వెల్గించు కొరకు –కదలండోయ్
ఈ ప్రభుతకి మూలమైన
ఏహ్యపు భూస్వామ్య విధిన్
హత్యమార్చగ కదలండోయ్

అదిరి కూలదా భవనం – కదలండోయ్"     అని జనాన్ని కదిలించారు కాంచినేపల్లి.

జనం కదిలారు. కదన శంఖాలూదారు. వందలాదిగా నేలకొరిగారు. ఉన్నతాశయాలతో ఉద్యమంలో అమరులయ్యారు. ఈ అమరవీరుల్ని స్మరిస్తూ అనేక స్మృతి గీతాలొచ్చాయి. నిట్టూర్పుల నుండి నిప్పుల ఉప్పెనల్ని పొంగించాయి. విషాదాన్ని కాదు. వీరత్వాన్ని వర్ణించాయి.

### అమరవీరుల స్మృతి:

ఏ ఉద్యమంలోనైనా కొందరు ప్రాణార్పణ చేయక తప్పదు. అయితే ఈ తెలంగాణా రైతాంగ పోరాటంలో నాలుగున్నర వేల మంది వీరులు అమరులయ్యారు. విప్లవ వారసత్వాన్ని ప్రజలకందించారు. ఈ వీరులపై ప్రజాకవులు స్మృతిగీతాలల్లారు. తమ ఆవేదనకీ, ఆవేశానికీ అక్షరాలు కూర్చి ప్రజలకు వినిపించారు. ప్రజల కన్నీళ్ళ నుండి కోపోగ్నుల్ని జ్వలింపజేశారు. భారత

జాతీయోద్యమ సాహిత్యంలో ప్రసిద్ధులైన దేశభక్తుల మీద, జాతీయ నాయకుల మీద, విప్లవకారుల మీద స్మృతి గీతాలు వెలువడినాయి. అయితే తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటంలో వేలాదిమంది సామాన్య ప్రజలు నేలకొరిగారు. వారిలో కొందరి పేర్లే మనకు తెలుస్తున్నాయి. అనేక మంది వీరులు అజ్ఞాతంగానే అమరులయ్యారు. ఈ అజ్ఞాత వీరుల్నందర్నీ స్మరిస్తూ పేర్లు తెలిసిన ప్రముఖ వీరయోధుల్నీ స్మరిస్తూ తెలంగాణ పోరాటకవులు రాసిన గీతాలే 'అమర వీరుల స్మృతి గీతాలు'.

'జోహార్లు - జోహార్లు- జోహార్లు అమరవీరులారా మీకు జోహార్లు
స్వాతంత్ర్య రథమునెక్కి - సమరవీథులందు తోలి
అతివాద శరముల గురిసి- అసువులపై నాస వదిలి
సైసైరా భళిరాసై స్వరక్త ధారలన్ గురిపి - స్వతంత్ర బీజముల నాటి

వీర స్వర్గవాసులైన - విప్లవ యోధులకు నిత్య - జోహార్లు' - అంటూ... దొరతనాన్ని రూపుమాపడానికి, నిరుపేదల గోడు మాన్పడానికి, అన్యాయాలను అరికట్టడానికి అంతిమ శ్వాస విడిచేదాకా సంఘర్షణ సాగించిన, సమరధర్మ నినాదమిచ్చిన అమరయోధులకు జోహార్లర్పిస్తూనే...

'మీ అడుగు జాడలలో –మీ ఉద్యమ మార్గంలో
కోటి చేతులొకటి చేసి - కొన ఊపిరి దనుకపోరి

భరత మాత కనుల నీరు బాపు వరకు నిదురబోము' అని సుద్దాల హనుమంతు ప్రతిజ్ఞ చేశారు.

కామారెడ్డి గూడెంలో షేక్బందగీని దేశముఖ్ కిరాయి గూండాలు హత్య చేశారు. విసునూరి దేశ్ ముఖ్ గడీ ముందుకొచ్చిన ప్రజా ఊరేగింపుపై దేశ్ ముఖ్ కిరాయి గూండాలు కాల్పులు జరిపారు. ఊరేగింపు అగ్రభాగాన ఉన్న దొడ్డి కొమరయ్య నేలకొరిగాడు.

"తెలుగుతల్లి బంధాలు తెంచి వేయుటలోన
బలమట్లు చూపించి తొలి బలిగ నీవేగ
శూరత్వమున నీవేరా కామ్రేడ్ జోహారులివిగోరా...
నిను గన్న తల్లిదే ధన్య జీవితమాయె కొమరయ్య నీ జీవి అమరజీవితమోయి.

స్వాతంత్ర్య హస్తాలరా కామ్రేడ్ సాల్యూట్ చేస్తామురా'' - అంటూ ప్రజలు తెలంగాణా అమరవీరుడికి జోహార్లర్పించారు.

'కష్టజీవుల పల్లి - కడివెండి గ్రామంలో...' - అంటూ ప్రారంభమయ్యే సుదీర్ఘ స్మృతి గీతంలో కొమరయ్య కథనంతా ప్రజాగాయకులు గానం చేశారు.

తిరునగరి రామాంజనేయులు గారి సాంస్కృతిక దళానికి సన్నిహితంగా గొట్టిముక్కల గోపాలరెడ్డి దళం వుండేది. నూనూగు మీసాల నూత్న యవ్వనంలో వున్న గోపాలరెడ్డి ఎప్పుడూ నవ్వుతూ వుండేవాడు. ఆత్మకూరు నుండి పాతర్లపాడు వరకు రక్షణ ఈ దళం బాధ్యత. ఒకరోజు సాయంత్రం గోపాలరెడ్డి వచ్చి, తాము వేరే ప్రాంతానికి తరలిపోతున్నట్లు రామాంజనేయులుతో చెప్పి, జాగ్రత్తగా వుండమని, రేపు భోజనానికి ఇక్కడికే వస్తామని, ఇవ్వాళ రాసే పాట రేపు తనకు నేర్పాలని లాల్ సలామ్ చేసి వెళ్ళిపోయాడు. మరునాడు పది గంటలకు పిడుగుపాటులాంటి వార్త విన్నాడు రామాంజనేయులు, శత్రువుల వలయంలో చిక్కి తుదిశ్వాస వరకు పోరాడి తెలంగాణా బాల చంద్రుడు గోపాలరెడ్డి నేలకొరిగాడని. ఉబికివచ్చే ఉద్వేగంతో ఆ వీరునిపై తిరునగరి రామాంజనేయులు స్మృతి గీతం రాశారు.

'సై సై గోపాలరెడ్డి, నీవు
నిలిచావు ప్రాణాలొడ్డి
ఔరౌరా నీ పేరు జెప్పితే
హడలు దోపిడీ బడా దొరోళ్ళకు
పౌరుషంబు గల తెలుగుజాతి
గౌరవము నిల్ప నొరిగావు యుద్ధమున' ॥ సై సై॥

అనే పల్లవితో ప్రారంభమయ్యే గీతంలో గోపాల రెడ్డి పరాక్రమాన్ని, శత్రువులతో చేసిన వీరోచిత యుద్ధాన్ని కళ్ళకు గట్టినట్లు శ్రీ తిరునగరి రామాంజనేయులు వర్ణించారు.

'ఓ ఎర్ర సైనిక వెంకటరెడ్డీ
విప్లవ జోహారులివిగోరా!
కామ్రేడు 'పసునూరు' నిన్ను
గన్న కాసరగోడు భూమీ

కాశీ క్షేత్రమయ్యి వెలుగొందు' - అనే గీతంలో ఎర్ర సైనికునికి ఈ ప్రజాకవి

నివాళులర్పించారు.

'అమరయోధుడు సీమ గురవయ్యా
అందుకో జోహార్లు గురవయ్యా ||
రాబందు మునగాల రాజుతో పోరాడ
రైతులు కూలీలు రణరంగమున నిలువ
ముందుండి పోరాడి గురువయ్యా

మొనగాడవైనావు గురవయ్యా!" అనే మరో గీతం ఆనాడు ప్రజల గుండెల్లో ప్రతిధ్వనించింది. గురువయ్య పోరాట పటిమను కీర్తించింది.

అలాగే 1947లో సూర్యాపేట తాలూకా, అన్నారుగూడెంలో 'పడిశాల పిచ్చయ్య' అనే దళిత యువకుడిని నిజాం పోలీసులు అరెస్టుచేసి, సంఘం సంగతులు చెప్పమని చిత్రహింసలు బెట్టారు. చింతబరిసెలతో వీపు చిట్లగొట్టారు. రెక్కలు గట్టి నేల పై బరబరా ఈడుస్తూ ఊరంతా తిప్పారు. అయినా మేరు పర్వతం వలె చలించక నిలిచిన ఆ యువకిశోరం గుండెల్లో పొడిచి కసిదీరక పోలీసులు ఘోరంగా కాల్చి చంపారు. ఆ వీరునికి నివాళులర్పిస్తూ...

'విప్లవ జోహార్లురా
పడిశాల పిచ్చయ్య గైకొమ్మురా ॥వి॥
సుత్తె కొడవలి జండనెత్తిపై నుండగా
పార్టీ సభ్యుని పేరు పరవు నాకుండగా ఎదురేమిటన్నావురా ప్రాణాల
నెదురొడ్డి నిలిచావురా ॥2॥
అన్నారు గూడెంబు నిను గన్న భాగ్యాన అమరత్వమే పొంది ఆదర్శమయింది
ఆంధ్ర విప్లవజ్యోతిరా నీ చరిత ఆరాధ్యమౌతుందిరా ॥వి॥

అంటూ రామాంజనేయ కవి గానం చేశారు. అమరవీరుని ఆదర్శచరిత్రను కొనియాడారు.

'వీర మట్టారెడ్డి... ఉయ్యాలో
ధీర అనంతరెడ్డి... ఉయ్యాలో
మీ వీర మరణమును... ఉయ్యాలో

మరువమెన్నటికైన... ఉయ్యాలో' - అంటూ సాగే ఉయ్యాల పదంలో

నల్లగొండ ప్రజల వీరోచిత పోరాటంలో అమరులైన వీరులను శ్రీమతి స్వరాజ్యం స్తుతించారు.

అలాగే మరో గీతంలో...

'రోజు విన్నాం - ప్రతి రోజూ కన్నాం
ఎవరో అజ్ఞాతవాసి ఎవరో ఒక అమరజీవి
విప్లవ ప్రస్థానంలో
విగతుడైన విషాద వార్త' ॥రోజూ విన్నాం ॥

అంటూ శ్రీటి. వి. కృష్ణ విప్లవవీరులను స్మరిస్తూ 'విప్లవాంకిత'మైనారు.

## సాయుధ సమర గీతాలు:

1947 సెప్టెంబర్ 11న 'ఆంధ్రమహాసభ', 'కమ్యూనిస్టు పార్టీ'లు సంయుక్తంగా సాయుధ సమరానికి పిలుపునిచ్చాయి. ప్రజా కమిటీలు, సాయుధ గెరిల్లా దళాలేర్పడ్డాయి. దాదాపు నాలుగువేల మంది దళ సభ్యులతో గ్రామ రక్షక దళాలు పోరాటం ప్రారంభించాయి. ఈ పోరాటం క్రమంగా విస్తృత రైతాంగ ప్రజా పోరాటంగా పరిణమించింది. రజాకారు గూండాలతో, నైజాం పోలీసు, మిలటరీలతో ప్రత్యక్ష పోరాటానికి పూనుకున్న తెలంగాణా ప్రజానీకాన్ని ప్రశంసిస్తూ, ఉత్సాహపరుస్తూ, ఉత్తేజపరుస్తూ వందలాది సాయుధ సమరగీతాలు వెలువడ్డాయి. ప్రజలీ పాటలు పాడుకున్నారు. పాడుతూ పోరాడారు. పాటల్లో నూత్నావేశాన్ని చవి చూశారు.

'మన తెలంగాణలో రణభేరి మ్రోగింది
మనిషి మనిషీ నడుము కట్టాలి - కట్టి,
మన శత్రువును కూల గొట్టాలి - యెర్ర
జండాలు ఇంటింట కట్టాలి – ఆంధ్ర
సంఘాలు వూరూర బెట్టాలి
నలగొండ రణములో తెలుగు తెగువను చూపి
బలియైన వీరులను తలవాలి - నిలిచి
హిందువులు ముస్లిములు కలవాలి - కలిసి

తెలంగాణ సంకెళ్ళు తెంచాలి' అనే పోరాటం పిలుపు వినిపించిన పిడుగు దాశరథి.

'విల్లంబులు చేత బూని
వెడలిరండి కదలి రండి
బాలవీర దళాలెల్ల
ఫౌజు దీరి పదండోయ్
తెలుగువాడి కురు భూములు - తెలంగాణ రణభూములు
విజయదశమి వచ్చిందట- అజేయులై నిలిచారట...
తుది సమరం ముగిస్తాను - తొందరగా రా రమ్మని

తొడ యదిల్చి అరిచారట - తెలంగాణ భీమబలుడు' - అంటూ తెన్నేటి సూరి విప్లవ విజయదశమిని చిత్రించారు.

'ఛలో ఛలో నైజాం ప్రభుత్వపు జులుముల నణచంగా
స్వతంత్ర భారత రాజ్యాంగమ్మున త్వరితమే కలువంగా'
చలో చలో అని శ్రీ అట్లూరి ప్రజల్ని కదిలించారు.
'తెలంగాణ గర్జించింది - తెలుగు బిడ్డలను పిలిచిందీ.
పేదల రక్తం పిండుకు తాగే - నాజీ నరహంతకులపై

కత్తి దూసి లంఘించింది - నదిమి గదిమి మరి తంతోంది' - అని 'తెలంగాణ గర్జన'ను ఆంధ్ర ప్రాంత ప్రజలకు సుంకర సత్యనారాయణ వినిపించారు.

'తెలంగాణ ప్రజలంత కలవాలోయ్ తెగువతో పోరాడి గెలవాలోయ్
నైజాము ప్రభువన్న - నరకాసురుని అన్న
హిట్లరుకు సోదరుండీ మీర్జయిస్మాయిల్
తొత్తులే దేశ ముఖులున్నారోయ్

పెత్తనము వెలిగించ దలచారోయ్' - అంటూ తెలుగు ప్రజల 'రణగర్జన' వినిపించిన కోగంటి గోపాలకృష్ణయ్య...

'దోపిడీ దొంగకు - తొత్తుర నైజాం
కక్కిన కూటిని - మెక్కుచు బ్రతికే
భోగలాలసుడు జాగీర్దార్

నానా హింసలు - దారుణ హత్యల్

నిలువున దోచెడి - నీచులందరి

అబ్బ వచ్చినా దెబ్బకు దెబ్బ తరిమి తరిమి కొడతాం'- అనే సంకల్పాన్ని ఉద్ఘాటించారు.

'బాలవీరులెవ్వరురా? బాలచంద్రులెక్కడరా

సవాలన్న నైజాముకు సమాధానమెవ్వడు

తెలుగు బిడ్డలెక్కడరా? - వెలుగు కత్తులెక్కడరా?

సవాలన్న నైజాముకు - సమాధానమెవ్వడురా?' - అని ప్రశ్నించిన తెన్నేటి సూరి...

'తెలంగాణ తమ్మునిపై - చేయెత్తిన కబంధుడ్ని

వధించగల మొగాడుంటే - బయల్దేరు బరి మీదికి

మన తల్లిని చీరలొల్చి - మానభంగమటరా, ఛీ బ్రతుకెందుకు మనకింకా – బయల్దేరు బయల్దేరు' అంటూ ఆంధ్ర ప్రాంత వీరుల్ని బయల్దేరదీశారు. ఆంధ్ర ప్రాంతం నుండి అనేకమంది వీరులు వచ్చి వీరోచిత తెలంగాణా పోరాటంలో పాల్గొన్నారు. ఆంధ్ర ప్రాంత ప్రజలు ఇక్కడి పోరాటానికి కావలసిన ఆయుధాలు కొనడానికి డబ్బులు వసూలు చేసి పంపారు. నైజాం నవాబు నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా తెలుగుజాతి ఒక్కటై నిలిచింది. ఇక్కడి పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొంటూ, ఇక్కడి నాయకులకు సలహాలివ్వడానికి ఆంధ్ర ప్రాంతం నుండి కామ్రేడ్ తమ్మారెడ్డి సత్యనారాయణగారిని పంపింది కమ్యూనిస్టు పార్టీ. అలాగే మరికొందరు పార్టీ నాయకులు ఇక్కడి పోరాటంలో పాల్గొన్నారు. తూటాలకు లాఠీలకు ఎదురు నిలిచారు.

'మన కొంపలార్చిన - మన స్త్రీల చెరచిన

మన పిల్లలను చంపి - మనల బంధించిన

మానవాధములను మండలాధీశులను

మరచిపోకుండగా గురుతుంచుకోవాలె

కసి ఆరిపోకుండ బుసకొట్టుచుండాలే

కాలంబు రాగానే కాటేసి తీరాలె' అనే ఉద్యమ సందేశాన్నందించిన కవి

కాళోజీ.

ఉద్యమం ఊరూ వాడా విస్తరించింది. పిల్లలు, పెద్దలూ, వయోవృద్ధులూ కర్రలో, కత్తులో, బరిసెలో, బల్లాలో, తుపాకులో, బాంబులో చేబూని నైజాం సైన్యాలనూ, రజాకారు మూకలనూ ఎదుర్కొనసాగారు.

సాయుధ గెరిల్లా దళాలు శత్రు వలయాలను ఛేదించుకుని ముందుకు సాగిపోతున్నాయి. మిలటరీ క్యాంపులపై దాడులు చేస్తున్నాయి. భూస్వాముల బంగళాలను విధ్వంసం చేస్తున్నాయి. వేల సంఖ్యలో ప్రజలు గెరిల్లా దళాలకు తోడ్పడుతున్నారు. వేలాది గ్రామాలు విముక్తమయ్యాయి.

అలా దొరల చెర నుండి విముక్తమైన బంగారుభూమిని చూసి
'కళకళలాడే కనకము కురిసే - తెలంగాణ భూమి
మా... తెలంగాణ భూమి
పచ్చపచ్చని పైరు పండి వొరిగింది భూమి
వచ్చింది దున్నేవానికి భూమి

తెలంగాణలోన, మా తెలంగాణలోన' అంటూ శ్రీ తిరునగరి రామాంజనేయులు ఆనందగీతాలను ఆలపించారు.

## పోరాట సీమకు నివాళి:

రైతాంగ సాయుధ పోరాటానికి ఆటపట్టయిన తెలంగాణ సీమను ప్రశంసిస్తూ, పోరాటసీమకు నివాళులర్పించారు కవులు.

'మూగవోయిన కోటి తమ్ముల గళాల
పాట పలికించి కవితా జవమ్ము కూర్చి
నా కలానకు బలమిచ్చి నడిపినట్టి
నా తెలంగాణ కోటి రత్నాల వీణ' అన్నారు దాశరథి.

'భళిర తెలంగాణ
వహరె తెలంగాణ
బహద్దూర్ తెలంగాణ

తెలుగుదేశం పేరు చెప్పితే - లేజిక్కళ్ళెం లేదు.

తలుపుకు గొళ్ళెం లేదు - ఈటెకు బల్లెం లేదు - నీటికి పల్లం లేదు ॥భళిరె॥

తెలుగు వీరుల పేరు వింటే - తెల్లదొరలు తెలివి దప్పిరి

నల్లదొరలు నాట్య మాడిరి - నైజాము నడుము విరిగె ॥భళిరె॥

తెలంగాణ పేరు వింటే - రంతులణిగె

దొరలు జాగీరుదారులంత - పారిపోయిరి పట్టణాలకు ॥భళిరె॥ అని సుద్దాల హనుమంతు ప్రశంసించారు.

'అదిగదిగో అదే అదే - తెలంగాణ రణరంగం

అది విలయ ప్రభంజనం - అది ప్రళయ విజృంభణం

అది యుగాంత సంధ్యారాగం - పొదివికొన్న క్రోధోద్రేకం' - అంటూ విద్వాన్ విశ్వం 'తెలంగాణ జైత్రయాత్ర'లో తెలుగు వీరుల ప్రతాపాగ్నిని, కదనరంగంలో కదలాడిన వీరాంగనల వీర విహారాన్ని కొనియాడారు.

'జోహారు రణవీణా! జొహారు రణవీణా!

జోహారు తెలగాణా! జోహారు తెలగాణా!' అంటూ తెలగాణ రణవీణకు జోహార్లు పలుకుతూ...

'అగ్నిపద్మమౌ తెలంగాణలో

విచ్చిన తొలిరేకు నల్లగొండరా!

ఆ దెస జోడుము! పల్లెపల్లెకు

జేవురు కొండల గుండెలవే సఖ!' - అని అగ్నిపద్మమౌ తెలంగాణలో వచ్చిన తొలిరేకు నల్లగొండకు నివాళులర్పించిన అభ్యుదయ కవి నార్ల చిరంజీవి.

'నల్లగొండరా విప్లవపు గుండెరా

కొల్లగొట్టి తిను దోపిడి మూకల

గుండెల్లో పెనుగాలంగా నల

గొండ విప్లవోద్దండ శక్తియై

చంద ప్రచండత చాటింది.

మన నల్లగొండరా! తెలంగాణ గుండెరా!' - అంటూ నైజాం పరిపాలన నుండి తెలంగాణా ప్రజలకు విముక్తిని కలిగించి, మూడు వేల గ్రామాలలో ప్రజాపాలనను నెలకొల్పి, దేశానికి దివ్యాశాజ్యోతై, ప్రపంచ పీడిత తాడిత శక్తుల ప్రశంసలందిన విప్లవ గుండె నల్లకొండకు కైమోడ్పులందించిన జనరణకవి తరునగరి రామాంజనేయులు...

'సై సై ఓ నల్లగొండ ధీరుండా
నీవెత్చేదే ఎర్రజెండా
నలగొండ నీ పేరు జెప్పితే
ఢిల్లీ కోటలో గుండె ఝల్లుమను
తెల్లదొరలె మా నల్లగొండకు
టోపీలెత్తి సలాము చేసిరి
ఎర్రబావుటా నీడల క్రింద
వెచ్చని నెత్తురు ఏరులు బారీ
మూడు వేల మృత వీర సమాధుల
పుణ్యక్షేత్రమీ నల్లగొండరా ॥ సైసై॥

అంటూ నల్లగొండ వీరకిశోరాల్నీ, నల్లగొండ వీరభూమినీ మనసారా అభినందించారు.

## సైనిక చర్య:

హైదరాబాద్ రాష్ట్రం ఇండియన్ యూనియన్లో విలీనం కాకుండా 'స్వతంత్ర సంస్థానం'గా నిజాం నవాబు ప్రకటించాడు. మహోధృత ప్రజా యుద్ధం కొనసాగింది. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన దాదాపు 3వేల గ్రామాలు భూస్వాముల చెర నుండి విముక్తమయ్యాయి. వేలాది ఎకరాల భూమి దున్నే వారికి దక్కింది.

ఈ నేపథ్యంలో హైదరాబాద్ రాష్ట్రాన్ని స్వాధీనం చేసుకోవడానికి 1948 సెప్టెంబర్ మాసంలో యూనియన్ సేనలు సైనిక చర్య ప్రారంభించాయి. కోదాడ, మునగాల దరిదాపుల్లో యూనియన్ సైనికులకు, నైజాం పోలీసులకు

ఘర్షణలు జరిగాయి. మహారాష్ట్ర, కర్నాటక సరిహద్దుల్లోనూ చెదురుమదురుగా కొన్ని ఘర్షణలు జరిగినా, ఎక్కువ ప్రతిఘటన లేకుండానే నైజాం పోలీసులు యూనియన్ సైనికుల ముందు లొంగిపోయారు.

సెప్టెంబర్ 17నాడు సైనిక చర్య పూర్తయ్యింది. యూనియన్ మిలిటరీ సైన్యాలకు కేంద్ర స్థానమైన సికిందరాబాద్ కంటోన్మెంటుకు వెళ్దామంటూ...

'లష్కరు పోదామురో! రంగన్నా! రారో
మన ఫౌజును సూద్దామురో! సింగన్నా! రారో
రజాకారు బడాచోరు రాజ్యం పోయిందిరో

నైజాము సర్కారోడు నవ్వుల పాలయెరో' - అంటూ ఆనందంగా పాడుకున్నారు ప్రజలు. యూనియన్ సైనికులు తమను కాపాడడానికే వచ్చారని, ఇండియన్ యూనియన్లో విలీనం కాగానే తమ కష్టాల గట్టెక్కుతాయని ప్రజలు భావించారు. ప్రజలే కాదు, కొందరు కవులు, కళాకారులు కూడా ఇదే భావాన్ని వ్యక్తం చేశారు.

కుందుర్తి కృతుల్లోని తెలంగాణా వచన కావ్యంలో...
'అందుకే యూనియన్ సైన్యాలకు స్వాగతం

అణచివేసినందుకు అంతులేని దురాగతం' - అని రాశారు. యూనియన్ సైన్యాలకు స్వాగతం పలికారు.

'దూరాననున్న చుట్టము.
దూరాన ఆగె! తెల్లదొంగ నభస్సం
చారి మయిపాయె, స్వేచ్ఛా
భారత సైన్యమ్ము తలుపు బ్రద్దలు కొట్టెన్' - అని కీర్తించిన దాశరథి...

'రెండు వందల యేండ్ల చరిత్ర పుటల కప్పుకొని యున్న గాఢాంధకారమెల్ల కొట్టుకొని పోయె...' నంటూ సంతోషాన్ని వ్యక్తం చేశారు.

ఇలా తెలుగు కవిత్వానికి ఉద్యమ కవితా వారసత్వాన్నిచ్చింది తెలంగాణా సాయుధ పోరాట కవిత్వం. నిన్నటి; నేటి తరాలకూ; రాబోవు తరాలకూ ఉత్తేజాన్ని ఉత్సాహాన్ని ఇచ్చేది కవిత్వం.

# అభ్యుదయ కవిత్వం



ఆచార్య మేడిపల్లి రవికుమార్
99491 64358

అభ్యుదయ కవిత్వం తెలుగులో పూర్తిగా ఆధునికమైంది. అయితే 'అభ్యుదయం' అనే మాట మాత్రం ప్రాచీన కాలం నుంచీ ఉన్నదే. ప్రాచీన కావ్యాల్లోనూ, ప్రబంధాలల్లోనూ ఉండే 'అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా' అనే ప్రయోగం మనందరికీ సుపరిచితమైందే. ఈ అభ్యుదయం అవే పదానికి ఉదయించుట, సంభవించుట, కలుగుట, శుభం, మంగళం, వృద్ధి, అభీష్టకార్యసిద్ధి, ఇష్టప్రాప్తి, ఉత్సవం అని నిఘంటువులు వివిధార్థాలను సూచించాయి.

'అభ్యుదయ కవిత్వం' అనే పదబంధంలోని 'అభ్యుదయ' పదం నిఘంటువులు ఇచ్చిన అర్థాల కంటే భిన్నమైన అర్థాన్ని సూచిస్తుంది. ఆధునిక కాలంలో సాహిత్య పరంగా ఇదొక ప్రత్యేక అర్థంలో స్థిరపడి పోయింది. మార్క్సిజం తాత్త్విక భూమికగా కలిగి; ప్రగతి, పురోగతి అనే అర్థంలో అభ్యుదయ శబ్దం ప్రయోగించబడుతూ ఉంది. భౌతికవాద చింతనతో 1937 లోనే శ్రీశ్రీ ఇవే అర్థాలు స్ఫురించేలాగా 'అభ్యుదయం' అనే ఒక ఖండికను కూడా ప్రకటించాడు. ప్రాచీన కవులు "అభ్యుదయ పరంపరాభివృద్ధిగా" తమ కావ్యాలను కృతి భర్తకు; అనగా తమ తమ రాజ పోషకులకు అంకితమిచ్చారు. దీనికి భిన్నంగా శ్రీశ్రీ కష్టజీవులకూ, కర్మవీరులకూ నిత్యమంగళం నిర్దేశిస్తూ; భావివేదాల జీవనాదాలను జగత్తు మొత్తానికి చవి చూపించాడు. దీని ద్వారా సామాజిక ప్రగతినీ, పురోగతినీ శ్రీశ్రీ అభిలషించాడు. వర్గ దృక్పథం కలిగిన కవులు కార్మిక, శ్రామిక పక్షపాతంతో వర్తమాన సమాజాన్ని వాస్తవికంగా ఆవిష్కరించేది అభ్యుదయ కవిత్వంగా భావించవచ్చు.

తెలుగులో అభ్యుదయ కవిత్వం ఆవిర్భవించడం వెనుక అనేక జాతీయ, అంతర్జాతీయ కారణాలున్నాయి. వీటి ఫలితంగా 1943లో 'ఆంధ్ర అభ్యుదయ

రచయితల సంఘం' ఏర్పడింది. అదే సంవత్సరం ఫిబ్రవరి నెలలో 13, 14 తేదీలలో తాపీ ధర్మారావు అధ్యక్షతన అభ్యుదయ రచయితల సంఘం తొలి మహాసభలు తెనాలిలో జరిగాయి. అది మొదలు 'పరంపరాభివృద్ధిగా' అన్నట్లు తెలుగులో అభ్యుదయ కవిత్వం అభివృద్ధి చెందుతూ అన్ని దిక్కులకు వ్యాపించింది. ఆధునిక యుగంలో తెలుగులో ఎన్నో సాహిత్య ఉద్యమాలు పుడుతూ గిడుతూ వస్తున్నాయి. కానీ, అభ్యుదయ సాహిత్య ఉద్యమం మాత్రం ఈనాటికీ ఒక సజీవ స్రవంతిలా అది ప్రవహిస్తూనే ఉండటం విశేషం.

### తొలినాటి అభ్యుదయ కవిత్వం :

1943లో తెలుగునాట 'ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం' ఏర్పడినా; అంతకుముందు నుంచే తెలుగులో అభ్యుదయ కవిత్వం వెలువడటం విశేషం. తెలుగులో వెలువడిన అభ్యుదయ కావ్యాలలో ఈనాటికీ శ్రీశ్రీ రచించిన మహా ప్రస్థానానికే ప్రథమ తాంబూలం. మహా ప్రస్థానం పుస్తకరూపంలో ప్రకటించటానికి కొంతకాలం పట్టినా; అందులోని ప్రధాన ఖండికలలో ఎక్కువ భాగం 1930 దశాబ్దంలో రచించబడినవే. వర్గ సంఘర్షణ, విప్లవ ప్రబోధం, వీరగాథా కథనం, సమసమాజ నిర్మాణం వంటి వివిధ అంశాలను అభ్యుదయ కవిత్వ లక్షణాలుగా సినారె వంటి పరిశోధకులు గుర్తించారు. వీటిలో ఎక్కువ భాగం శ్రీశ్రీ మహా ప్రస్థానంలో గుర్తించగలం.

సామాజిక పరివర్తనకు మూలకారణం బాహ్య ప్రకృతిలో జరిగే మార్పులే అన్నది మార్క్స్ అభిప్రాయం. దీనినే గతితార్కిక భౌతికవాదంగా వ్యవహరిస్తున్నాం. దీనికి మార్క్స్ మూడు ప్రధాన సూత్రాలను ప్రతిపాదించాడు. అవి- పరస్పర విరుద్ధ శక్తుల మధ్య సంఘర్షణ, విరోధ వైరుధ్య సూత్రం, పరిమాణం గుణంగా మారడం. వీటిని సినారె తమ సిద్ధాంత గ్రంథంలో కొంత వివరించారు. ఇవన్నీ శ్రీశ్రీ మహా ప్రస్థానంలో స్పష్టంగా ఆవిష్కరించబడ్డాయి.

శ్రీశ్రీ గతితార్కిక భౌతికవాద దృష్టికి దేశ చరిత్రలు, ప్రతిజ్ఞ, మహాప్రస్థానం, జగన్నాథుని రథచక్రాలు, కవితా ఓ కవితా వంటి అనేక ఖండికలు ప్రబల తార్కాణాలు.

ఏ దేశచరిత్ర చూచిన
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం

దేశస్తులు దేశచరిత్ర చుట్టూ అల్లుకున్న అనేక అంశాలను నిలువునా బద్దలు కొట్టిన ఇటువంటి ఖండికలు మహా ప్రస్థానంలో అనేకం ఉన్నాయి. వీటన్నింటినీ ఇక్కడ ప్రస్తావించలేము. అదే ఒక సిద్ధాంత గ్రంథం అవుతుంది.

1934లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీతో పాటు, కమ్యూనిస్టు పార్టీ కూడా ఏర్పాటయింది. ఈ కమ్యూనిస్టు పార్టీకి ఒక పతాక గీతం ఆనాడు తెలుగు గడ్డమీద మారుమ్రోగింది. ఆనాటి యువతరాన్ని, ముఖ్యంగా యువకవుల్నీ ఎంతగానో ఉత్సాహ పరిచింది.

ఆకలి మంటచె మలమల లాడే
అనాథులంతా లేవండోయ్

అనేది ఆ గేయం పల్లవి. ప్యారిస్ విప్లవం జరిగే సందర్భంలో యూజినీ పాటియర్ ఒక అంతర్జాతీయ గేయాన్ని ఫ్రెంచిభాషలో రచించాడు. ఆ గేయానికి ఇది తెలుగు అనువాదం. అనువాదకులు: బాలాంత్రపు నళినీ కాంతారావు. అనువాదం చేయించినవారు: పుచ్చలపల్లి సుందరయ్య.

1934 ప్రాంతంలోనే తుమ్మల వెంకట్రామయ్య ఒక అద్భుతమైన అభ్యుదయ గేయాన్ని అందించారు.

ఎగరాలి ఎగరాలి మన ఎర్ర జెండా
అదురు బెదురు లేక అడ్డేదియును లేక
సామ్రాజ్యవాదులు సమసి పోవంగా
ధనిక వాదంబింక దగ్ధమై పోవా

తెలుగు సమాజాన్ని ఆనాడు ఒక ఊపు ఊపిన ఈ గేయం తెలుగులో వెలువడిన తొలి అరుణ పతాక గీతం.

ఎర్ర జెండా మీదనే కాదు; రైతులనూ, రైతుకూలీలనూ జాగృతపరిచే పాటలు కూడా 1934 లోనే అనేకం వెలువడ్డాయి.

ఆగునా జీవాలు సాగునా లోకాలు
రాజుగా మనమెంచి రైతు జూడకపోతె
దేశాలు తలలెత్తునా - దాస్యపున్
పాశాలు తా వీడునా ?

ఈ రైతు చైతన్య గీతాన్ని గిరిరాజు రామారావు, శెట్టిపల్లి వెంకటరత్నం కలిసి రచించారు. ప్రజలు పాడుకున్నారు. తెలుగులో వెలువడిన తొలి రైతు గీతం ఇదే అని ప్రముఖ అభ్యుదయ రచయిత ఎస్వీ. సత్యనారాయణ తెలియజేశారు.

1936-37 ప్రాంతాల్లో మరొక అభ్యుదయ గేయం కార్మికలోకంలో బాగా ప్రచారం పొందింది.

కూలీ లందరు ఏకమైతే - కూటికి తరుగేమిరా
కూలి వాండ్లలోనే బలిమీ - కాలమందున నుండెరా
కూలి వాండ్లమైన మనకు - కులము లెందుకు తెలుపరా
కూలి వాండ్లమైన మనము - కలిసి ఉందము సోదరా

ఇది ఎనిమిది చరణాలు కలిగిన సుదీర్ఘమైన పాట. కార్మిక సంఘాల నిర్మాణ అవసరాన్ని పట్టి చూపించే ఈ గేయాన్ని పెండ్యాల లోకనాథం రచించారు. గుంటూరులో కూలివాడల్లో నివసిస్తూ, కార్మికులతో కలిసి పని చేసిన కవి లోకనాథం. తెలుగులో వెలువడిన తొలి కార్మిక గేయం ఇది.

1934 నుంచే తెలుగులో మరికొన్ని అభ్యుదయ రచనలు వెలువడ్డాయి. 1934 లోనే ఎన్.జి.రంగా తన సంపాదకత్వంలో 'రైతు భజనావళి' ప్రకటించారు. ఆ రోజుల్లో 'ప్రభ' అనే పత్రిక వెలువడేది. దీని సంపాదకులు: గద్దె లింగయ్య. ఎన్నో అభ్యుదయ గీతాలను ఈ పత్రిక ప్రచురించింది. 'క్రాంతి గీతాలు' అనే పేరుతో కార్మిక దృక్పథం గల ఈ గేయాలు గద్దె లింగయ్య సంపాదకత్వంలోనే 1938లో వెలువడ్డాయి.

సుప్రసిద్ధ అభ్యుదయ కవి శిష్లా ఉమామహేశ్వరరావు రచించిన 'విష్ణు ధనువు' కవితా సంపుటి 1938 లోనే వెలువడింది. పఠాభి - 'ఫిడేలు రాగాల డజన్', శ్రీరంగం నారాయణ బాబు -'రుధిరజ్యోతి' వంటి ఖండికలు కూడా ఆ కాలంలో ప్రకటించబడినవే.

ఆనాటి సాహిత్య వాతావరణానికీ,వెలువడిన అభ్యుదయ సాహిత్య ధోరణులకూ ఎందరో యువకవులు ఎంతగానో స్ఫూర్తిపొందారు. పోలేపల్లి నరసింహమూర్తి, పులుపుల శివయ్య, చండ్ర రాజేశ్వరరావు, కాట్రగడ్డ నారాయణరావు, నండూరు ప్రసాదరావు, రేణంకి అప్పలస్వామి, కొడవటిగంటి కుటుంబరావు, విద్వాన్ విశ్వం, పాలగుమ్మి పద్మరాజు వంటి వారు అలా స్ఫూర్తి పొందిన వారిలో కొందరు.

**అభ్యుదయ కవిత్వ వికాసం :**

ఆంధ్రనాట అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడటానికి సుమారు దశాబ్దం ముందు నుంచే తెలుగు సాహిత్యంలో అభ్యుదయ బీజాలు ఎంత బలంగా నాటుకున్నాయో ప్రస్తావించుకున్నాం. 1943 తరువాత దాని వికాసం వామన విజృంభణ స్థితిని తలపిస్తుందని చెప్పవచ్చు. అందుకు నిదర్శనంగా ఆ తరువాత కాలంలో వెలువడిన అనేక కవితా సంపుటాలను, సంకలనాలను చూపించవచ్చు.అటువంటి కవితా సంపుటాల్లో ప్రసిద్ధమైంది 'నయాగర' సంపుటి. కుందుర్తి ఆంజనేయులు, బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం అనే వారు నయాగరా కవిత్రయంగా ప్రసిద్ధులు. ఇది 1944 లో వెలువడింది. 1949 లో అనేక అభ్యుదయ కవితా సంపుటాలు ప్రకటించబడ్డాయి. దాశరథి 'అగ్నిధార', ఆవంత్స సోమసుందర్ 'వజ్రాయుధం', ఆరుద్ర 'త్వమేవాహం', అనిశెట్టి 'అగ్నివీణ' వంటివి 1949లో వెలువడిన కవితా సంపుటాలు. ఆ తరువాత దాశరథి 'రుద్రవీణ', నారపరెడ్డి 'అశ్రుమాల', రెంటాల 'సంఘర్షణ', గంగినేని 'ఉదయని' వంటి కవితా సంపుటాలు 1950లో ప్రకటించబడ్డాయి.

కె.వి.రమణారెడ్డి 'భువన ఘోష'(1955), కుందుర్తి 'తెలంగాణ'(1956), రెంటాల 'సర్పయాగం'(1957) వంటి కవితా సంపుటాలను కూడా ఈ సందర్భంలో ప్రస్తావించుకోదగినవి. ఈ సంపుటాలు అన్నింటిలోనూ అభ్యుదయ కవితా లక్షణాలు సుస్పష్టంగా ఆవిష్కరించబడ్డాయి.

అనాదిగా సాగుతుంది అనంత సంగ్రామం
అనాథుడికి ఆగర్భ శ్రీమంతుడుకి మధ్య

అన్న సుప్రసిద్ధ కవితా పాదాలు దాశరథి రచించిన అగ్నిధార లోనివి.

వర్గ సంఘర్షణ అవసరాన్ని పట్టి చూపించే మరో ఖండికను సినారె 'జలపాతం'లో చూడవచ్చు.

భూరి వృక్షం జారిపడ్డప్పుడే
లేత మొక్క పైకి లేస్తుంది
పసిడి మేడ ప్రక్క కోరిగినప్పుడే
అడుసు గుడిసె నడువ నేరుస్తుంది

భూరి వృక్షం, పసిడి మొక్క అనే ప్రయోగాలు దోపిడి వ్యవస్థకు; లేత మొక్క,

అడుసు గుడిసె అనే పదాలు శ్రామిక వర్గానికి ప్రతీకలు. దోపిడీ వ్యవస్థ సమూలంగా నిర్మించబడినప్పుడే శ్రామిక కార్మిక వర్గానికి అభ్యుదయం చేకూరుతుందనేది కవి ఆకాంక్ష.

వర్గ సంఘర్షణను శక్తివంతంగా ఆవిష్కరించిన మరో ఖండిక నారాయణ బాబు రచించిన 'గడ్డి పరక'.

నడవండి నడవండి
నా మీంచి నడవండి
గడ్డిపరకను !
గడ్డిపరకను !

పల్లకీ దిగినట్టి
పెళ్లి కొడుకులు మీరు
పట్టు తివాచీని నేను
నడవండి నడవండి
నా మీంచి నడవండి !

ఇలా సుదీర్ఘంగా సాగిపోతుందీ ఖండిక. వర్గ సంఘర్షణకు గురవుతున్న కార్మిక శ్రామిక వర్గం నిరంతరం ఎటువంటి దయనీయ స్థితిలో ఉందో తెలియజేయడానికి నారాయణ బాబు గడ్డిపరకను ప్రతీకగా స్వీకరించాడు. ఇక్కడ పల్లకీలు, పెళ్లి కొడుకులు బూర్జువా వ్యవస్థకు ప్రతినిధులు.

ఆరుద్ర 'త్వమేవాహం' వర్గ సంఘర్షణను బలంగా ఆవిష్కరించిన గొప్ప ప్రతీకాత్మక కావ్యం. గంటలు, చిన్న ముళ్ళు (సంపన్న వర్గం); నిమిషాలు, పెద్ద ముళ్ళు (మధ్యతరగతి వర్గం); సెకండ్లు, సెకండ్ల ముల్లు (శ్రామిక వర్గం) అనేవి ఒక్కొక్కటి ఒక్కొక్క వర్గానికి, ఆ వర్గ మనస్తత్వానికి ప్రతీకలు. పైథాగరస్ సిద్ధాంతాన్ని వర్గ సంఘర్షణకు అన్వయించి కూడా చెప్పిన చిక్కని కావ్యం 'త్వమేవాహం'.

కుందుర్తి 'తెలంగాణ' లోని 'ప్రస్తావన' అనే ఖండిక, కుందుర్తి కృతులు లోని 'రెండు లోకాలు' అనే ఖండిక; కె.వి.రమణారెడ్డి 'అడవి' వంటి కవితల్లోనూ వర్గ సంఘర్షణను కవులు బలంగా ఆవిష్కరించారు.

విప్లవాన్ని ప్రబోధించే ఖండికలు కూడా విరివిగానే వెలువడ్డాయి. అనిశెట్టి రచించిన 'అగ్నివీణ' అటువంటి కావ్యాల్లో ప్రముఖమైంది.

గుండె గుండెకు చిచ్చు మండించి లేవండి
గుడిసె గుడిసెకు కోట నిర్మించి లేవండి
అని పోన్ముఖ పీడితవర్గాన్ని విప్లవాల్ని చేయడానికి కవి కలం ఝుళిపించాడు.

దాశరథి రచించిన 'అగ్నిధార' సంపుటిలోని 'శ్రామిక జ్యోతి' అనే ఖండిక కూడా ఈ సందర్భంలో స్మరించుకోదగిందే.

పొగులుతున్న భూ గర్భం
పగల నున్న జ్వాలాముఖి
చిచ్చంటిన స్నిగ్ధాటవి
పిడుగులురలు పెను మేఘం
హార గళగత హాలా హలం
శ్రామిక జాతి కదిలింది

ఈ ఖండిక లోని ప్రకృతి పరమైన ప్రయోగాలన్నీ శ్రామిక వర్గ చైతన్యాన్ని సూచించేవే. ఇదే సంపుటిలోని 'నడి గడ్డ' కవిత కూడా విప్లవాన్ని ప్రబోధించేదే.

'కుందుర్తి కృతులు' లోని 'వెలుగులోకి'; 'గంటలో నిమిషంలో క్షణంలో' అనే ఖండికలు; ఆవంత్స సోమసుందర్ 'వజ్రాయుధం' లోని 'మలయా ప్రభంజనం' అనే కండిక కూడా శ్రామిక వర్గంలో విప్లవాన్ని రగిలించేవే.

శ్రీ శ్రీ మహాప్రస్థానం సంపుటిలోని 'మహా ప్రస్థానం' ఖండిక సుప్రసిద్ధమైంది. 'మరో ప్రపంచం మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచింది' అంటూ ఎంతో వేగంగా సాగే ఈ ఖండిక ఒక నాడు శ్రామిక వర్గంలో ఎంత శక్తివంతంగా విప్లవాన్ని ప్రబోధించిందో; అంతే బలంగా పైన ప్రస్తావించుకున్న ఖండికలన్ని విప్లవాన్ని ప్రకటించినవే.

అభ్యుదయ కవిత్వ లక్షణాలైన ఇతరేతర అంశాలకు సంబంధించి కూడా అనేక ఖండికలు తెలుగులో వెలువడ్డాయి. తెలంగాణ రైతాంగ పోరాటాన్ని అభ్యుదయ కవులందరూ ఎంతగానో సొంతం చేసుకున్నారు. వందలాది రచనలు ప్రచురించారు. వ్యాస విస్తరణ భీతి వల్ల అన్నింటినీ ఇక్కడ ప్రస్తావించ లేక పోతున్నాను.

## వర్తమానంలో అభ్యుదయ కవిత్వం :

అభ్యుదయ భావజాలం నిలువ నీరు లాంటిది కాదు. అది ఒక సజీవ ప్రవంతి. భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతూ ఉన్నట్టు; అభ్యుదయ కవిత్వం కూడా తనను తాను సమీక్షించుకుంటూ, సమాజాన్ని సమీక్షిస్తుంది. ఈ క్రమంలో సమాజంలో వస్తున్న మార్పులకు గల కారణాలను శాస్త్రీయంగా అన్వేషిస్తుంది. అవసరమైన సందర్భాల్లో పరిష్కారాలను గతితార్కికంగా సూచిస్తుంది. సరికొత్త రూపాలను కూడా సంతరించుకుంటుంది.

> అస్తిత్వ ఉద్యమాలు అస్తిత్వంలోకి వచ్చిన కాలం నుంచీ మనం వర్తమానంలో ఉన్నట్టే. స్త్రీ వాద, దళితవాద, మైనారిటీవాద, ప్రాంతీయవాద ఉద్యమాల వంటివన్నీ అస్తిత్వ వాడ ఉద్యమాలే.

అస్తిత్వ ఉద్యమాలు అస్తిత్వంలోకి వచ్చిన కాలం నుంచీ మనం వర్తమానంలో ఉన్నట్టే. స్త్రీ వాద, దళితవాద, మైనారిటీవాద, ప్రాంతీయవాద ఉద్యమాల వంటివన్నీ అస్తిత్వవాడ ఉద్యమాలే. ప్రధానంగా వర్గ దృష్టితో సమాజాన్ని అధ్యయనం చేయడం అభ్యుదయ కవుల దృక్పథం. ప్రతి అంశాన్నీ, సమస్యను ఆర్థిక కోణంలో పరిశీలించడం అభ్యుదయ కవుల తాత్విక చింతన. అయితే అవసరమైన సందర్భంలో తమను తాము పునస్సమీక్ష చేసుకోవడం, తమను తాము పునర్నిర్వచించుకోవడం కూడా అభ్యుదయ దృక్పథంలో ఉన్నదే. అందుకే వర్గేతరాంశాల ప్రాతిపదికగా ఏర్పడిన అస్తిత్వవాద ధోరణులనూ, ఉద్యమాలనూ కూడా అభ్యుదయ కవులు సామాజిక వాస్తవిక కోణంలోంచి శాస్త్రీయంగా అధ్యయనం చేశారు. కొన్నిటికి ద్వార బంధాలనూ, మరికొన్నింటికి గవాక్షాలనూ తెరచి తమలోనికి ఆహ్వానించారు. సాదరంగా చేయందిచారు. అభ్యుదయ కవులందరూ ఆయా అస్తిత్వవాద ఉద్యమాలను పూర్తిగానో, పాక్షికంగానో స్వంతం చేసుకున్నారు. కొంతమంది కలాన్ని అందించారు. మరికొంత మంది గళాన్ని అందించారు. ఎంతోమంది సంఘీభావాన్ని ప్రకటించారు. ఈ నాటి కవులే కాదు, ఒక నాటి అభ్యుదయ కవులు కూడా ఈ అస్తిత్వవాద రచనలను చేయడం ఇందుకు నిదర్శనం.

ఇతర అస్తిత్వ వాద ఉద్యమాల కంటే ప్రాంతీయ అస్తిత్వ వాదం కొంత భిన్నమైంది. శక్తివంతమైంది కూడా. ప్రజాదరణ సంపూర్ణంగా దీనికి సిద్ధిస్తుంది. ఇటీవల కాలంలో తెలంగాణా అస్తిత్వ వాదం సాధించిన రాజకీయ విజయం ఇందుకు నిదర్శనం. ఈ రాజకీయ కోణంలో రాజ్యాధికారాన్ని సాధించడం అంత ప్రధానంగా కాక పోయినా; పాలనా పరమైన వివక్షను పలుకోణాల్లో ప్రశ్నించడం ఇటు రాయలసీమలోనూ, అటు ఉత్తరాంధ్రలోనూ ఇటీవలి కాలంలో ఎక్కువగా కన్పిస్తోంది. ఈ ప్రశ్నిస్తున్న గొంతులన్నీ ఎక్కువగా అభ్యుదయ వాదులవే. ఉత్తరాంధ్ర నుంచి ఛాయారాజ్, అట్టాడ అప్పలనాయుడు వంటివారు; రాయలసీమ నుంచి ఒకనాడు విద్వాన్ విశ్వం, ఈనాడు రాచపాళెం చంద్రశేఖర రెడ్డి వంటి వారు తమ తమ అస్తిత్వ వాద స్వరాలను వినిపించిన వారు; విన్పిస్తున్నవారు. అభ్యుదయ కవుల అస్తిత్వవాద స్వరాలు ఎంత లోతుగా ఉంటాయో ఒక ఖండిక ద్వారా పరిశీలిద్దాం.

కరువు
సీమ ముంగిట పెరిగిన వింత తరువు
దాని లీలలు అనంతం
బిడ్డలాంటి పశువును అడ్డంగా అమ్మిస్తుంది
గుట్టంత చెట్టును నిలువునా నరికిస్తుంది
మనపైన మనిషిని మృగంగా మలుస్తుంది
కరువు
సీమ ముఠాల ముంగిట కల్ప తరువు
కరువు చెట్టు నిండా
పథకాల కొమ్మలు సాగి నిధుల కాయలు కాస్తున్నాయి
పదవుల కంచె కాపలా కాస్తున్నది
అయినా కాయలు మాత్రం మాయం
కరువు మాత్రం పదిలం

ఇది రాచపాళెం రచించిన 'కరువు గడ్డ' అనే ఖండిక. 'రాయల సీమ రత్నాలసీమ' అన్నది ఒకనాటి మాట. స్వార్థపరులైన పాలక వర్గాల పాలనా వైఫల్యాల వల్ల అదిప్పుడు ఒట్టి నీటి మూట. ఈ విషయాన్నే రాచపాళెం కరువు నైజంతో కలగలిపి నొక్కి చెప్పారు. ఇటువంటి ఖండికలు ఉత్తరాంధ్ర నుంచీ చూడగలం.

## ప్రపంచీకరణ నేపథ్యంలో అభ్యుదయ కవిత్వం :

వర్తమానం అన్నది ప్రస్తుతం ప్రపంచీకరణతో ముడిపడి ఉన్నది. ప్రపంచీకరణ ప్రభావం ప్రపంచవ్యాప్తంగా ప్రపంచీకరించబడింది. ఫలితంగా 'వర్తమానం' అన్నది ప్రపంచవ్యాప్తంగా గట్టి కుదుపుకు లోనైంది. ప్రపంచ దేశాలలోని ఆర్థిక స్థితిగతులేకాక; సామాజిక జీవితాల్లోనూ, కుటుంబ జీవితాల్లోనూ, వైయక్తిక జీవితాల్లోనూ అనేక అంశాలు అతలాకుతల మయ్యాయి. ఇందుకు మన దేశం, మన రాష్ట్రం, మన జిల్లా, మన మండలం, మన ఊరు, మన ఇల్లు, మన ఒళ్లు కూడా మినహాయింపు కాదు. వీటన్నింటినీ అభ్యుదయ కవులు అధ్యయనం చేస్తున్నారు. అనేక అంశాలను, అనేక కోణాల్లో తమ తమ కవితల్లో ఆవిష్కరిస్తున్నారు. ఇప్పుడు వెలువడుతున్న వందలు కాదు, వేలాది కవితలు ఇందుకు నిదర్శనం.

> ప్రజా జీవితాలపై ప్రపంచీకరణ ప్రభావాలు ఎంత ప్రగాఢంగా ప్రతిఫలిస్తున్నాయో ప్రకటించిన అభ్యుదయ కవులు తెలుగులో అనేకమంది ఉన్నారు.

ప్రజా జీవితాలపై ప్రపంచీకరణ ప్రభావాలు ఎంత ప్రగాఢంగా ప్రతిఫలిస్తున్నాయో ప్రకటించిన అభ్యుదయ కవులు తెలుగులో అనేకమంది ఉన్నారు. అద్దేపల్లి రామమోహనరావు. జూకంటి జగన్నాథం, అడిగోపుల వెంకటరత్నం, నాళేస్వరం శంకరం, కోడూరు విజయకుమార్, ఓల్గా, కొండేపూడి నిర్మల, పాటిబండ్ల రజని, జయప్రభ, విమల, మదరపు హైమవతి, కుప్పిలి పద్మ వంటి వందలాది కవులు ప్రపంచీకరణ ప్రభావాలను వర్తమాన తెలుగు కవిత్వంలో వండి వారుస్తున్నారు.

నువ్వు షరా మామూలుగా నిద్రలేస్తావు
అర్ధరాత్రి అమ్ముడై వుంటావు
తల్లి భారతిని అమ్ముకుంటూ ఒకడు
తెలుగు తల్లిని తాకట్టు పెడుతూ మరొకడు
తాకట్టుపాలైన ప్రభుత్వంలో
ప్రజలు విక్రయ సామాగ్రి

ఇది అడిగోపుల వెంకటరత్నం రాసిన 'పునాదుల్లేని కట్టడాలు' అనే కవిత. మనదేశ ఆర్థిక స్థితిగతుల్నే కాదు; పరిపాలన విషయంలో మన పాలకుల తీరుతెన్నులను కూడా ఈ ఖండిక తెలియ పరుస్తుంది. 'తలసరి ఆదాయం' అన్నమాట ఏనాటి నుంచో మనకు సుపరిచితమైన ఒక సాంకేతిక పదం; దీనికి భిన్నంగా ఇప్పుడు 'తలసరి అప్పు' అన్నది మనందరి అనుభవంలోకి వచ్చిన విషమ సమాస పదం. ఈ విషయాన్నే కవి ఈ కవితలో ధ్వనించారు.

'కులము గలవాడు, గోత్రము గలవాడు, విద్యచేత విర్రవీగువాడు పసిడి కలుగు వాని బానిస కొడుకులు' – ఇది మన ప్రజాకవి వేమన నాలుగైదు వందల సంవత్సరాల కిందట చెప్పిన ఒక కఠిన వాస్తవం. వేమనను ఒక యోగిగానో, భోగిగానో భావించే వారికి ఈ వాస్తవం అర్థం కాక పోవచ్చు. కానీ, ఇప్పుడు ప్రపంచీకరణ నేపథ్యంలో ఇది అందరికీ అనుభవంలోకి వచ్చిన ఒక పరమ సత్యం. భగ్వాన్ అనే కవి ఈ నగ్న సత్యాన్ని ఒక హైకూకు గుచ్చి మనగుండెల మీదకు గురిపెట్టాడు.

టేబుల్ మీద
రూపాయి బిళ్ళను తిప్పి
భూగోళం తిరుగు తొందన్నాడు

ఒక అణువుకు ఎంత శక్తి ఉంటుందో ఈ హైకూకు అంతకు మించిన శక్తి ఉంది. ఎంత తోడితే అంత దొరుకుతుంది. సమాజం పట్ల ఒక శాస్త్రీయమైన చూపు కలిగిన ఒక అభ్యుదయ కవి మాత్రమె ఈ ఖండికను చెప్పగలడు. ప్రతినిత్యం మన ఇంట మన కంటపడే ఒక సాదాసీదా దృశ్యంతో వర్తమాన ప్రపంచాన్ని దర్శింప చేయడం ఈ కవి ప్రతిభకు నిదర్శనం.

కేవలం ఆర్థిక స్థితిగతులనే కాదు; ఆర్థిక సంబంధాల నేపథ్యంలో విచ్ఛిన్నమౌతున్న మానవ సంబంధాలనూ తెలుగు కవులు గతితార్కికంగానే ప్రదర్శించారు. మన ఆలోచనా విధానాల్లోనూ, మన సంస్కృతిలోనూ వచ్చిన మార్పులనూ; కులవృత్తులపై పడిన ప్రభావాలనూ; మాతృ భాషలు మృత భాషలుగా మారుతున్న వైనాలనూ; ఆంగ్ల భాషపై, విదేశీ సంస్కృతులపై పెరుగుతున్న వ్యామోహాలనూ కూడా మన తెలుగు కవులు అనేక మంది భౌతిక వాద చింతనతోనే ప్రకటిస్తున్నారు.

కేవలం వర్తమాన స్థితిగతుల్ని చిత్రించడమే కాదు; అవసరమైనప్పుడు మనకు ఎదురు పడ్డ సమస్యలను అధిగమించడానికి అనుసరించవలసిన పరిష్కారాలనుకూడా తెలుగు అభ్యుదయ కవులు సూచిస్తున్నారు.

నువ్వు ఆర్యుడివైతే ఏమిటి? ద్రావిడుడి వైతే ఏమిటి?
బహుళ జాతుల రక్తం నీలో ఇంకిపోతున్నప్పుడు-
నువ్వు ప్రభుత్వమైతే ఏమిటి? ప్రజలవైతే ఏమిటి?
అందరం పరాయి ప్రభువుకి బానిసలమై పోతున్నప్పుడు-
నువ్వు కళ్ళు తెరుచు కుంటే ఏమిటి? మూసుకుంటే ఏమిటి?
కనుపాపల్ని గద్ద తన్నుకు పోతున్నప్పుడు-
నువ్వు మగాడి వైతే ఏమిటి? ఆడదానివైతే ఏమిటి?
ఇంకోడి మార్కెట్టుకి సరుకువై పోతున్నప్పుడు-
నువ్వు గతంలో జీవిస్తే ఏమిటి? భవిష్యత్తులో బతికితే ఏమిటి?
వర్తమాన కాలంలో మరణించి పోతున్నప్పుడు-
నువ్వు మాట్లాడితే ఏమిటి మౌనంగా ఉంటే ఏమిటి?
పరాయీకరణ భావాలకి మంట పెట్టలేక పోతున్నప్పుడు-

ఇది ప్రముఖ అభ్యుదయకవి అద్దేపల్లి రామమోహనరావు రచించిన 'పొగచూరిన ఆకాశం' అనే ఖండిక. ప్రపంచీకరణ స్వరూప స్వభావాలనే కాక; ప్రపంచీకరణ పట్ల కవి చూపును కూడా పట్టి చూపించే ఖండిక. మనదేశం, మనరాష్ట్రం, మనఊరు, మనఇల్లు, మనఒళ్ళు ఇటువంటి స్థితిగతుల్లో ఉన్నప్పుడు దేశస్తుల చూపు ఏ దిశలో ఉండాలో, ఎ లక్ష్యం కోసం ఉండాలో అద్దేపల్లి ఈ ఖండికలో అద్దినట్టు చెప్పారు. పరాయీకరణ భావాలకు మంట పెట్టలేక పోయినప్పుడు మన జీవితాలు ఎలా మంట కలిసి పోతాయో కూడా హెచ్చరించారు.

ఆదిలో వర్గ సంఘర్షణ, విప్లవ ప్రబోధం వంటి కొన్ని అంశాలకు మాత్రమె పరిమితమైన తెలుగు అభ్యుదయ కవిత్వం కాలం గడిచేకొద్దీ మారుతున్న పరిస్తితులకు అనుగుణంగా, అనేక అంశాలకు విస్తరించింది. ఇటీవలి కాలంలో తెలుగు సాహిత్యాన్ని ఆవహించిన కొన్ని అస్తిత్వవాద ఉద్యమాల నేపథ్యంలో వెలువడిన కవిత్వంకూడా చాలావరకు అభ్యుదయ భావజాలానికి కొనసాగింపు గానే తెలుగు అభ్యుదయ కవులు నిరూపించారు.

నిబద్ధత కలిగిన ఏ సైద్ధాంతిక భావజాలానికైనా కామాలే గాని, ఫుల్ స్టాపులుండవు. మార్క్సిజం నేపథ్యంగా కలిగిన అభ్యుదయ కవిత్వానికీ ఇది వర్తిస్తుంది.

# ఆంధ్రోద్యమ కవిత్వం



**డా. గుమ్మా సాంబశివరావు**
విశ్రాంత ఉపప్రాచార్యుడు
✆ 98492 65025

"నారాష్ట్రంబుగడించి తీరెదను నానా విఘ్నముల్ వచ్చినన్
రారాపిళ్ళకు, దల్లడిల్లనను తీవ్రజ్వాలతో, గార్యమున్
బ్రారంభించిన తెల్గుబిడ్డ నెదిరింపన్ బ్రహ్మరుద్రాదులే
చేరంజాలరు తక్కువుక్కడులకై చింతింపగానేటికిన్" (యుగకవిత - పుట 74)

- అని తెనుగులెంక తమ్మల సీతారామమూర్తి కవి ఆంధ్ర రాష్ట్రాన్ని సాధించే విషయంలో ఎన్ని అడ్డంకులు వచ్చినా, రాష్ట్రాన్ని గడించి తీరుతానని ఆత్మ విశ్వాసాన్ని ప్రకటించారు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో దేశభక్తి కవిత్వం జాతీయ భావన నుండి పుట్టింది. ఇది రెండు పాయలుగా ప్రవహించింది. ఒకటి భారత జాతీయాభిమాన సంబంధిగా, రెండోది ఆంధ్రాభిమాన సంబంధిగా వెలువడింది. ఈ రెండూ సమాంతరంగా వెలువడటం గమనార్హం. తెలుగుదేశం, తెలుగు ప్రజలు తెలుగు చరిత్ర, తెలుగు జాతి, తెలుగు సంస్కృతి, తెలుగు భాష మొదలైన అంశాలను గూర్చి కవులు తమ తమ గళాలను వినిపించారు. కలాలను ఝుళిపించారు. ఆంధ్రోద్యమ కవిత్వంలో గత వైభవ స్మరణం, వర్తమాన స్థితి పట్ల విచారం, భవిష్యత్ కర్తవ్య ప్రబోధం అనేవి ప్రధాన లక్షణాలుగా కనిపిస్తాయి.

ఆంధ్రాభిమానాన్ని ప్రకటించిన వారిలో రాయప్రోలు సుబ్బారావు గారు ప్రముఖులుగా కనిపించినా, వీరికంటే ముందుగా కొంతమంది కవులు ఆంధ్రాభిమానాన్ని ప్రకటించిన వారు ఉన్నారు.

ఆంధ్రుల గత వైభవాన్ని స్మరిస్తూ 1914 లో గడ్డముకొండా రెడ్డిగారు "ఆంధ్రమాతృస్తవము" అనే శీర్షికను రచించారు. ఆంధ్రాభిమానాన్ని

ప్రబోధించారు.

సీ. శకయవనాదినాయకులసేనలు(బాఱ

దోలిన శౌర్యమేమూలదాగె

జావాసుమాత్రాప్రశస్త సర్వ ద్వీప

పాలకత్వాప్తి యేవార్ధిబడియె" - అని గత వైభవ దీప్తి ఏమైపోయిందని తెలుగు ప్రజల్లో పౌరుషాన్ని రగులు గొలిపారు.

1916లో మండపాక పార్వతీశ్వరశాస్త్రి గారు "ఆంధ్ర సంవత్సరాది" అనే ఖండికలో ఆంధ్ర రాష్ట్ర భావనను వెల్లడిస్తూ

"ఆంధ్ర ప్రత్యేక రాష్ట్రాసక్తి చాటించె

మదపికంబులు పంచమస్వనమున"- అని రచించారు. తిరుపతి వేంకట కవులు "మన మండలంబున మన తల్లి వేఱు వసింపగా గృహము కట్టింపవలయు"- అని ప్రత్యేక రాష్ట్ర అవసరాన్ని వ్యంగ్యంగా ప్రబోధించారు.

ఆంధ్రోద్యమ కవిత్వానికి రాయప్రోలు సుబ్బారావుగారి రచనలు సమగ్రమైన ఆకృతిని కలిగింపజేశారు.

సీ. అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ

విద్యాలయములు స్థాపించునాడు

ఓరుగల్లున రాజవీరలాంఛనముగ

పలుశస్త్రశాలలు నిలుపునాడు....

ఆంధ్రసంతతికే మహితాభిమాన

దివ్యదీక్షాసుఖ స్ఫూర్తి తీవరించె

నా మహావేశమరించి యాంధ్రులార!

చల్లుడాంధ్రలోకమున నక్షతలునేడు" (వైతాళికులు - 6)

- అని చాటిచెప్పి" చావలేదు, చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్ర హృదయములు చీల్చి చదువుడో సదయులార!" అని ఉద్యమ ప్రేరితుల్ని గావించారు. ఇంకా ఆంధ్రుల ఐశ్వర్యాన్ని, వాణిజ్య వైభవాన్ని, నౌకావ్యాపారాన్ని తెనుగుతల్లి శీర్షికలో వర్ణించారు.

ఆంధ్రుల పరాక్రమ ఘట్టాల్ని విశ్వనాథవారు "ఆంధ్రపౌరుషము"లో

"కోటగోడల నుండి కుప్పించి సింహంబు

లోయన నరులపై నురుకలేదా

కొండయడుగునుండి కొండపై వరకు నూ

గించి తేజీల దూకించలేదొ"...." అని రచించారు.

ఇంకా 'వేగీక్షేత్రము" ఖండికలో

ఇమ్ముగగాకుళమ్ముమొదలీవరకుంగలయాంధ్రపూర్వరా

జ్యమ్ములపేరు చెప్పిన హృదంతరమేలొ చలించిపోవునా

ర్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవనిర్ణయమేని యెన్నిజ

న్మమ్ములుగాగనీతనువునన్ బ్రవహించునొ యాంధ్రరక్తముల్"

(వైతాళికులు - II)

- అని రచించి ఆంధ్రాభిమానాన్ని ప్రకటించారు.

కవికోకిల గుర్రంజాషువ ఆంధ్రుల వీరత్వాన్ని పలు పద్యాల్లో ప్రశంసించాడు. 'తెలుగు వెలుగు' అనే ఖండికలో "ఒకనాడు ఆంధ్రుని కత్తి శాత్రవ బల వ్యూహాలపై రక్త నాటికమున్ సల్పుట విస్మరింపకుము" అని ప్రబోధించాడు. "ఉత్సహాయుతమైన యుడుకునెత్తురు లేక ప్రాప్తించలేదు రాష్ట్ర ధ్వజంబు" - అని హెచ్చరించాడు. ఇంకా జాషువా ప్రబోధం ఇలా సాగింది.

"మ. తెలుగుంగేసరులున్ మహర్షులును, గాంధీశాంతిసేనాపతుల్

గలరాంధ్ర ప్రముఖుల్ త్వదీయులు భుజస్కంధంబునందింత్రు, నీ

అలఘు శ్రేయము లీనమోచినవి రాష్ట్రార్థంబుయత్నించి, నీ

బలముంగొంచియు మాకళించుకొనరా! ప్రఖ్యాత వీరాంధ్రుడా"

(జాషువ సర్వలభ్యరచనలు - 603)

- గాంధీ అనుయాయులు తెలుగు ప్రముఖులు ఎంతో మంది ఉన్నారని, వారందరు సహకారాన్ని అందిస్తారని, రాష్ట్ర సాధన కోసం ప్రయత్నించి బలాన్ని కూడగట్టుకోవలసిందని జాషువ ప్రబోధించారు.

ఆంధ్రుల నౌకా వ్యాపారాన్ని ప్రశంసిస్తూ తుమ్మలవారు

"ఈజిప్తు నుండి కృష్ణాజలమ్ములకుబా

రంబాటగా పరాక్రమముజూపి
సకలజీవుల విజయధ్వజములనాటి
తనదుతెరచాపవార్ధిరాజునకుకట్టుకోకగా...."

- పూర్వం ఆంధ్ర నౌకలు సప్త సముద్రాల మీద తిరుగాడాయని పరవశించారు. శాతవాహనుల కాలంలో ధాన్య కటకాన విదేశీయులతో జరిగిన నౌకా వ్యాపారం ఈ పద్యంలో ప్రతిబింబించింది. తుమ్మలవారు మరొక చోట ఆంధ్ర సోదరులకు ప్రబోధం గావిస్తూ ఇలా రచించారు.

ఉ. రక్కెసతాల్మి నోర్చితిమి రాష్ట్రము లేని పరాభవంబునల్
దిక్కులధిక్కృతి ధ్వని ప్రతి ధ్వని సేయఁ దొడంగెముజ్జగం
బొక్కట వేడుకొన్న మొగమోటకు నియ్యది వేళగాదు, నీ
యుక్కువెలార్చియాంధ్ర విజయోత్సవదాతవు గమ్ము సోదరా!"
(యుగకవితపుట - 83)

- ఇంకా "తమిళకర్ణాట బంధాలను తొలగించి తెలుగు సీమను స్వతంత్రంగా మార్చేవరకు, తెలుగు పసిపాపకైనా నిద్రపట్టదని తెలియజేశారు.

ఆంధ్రాభిమానాన్ని ప్రోది చేయటానికి కవులు తెలుగు నదీ ప్రశస్తి, క్షేత్ర ప్రశస్తి, భాషా ప్రశస్తి గావించారు. ఆంధ్ర పౌరుషములో విశ్వనాథవారు.

"గోదావరిపావనోదారవాఃపూర
మఖిలభారతము మాదన్ననాడు
తుంగభద్రాసముత్తుంగ గానముతోడ
కవులగానముశ్రుతిగలయునాడు
పెన్నానదీసముత్పన్న కైరవదళ
శ్రేణిలోతెన్గువాసించునాడు
కృష్ణాతరంగనిర్ణిద్రగానముతోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాడు....." అని అద్భుతంగా రచించారు.

చం. శిలలు ద్రవించి యేడ్చినవి జీర్ణములైనవి తుంగభద్రలో
పలిగుడిగోపురంబులు, సభాస్థలులైనవి కొండముచ్చుగుం

పులకు, చరిత్రలో మునిగిపోయినదాంధ్ర వసుంధరా ధిపో

జ్జ్వల విజయప్రతాపరభసంబొక స్వప్నకధావిశేషమై"

- అని చెప్పిన కొడాలి వారు ఈ కావ్యంలో ఆంధ్ర రాజుల శౌర్య సాహసాలకు సంబంధించిన పలు విశేషాల్ని ప్రసంశించారు. ఇంకా రామచంద్రుని హంపీయాత్ర, దక్షారామము, ఓరుగల్లు కోట, పెనుగొండ లక్ష్మి అనే కావ్యాలు క్షేత్ర ప్రశస్తిని గావిస్తూ, ఆంధ్ర రాజుల ఔన్నత్యాన్ని, ఆంధ్ర కవుల ప్రతిభను, ఆంధ్రపురా గాధల్ని రచించి ఆంధ్రుల్ని నూతనోత్తేజితుల్ని గావించే ప్రయత్నం చేశారు.

తెలుగు భాష వైభవాన్ని కీర్తిస్తూ, కవులు పలు ఖండికల్ని రచించారు. 'దేశభాషలందు తెలుగు లెస్స' అనే పాదాన్ని స్ఫూర్తిగా తీసుకొని ఆధునిక కవులు తెలుగు ప్రత్యేకతను ప్రశంసించారు. విశ్వనాథవారు

"ఒక్కసంగీతమేదో పాడినట్లు భా

షించునప్డు విన్పించు భాష

విస్పష్టముగనెల్ల విన్పించునట్లు స్ప

ష్టోచ్చారణంబున నొనరు భాష...." అంటూ ప్రశంసించారు.

గుర్రం జాషువా 'స్వయంవరము' అనే ఖండకావ్యంలో

మ. ఇటలీభాషవిధాన కమ్మనయి, మున్నే బ్రౌను చిత్తంబుగు

ప్పిట సంధించిన తెల్గు చక్క గనమున్ బెంపుల బ్రశంసించి, యా

కటి పెల్లాడని గ్రంథకర్తల యభాగ్యశ్రీకి జింతించి, బా

సట గల్పించునటంచు నిండభయ హస్తంబిచ్చె సంశప్తయై"

(జాషువాస్వరలభ్య రచనలు - 1247)

- అని తెలుగు భాషా ప్రాశస్త్యాన్ని ప్రశంసించారు తుమ్మలవారు

మ. కమ్మని తెల్గటంచునుడికారము సొంపుల నీవిశాల వి

శ్వమ్మునఁ దీనిఁబోలిన వచస్సు నభస్సుమమంచు వేయివా

క్యమ్ములనేను మెచ్చుటయ కాదు రసజ్ఞులు దారులెల్ల ఖం

డమ్ముల మెచ్చిరిచ్చిరివినమ్రతమై 'గపుటంపుటారతుల్'

(యుగకవితపుట - 114)

- అని రచించారు. ఇంకా ఆంధ్ర భాషా సేవ చేయనిదే ఆంధ్ర రాష్ట్రం రాదని,

వంగ సోదరులు నక్షత్రాలలాగా ప్రకాశించటానికి వారి భాషా రాష్ట్రమే కారణమని దానికోసం మాతృభాషాభ్యసనం అనివార్యమని తుమ్మల వారు హెచ్చరించారు.

ఆంధ్రోద్యమ కవిత్వంలో పద్యకవుల రచనలే కాకుండా గేయ కవుల రచనలు కూడా ఉన్నాయి. గేయం ప్రజల్ని తొందరగా ప్రభావితం చేస్తుంది. జాతీయోద్యమంలో "మేలుకొను మీ భరతపుత్రుడ - మేలుకొను మా సుజనచరితుడ" - అనే గేయం లాగే మంగిపూడి వెంకటశర్మ "మేలుకొనుమా ఆంధ్రపుత్రుడ మేలుకొనుమా ఆర్యగోత్రుడ - మేలుకొనుమా శుభచరిత్రుడు - మేలుకొనవయ్యా" అని రచించటం గమనార్హం. ఆంధ్రోద్యమంలో ఆంధ్ర మహాసభ ప్రముఖ పాత్ర వహించింది. దాన్ని గూర్చి పలు కవితలు వచ్చాయి. తిరునగరి రామాంజనేయులు అనే కవి "ఎక్కుబావా! పడవెక్కుబావా! ఆంధ్ర మహాసభయను పడవెక్కుబావా!" అనే గేయాన్ని రచించారు. సుద్దాల హనుమంతు అనే ప్రజాకవి "జయభేరి మోగింది తెలుగోడా! రావోయి ముందుకూ మొనగాడా!" అనే గేయాన్ని రచించారు.

> ఆంధ్రోద్యమ కవిత్వంలో పద్యకవుల రచనలే కాకుండా గేయ కవుల రచనలు కూడా ఉన్నాయి. గేయం ప్రజల్ని తొందరగా ప్రభావితం చేస్తుంది.

శ్రీశ్రీ "అదెవో తెలుగుతల్లి - అందాల నిండు జాబిల్లి - ఆనందాల కల్పవల్లి - అదె నీ తెలుగుతల్లి - పదవోయ్ తెలుగువాడా - అదె నీ తెలుగుమేడ - అదె నీ అనుంగు నేల - అదిగో సుదూర వేల - చనవోయ్ తెలుగువీరా!.... పదవోయ్ తెలుగుబాట... ఇదిగో తెలుగు కోట - పదవోయ్ నిర్భయంగా - పదవోయ్ దిగ్జయంగా - పదవోయ్ నిశ్చయంగా" అని ప్రబోధించారు.

ఒకటవతేదీ 1953 అక్టోబరులో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర అవతరణ, 1956 నవంబరు ఒకటవ తేదీన ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భాలను పురస్కరించుకొని కవులు తమ కలాలను గేయ రూపంలో కదిలించారు.

తెలుగువారి జాతీయ గీతంగా ప్రచారం పొందిన 'మా తెలుగు తల్లికి మల్లె పూదండ' గేయం శ్రీ శంకరంబాడి సుందరాచారి గారి కలం నుంచి' మా తెలుగు తల్లికి మల్లెపూదండ - మా కన్న తల్లికి మంగళారతులు - కడుపులో బంగారు

కనుచూపులో కరుణ చిరునవ్వులో సిరులు దొరలించు మాతల్లి.... త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు - తిక్కయ్య కలములో తియ్యందనాలు - నిత్యమై నిఖిలమై నిలిచియుండేదాక - నీ ఆటలే ఆడుతాం - నీ పాటలే పాడుతాం - జై తెలుగు తల్లీ! జై తెలుగు తల్లీ!" అని వెలువడింది. ఈ గేయం తెలుగు ప్రజలందరినీ కదిలించింది. తెలుగువారిలో ఆత్మాభిమానాన్ని పెంచింది.

ఆంధ్ర రాష్ట్ర సిద్ధిని దృష్టిలో పెట్టుకొని దేవులపల్లి కృష్ణశాస్త్రి "జయ మహోంధ్ర జనయిత్రీ - జయ ప్రియాంధ్ర జనయిత్రీ - అనే గేయం వెలువడింది.

వేములపల్లి శ్రీ కృష్ణ రచించిన

"చేయెత్తి జైకొట్టు తెలుగోడా! గతమెంతో ఘనకీర్తి కలవాడు! సాటిలేని జాతి - ఓటమెరుగని కోట - నివురు గప్పినేడు - నిదురపోతుండాది .... అని సాగిన ఈ గేయం తెలుగునాట ప్రతినోట వినిపించి ఆంధ్రోద్యమానికి ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కలిగించింది.

ఆంధ్ర రాష్ట్ర సిద్ధిని దృష్టిలో పెట్టుకొని దేవులపల్లి కృష్ణశాస్త్రి "జయ మహోంధ్ర జనయిత్రీ – జయ ప్రియాంధ్ర జనయిత్రీ – అనే గేయం వెలువడింది.

పలువుల వెంకట శివయ్య రచించిన

"వెనుకతరములవారి వీరచరితల సిరులు

నార్వోసి త్యాగింపు నీర్వెట్టి పెంచరా

విరిసిసుఖములు పండురా పలనాడు - వెలలేని మాగాణిరా"

అన్న గేయం బహుళ ప్రచారం పొందింది.

శ్రీ శ్రీ ఒకగేయంలో "కదలవోయ్ ఆంధ్ర కుమారా - నిద్రవదలవోయ్ నవయుగం - నిర్మింపసాగవోయ్ - కదలవోయ్ ఆంధ్ర కుమారా - అదిగదిగో రేయిపోయి - వేగుచుక్క వెలిగెనోయ్ - సుదూరాన విశాలాంధ్ర - విజయవాణి పిలిచెనోయ్ " అని రచించాడు.

తెలుగు మట్టిలోగల మహత్తరమైన శక్తిని, ప్రేమాను రక్తిని, భక్తిని, అంకిత భావాన్ని జంపనచంద్రశేఖరరావు గారు వర్ణించారు.

శ్రీ పైడిపాటి సుబ్బరాయ శాస్త్రి "త్రిలింగ దేశం మనదేనోయ్ తెలుగులంటే మనమేనోయ్" అని అద్భుత గేయాన్ని రచించారు.

శ్రీ అనపోతు లక్ష్మణరావు గారు 'ఆంధ్రరాష్ట్ర గీతారత్నములు" అనే గ్రంథంలో పొట్టి శ్రీరాముల త్యాగనిరతికి

జోహారు జోహారు ఓ ఆంధ్ర వీరా! దేహములను విడునాడు దీక్షాఫలము నీవు - ఊహించితిని గాని యుర్విపై వినలేదె" అని ప్రశంసించారు.

త్రిపురనేని రామస్వామి చౌదరిగారు

"బ్రహ్మపురము మందేరా - పర్లాకిమిడి మందేరా
కాదని వాదుకు వస్తే కటకం దాకా మందేరా
గోలుకొండ మనదేరా - తెలంగాణా మందేరా" అని ఎలుగెత్తి చాటారు. అలాగే
తెలుగుతల్లి బిడ్డలం - తెలంగాణ వీరులం"
- అని కొండేపూడి లక్ష్మీనారాయణ గారు రచించారు.

పొట్టి శ్రీరాములు ఆత్మ త్యాగాన్ని ప్రశంసిస్తూ డా. సి.నా.రె 1953 జనవరి స్వతంత్ర వారపత్రికలో 'రాష్ట్రపాంచజన్యం' అనే కవితను రచించారు.

"ఆశయాలు నెమరేసే వాళ్లకు - పాఠం నేర్పెను పరమతపస్వి
అనైక్యజాతిని అతికించుటకై - అసువులుపిండెను అమరయాశస్వి
ఆవేశంతోపొంగే వెల్లుల - అణచగల్గునాసిపాయిదండులు?
ఆందోళనతోనడిచేతెల్గుల - ఆపగల్గునా తుపాకి గుండులు?
నిర్జీవాంధ్రనభఃకోణంలో - గర్జించెను పౌరుషపర్జన్యం
బధిరలోక కర్ణకవాటంపై - ప్రతిరణించె రాష్ట్రపాంచజన్యం"
అని పొట్టి శ్రీరాములుగారి ఆత్మత్యాగాన్ని ప్రశంసించారు.

శ్రీమన్నంబాల కృష్ణారావుగారు పొట్టి శ్రీరాములు గారికి 'భక్త్యంజలి' సమర్పిస్తూ "నీప్రాణబలిదానం - ఇంద్రలోకము కదిపె... ఆంధ్రావనికె - నీచరితంబిక - నూతనపుట - దేశచరితకె - నీ త్యాగమొక నవసంపుటి - అని రచించారు.

దాశరథి ఆంధ్ర ప్రదేశ్‌ను మహోంధ్రోదయంగా వర్ణించి, రాష్ట్ర అవతరణను తెల్లవారటంతో పోల్చారు.

"ఎన్నాళ్లకు తెల్లవారె - ఎన్నాళ్ళకు కన్నుమారె - వెలుగువెలుగు వెలుగు వెలుగు, తెలుగు తెలుగు తెలుగు - తెలుగు - ఏది కాకతి ఎవరు రుద్రమ - ఎవరు రాయలు? ఎవడు సింగన? - అన్నీ నేనే అంతా నేనే - వెలుగునేనే తెలుగు నేనే" అని వీరావేశంతో రచించారు.

ప్రజాకవి కాళోజి "ఏమానందము ఏమానందము" అంటూ పేద ప్రజల సమస్యల్ని ప్రజల భాషలో అందించారు.

పల్లాదుర్గయ్యగారు "తెలుగు వాకిళ్ళలో - తొలికోడి కూసింది - తెలుగు కన్నియ తలుపు - తెరచిచూసింది" అని ఆంధ్రప్రదేశ్ అవతరణాన్ని చిమ్మచీకటిని శిథిలం చేసి తూర్పువాకిట పొడిచిన పొద్దు పొడుపుగా వర్ణించారు.

ఈ విధంగా తెలుగు కవులు ఆంధ్రోద్యమ సంబంధమైన కవితల్ని, ఉద్యమ సమయంలోను, రాష్ట్ర అవతరణ సమయంలోను రచించి తెలుగు ప్రజల్ని ఉత్తేజితుల్ని గావించారు. తెలుగు ప్రజలు ఎక్కడ ఉన్నా అందరమూ తెలుగుతల్లి ముద్దుబిడ్డలమనే సోదరభావంతో కలసిమెలసి అభివృద్ధి పథంలో సాగాలని ఆకాంక్షిద్దాం.

### ఆధార గ్రంథాలు


1. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు - 1977
   డా. సి. నారాయణరెడ్డి
2. తెలుగు సాహిత్యంలో దేశభక్తి - 2017
   సంపాదకులు - డా. తూమాటి సంజీవరావు
3. వైతాళికులు - సంకలనం - ముద్దుకృష్ణ - 1994
4. యుగకవిత - సంపాదకులు. శ్రీ ఎంటి. శ్రీనివాసు - 1981
5. జాషువ సర్వలభ్య రచనలు సంకలనము : మనసు ఫౌండేషన్ ప్రచురణ.
6. తెలుగు సాహిత్య చరిత్ర - 2021 - ఆచార్య వెలమల సిమ్మన్న
7. భారతజాతీయోద్యమ సాహిత్యం - 2012
   ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి
8. తెలుగువ్యాసమండలి - 2011 సంపాదకులు - శ్రీ గుత్తికొండ సుబ్బారావు
   డా. జి.వి పూర్ణచందు.

# విప్లవ కవితా విహంగవీక్షణం



డా. కె. నాగేశ్వరా చారి
94411 39652

దాదాపు యాభై ఏళ్ళ కిందటి నుంచి ప్రారంభమైన విప్లవ కవితా ప్రస్థానాన్ని అంచనా వేయడం అంత సులభమైన పని కాదు. ప్రపంచవ్యాప్తంగా వస్తున్న పరిణామాలు భారతీయ సమాజంలో అన్ని రంగాల్ని ప్రభావితం చేశాయి. అందులో సాహిత్య రంగం మినహాయింపు కాదు, అంటే అంతర్జాతీయ పరిణామాల నేపథ్యంలో తెలుగు సాహిత్యాన్ని అంచనా కట్టాలి. ఈ పని ఒక వ్యాసంలో ఒకరితో పూర్తయ్యే పనికాదు. ఒక్క విహంగవీక్షణం చేస్తే సరిపోతుంది.

ప్రపంచంలో ఎప్పుడు ఎక్కడ ఏ కొత్తదనం వచ్చినా అది తెలుగు కవిత్వంలోకి ప్రవేశిస్తుంది. కొత్త నీటికి చేపలు ఎదురెక్కినట్టుగా ,అని సాంప్రదాయ కవి విశ్వనాథ సత్యనారాయణ అన్నట్లు , చలసాని ప్రసాద్ అన్నారు. అభ్యుదయ రచయితల సంఘం పై లండన్ మేనిఫెస్టో, బోల్షవిక్ ప్రభావం లేదని చెప్పలేము. ఆ పరంపర చైనా విప్లవం మీదుగా వచ్చి నక్సల్ బరీ లోవెలిగింది. అంతకుమునుపు తెలంగాణా సాయుధ పోరాటం విప్లవ కవితకు బాటలు వేసింది. నక్సల్ బరీ పిలుపుతో యాభై ఏళ్లుగా తెలుగునాట ప్రచలితమవుతూ అనేక ఆటుపోట్లను ఎదుర్కొంటూ, విప్లవ కవిత కొనసాగుతూ ఉంది.

పాత సంస్కృతి పడగ నీడలో సాంస్కృతిక దాస్యాన్ని అనుభవిస్తున్న ప్రజలకు కొత్త సంస్కృతిని నిర్మించడమే విప్లవ కవిత ఆశయం. అని త్రిపురనేని మధుసూధనరావు అన్నారు. స్పష్టంగా తన ప్రాపంచిక దృక్పథాన్ని నిర్వచించుకుని విప్లవ రచయితల సంఘం యాభై ఏళ్లుగా కొనసాగుతూ, తెలుగు సాహిత్యం పై చూపిన ప్రభావం చాలా గొప్పది. తెలుగు సాహిత్య చరిత్రను ఒకసారి వెనక్కి తిరిగి

చూస్తే గతంలో ఎన్నడూ లేని విధంగా 1970లో విరసం ఏర్పడిన తర్వాత తెలుగు సాహిత్య దృక్పథంలో గొప్ప మార్పు వచ్చింది . ఆలంకారిక దృక్పథం నుంచి సామాజిక శ్రేయస్సే పరమావధి గా మారిపోయింది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే సకల పీడిత వర్గాలు మేల్కొని తమ విముక్తికై పోరాడుతూ ఉన్న వర్గాలకు ప్రతిస్పందనగా విప్లవ కవిత్వం వెలువడుతూ వుంది. వెయ్యేళ్ళ సాహిత్య గమనాన్ని విప్లవ కవిత్వం మలుపు తిప్పింది. అన్ని రంగాలకు తాను చేరువవుతూనే ఉంది. అన్ని రకాల అస్తిత్వ పోరాటాలకు ప్రేరణ ఇచ్చింది విప్లవ రచయితల సంఘమే. అన్ని ప్రక్రియలు ఇవ్వాళ నేల విడిచి సాము చేయడం లేదు. నేల కోసమే, నేలపై గౌరవప్రదమైన జీవనం కోసమే , అన్ని సాహిత్య ప్రక్రియలు మందుకొస్తున్నాయి. నూతన ఆర్థిక విధానాల నేపథ్యంలో అక్కడక్కడ కొన్ని అపస్వరాలు పలుకుతున్న మాట వాస్తవమే. కందుకూరి, గురుజాడ, గిడుగుల కాలం నుంచి మొదలైన బాట నేడు స్పష్టంగా శ్రామిక విముక్తి పోరాటాన్నే తెలుగు సాహిత్యం ప్రతిబింబిస్తూ ఉంది. వారు ప్రారంభించింది సంస్కరణలు, ఇవ్వాళ మార్పును కోరుతున్నారు. ఈ తేడా తెలుగు పాఠకులు స్పష్టమే. ఈ మార్పునకు పిలుపునిచ్చింది 'నక్సల్బరీ ఉద్యమం', సాహిత్య రంగంలో విరసం ప్రతిధ్వని. ఈ ప్రతి ధ్వని కవిత్వంలో వినిపించిన తీరును ప్రస్థానాన్ని విహంగ వీక్షణంలో చూడాలి.

> విరసం ప్రారంభానికి ముందు దిగంబర కవులు తిరగబడు కవులు కొంత నేపాథ్యాన్ని సమకూర్చారు. శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటం ప్రేరణగా వచ్చిన విరసం విప్లవ కవిత్వానికి నాంది పలికింది విప్లవ కవిత్వంపై ఎర్ర జెండా నెగురవేసిన చెరబండరాజును ముందుగా చెప్పుకోవాలి.

విరసం ప్రారంభానికి ముందు దిగంబర కవులు తిరగబడు కవులు కొంత నేపాథ్యాన్ని సమకూర్చారు. శ్రీకాకుళ గిరిజన రైతాంగ పోరాటం ప్రేరణగా వచ్చిన విరసం విప్లవ కవిత్వానికి నాంది పలికింది విప్లవ కవిత్వంపై ఎర్ర జెండా నెగురవేసిన చెరబండరాజును ముందుగా చెప్పుకోవాలి. దిగంబర కవిగా ఉన్న రోజుల్లో జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చరబండ రాజు ఈ ముగ్గురి కవితల్లో విరసం నిర్దేశ్య

లక్ష్యాలకు సాక్ష్యాలున్నాయి. ద్వారాముఖి నిఖిలేశ్వర్లు రాజకీయ అవగాహనతో వివరించి విరసం నుంచి వైదొలిగినా చెరబండ రాజు తుదకంటా కొనసాగారు.

విప్లవ కవిత్వం ప్రధానంగా నిర్ధారణ, నివారణ అన్న చట్టాల మీద నడుస్తూ ఉంది. దీనికి ప్రధాన సూత్రం విముక్తి. దిగంబర కవులు కూడా ఇదే పద్ధతిని అవలందించారు.

స్వాతంత్ర్యం ప్రకటించుకున్న తర్వాత పదహైదు సంవత్సరాల తర్వాత కూడా దేశ పరిస్థితులు చక్కబడలేదు. నిరుద్యోగం, దారిద్ర్యము విలయతాండవం చేశాయి. ఎన్నికల వాగ్దానాలు నీటిమీద రాతలు అయ్యాయి. సమాజంలోని అన్ని రకాల పీడనల్ని ఈ నక్సల్బరీ ఎత్తిపట్టి సాయుధ పోరాటం ద్వారానే పీడిత ప్రజల విముక్తి జరుగుతుందని దేశంలో అనేక చోట్ల రైతాంగ పోరాటాలు ఈ వెలుగులో ముందుకొచ్చాయి.

ఈ సపద్యంలో విరసం ఆశించే లక్ష్యాలు 1965 నాటికి బీజ ప్రాయంగా దిగంబర కవిత్వంలో కనిపిస్తాయి. అభ్యుదయ కవిత్వం వెనుక పట్టు పట్టింది. గతాన్ని కీర్తించడం కవులు మానలేదు. కర్తవ్యబోధ జరగడం లేదు. ఈ సందర్భంలో

నిఖిలేశ్వర్న
న్నయ్యను నరేంద్రుని
బొంద లోనే
నిద్ర పోనియ్యి
లేపకు
పీకనులిమి గోతిలోకి
లాగుతాడు.............
...................
పండిత వర్యా! రికార్డు
లా నోరు తిప్పకు
నవ సృష్టిని కాలదన్నకు
భావకవుల నపుంసక
హావభావాలకు నవ
సవాలు

అభ్యుదయ కవీ నల్లమందు తిని నిద్ర పోయావు........ అంటూ ఇప్పటికి కావాల్సిన కవిత్వమేదో సూచించారు. సంప్రదాయ కవుల ప్రభంజనం తగ్గినా ఆ ప్రభావం తగ్గని కాలమది. ఇంచుమించు ఇదే భావనను కొనసాగిస్తున్నట్లుగా జ్వాలాముఖి సూర్య స్నానం అన్న కవితలో.......

............చచ్చిన రాజులు పుచ్చిన గాథల
మెచ్చే చచ్చు చరిత్ర కారులను
ముక్కు చెవులు కోసి అడగాలని ఉంది..
మానవ పరిణామ శాస్త్రం
నేర్పిందేమని?
............అణ్వాహంకారంలో కావరమెక్కన
అగ్రరాజ్య శేన్యాలకు రెక్కలు నరికి

ఈకలు పెరికి, చంపాలనుంది..... అని గతాన్ని కీర్తించడం కాదని విజ్ఞాన సామాజిక శాస్త్రాల అధ్యయనం అవసరమని జ్వాలాముఖి ఆశిస్తారు. అప్పటికి సామ్రాజ్య వాదం బలహీన దేశాలపై నెరపే పెత్తనాన్ని నిరసించారు. ఏ దేశ ప్రగతిని ఆ దేశ ప్రజలే నిర్ణయించుకోవాలి. నిర్వహించుకోవాలి. అలా కాక ఆయా దేశాలను తమ మార్కెట్లుగా ఉపయోగపడరాదన్నది జ్వాలాముఖి వక్తవ్యాంశం.

చెరబండ రాజు ఇంకో అడుగు ముందుకేసి న్యాయ వ్యవస్థలో న్యాయమెంతని ప్రశ్నిస్తారు. 'నన్నెక్కనివ్వంది బోను' అనే కవితలో ఓ కుట్ర కేసు విచారణలో వరవరరావు, త్రిపురనేని మధుసూదనరావు, కె.వి. రమణా రెడ్డి సంయుక్తంగా కోర్టుకిచ్చిన వాంగ్మూలానికి నన్నెక్కనివ్వండి బోను పేరే పెట్టారు.. ఈ కవిత ప్రాధాన్యత అట్టిది. వర్గ సమాజములో వర్గన్యాయమే ఉంటుందని విరసం విశ్వశిస్తుంది..

ఒక దేశం కోర్టులో
పైసలా అయ్యే కేసు కాదు నాది
నన్నెక్కనివ్వండి బోను
............మనిషి మీద నమ్మకం పోగుతున్న మీరు
దేవుని మీద ప్రమాణం చేయమంటారందుకు?
దోషికీ నిర్దోషికి ఒకటే సూత్రం.

వల్లించిందే వల్లించిచు వాదిస్తారు.
ఫీజు కుడితి కుండలో న్యాయాన్ని ఎలుకలా ముంచేస్తారు.
"మీ ఉద్యోగాలకు ప్రమాణాలేమిటి" అని ప్రశ్నిస్తారు.
ఇంకా నుంచి మనసు పరిమళాలు విశ్వవ్యాప్తి కాకపోవు
భావితరం గుర్తించకపోదు

దోపిడీ రాజ్యాంగ వ్యవస్థ లోని ఒక అంగం న్యాయ వ్యవస్థ. దాని నిర్మాణ సూత్రాల్లోని డొల్లతనాన్ని చెరబండ రాజు ఎత్తి చూపుతారు. పై కవితలు గీత గీసిన పదాల్లో ఘర్షణ నిరంతరం కొనసాగుతూనే ఉంటుందన్న మావో వైరుధ్య సూత్రాలలో ఒకటి, ఈ ఆలోచనా విధానం కొనసాగుతుందని చెరబండరాజు సూచన.

ఇలా ప్రస్తుత వ్యవస్థ లోపాల్ని, వ్యవస్థలోని అశాస్త్రీయతను అవగాహనలో లోపాల్ని దిగంబర కవులు వివరించారు. విరసం ఆవిర్భావానికి ముందే సాహిత్య రంగంలో పూర్వరంగం కొంత సమాయత్తమైంది. మొదటి దిగంబర కవితా సంకలనానికి లేని మార్క్సిజం ప్రసక్తి మూడవ సంపుటం వెలువడే నాటికి మార్క్సిజాన్ని ప్రశ్నించే హక్కు పీడన ఉన్నంత వరకు ఎవరికీ లేదని నిర్ద్వంద్వంగా ప్రకటించుకున్నారు. దిగంబర కవుల్ని అరిషడ్వర్గాలని, అస్లీ కవిత్వం అని నానా విధాల నిరసించిన విమర్శకులున్నారు. ఈ సందర్భంలో దిగంబర కవుల కంటే ముందు వచ్చిన "రాష్ట్ర" కవితా సంకలనం.

> "ఇలా ప్రస్తుత వ్యవస్థ లోపాల్ని, వ్యవస్థలోని అశాస్త్రీయతను అవగాహనలో లోపాల్ని దిగంబర కవులు వివరించారు. విరసం ఆవిర్భావానికి ముందే సాహిత్య రంగంలో పూర్వరంగం కొంత సమాయత్తమైంది."

నాటి యువతలో ఉన్న అసంతృప్తిని అలజడిని ప్రతిబింబించింది అని గుర్తుచేసుకోవాలి. దిగంబరకవుల ప్రయత్నం ఆనాటి పరిస్థితుల దృష్ట్యా ఒక సాహిత్య ఉద్యమ అవసరాన్ని బలంగానే గుర్తింప చేసింది. అప్పటిదాకా లేని ఒక వ్యక్తిని "దిగంబర కవిత్వం" ఇచ్చిందని దిగంబర కవిత్వం నిర్వహించిన పాత్రను సీతారామ్ దిగంబర కవిత్వానికి రాసిన

ముందుమాటలో సరిగానే అంచనా వేశారు. మొత్తానికి దిగంబర కవిత్వం సాహిత్య రంగాన్ని, సామాజిక రంగాన్ని గందరగోళం నుంచి బయటపడేసి ఓ విధంగా విరసానికి పూర్వరంగం సిద్ధం చేసింది.

ఇంచుమించు దిగంబర కవితా ఉద్యమం సన్నగిల్లే ఈ క్రమంలోనే తిరగబడు కవులు రంగం మీదకు వచ్చి, శ్రీకాకుళ ఆదివాసి రైతాంగ పోరాటానికి తమ సంఘీభావం తెలిపారు. శ్రీకాకుళ ఉద్యమానికి దేశంలోనే ప్రత్యామ్నాయ రాజకీయాలకు పునాది వేసిన నక్సల్బరీ రైతాంగ ఉద్యమాన్ని గుర్తుల తెచ్చుకోవాలి. నక్సల్బరీ ఉద్యమ ప్రభావాన్ని గురించిన వందలాడి పుస్తకాలు వెలువడ్డాయి, అంటే దాని ప్రాధాన్యత ఎంతటిదో అర్థం చేసుకోవాలి.

> అగ్నిగుండం నుంచి ద్రౌపది పుట్టిందో లేదో తెలియదు గానీ, శ్రీకాకుళ ఉద్యమం నుండి విరసం పుట్టింది అనేది అందరూ అంగీకరించే విషయమని కె.వి. రమణారెడ్డి గారు అంటారు. ఈ నేపథ్యంలో నుంచి విప్లవ కవితాప్రస్థానాన్ని పరిశీలించాలి.

అగ్నిగుండం నుంచి ద్రౌపది పుట్టిందో లేదో తెలియదు గానీ, శ్రీకాకుళ ఉద్యమం నుండి విరసం పుట్టింది అనేది అందరూ అంగీకరించే విషయమని కె.వి. రమణారెడ్డి గారు అంటారు. ఈ నేపథ్యంలో నుంచి విప్లవ కవితాప్రస్థానాన్ని పరిశీలించాలి.

మర్క్సిజ.-లేనినిజం మావో ఆలోచనా విధానం తన ప్రాపంచిక దృక్పథంగా నిర్వహించుకున్న విప్లవ కవితోద్యమం 1970 నుంచి నేటి వరకు వందలాది కవితా సంకలనాల్ని ప్రచురించింది. 'సృజన', 'అరుణతార', 'ప్రజాసాహితి' వంటి పత్రికల్లో వచ్చిన కవితల్ని కలుపుకుంటే వేలాది కవితలు వెలువడినట్లు ఒక అంచనా ఉంది. విప్లవ కవిత్వానికి సాయుధ పోరాటం ద్వారా శ్రామిక పీడిత ప్రజల విముక్తిని ఆశించడమే ప్రతిపాదించడమే ప్రధానం.

విరసం ఆశయాలకు అనుగుణంగానే అనంతపురంలో చైతన్య సాహితి, తిరుపతి పట్టణంలో విప్లవ సాహితీ సంస్థలు కొనసాగాయి. తమ లక్ష్య ప్రకటన

చేసుకోకపోయినా మార్పును ఆశించే, మార్పును బలపరిచే తాత్విక దృక్పదాన్ని బలపరచాయి. సాయుధ పోరాటాన్ని ఎత్తిపట్టే క్రమంలో రివిజనిజాన్ని పూర్వపక్షం చేయడం కూడా విప్లవ కవిత్వమే. 1972లో తిరుపతి విప్లవ సాహితి ప్రచురించిన విప్లవం వర్ధిల్లాలి కవితలో కె.రాజా రెడ్డి

............పూసుకున్న ఎర్ర పౌడర్ చెరిగిన వాడు
సాహస వాదం అన్నాడు
వ్యక్తిగత హింస అనీ గొణిగాడు.
వర్తమానజీవితం అట్టడుగున రేగుతున్న సంక్షోభం
పన్నాల పతనంతో సున్నాగామారిన బుర్రకు ఎక్కదు
భవిష్యత్తు మీద నమ్మకం లేని సామరస్య వాదులకి
విప్లవ సూర్యోదయ ప్రభాత కిరణాలు కనిపించవు

అని పార్లమెంటరీ విధానం ద్వారా వ్యవస్థను మార్చుకోలేమని అంటారు. ఇదే సంకలనంలో విప్లవ కేంద్రం అనే కవితలో జ్యోతి అనే కవయిత్రి

"బొరియల్లో మొత్తుకునే ముసలి పులులు

అవిశ్రాంత కుహనా శాంతి మంత్రాన్ని జపిస్తున్నాయి" అన్ని అంతర్జాతీయ గానే విప్లవ కేంద్రం విచ్ఛిన్నమవడం పోరాట పంథాను వీడిన వర్గ సామరస్య ధోరణిని నిరసిస్తారు. ఇంకా అదే కవితలోనే ఆమె

"..........దళిత జాతి శ్రమశక్తి లోంచి
మేల్కొంటున్నాడు
అరుణారుణ విప్లవ భానుడు
గెరిల్లా సూర్యుడు
సాయుధ మార్గంలో పయనిస్తున్న

పురోగమిస్తున్న వర్ణమాన వీరుడు" అంటూ సాయుధ పోరాటంలో భాగస్వాముల గురించి ప్రస్తావించింది. సాయుధ మార్గంలో పయనిస్తున్న వర్తమాన వీరుణ్ణి గురించి ఇదే సంకలనంలో జ్వాలా పంజరాలు అన్న కవితలో సంవర్త యువతరాన్ని గురించి చెబుతూ

విప్లవ కారుని అగ్ని నేత్రంలా నిప్పులు చిమ్ముతూ

ఆకలిగొన్న బెబ్బులి గాత్రంలా ఆవేశంతో రొప్పుతూ
ఉన్మత్త సముద్ర కెరటంలా ఉరుకుతూ
కోటి ఝంఝల శత కోటి ప్రభంజనాల హోరులో
కధనాన నడుం కట్టి
ప్రాణాలు ఫణం పెట్టి
అమానుష దమనకాండను చుట్టుముట్టి మట్టు పెడుతుంది.

అని జరగబోయే వర్గ పోరాట తీవ్రతను వర్ణిస్తారు ఈ కవితలో. ఉద్యమ అనివార్యతను కవి నొక్కి చెప్పారు. మార్క్సిస్టు సాహిత్య తత్వవేత్త త్రిపురనేని మధుసూదనరావు "వీడు" శీర్షికతో ఈ సంకలనంలో ఓ కవిత రాశారు. అందులో ఆయన పీడించే వారి తత్వాన్ని వివరిస్తారు. అంతిమంగా

.........యువజనులు గిరిజనులు
కత్తులతో తుపాకులతో ముందుకొస్తుంటే..
కొండల్లో కోనల్లో నగరాల్లో
భవిష్యత్తు సింహాలు గర్జిస్తుంటే
వీడు.....
అహింస అహింస అని అరుస్తున్నాడు

అని అటవీ మైదాన ప్రాంతాల్లో జరుగుతున్న ఉద్యమాల్ని గుర్తుచేస్తారు. ఈ సంకలనంలో అత్తలూరి నరసింహారావు, భూమన్, జైరామ్ హనీఫ్, శ్రీ శ్రీ వంటి ప్రముఖ కవులతో 12 మంది కవితలు ఉన్నాయి. అప్పటికి విరసంలో చేరని వాళ్ళు చేరినవాళ్ళు ఇరువురు ఈ సంకలనంలో రాసిన వారు ఉన్నారు.

1972లో అనంతపురం నుండి చైతన్య సాహితి ఆధ్వర్యంలో రక్త గానం కవితా ఈ సంకలనం వెలువడింది. అందులో పన్నెండు మంది రాసిన 23 కవితలున్నాయి. ఈ సంకలనానికి శ్రీ శ్రీ "రక్తం పాడే సమయం" శీర్షికతో ముందుమాట రాశారు. ఈనాటి ఆంధ్ర సాహిత్యంలో విప్లవ రచయితల సంఘం ఆరోగ్యకరమైన సంస్థ. అందుకే దాని మీద రోగ క్రిముల దాడి అంత ముమ్మరంగా జరగడమూ అని విరసంపై ప్రభుత్వ సంప్రదాయ కవుల దాడిని శ్రీ శ్రీ నిరసించారు. "విప్లవ కవిత్వం సాంస్కృతిక పోరాటం" అన్న శీర్షికతో త్రిపురనేని మధుసూదనరావు రాసిన వ్యాసం విప్లవ రచయితలకు మార్గదర్శకమైంది.

మార్క్సిస్టు ఆలోచనా విధానంలో సాహిత్యరంగంలో జరిగవలసిన పోరాట పంథాను ఆయన ఆ వ్యాసంలో వివరించారు..

రక్తగానం కవితా సంకలనంలోని కవితలు ప్రస్తుత సమాజ స్థితిని విశ్లేషిస్తూ సమస్యల పరిష్కారానికి పోరాటమే ఏకైక మార్గమని పిలుపునిస్తాయి. కొన్ని కవితలు ఆనాటికీ ఎన్ కౌంటర్ లో మరణించిన బి.పి రామప్ప స్మృతి లో రాశారు. ఈయన తాడిపత్రి ప్రాంతంలో చందన గ్రామానికి చెందిన విప్లవోద్యమ కార్యకర్త. 1969 నాటికి చందన గ్రామ పరిసర ప్రాంతాల్లో 10 గ్రామాలను ఆనాటి ప్రభుత్వం కల్లోలిత ప్రాంతంగా ప్రకటించింది. అనేకమంది రైతు కూలీలపై అక్రమ కేసులు నడిచాయి. కోర్టులో కేసులు కొట్టివేసిన రోజున అనంతపురం పట్టణంలో కాగడాల ఊరేగింపు గొప్పగా జరిగిందని అక్కడి ప్రజలు చెప్పుకుంటారు. ఈ ప్రభావం కవులపై ఉందనడానికి ఉదాహరణ "కదలిరా" శీర్షిక తో ప్రేమ సాగర్ రాసిన కవిత చక్కని ఉదాహరణ. ఆయన తన కవితలో

కలం తుపాకీతో అక్షర తూటాలను కురిపిస్తున్నాను.  
వర్షిస్తున్నాను.  
శ్రామిక రక్త మాంసాల్ని  
భక్షించే  
ధన రాబందులు మిడిల్ పాయింట్  
ట్రిగ్గర్ నొక్కిస్తున్నాను నువ్వు నాతో కదలిరా  
నేను కూలినా నా మీదుగా వెళ్ళు  
శత్రువుని మట్టుపెట్టు

అని చారుమజుందార్ పిలుపుకు స్పందనగా ఉంది ఈ కవిత, పీడిత ప్రజల స్థితి ని వివరిస్తూ,

.............తిరగబడ్డ నిన్ను ఎవరు అని ప్రశ్నిస్తూన్న  
వర్గ శత్రువు కు సమాధానం చెప్ప  
బెంగాల్ "లైట్" వెలుతురులో  
శ్రీకాకుళం గిరిజనుని చైతన్యం లో

ఉత్తేజితుణ్ణయిన పీడిత ప్రజల ప్రతినిధినని జవాబు చెప్పమంటారు. సారంగ మూర్తి అనే కవి "ఎత్తు తుపాకీ ఆలస్యం దేనికి ఎండిపోయిన కళ్ళల్లో

ఎర్ర మంటల్ని రగల్చు" మంటాడు. కవి తాను చెప్పదలచుకున్న విషయాన్ని నిర్మోహమాటంగా తీక్షణంగా మొటురగా చెప్పారని వీరిపై విమర్శలు ఉన్నాయి. ఈ విమర్శ విరసం కవులపై కూడా పడింది . భావ విప్లవం కోసం చేసే ఈ కవుల రచనలలో లోపాలు ఉండవచ్చునని అందుకు తొలి ప్రయత్నమే కారణమని ప్రచురణకర్తలు చివరి మాటలో చెప్పారు.

> నిషేధానికి గురైన ఈ కవితా సంకలనాన్ని బీసీ రామప్పకు అంకితమిచ్చారు. 1973లో చైతన్య సాహితీ "బందూక్" అనే కవితప్రచురించింది. దీన్ని కూడా ప్రభుత్వం నిషేధించింది.

నిషేధానికి గురైన ఈ కవితా సంకలనాన్ని బీసీ రామప్పకు అంకితమిచ్చారు. 1973లో చైతన్య సాహితీ "బందూక్" అనే కవితప్రచురించింది. దీన్ని కూడా ప్రభుత్వం నిషేధించింది. ఈ సంకలనంలో జ్వాలాముఖి , భూమన్ , ముడార్, వేణు, గొల్లా పిన్ని శేష శాస్త్రి , యాదాటి కాశీపతి లోచర్ల పెద్దారెడ్డి , మల్లయ్య మరికొందరు కలం పేర్లతో రాసిన కవిత్వాలు ఉన్నాయి. పరిటాల శ్రీరాములు పాట రాశారు . ఈ సంకలనం కూడా ఇంచుమించు రక్తగానం లాగే సాగింది. సిద్ధాంతమే బందూక్ శీర్షిక తో ఒక వ్యాసం విరాట్ స్వరూప్, నర్సప్ప, నూతన్ వంటి వాళ్ళ చిన్న వ్యాసాలూ ఉన్నాయి. ఈసంకలనాన్ని విప్లవ పార్టీ సాహిత్య డాక్యుమెంటు అనవచ్చు. ప్రజా సంఘాలకు పార్టీకి గీటురాళ్లు లేవు. అప్పుడప్పుడే నిర్మాణ మవుతున్న లోపాలని ఈ నాడు అర్ధం అవుతున్నాయి. ఏది ఏమైనా దేశ సమాజ స్థితి గతుల్లో మార్పు రావాలంటే సాయుధ పోరాటం ద్వారానే సాధ్యమవుతుందని విప్లవ పార్టీ, సాంస్కృతిక రంగంలో పోరాటం విరసం చేస్తుందని విరసం తన మేనిఫెస్టోలో నిర్వహించుకుంది.

ఇదీ విప్లవ కవితా ఉద్యమం ప్రారంభమయ్యే వాటికి ఉన్న సాహిత్య స్థితి. ఇక్కడ నుంచి విప్లవ కవితోద్యమాన్ని వీక్షించాలి. విరసం ప్రారంభం కాకముందు నుంచి కవిత్వం రాస్తున్నవారు కొందరు విరసంతో కొనసాగారు. కొందరు దేశ అత్యవసర కాలంలో విరసం నుంచి వైదొలిగారు. అన్ని నిర్బంధాలకు వెరవకుండా కొనసాగుతున్న కవులు కె.వి. రమణారెడ్డి, చెరబండరాజు వరవరరావులను ప్రముఖంగా చెప్పుకోవాలి. వీరిని శ్రీ శ్రీ పైకి విరసంలో వీర శైవులు అని ఒకసారి

చమత్కరించారు. రమణా రెడ్డి ఈ జాతికి చెందిన ప్రజా కవి. ప్రజా ఉద్యమాలు ఏ రూపంలో ఉంటే అప్పటికి ఆ రూపంలో ఒక భాగంగా రమణా రెడ్డి గారు నడిచారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్య వలలు పన్ని మభ్యపెట్టే వర్గాల ధౌష్ట్యానికిపజలు బలి కాకుండా నిజమైన ప్రజావైఖరిని సమర్థిస్తూ తన అక్షర శక్తిని వారికే అర్పించారు. ............ఆనాడు "అడవి" లో తరువాత "భూవన ఘోష"లో మరి "అంగార వల్లరి"లో ఇప్పుడు ఈ "ఎర్ర పిడికిలి"లో ప్రతి అక్షరం వెనుక ప్రజా హృదయ స్పందన ఉంది. ఇంతకుముందున్న కావ్యాలలోని సంక్షిప్తత "ఎర్ర పిడికిలి" లో తగ్గింది. సూరీడు మావోడులో ఇంకా తగ్గి పాఠకులకు చేరువైంది.

దిగంబర కవులతో మొదలైన దేశ స్వాతంత్ర్య భావన దాదాపు చాలా మంది విరసం కవులు తమ కవితల్లో పునరావృతం చేస్తారు. చెరబండరాజు "ఆగష్టు పదిహేను ద్రోహం చెప్పక పోతే నాకు అన్నం సహించద"న్నాడు. ఇదే అభిప్రాయాన్ని అలిశెట్టి ప్రభాకర్ "స్వాతంత్ర్యము ఒక మేడి పండు" అన్నాడు. కె. వి. రమణారెడ్డి "ఎర్ర పిడికిలి" కవితా సంకలనంలో

"ఆగష్టు 15(1947) అర్ధరాత్రి సమయం
అస్వాభావికంగా భారత స్వాతంత్ర్య భానూదయం?
........శవం మీద ముసుగ్గా నిలిచి వున్న మువ్వన్నెల(మెకాల) జెండా స్వాతంత్ర్యాలను చావుగొట్టి చెవులు మూసే రక్షకభటుల తండా"

దేశం స్వతంత్రం కాలేదని, అధికార మార్పిడి జరిగిందని, దేశం ఆ విదేశీయుల కనుసన్నల్లో ఉండడం వల్ల దేశం దళారీ, బూర్జువా, అర్ధ వలస, అర్ధ భూస్వామ్య వ్యవస్థగానే ఉందని, కాబట్టి ఇక్కడ జరగవలసింది సోషలిస్టు విప్లవ కాదని, శాంతి యుత పద్ధతుల ద్వారా మార్పు జరగదని విరసం విశ్వసిస్తుంది. రైతాంగం అధికంగా ఉన్న ఈ దేశంలో వ్యవసాయక విప్లవం ద్వారా నూతన ప్రజాస్వామిక విప్లవం జరుగవలసి ఉందని పోరు బాటలోనే ఈ దేశం విముక్తి అవుతుందని విరసం భావిస్తుంది. ఈ భావన విప్లవ కవిత్వమంతా విశాలంగా పరచుకుని ఉంటుంది. ఈ భావనను పునాదిగా చేసుకుని అన్ని ప్రభుత్వ రంగ వ్యవస్థలలోని డొల్లతనాన్ని విప్లవ కవిత్వం ఎత్తి చూపుతుంది.

తొలిరోజుల్లో ఉన్న అభి వ్యక్తి లోని భాషా తీవ్రత తదనంతర కాలంలో పరిణితి సాధించింది. భావంలో తీక్షణమైన కఠోర వాస్తవాల్ని కవిత్వంలో వ్యక్తీకరించడం ప్రారంభమైంది. ఝుంఝు కవితా సంకలనంలోని సోమయ్య రాసిన కవిత "సైన్యంలో

చెరకు"లో

సైన్యం లో చేరకు
ఆ రోజో ఈ రోజో
రాజ్య మేలాలంటే
ఈ సైన్యం ఆ సైన్యం కొట్టుకు చావాలి
ఈ దేశపు పేదోడూ ఆ దేశపు పేదోడూ
కొట్టుకు చావాలి
సైన్యంలో చేరండంనే దేశభక్తి పూర్వకమైన పదాల
లో మోసపోయి..............
నీ ముందు ఉన్నోడు ఇరోది కాడు
గుండెనీ డొక్కనీ గుండెలో

గుచ్చుకుంటుందని మాటియ్యి, ఇద్దరం కలిసి కలియబడదాం" అని కవిత ముగుస్తుంది. ఝుంఝు ప్రచురించిన నాలుగు నెలలకే సంకలనాన్ని ప్రభుత్వం నిషేధించింది. పదేళ్ల తరువాత బాల గోపాల్ దేశభక్తిని విశ్లేషిస్తూ సుదీర్ఘ వ్యాసంలో ఆ భావన వర్గ ప్రయోజనాన్ని వివరిస్తారు. కడుపు మండిన వారు కాలిన వారు ఏ దేశస్తులైనా ఒకటేననే భావన ఆ కవితలో రచయిత చెప్పదలుచుకున్నారు. జాషువా చెప్పిన విశ్వనరుడు ఇందులో ఉన్నాడు అనిపిస్తుంది. దాదాపు 1980 వరకు విరత కవిత్వంలో ఇదే పోకడలు ఉన్నాయి.

విరసం ఆశించే విప్లవోద్యమం 80ల తర్వాత తీవ్రతరమైంది. గ్రామాలలోనూ భూ పోరాటాలు ఆరంభమైనాయి. భూస్వాముల అణచివేతకు పోలీసులూ సహకరించి హత్యలు, ఎన్కౌంటర్లు చేశారు. దండకారణ్యంలో ప్రవేశించిన దళాలు ఆదివాసుల సమస్యలపై పోరాటాలు చేసే క్రమంలో ఆదివాసులు, దళాలు ఏకమైనారు. ఈ సంఘర్షణ తీవ్రమైన క్రమంలో, కవితల్లో మార్పులు గోచరమవుతాయి. సమాజ స్థితిని వివరిస్తూనే అణచివేతను, ఉద్యమం విస్తరించే క్రమాన్ని, వివరించే కవితలు వచ్చాయి. ఉద్యమ అనివార్యత తాత్త్విక స్థాయిలో ప్రతిపాదించే కవితలు వెలువడ్డాయి. దీనికి పునాదులు మళ్ళీ డబ్బైనుంచే చూడాలి. 1974లో వరవరరావు "ఊరేగింపు" కవితా సంకలనాన్ని పుచురించారు. అందులో టైటిల్ కవిత డాక్యుమెంటరీ కవిత. జగిత్యాల జైత్ర యాత్ర పై కూడా ఒక డాక్యుమెంటరీ కవిత రాశారు. ఖమ్మంలో జరిగిన మొదటి విరసం సభల

ఊరేగింపే, ఊరేగింపు కవితా సంకలనం. ఈ సంకలనంలోని ఓ కవిత శీర్షిక తూర్పున ఉదయించిన ఎర్ర జెండా ఆకారం నిండా వెలుగుతుంది లో,

వెలుతురులో మెరుస్తున్న రోడ్డు
శ్రీకాకుళం ఒర లోంచి దూసి
దోపిడి రాజధాని గుండెల్లో గుచ్చిన కత్తి లాగా ఉన్నది
ఈ కత్తి అంచు మీద సిద్ధాంతం పదునెక్కుతున్నది.
చీకటి నిద్రలో చిదమిన దీపంలా మెరుస్తున్న కల
గ్రామాల్లో ప్రజలు మేల్కొంటారు.

కళ్ళల్లో తెల్లవారుతూ ఎర్రజెండా ఉదయిస్తుంది అని ఆత్మ విశ్వాసాన్ని ప్రకటిస్తారు. తన రాజకీయ సైద్ధాంతిక ఆవరణను కళాత్మకంగా తీవ్ర స్వరంతో చెప్పగలిగిన వారే కాబట్టి విరసంలో వీరశైవుడు అనిపించుకున్నారు శ్రీశ్రీతో. దేశంలోనే కాదు అంతర్జాతీయ సంఘటనలపై తన దృక్పథాన్ని ఎప్పటికప్పుడు కవితాత్మకంగా చెప్పగలిగిన వారు వరవరరావు.

17 జూలై 25న గిరాయిపల్లి అడవుల్లో సూరపనేని జనార్ధన్ సుధాకర్, మురళీ మోహన్ రెడ్డి, ఆనంద్ రావులను చెట్లకు వేలాడదీసి కాల్చి చంపారు. జననాట్యమండలి ప్రదర్శనల్లో వీరి మరణాల్ని ఒగ్గు కథ గా ప్రదర్శించేవారు. విప్లవ ఉద్యమ చరిత్రలో అత్యంత కిరాతకంగా జరిగిన ఈ ఎన్కౌంటర్ పై న్యాయ విచారణ జరిగినా ఫలితం లేకపోయింది.

> 17 జూలై 25న గిరాయిపల్లి అడవుల్లో సూరపనేని జనార్ధన్ సుధాకర్, మురళీ మోహన్ రెడ్డి, ఆనంద్ రావులను చెట్లకు వేలాడదీసి కాల్చి చంపారు. జననాట్యమండలి ప్రదర్శనల్లో వీరి మరణాల్ని ఒగ్గు కథ గా ప్రదర్శించేవారు.

ఈ ఒగ్గు కథ ప్రదర్శన ప్రేక్షకుల్లో ఉత్కంఠ రెపి గొప్ప సందేశాన్ని ఇచ్చేది. చెరబండరాజు వీరి స్మృతిలో అదే రోజున దీపం అనే శీర్షికతో కవిత రాశాడు. ఒక్కొక్కరికి ఒక్క స్టాంజా తో వివరించారు. కుత్తుకలూ తెగిపడినా

మొండేలతో అడ్డుకుని శత్రువర్గ తూటాలను దూసుకొని పోనివ్వం అని

పట్టుదలను వివరిస్తారు. గ్రామీణ నేపథ్యం ముఖ్యంగా వ్యవసాయ జీవితంతో పరిచయం ఉన్న వాడు, కాబట్టి చరబండరాజు వ్యక్తీకరణ, కవితా శిల్పం మిగతా కవుల కంటే కొంత భిన్నంగా కనిపిస్తుంది. "గౌరమ్మ కలలు" కావ్యానికి రాసుకున్నా ముందుమాటలో కవిత కంటే పాటే మన సందేశం ప్రజల్లోకి సులభంగా లోతుగా వెళుతుందని అన్నారు. ఆ పద్ధతిలో ఆయన రాసిన గేయ కవిత "కొండలు పగలేసినం", "పుత్తడి బొమ్మ పూర్ణమ్మ", "చెల్లీ చంద్రమ్మ" వంటి గేయాల సరసన మారిన చారిత్రక సందర్భంలో గుర్తించదగిన గేయం విభిన్న వృత్తుల వాళ్లు సమాజానికి తమ ఉత్పత్తులను అందించి ఏమి మిగుల్చుకున్నారని ప్రశ్నిస్తూ "కారణాలు తెలిపినం

ఆయుధాలు పట్టినం
మా యుద్ధం ఆపకుండా
విప్లవాలు నడిపెదం
చావు మీదిరో

గెలుపు మాదిరో" అని ప్రజాయుద్ధ పంథాను చెబుతారు. ఈ గేయాన్ని సినిమా వాళ్ళు అడిగితే చెరబండరాజు ఇవ్వలేదు. ఆయన క్రమశిక్షణ అది.

చెరబండరాజు కవిత్వం లో అన్వయ కాఠిన్యం లేకుండా సరళమైన భావాల్ని చెప్పగలడు. భావాన్ని సరళీకరించి చెప్పగల నేర్పు ఆయనది. ప్రపంచ పురోగతి సొంతం శ్రమజీవి నెత్తుటి బొట్టునే ఇమిడివుంది.

"............ఈ మట్టి నాకు
పట్టెడన్నం పెట్టి పాలు తాపింది.
రాక్షస భూస్వామ్య రంపపు కోతల్నుంచి

తనను విముక్తి చేసి రుణం తీర్చుకుంటాను." కమ్యూనిస్టు మేనిఫెస్టోల్లో లాంటి వాక్యాలివి. కవిత్వాన్ని నినాదంగా మలచగల వాడు చెరబండరాజు ఉద్యమానికి ఊరేగింపులో నూ బాగా పనికి వచ్చినాయి. ఓ కవితలో ఈ మట్టిని తలుచుకుని విప్లవాలు లేస్తున్నై / ఎరుపెక్కిన ఈ మట్టికి మా నెత్తుటి స్వాగతాలు వంటివి గోడల మీద కనిపించేవి..

విప్లవ సాహిత్యానికి దిశానిర్దేశం చేసిన కవిత శివసాగర్ రాసిన "నరుడో భాస్కరుడా" చాగంటి బాస్కరరావు గుంటూరు నుండి వచ్చి శ్రీకాకుళ పోరాటంలో అమరుడైనాడు. ఆయన స్మృతి లోనే కవిత ఇది. శ్రీ శ్రీ దీన్ని టైటిల్ సాంగ్ అని, రావి

శాస్త్రి ఆల్కహాలిక్ హైమ్ అని అన్నారు.

శివసాగర్ ప్రవేశంతో విప్లవ కవిత అడవి బాట నుండి బయలుదేరింది. పూర్తికాలం ఉద్యమములో రహస్య జీవితం గడుపుతూనే చాలా మంది విప్లవకారులు గొప్ప కవిత్వం రాశారు. అందులో ఒకరు శివసాగర్ ఆయన అమరత్వం అనే కవితలో విత్తనం చనిపోతూ పంటను వాగ్దానం చేసింది.

..........సూర్యాస్తమయం చేతిలో చేయి వేసి

సూర్యోదయాన్ని వాగ్దానం చేసింది. అమరత్వం రమణీయం అని త్యాగాల విశిష్టతను గురించి రాయడానికి "యాంటీడ్యూరింగ్" లో ఏంగెల్స్ రాసిన మాట ప్రేరణగా రాసిందంట. "ఒక్కో అమరుణ్ణి గురించి ఏమని ఎంతని రాయాలి? అందుకని అమరత్వాన్ని జనరలైజ్ చేసిరాశా"నన్నారు శివసాగర్, అమరత్వం "అది కాలాన్ని కౌగలించుకుని/మరో ప్రపంచాన్ని వాగ్దానం చేసింది " అని రివిజనిస్టులకు సమాధానమిచ్చారు. ఇదే భావాన్ని "చను బాల ధార" కవితా సంకలనంలో చెప్పాడు. అందులోని మీకోసం నేనోపద్యం రాస్తాను. శీర్షికలో కవితలో

"చావుదేముంది
బ్రతకడం శాశ్వతమైతే కదా!
క్షణకాలం బతికినా సరే
పరిమళ భరితంగా బతకడం

చుట్టూ ప్రపంచాన్ని పరిమళం చేయడం" అని త్యాగం వృథా కాదని చెబుతారు. ఆ భావాన్ని అలంకారికంగా తాత్విక స్థాయిలో వివరించడంలోని కవి నైపుణ్యం గమనించ తగ్గది. నగరాలలోని కవులకు సరితూగే ఓ సందర్భంలో అంతకంటే మెరుగైన కవిత్వం అజ్ఞాత కవుల నుంచే వెలువడింది. అందులో ప్రముఖంగా చెప్పుకో దగిన వాళ్ళు అజ్ఞాత సూరీడు, సముద్రుడు, కౌముది, రిక్కల సహదేవ రెడ్డి, నూతన్, ఎమ్.ఎస్.ఆర్ ల కవిత్వం విప్లవ కవిత్వానికి కొత్త ఒరవడిన దిద్దారు. వీటన్నిటిని కలిపి ఓ సంకలనం చేస్తే విప్లవ కవిత తెలుగు సమాజానికి కాదు, మొత్తం శ్రామిక వర్గానికి అది అందించిన సందేశం ఎంతటి మహోన్నతమైందో ప్రపంచానికి తెలుస్తుంది. దీర్ఘ కవితలు రాసిన వీళ్లలో చాలామందే వున్నారు. విమల రాసిన "కన్న తల్లీ" దీర్ఘ కావ్యం, వరవరరావు రాసిన 'సముద్రం' ఎన్.కె. రాసిన లాల్ బనో గులామీ చోటో బోలో వందేమాతరం అన్న కవితలు మూడు మూడు విధాల ఉత్కృష్టమైన కావ్యాలే.

> విప్లవ కవిత్వం నర్మగర్భంగా, నిగూఢతను సంతరించుకుని, రూపంలోను పాఠంలోను పరిపక్వతను సాధించి విస్తృతంగా వస్తున్నది.

విప్లవ కవిత్వం నర్మగర్భంగా, నిగూఢతను సంతరించుకుని, రూపంలోను పాఠంలోను పరిపక్వతను సాధించి విస్తృతంగా వస్తున్నది. కేవలం రైతాంగ పోరాటాలు, నిర్బంధాలు, రాజ్యహింస మాత్రమే కాకుండా, మధ్య తరగతి జీవితాన్ని మానవ సంబంధాలని, వాటిలోని హిపోక్రసిని, డొల్లతనాన్ని అతలాకుతలమైన సమాజాన్ని ప్రతిఫలిస్తూ, మధ్య తరగతి విలువలని విప్లవ రాజకీయాల వెలుగులో ప్రశ్నిస్తూ తిరస్కరిస్తూ విప్లవ కవిత్వం విరివిగా వచ్చింది. రాజ్యహింస నిర్బంధాల పట్ల మధ్య తరగతి నిర్లిప్తత ప్రశ్నిస్తూ కుదుపుతూ కవిత్వం రాశారు"(50ఏళ విరసం పేజీ 48-49) అని దాదాపు ఖచ్చితంగా అంచనా వేశారు.

జాతుల పోరాటాలు, అస్తిత్వ పోరాటాలు అత్యయిక పరిస్థితి ప్రభావం, భోపాల్ గ్యాస్ సంఘటన, గుజరాత్, ఒరిస్సా, కారంచేడు, చుండూరు వంటి అన్ని అణచివేత సంఘటనలపై జీవిత స్పందనలున్నాయి. గత ఇరవై ఏళ్ల నుంచి కవిత్వం కంటే కథా నవలలపైనే విరసం రచయితలే కాక అజ్ఞాత రచయితలు కూడా దృష్టి పెట్టారు. నిజానికి నేటి వ్యవస్థకు కవిత్వం కంటే కథా నవలలే కావాలని - త్రిపురనేని మధుసూదనరావు గారంటారు. ఇదే అభిప్రాయాన్ని ప్లెహనోవ్ కె.వీ. ఆర్ లాంటి వాళ్ళు కూడా సమర్థించారు. ఎన్. వేణు, పాణి, వడ్డెబోయిన శ్రీనివాస్, గీతాంబర్ వంటి వారు రాస్తూనే ఉన్నారు. గతంలో తిరుపతి నుంచి సాలా త్రిపురనేని శ్రీనివాస్, పల్లామ్ తిరుపాలు, చంద్రహాస, ఇంద్రవెల్లి రమేష్, రాము వంటి వాళ్ళు రాసేవారు.

ఏది ఏమైనా అన్నీ సాహిత్య రంగాలపై విరసం ప్రధాన ముద్ర వేసింది. అనేక నిర్బంధాలను, నిషేధాలను అనుభవించి, అనుభవిస్తూ ఉంది. ఇవాళ కవిత్వం, కథ, నవల ఏది రాసినా కాలక్షేప రచనలు మాత్రం కానరావు. విమర్శ రంగం కూడా అందుకు మినహాయింపేమీ కాదు. 50 సంవత్సరాల పయనంలో ని గమనానికి ఈ వ్యాసము ఒక విహంగ వీక్షణమే. సమగ్ర అధ్యాయంలో విరసం ప్రభావం తెలుస్తుంది.

# స్త్రీవాద-కవిత్వం



డా. కందాళ శోభారాణి
89786 56327

1980 ప్రాంతాల్లో విస్తృతమైన చర్చలు,సభలు, సమావేశాలు, అవగాహన సదస్సులు జరిగాయి. అవసరమైన స్త్రీవాద భావ వ్యాప్తిని కలిగించాయి కవిత్వంలో. వచన రచనలు, ఉద్వేగభరితమైన ఆవేశపూరితమైన ఆగ్రహం నిండిన స్వరాలు అనేకం వచ్చాయి. అంతర్జాతీయ మహిళా దశాబ్ద నేపధ్యంలో స్త్రీవాద కవిత్వం ఒక ఉద్యమంగా పుట్టుకొచ్చింది.

1980ల తర్వాత తెలుగు సాహిత్యంలో స్త్రీవాదం ప్రభంజనంలా దూసుకొచ్చింది. తరతరాల, యుగయుగాల స్త్రీల రాపిడి వేదన తహతహలు, తపన, గొప్ప గొప్ప కవితా వస్తువులయ్యాయి. దుఃఖ పడటం, బాధపడటమే తెలిసిన స్త్రీ రుద్ర కాళిక రూపం దాల్చినట్లు అయింది. 1960లో వచ్చిన స్త్రీ వచన రచనలకు, 1980 తర్వాత దూసుకొచ్చిన స్త్రీల కవిత్వానికి పొంతన లేదు. ఆనాటి రచయిత్రులకు లేని తాత్విక పునాది సామాజిక చైతన్యం ఈనాటి కవయిత్రులు పుణికి పుచ్చుకున్నారు. అనూహ్యమైన విజయాలను సాధించారు. స్త్రీవాదం ఒక కొత్త తాత్విక పునాదిని వెలుగులోకి తీసుకొచ్చిందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

స్త్రీవాదం పుణ్యమా అని "గురి చూసి పాడే పాట" స్త్రీల కవితా సంకలనం 1992లో వచ్చింది. సంవత్సరం తిరక్కుండానే అచ్చులో వచ్చిన "నీలిమేఘాలు" ఎన్నదగిన కవితా సంకలనాలుగా విమర్శకుల మెప్పు పొందాయి.

శీలా సుభద్రాదేవి స్త్రీగా, స్త్రీల పక్షాన, స్త్రీల మనోభావాలకు అస్తిత్వం కోసం స్త్రీలు పడే ఆరాటాలు అర్థం చేసుకొని స్త్రీవాద కవిత్వం రాశారు. 1980 నుండి 2009 వరకు ఆరు కవితా సంపుటాలు వెలువరించారు. ఇంట్లో నైతేనేం, సమాజంలో నైతేనేం, అన్ని చోట్ల వెనుకబాటుతనం .అని స్త్రీ విస్మృతిని బాధతో నిరసన వ్యక్తం చేశారు. "పడుగు పేక" అనే కవితలో. తరతరాల ఆంక్షల, అవమానాల దుఃఖ

చరిత్ర స్త్రీలది. స్త్రీల జీవితం, స్త్రీల ది కాకుండా పోవటం స్త్రీలను ఎంత హింసకు గురి చేస్తుందో, “కాలసముద్రంలో బిందువు” అనే కవిత తెలియజేస్తుంది. స్త్రీల సమస్యలను కవిత్వ వస్తువు గా చేసుకొని ,స్త్రీలు తమను తాము తెలుసుకుంటూ ఆత్మగౌరవంతో జీవించే మానవ హక్కుల కోసం తమను తాము ఆయుధంగా మలుచుకోవాలని ‘ఇంధనం’, ‘అనుభవసారం’, ‘ఆత్మసాక్షాత్కారం’ వంటి కవితలలో చిత్రించారు.

30 ఏళ్ల స్త్రీ జీవితాన్ని మూడు ముక్కల్లో చక్కగా చెప్పింది “బందిపోట్లు”కవిత. ‘తివాచీ’, ‘సర్ప పరిష్వంగం’,‘కాల్ గర్ల్స్’, ‘మోనో లాగ్’, ‘వంటిల్లు’, ‘లేబర్ రూమ్’ వంటి లెక్కలేనన్ని కవితలు అద్భుతంగా రూపొందాయి. ఇంతమంది రచయిత్రులు వెలుగులోకి రావడానికి స్త్రీవాద తాత్వికతకి ఉన్న గాఢత్వం అని చెప్పవచ్చు.

> 1980 నుండి స్త్రీవాద కవిత్వంలో స్త్రీలు రాస్తేనే స్త్రీవాదం బలంగా చూపగలరని నిర్ణయానికి వచ్చారు. స్త్రీలు తమ కష్టాలను తామె అనుభూతులుగా వ్యక్తపరిచే కవిత్వం కావాలి. తమ బాధలను సానుభూతిగా పురుషులు వ్యక్తపరచడం స్త్రీవాదులు కోరుకోలేదు.

1980 నుండి స్త్రీవాద కవిత్వంలో స్త్రీలు రాస్తేనే స్త్రీవాదం బలంగా చూపగలరని నిర్ణయానికి వచ్చారు. స్త్రీలు తమ కష్టాలను తామె అనుభూతులుగా వ్యక్తపరిచే కవిత్వం కావాలి. తమ బాధలను సానుభూతిగా పురుషులు వ్యక్తపరచడం స్త్రీవాదులు కోరుకోలేదు. రేవతీదేవి “శిలాలోలిత” అనే కవితా సంపుటి 1984లో ఆంధ్రజ్యోతి వారపత్రికలో, సావిత్రి అనే కవయిత్రి రాసిన “బందిపోట్లు” కవిత వంటివి, పాతివ్రత్యంతో కూడిన శీలం అనేది కేవలం స్త్రీకి ఒక్కదానికేనా అనే ఆలోచనతో ప్రశ్నించటం ఆ కాలంలో కనిపిస్తుంది.

1990లో కొండేపూడి నిర్మల “సందిగ్ధ సంధ్య,” “నడిచే గాయాలు” అనే కవితా సంపుటాలు వెలువరించారు. అనంత నీలాకాశంలో తమ బరువంతా లోలోపల దాచి హాయిగా,ఆహ్లాదంగా,తేలికగా మరో పనేమీ లేదన్నట్లుగా కనిపించే

విధంగా చూస్తుండగానే గాఢంగా దట్టంగా ప్రజలకు అందిన అద్భుతమైన కవితా సంకలనం ''నీలిమేఘాలు''(1993) నల్లజాతి కవయిత్రి ఆడ్లార్డ్ స్మృతికిచ్చిన అస్మిత సంపాదకత్వంలో వచ్చింది..

స్త్రీ వాదానికి ఒక తాత్విక పునాది ఉండటం వల్ల చాలామంది మహిళలు యుగయుగాల వేదనలను, తపనను బలంగా ప్రతిభావంతంగా తమ కవితల్లో ప్రతిఫలింప చేశారు. ''గురి చూసి పాడే పాట'', ''నీలిమేఘాలు'' సాహిత్య లోకంలో పెను సంచలనం సృష్టించాయి. ఆ తర్వాత 'సందిగ్ధసంధ్య', 'యశోధర', 'వగపెందుకే', 'నిర్వచనం', 'నేను కనిపించే పదం' మొదలైన స్త్రీవాద కవిత్వం విరివిగా వచ్చింది.

విమల రాసిన ''వంటిల్లు'' కవితలో 'ఈ వంటింటి సామ్రాజ్యానికి మా అమ్మ మహారాణి అయినా చివరకు వంటింటి గిన్నెల అన్నింటిపైన నాన్న పేరే. మనం ఏమైనా మన అంతిమ కర్తవ్యం గరిట తిప్పటంగా చేసిన ఈ వంటిల్లను ధ్వంసం చేద్దాం రండి'అంటూ విమల మహిళలందరికీ పిలుపునిచ్చింది.

స్త్రీవాద కవయిత్రులు 'రతి', 'ప్రసవం', 'వీర్యవర్షం', 'స్వప్నస్కలనం' మొదలగు అశ్లీల పదాలు ఉపయోగించారని నిందించారు. స్త్రీవాదం కొన్ని మౌలిక ప్రశ్నలు లేవనెత్తింది. స్త్రీ సెక్స్ పునరుత్పత్తి లో నిర్ణయాధికారం స్త్రీకి ఉండాలని చర్చించింది. స్త్రీ పురుషుల మధ్య సమానత్వం ఆశించింది. స్త్రీ పురుషులిద్దరూ పెట్టుబడిదారీ వ్యవస్థలో దోపిడీ చేయబడుతున్నారు. ఇద్దరూ దోపిడీకి వ్యతిరేకంగా పోరాడాల్సిన అవసరం ఉందని, ప్రపంచీకరణ వ్యాపార ధోరణులు, వస్తు వ్యామోహం మొదలగు వాటిని కవిత్వంలో చెప్పగలిగారు.

> స్త్రీవాద కవయిత్రులు 'రతి', 'ప్రసవం', 'వీర్యవర్షం', 'స్వప్నస్కలనం' మొదలగు అశ్లీల పదాలు ఉపయోగించారని నిందించారు. స్త్రీవాదం కొన్ని మౌలిక ప్రశ్నలు లేవనెత్తింది.

ప్రజల ఆలోచనలను చక్కదిద్ది జీవనం సులభతరం చేసేందుకు సాహిత్యం ఉద్యమంలా కృషి చేస్తుంది. తరాల తరబడి మగవాడి ప్రక్కటెముక నుంచి పుట్టినట్టుగా స్త్రీని చిత్రించి మనిషి మనుగడలో

కీలక భూమిక వహిస్తున్న మహిళలను వంటింటి కుందేలు గా మార్చేశారు. కొన్ని వందల ఏళ్ళపాటు సుదీర్ఘ పోరాటం చేసిన మహిళలు స్వతంత్ర వ్యక్తిగా గుర్తింపు పొందుతున్నారు. తమ సమస్యలను, బాధలను, అనుభవాలను, అనుభూతులను ఇష్టానిష్టాలను, తమ దృష్టి కోణాన్ని, తమదైన శైలిలో తమకు తాము చెప్పుకోవడంలో స్త్రీవాద ఉద్యమం మొదలైంది. గంభీరంగా మంద్రంగా కొనసాగుతూ వచ్చింది. ఫ్రెంచ్ లో సీమోన్ డిబావ్, ఇంగ్లీషులో వర్జీనియా వుల్ఫ్ లు నాటిన విత్తులు తెలుగులో శాఖోప శాఖలుగా విస్తరించి వృక్షంగా మారింది. స్త్రీవాద కవిత్వం విలాసం సరదా కోసం వచ్చింది కాదు . స్త్రీల ఉనికి కోసం వచ్చింది.

> వాస్తవానికి, గురజాడ స్త్రీ కోణం నుంచి ఆలోచించడం మొదలుపెట్టిన రచయిత. స్త్రీల అనుభవం పురుషుల అనుభవం కంటే భిన్నంగా ఉంటుందని ఆయన భావించాడు. స్త్రీల ప్రశ్నలు స్త్రీ జీవిత అనుభవం నుంచి వస్తాయి.

వాస్తవానికి, గురజాడ స్త్రీ కోణం నుంచి ఆలోచించడం మొదలుపెట్టిన రచయిత. స్త్రీల అనుభవం పురుషుల అనుభవం కంటే భిన్నంగా ఉంటుందని ఆయన భావించాడు. స్త్రీల ప్రశ్నలు స్త్రీ జీవిత అనుభవం నుంచి వస్తాయి. కాబట్టి వాటికి జవాబు చెప్పగల శక్తి పురుషుడికి లేదని గురజాడ అభిప్రాయం. స్త్రీల కోణం లో ఆలోచించిన ప్రథమ రచయితగా గురజాడను తీసుకోవచ్చు.

స్త్రీవాద ఉద్యమ స్పృహను అందిపుచ్చుకున్న తెలుగు కవయిత్రులు తమ భావాలను ఒక చోట గుదిగుచ్చి అందించిన కవిత్వ హారమే 'నీలిమేఘాలు' స్త్రీవాద కవిత్వసంకలనం. ఈ కవిత్వం ఎన్నో విమర్శలను వ్యక్తిగత దాడులను నిబ్బరంగా ఎదుర్కొన్నది. తన స్వచ్ఛమైన కవిత్వంతో అందరి నోళ్ళు మూయించ కలిగింది. ముఖ్యలక్ష్యాన్ని సాధించగలిగింది. 1) పితృస్వామ్యం, జెండర్, ఇంటి చాకిరీ, సంతానోత్పత్తి, కవిత్వంలో స్త్రీ కవయిత్రులు రాసిన భాష మొదలగు విషయాల గురించి ఎన్నో చర్చలకు దారి తీసింది. స్త్రీవాదం ఆనాటి సమాజంలో కొత్త ఆలోచనలు ముందుకు తెచ్చింది.

1990లో వచ్చిన కొండేపూడి నిర్మల ''లేబర్ రూమ్''భాష భావం రెండిరటిలోనూ తీవ్ర అలజడి సృష్టించింది. దీని గురించి వసంత కన్నబిరాన్ ఇలా అన్నారు "ఆ కవితంతా నిరాశ, పరాయికరణల ఉపమానాలతో నిండిపోయింది. పురుషులు పరోక్షంగా మాత్రమే ఉంటారు. బూటకపు కలల భ్రమలలో ఈ ప్రపంచమంతా తమ చుట్టే తిరుగుతుందనే విషయాన్ని ఎన్నడూ సందేహించని, ప్రశ్నించని పురుష పుంగవులకు ఒక స్త్రీ పవిత్ర మాతృత్వ వ్యవస్థనిలా తీసి పారేయటం నిజంగా చాలా భయాన్ని కలిగిస్తుంది. ఒక వ్యవస్థ చుట్టూ భ్రమలను myth లను ప్రశ్నించడం అంటే దానిమీద దాడి చేయడమే". ఇదే కవిత గురించి ఓల్గా ఇలా అన్నారు "పిల్లల్ని కనటం, మాతృత్వం ఒకటి కాదని స్త్రీలు తెలుసుకుంటున్నారు. ఈ రెండు వేర్వేరు విషయాలని అర్థం చేసుకున్న స్త్రీలు పిల్లల్ని కనటం మీ సామాజిక బాధ్యత అనటానికి సాహసించే వారికి, వారి సామాజిక బాధ్యతల్ని గుర్తు చేస్తారు. పిల్లల్ని కనాలా! వద్దా! అని ఎంచుకునే హక్కు స్త్రీకి ఉందని అది మానవ హక్కుల్లో ఒకటని అన్నారు".

> 1990లో వచ్చిన కొండేపూడి నిర్మల ''లేబర్ రూమ్''భాష భావం రెండిరటిలోనూ తీవ్ర అలజడి సృష్టించింది. దీని గురించి వసంత కన్నబిరాన్ ఇలా అన్నారు ''ఆ కవితంతా నిరాశ, పరాయికరణల ఉపమానాలతో నిండిపోయింది.

''పెద్దవ్వని చెప్తా'' అనే కవితలో శ్రీమతి, స్త్రీ పురుష సమానత్వం గురించి చాటి చెబుతుంది. వరకట్నాల దృష్ట్యా ఆడపిల్లలు మైనస్ లు, మగపిల్లలు ప్లస్ లు గా వ్యవహరించి వదలకుండా అన్నిటిలోనూ లెక్కలు వేసి మరీ తక్కువ చేస్తారు. అందుకే ఎంతో ఆశావహ దృక్పథంతో కవయిత్రి ఇలా అన్నారు. ''కానీ ఇప్పుడు నేనేం చేయగలను. పెద్దయ్యాక ప్రయత్నం చేస్తా. నాకు ఒక అమ్మాయి పుట్టాక అమ్మకు తన తప్పేమిటో తెలిసేలా చేస్తా''. ఘంటసాల నిర్మల 'జుగల్బందీ', పాటిబండ్ల రజని 'క్షుద్రానందం', జయప్రభ 'పైటని తగలెయ్యాలి' మొదలగు కవితలు కొందరి పురుషాహంకార పూరిత ప్రేలాపనలకు స్త్రీవాదులు ఘాటుగా ఇచ్చిన జవాబులు.

> లక్ష్మీ సుహాసిని 'కలలు కలవరం' కవిత్వ సంపుటిలో స్త్రీల సమస్యలు స్త్రీవాద చైతన్యానికి సంబంధించిన కవితలు అనేకం రాశారు.

లక్ష్మీ సుహాసిని 'కలలు కలవరం' కవిత్వ సంపుటిలో స్త్రీల సమస్యలు స్త్రీవాద చైతన్యానికి సంబంధించిన కవితలు అనేకం రాశారు. 'నేను మౌనంగా ఉండి పోను ఆడవారి మీద సాగే ప్రతి అనిచివేత అత్యాచారాల మీద, అక్షర యుద్ధం సాగిస్తాను' అంటూ స్త్రీల కోసం వాదించడం, స్త్రీ కోణాన్ని అర్థం చేసుకోవటం స్త్రీ వాద ఉద్యమం నుండి ఆమె అందిపుచ్చుకున్న చైతన్యం అని చెప్పవచ్చు.

స్త్రీవాద కవిత్వం వ్యవస్థను ప్రశ్నించడం తోనే ప్రారంభమైంది. పితృస్వామ్య వ్యవస్థ కారణంగా సమాజంలో వేళ్ళు పాతుకొని ఉన్న ద్వంద్వ ప్రమాణాలను స్త్రీ పురుషుల అసమానత అతి సహజమని పరిగణించే ఆలోచనా విధానాన్ని మార్చనవసరం లేదని భావించారు. కానీ ఆ జడత్వాన్ని స్త్రీవాద కవిత్వం ప్రశ్నించ గలిగింది. ఆనాటి వ్యవస్థను ప్రశ్నించడం, ధిక్కరించడం, కొత్త దృక్పథాలను ప్రతిపాదించడంలో స్త్రీవాద కవిత్వం శక్తివంతంగా పని చేసింది. జీవితాన్ని, సమాజాన్ని, మొత్తంగా ప్రపంచాన్ని స్త్రీల దృక్పథాలనుంచి చూడాల్సిన అవసరాన్ని స్త్రీవాద కవిత్వం నొక్కి చెప్పగలిగింది. స్త్రీవాద సిద్ధాంతాన్ని నాలుగు ప్రధాన ధోరణులుగా విభజించారు. అంటే సిద్ధాంతపరంగా స్త్రీవాద పరిణామక్రమంలో చూసినప్పుడు స్త్రీవాదం నాలుగు రకాలుగా చూడవచ్చని నిర్ధారించారు.

1. లిబరల్ స్త్రీవాదం 2.రాడికల్ స్త్రీవాదం 3.మార్క్సిస్ట్ స్త్రీవాదం 4.సోషలిస్టు స్త్రీవాదం. తెలుగు స్త్రీవాద సాహిత్యంలో పాశ్చాత్య దేశాల ఫెమినిజం లోని వివిధ సైద్ధాంతిక దృక్పథాలను, రాజకీయ లక్ష్యాలను విడివిడిగా గుర్తించడం కష్టమే. స్థూల దృష్టితో చూసినప్పుడు మార్క్సిస్టు, సోషలిస్టు, రాడికల్ స్త్రీ వాద దృక్పథం తెలుగు స్త్రీవాద సాహిత్యంలో తరచుగా కనబడుతుంటాయి. ఫలానా రచయిత్రులు నిర్దిష్టంగా ఫలానా ఫెమినిస్టు ధోరణికి చెందిన వాళ్లనో, ఒక రచయిత్రి సాహిత్యంలో పూర్తిగా ఫలానాధోరణి కనబడుతుందనో చూపించటం కష్టమే. ఇందుకు కారణం వివిధ సామాజిక, రాజకీయ ఉద్యమాల్లో స్త్రీలు పని చేయడం వాటికి అనుబంధంగా మహిళా సంఘాలు ఏర్పడటంగా కనిపిస్తుంది. ప్రత్యేకమైన ఫెమినిస్టు ఉద్యమాల చరిత్ర మనకు కనిపించదు.

స్త్రీవాదాన్ని ఒక సైద్ధాంతిక దృక్పథం గా పరిచయం చేస్తూ కొందరు రచయిత్రులు రాసిన వ్యాసాలు, స్త్రీవాద దృక్పథంతో గత, వర్తమాన సాహిత్యాన్ని విశ్లేషిస్తూ వాళ్ళు రాసిన విమర్శలు వచ్చాయి. కానీ సృజనాత్మక సాహిత్యం లోనికి నిర్దిష్టంగా ఫెమినిస్టు దృక్పథాన్ని అనువదించిన సందర్భాలు తక్కువ అని చెప్పుకోవచ్చు.

స్త్రీవాద కవిత్వంలో వస్తు విభజన స్థూలమైందిగా చెప్పారు. వీటిలో అంతర్విభజనలు ఉండవచ్చు. కానీ మొత్తం మీద స్త్రీ జీవితంలో పితృస్వామ్య వ్యవస్థ స్పృశించని భాగం గానీ,అంశం కానీ లేదని చెప్పవచ్చు. పితృస్వామ్య భావజాలం మూలాలు గుర్తించారు. ఆ మూలాల నుండి అస్తిత్వాన్ని పరిరక్షించుకుంటూనే కొత్త విలువలను అన్వేషించారు. అలాంటి అన్వేషణ వ్యక్తిగతం కాకుండా సామూహికంగా చైతన్య పరిచిందే స్త్రీవాద కవిత్వ ఉద్దేశ్యంగా చెప్పవచ్చు.

స్త్రీవాద కవులు రజస్వల గురించి చెప్పినా, అబార్షన్ ను వర్ణించినా, లేబర్ రూము చిత్రించినా వారందరి గొంతులు స్త్రీ జాతి మొత్తానికి ప్రాతినిధ్యం వహించినవే. 1972లో ఓల్గా రాసిన ‘‘ప్రతి స్త్రీ ఒక నిర్మల కావాలి’’ కవితతో స్త్రీవాదం ప్రారంభం అయినట్టు చెప్పబడినది. అది ఉద్యమ రూపం పొంది, సమకాలీన సాహిత్యాన్ని కదిలించింది మాత్రం 1977 తర్వాతనే అని చెప్పవచ్చు.

> “స్త్రీవాద కవులు రజస్వల గురించి చెప్పినా , అబార్షన్ ను వర్ణించినా, లేబర్ రూము చిత్రించినా వారందరి గొంతులు స్త్రీ జాతి మొత్తానికి ప్రాతినిధ్యం వహించినవే.”

స్త్రీవాద కవిత్వంలోని ప్రధాన వస్తువులు ఇలా చెప్పబడ్డాయి. 1.వ్యక్తిగా తమ ఉనికి, 2.మాతృత్వం, 3.లైంగిక వివక్ష, 4.శారీరక స్పృహ, 5. వివాహ వ్యవస్థ, 6.కుటుంబంలో హింస, 7.సామాజిక జీవితం, 8.ప్రపంచీకరణ, 9.తిరుగుబాటు, 10. విప్లవం.

స్త్రీల అస్తిత్వం అంటే వాళ్ళ శరీరాలనే భావనను స్త్రీవాద కవిత్వం ఖండించింది. ‘శిలాలోలిత’ రాసిన కవిత ‘‘పరాయి ముఖం’’లో ఆగి ఆగకుండా నన్ను నేను వెతుక్కునే దారిలో /ప్రతిసారి ముఖం కనిపించని /శరీరమే కనిపిస్తుంటుంది. అని వేదన వ్యక్తపరిచింది.

''ఆడదై పుట్టే కంటే అడవిలో మ్రానై పుట్టడం మేలని'' భావించేలా పితృస్వామ్య వ్యవస్థ చేస్తుందని, తమ ఉనికే నిషిద్ధమని చెప్పే కవిత శ్రీమతి రాసింది. 'నేనమ్మ లో ఉన్నప్పుడు/మొన్నటిదాకా నా నవ్వు నిషిద్ధం;నిన్న నా చదువు నిషిద్ధం/ నేడు నా బ్రతుకు కూడా నిషిద్ధమే' అని చెప్పింది. స్త్రీలు ఏది మాట్లాడాలో ఏది మాట్లాడకూడదో నియంత్రించే పితృస్వామ్య సంస్కృతిని రేవతీదేవి ''మూగవోయిన గొంతు''అనే కవితలో చెప్పింది.

2 కొండేపూడి నిర్మల "లేబర్ రూం" కవితలో

బల్ల కొక బాధల నది

కాగితప్పడవలా చివికి చీలి పోతున్న రోదనల గది.

.......

కాళ్లనలా ఎడం చేసి దీనంగా హీనంగా నీచాతి నీచంగా.

ఒక హింసాతల పరాకాష్ట కోసం ఎదురు చూడ్డమంటే

రైలు పట్టా మీద నాణం విస్తరించిన బాధ

కలపను చెక్కుతున్న రంపం కింది పొట్టులా

ఉండ చుట్టుకున్న బాధ

......

చావుకి బతుక్కి మధ్య పిసరంత గీటు లేదు.

పురిటి నొప్పుల మీద కవిత్వం ఏమిటి ?అని శారీరక ధర్మాలనిలా ఏకరువు పెట్టుకోవడంలో సామాజిక ప్రయోజనం ఏమిటని అభ్యంతరం చెప్పిన వాళ్ళు ఉన్నారు. ఇలాంటి భావన కలిగిన పితృస్వామ్య వ్యవస్థను ఆనాడు స్త్రీవాదం ఖండించింది.

మాతృత్వం అంటే ఒక ఆనందమని ప్రచారం సమాజంలో జరుగుతూ వచ్చింది. దాంతో పాటు దాని వెనక ఉన్న శరీర హింసను స్త్రీలు పిల్లల్ని కనాలా?వద్దా? అనే స్త్రీల నిర్ణయం, అభిప్రాయంతో పని లేని మాతృత్వ స్థితిని చిత్రించిన కవిత్వాన్ని స్త్రీవాదం వ్యతిరేకించింది.

వసంత కన్నబిరాన్ "శరీరం" అనే కవితలో కూడా ఇది గమనించవచ్చు. స్త్రీల పునరుత్పత్తి హక్కుల గురించి మాట్లాడకుండా కేవలం స్త్రీని సంతానాన్ని కనే యంత్రంగా చూడటాన్ని స్త్రీవాద కవిత్వం గుర్తించింది.

స్త్రీ పురుషుల మధ్య బాల్యం నుంచి చూపే వివక్షే కాకుండా,కడుపులో ఉన్నది ఆడపిల్ల అని తెలియగానే పుట్టకముందే చంపడం వరకు విస్తరించింది. జయప్రభ "వామనుడి మూడో పాదం"కవితలో 'విక్రమించే వామనుడి/విశ్వవ్యాప్తంగా/ గర్భంలో పెరిగే శిశు దశ నుంచి ఆడతనం పై అత్యాచారం' అంటుంది.

ఆడపిల్ల పుట్టినప్పటినుండి వృద్ధాప్యం వచ్చే వరకు ఎలాంటి నియంత్రణలో, చులకన తో బతుకుతుందో రజియా బేగం "పెద్దవ్వని చెప్తా" కవితలో అద్భుతంగా చిత్రించింది. ఇటువంటి వివక్ష వల్ల స్త్రీ పెద్దదైనా ఆమెను నిశ్శబ్దం,మౌనం ఆవరించిన తీరును "స్వర స్థాపం" కవితలో పాటిబండ్ల రజని చెప్పింది. స్త్రీ జీవితం పురుష స్వామ్యం చూపే వివక్ష, నియంత్రణ వల్ల నిశ్శబ్దంగా మారిన స్థితిని చక్కగా వర్ణించారు. తరతరాలుగా పురుషులు తమ సాహిత్యంలో చేసే స్త్రీ శరీర వర్ణనకి, స్త్రీలు చేసే వర్ణనకి చాలా వ్యత్యాసం ఉంది. స్త్రీ శరీర సౌందర్యం వెనక ఉన్న హింసను, శరీరం వల్ల స్త్రీ పొందే బాధలను స్త్రీవాదులు చిత్రించారు.

> "ఆడపిల్ల పుట్టినప్పటినుండి వృద్ధాప్యం వచ్చే వరకు ఎలాంటి నియంత్రణలో, చులకన తో బతుకుతుందో రజియా బేగం "పెద్దవ్వని చెప్తా" కవితలో అద్భుతంగా చిత్రించింది."

శరీరానికి సంబంధించిన కవితల్లో కొండేపూడి నిర్మల "రహస్తంత్రి", కె గీత "నేను ఋతువునైన వేళ" రజస్వల అయినప్పుడు ఆడపిల్లల మానసిక స్థితి ఎలా ఉంటుందో చిత్రించారు. స్త్రీ శరీర హింసకూ,మనసుకూ ఉన్న సన్నిహితమైన సంబంధాన్ని అబార్షన్ అయినప్పుడు స్త్రీలకు కలిగే వేదనను "అబార్షన్ స్టేట్మెంట్" కవితలో 'అయ్యో పాలింకి పోవడానికున్నట్లు మనసింకిపోవడానికి మాత్రలుంటే ఎంత బాగుండు' అని పాటిబండ్ల రజని ఆర్తిని, ఆవేదనను వ్యక్తీకరించిన తీరు కంటతడి పెట్టిస్తుంది. విమల రాసిన "సౌందర్యాత్మక హింస" లో స్త్రీల శరీరం ఒక భోగవస్తువుగా తీర్చిదిద్దిన దాని వెనక ఉన్న పితృస్వామ్యం లోని వ్యాపార భావజాలాన్ని వివరించారు; ద్వేషించారు కూడా. సంభోగం శృంగారం లోని ఆనందాన్ని స్త్రీల పరంగా ముద్దుపళని వర్ణించింది. ఆమెకు నిందలు దూషణలే ఎదురయ్యాయి. చాలాకాలానికి రేవతీదేవి "అనురాగ దగ్ధ సమాధి" కవిత,

జయప్రభ ''స్పర్శానురాగాన్ని ఆలపిస్తూ'' కవిత, శృంగారంలో స్త్రీ ఆనందాన్ని రసవంతంగా వర్ణించి గొప్ప సాహసం చేశారు.

పితృస్వామ్య వ్యవస్థలోని అణచివేత వివాహ వ్యవస్థలో ఉన్న దాని గురించి సావిత్రి ''బందిపోట్లు'' కవితలో పెళ్లి అనే రెండక్షరాల మాట ఎలా శిక్షగా పరిణమిస్తుందో చెప్పింది. పెళ్లంటే ఆడపిల్లకు శిక్ష అనే భావాన్ని ఎలా కలిగించ బడుతున్నాయో అద్భుతంగా చిత్రించింది. ఈ కవిత స్త్రీవాద కవితా స్వభావాన్ని పూర్తిగా అందిపుచ్చుకున్న తొలి కవిత గా విమర్శకులు నిర్ధారించారు. సుధ ''లొంగుబాటు సంగీతాన్ని నేను''అనే కవితలో వివాహపు అసమ సంబంధాల పై విరుచుకుపడింది. మందరపు హైమావతి ''సర్పపరిష్వంగం'', ''ద్విపాత్రాభినయం'' కవితలు, ఘంటసాల నిర్మల ''జుగల్బందీ''కవిత, ఓల్గా రాసిన ''దాంపత్యం'' కవిత ఇలా ఎన్నోకవితలు వివాహానంతరం స్త్రీ ఎన్ని రకాల అవతారాలు ఎత్తాలో, వైవాహిక జీవితంలో ఆర్థికం ఎంత కీలకమైన పాత్ర వహిస్తుందో చిత్రీకరించాయి. అనుభూతి అనుభవాలతో స్త్రీ ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా చేసే దాంపత్యాల గురించి కే వరలక్ష్మి ''అవ్యక్త వేదనారాగం'' కవితలో తెలిపింది.

చిల్లర భవానీదేవి 1996 -2000 వరకు రాసిన కవితల్లో పిల్లలు పుట్టకపోవడానికి స్త్రీని వేలెత్తి చూపే సమాజ వైఖరి గురించి ఆవేదన చెందిన తీరు ''నీళ్ళోసుకోలేదు''అనే కవితలో కనిపిస్తుంది. ఒక్కరోజైనా విశ్రాంతి నోచుకొని ఇంటి పని నుంచి విముక్తుని కోరుకునే స్త్రీ అంతరంగం చీకటిని ''కొలువు'' కవితలో చూడవచ్చు. స్త్రీల మేధోపరమైన సృజన శక్తి కి చోటు నోచుకోని చరిత్ర పట్ల నిరసన ''దీపస్తంభం ''కవితలో చూపిస్తే, తనది కాని బ్రతుకు కొనసాగిస్తున్న క్రమాన్ని అంతరంగం కల్లోలాన్ని అనుచుకుంటూ చిరు నవ్వు నటిస్తూ బ్రతికే స్థితిని స్త్రీల జీవితంలోని వైరుధ్యాలను ''నవ్వు ముళ్ళు'' అనే కవితలో వ్యక్తం చేసింది. కుటుంబంలో స్త్రీ నిర్వహించవలసిన అనేక పాత్రలు ఆమెపై వాటి ప్రభావాలు స్త్రీవాద కవితకు ప్రధాన వస్తువులు గా చూడవచ్చు. కుటుంబ వ్యవస్థలో కనిపించీ కనిపించని అణచివేత, దౌర్జన్యం,స్త్రీ అస్తిత్వాన్ని నిర్మూలించే పద్ధతులు అనేక కవితల్లో చిత్రించబడ్డాయి.

ఇంటి చాకిరీ స్త్రీ జీవితాన్ని ఎలా పరిమితం సంకుచితం చేసిందో, ఆమె అస్తిత్వాన్ని ఎలా హరించిందో విమల రాసిన ''వంటిల్లు'' కవితలో అద్భుతంగా వర్ణించింది. కుటుంబ జీవితంలో నిర్బంధం గురించి జయప్రభ, జయ, రజని తదితరులు కవితలు రాశారు. వరకట్నం మూఢాచారాలు వంటి కుటుంబ

సంబంధమైన విషయాలపై చిల్లర భవానీదేవి, వాణీ రంగారావు, రావులపల్లి సునీత, ఓల్గా వంటి వాళ్లు రాశారు. ఇంట్లో తండ్రి, తల్లిని పెట్టే హింస గురించి పద్మావతి 'గుక్కపట్టిన బాల్యం'లో చెప్పింది. దాదాపు కవయిత్రులందరూ వివాహ, కుటుంబ వ్యవస్థ లో ఉన్న అణిచివేత బాగా చిత్రించారు. ఇంటి నుంచి బయటికి వచ్చే స్త్రీలు ఎదుర్కొనే సమస్యలు,పురుషాధిక్య సమాజం వారిని కించపరిచే, అవమానించే అణచివేసే విధానాలు కూడా కవితా వస్తువులయ్యాయి. సమాజంలోని అన్ని వర్గాల పురుషులకు స్త్రీ ఎలా పెట్టుబడి అవుతుందో మందరపు హైమావతి "నీలి కవితలే రాస్తాము" అనే కవితలో చెప్పింది. జయప్రభ తన "చూపులు" కవితలో పురుషుని వికృత చూపును సొంగ కార్చే కుక్క లాంటి ఆకలిగా వర్ణించింది. ఇంట్లో భర్త నుంచి, బయటి గుంటనక్క ల వరకు, కుటుంబం, సమాజం బతుకునివ్వడంలేదని రావులపల్లి సునీత రాసిన "ఆత్మహత్య నా నిరసన" అనే కవితలో ఆక్రోశిస్తుంది. సామాజిక జీవనం లో వివిధ వృత్తుల లో ఉన్న స్త్రీల బాధలకు స్త్రీవాదులు అద్దం పట్టారు.

> ఇంటి చాకిరీ స్త్రీ జీవితాన్ని ఎలా పరిమితం సంకుచితం చేసిందో, ఆమె అస్తిత్వాన్ని ఎలా హరించిందో విమల రాసిన "వంటిల్లు" కవితలో అద్భుతంగా వర్ణించింది.

ఓల్గా రాసిన "మెహందీ స్త్రీల విజ్ఞప్తి" విమల రాసిన "వేశ్యా శిశువు" కవిత,ఘంటసాల నిర్మల" కాల్ గర్ల్స్ మోనో లాగ్" కవితల్లో వేశ్యల ఆత్మ గీతాన్ని,ఆర్తిని ఆవిష్కరించారు. స్త్రీలకు కనీస వసతి అయిన మరుగుదొడ్లు లేకపోవడాన్ని కొండేపూడి నిర్మల "వలసల రాజ్యం"లో ఆలోచింపజేసింది. సామాజిక జీవితాన్ని వస్తువుగా స్వీకరించిన కవయిత్రుల్లో అనిశెట్టి రజిత,కె గీత, కల్పన రెంటాల, పసుపులేటి గీత మొదలగువారు ఉన్నారు.

ప్రపంచీకరణలో భాగంగా మరింత పీడనకు గురైంది కూడా స్త్రీలే. ఈ ప్రపంచీకరణలో భాగమైన అందాల పోటీలు, శారీరక సౌందర్యం కోసం యువతులు పడే యాతన ఇవన్నీ స్త్రీ పురుష సంబంధాల్లో తీసుకొచ్చిన కృత్రిమత్వం గురించి కొండేపూడి నిర్మల రాసిన "మల్టీనేషనల్ ముద్దు" కవితలో చూడవచ్చు. "కళ్ళెత్తి చూసినా కనకాభిసేకాల్లేవ్"కవితలో సామ్రాజ్య దేశాలు భారతదేశం వంటి

వర్ధమాన దేశాలను ఎలాంటి ప్రలోభాలకు గురిచేస్తుందో, వాటిని అనుకరిస్తూ మనం ఎంత అసహజంగా జీవిస్తున్నామో చక్కగా ఆవిష్కరించబడింది. కుప్పిలి పద్మ, రెంటాల కల్పన, అనిశెట్టి రజిత తదితరులు ''మేధోవలసలు'' ''డాట్ కాం'', ఇంటర్నెట్ సంస్కృతులపై కూడా కవితలు రాశారు. స్త్రీవాద కవిత్వం స్త్రీలు ఎదుర్కొంటున్న అణిచివేతనూ, దౌర్జన్యాలను బేషజాలు లేకుండా వాస్తవికంగా చిత్రించారు. అంతేకాదు పితృస్వామ్య సంస్కృతిని ఎండగట్టారు. పురుషాధిక్య వ్యవస్థపై తిరుగుబాటు ప్రకటించారు.

విప్లవ కవిత్వ విషయానికొస్తే స్త్రీలు మెరుపుల పిడికిల్లెత్తిన పోరాట ప్రచండ ఘోషకు ఎగబడిన దృశ్యాన్ని 'ఓ! నా మిగిలిన సగం ప్రపంచమా నీవిప్పుడు వినక చూడక తప్పదు' అన్న ''తెగబడిన మా కలల ప్రపంచం'' కవితా పాదాలు స్త్రీవాదాన్ని మార్క్సిస్టు దృక్కోణంలో విమల వ్యక్తపరిచింది.

జయప్రభ ''పైటని తగలెయ్యాలి'', ''ఎరుపుతోనే సంపూర్ణ స్త్రీని'' వంటి కవితల్లో ఆనాటి స్త్రీలలో వస్తున్న, రానున్న చైతన్యం కనిపిస్తుంది. మార్క్సిస్టు భావజాలం కొందరిలో లేకపోలేదు. ''స్వర్ణానురాగాన్ని ఆలపిస్తూ'' అన్న కవిత దీన్ని నిరూపిస్తుంది. అలాగే 'తరాల తాళ్లు తెంచుకున్నాం కదా/ కుంట్లుపట్టిన కాళ్ళు మొరాయిస్తున్నాయి/పంజరంలో నుంచి బయటపడ్డ పక్షికి రెక్కలు సహకరించనట్లు అయినా పర్వాలేదు నిటారుగా నిలబడతాం', అని ''లేగదూడల్లాగా కంటిపాపల్లాగా''అనే కవితలో స్త్రీల వ్యక్తిత్వాన్ని, ఉద్యమంలో స్త్రీల పోరాటపటిమను తాయమ్మ కరుణ తెలియజేసింది.

లక్ష్మీ సుహాసిని విప్లవ దృక్పథం నుండి స్త్రీవాద చైతన్యాన్ని అర్థం చేసుకున్నది. పీడన లేని సమాజం, వర్గ లింగ వివక్ష లేని సమాజం కోసం కలలు కన్నది. ఆ రకంగా "మరో వసంతం'', '' నమ్మిక", ''పేదరాశి పెద్దమ్మ" లాంటి అద్భుతమైన కవితలు రాసింది.

వాడుమంత్రో మంత్రి కొడుకో మంత్రి చుట్టమో అయితే చాలు/ అధికార పార్టీ అయితే ఇంకా మేలు/ ఆడపిల్లలను అత్యాచారం చేయొచ్చు/ ఆపై చంపేయవచ్చు/సాక్ష్యాలు దొరక్కుండా పోలీస్ బందోబస్తు నడుమ కాల్చేయవచ్చు/ఒకవేళ ఎవరైనా/ కేసు పెట్టి కోర్టు కి వెళ్తుంటే/ వెంబడిరచి నడిరోడ్డు మీద వాళ్ల మీద/ పెట్రోల్ పోసి తగలబెట్టి సజీవదహనం చేసేయవచ్చు. అధికారంలో ఉన్నవాళ్లు ఆడపిల్లల మీద చేసే దుర్మార్గాన్ని, సాక్షాలు లేకుండా చేసే

ఆధిపత్య ధోరణిని కళావతి "ఒక నిజం" కవితలో వ్యక్తపరిచింది. స్త్రీలు శరీరాలకు సంబంధించిందే కాకుండా, విప్లవానికి సంబంధించిన కవితలు కూడా రాశారని అర్థం చేసుకోవచ్చు.

మధ్యతరగతి స్వీయ అనుభవాలతో ప్రారంభమైన స్త్రీవాద కవిత్వం విమల, పద్మ వంటి వారి కవిత్వంలో శ్రామికవర్గ స్త్రీల ఆత్మ ఘోషను కూడా పట్టుకున్నారు. విమల రాసిన "సౌందర్యాత్మక హింస"లో దేహ సౌందర్యాన్ని ద్వేషించి మార్క్సిస్టు సిద్ధాంత అవగాహనతో విలువైన శ్రమ సౌందర్యాన్ని మానవ విలువల్ని ప్రేమిద్దామని పిలుపునిచ్చింది. "వంటిల్లు" కవితలో స్త్రీవాద స్పృహతో ప్రారంభమైన వంటిల్లు సొంత ఆస్తిని కూల్చేద్దామన్న నినాదంతో మార్క్సిస్టు దృక్పథంతోనే ఈ కవిత అంతమవుతుంది.

స్త్రీలందరి సమస్యలు ఒకేలా ఉండవు అని దళిత మైనార్టీలకు చెందిన స్త్రీల వెతలు మరింత దారుణంగా ఉంటాయని ఒక కొత్త అవగాహన ఏర్పడింది. చల్లపల్లి స్వరూప రాణి, మద్దూరి విజయశ్రీ, జి విజయలక్ష్మి, దరిశె శశినిర్మల, జూపాక సుభద్ర, గోగు శ్యామల మొదలగు ఎందరో దళిత స్త్రీలు కుల వివక్షకు, జెండర్ వివక్ష తోడై ఎదుర్కొనే హింసను చిత్రించారు. అదేవిధంగా మైనార్టీ మతం అంటే ముఖ్యంగా ముస్లిం మతస్తులైన స్త్రీల సమస్యలు వారి ఆచార సంప్రదాయాల్లో స్త్రీలపై జరిగే అణిచివేతకు షాజహానా, మహెజబీన్ చక్కగా చిత్రించారు. మొత్తం మీద స్త్రీవాద కవిత్వం ఎందరో గొప్ప కవయిత్రులను సాహితీలోకానికి అందించింది.

> మధ్యతరగతి స్వీయ అనుభవాలతో ప్రారంభమైన స్త్రీవాద కవిత్వం విమల, పద్మ వంటి వారి కవిత్వంలో శ్రామికవర్గ స్త్రీల ఆత్మ ఘోషను కూడా పట్టుకున్నారు.

ఈ వ్యాసంలో కవయిత్రుల పేర్లు కవితల పేర్లు తరచూ వచ్చినట్లుగా కనిపిస్తుంది. వస్తు విభజన అంశాలను బట్టి రాయటం వల్ల ఆ రకంగా పునరావృతం అయ్యాయని గమనించగలరు. స్త్రీలకు శరీర స్పృహ తప్ప ఏమీ లేదన్న విమర్శ వచ్చింది కాబట్టి విప్లవ కవిత్వం రాసిన వాళ్లను సంక్షిప్తంగా పరిచయం చేశాను. ఒక్క విషయం ఇక్కడ ప్రస్తావించక తప్పదు. చలం స్త్రీ లకు శరీరం ఉంది వ్యాయామం కావాలి. మెదడు ఉంది

ఆలోచన కావాలి అంటూ మొదట స్త్రీల గురించి ఆలోచించి ,ఆలోచింపచేసిన రచయితగా గుర్తు చేసుకోక తప్పదు. ఇది రాయడానికి 1980 తరువాత వచ్చిన వందమంది కవయిత్రులను వారు రాసిన కవితలను పరిశీలించాను. ఇంత మంది ఉన్నారని నిర్ధిష్టంగా చెప్పటం కాదు. నా దృష్టికి వచ్చినవాళ్లు ఇంతమంది అని చెప్పటం. కొత్త తరం కూడా చాలా మంది రాస్తున్నారు. చాలా కవితలు ఉన్నాయి. కానీ ఇక్కడ ఎక్కువ ప్రస్తావించ లేక పోయాను.

స్త్రీవాద కవిత్వం 1980-95 మధ్యకాలంలో విస్తృతంగా వెలువడినప్పుడు సమకాలీన విమర్శకుల నుంచి తీవ్ర విమర్శ ఎదుర్కొన్నది. సామాజిక స్పృహ లేదని విమర్శకులు పేర్కొన్నారు. స్త్రీవాద కవితా ప్రస్థానంలో ప్రపంచాన్ని, జీవితాన్ని స్త్రీల కోణం నుంచి విశ్లేషించడంలో కవయిత్రులందరూ సఫలమయ్యారు. విమర్శకులకు, నిందలకు నిర్హేతుకమైన ఆరోపణలకు లొంగిపోకుండా స్త్రీవాద కవులుగా తమ సంఖ్యను, తమ రచనా వస్తువులో నవ్యతను చేర్చుకుంటూ ముందుకు సాగారు. సాగుతున్నారు కూడా. స్త్రీవాదుల పోరాటం పురుషుల పైన కాదని పురుషాధిక్య సమాజం పైననే అని తమ పాఠకులకు విమర్శకులకు విడమరిచి చెప్పటంలో కృతకృత్యులయ్యారు. స్త్రీ పురుషుల మధ్య ఆధిపత్య, అధికార సంబంధాలు పోయి, పరస్పరం గౌరవించుకునే సమ స్థాయి సంబంధాలు ఏర్పడాలన్నదే తమ లక్ష్యమని స్త్రీవాద కవిత్వం నిరూపించింది. పురుషాధిక్య సమాజం స్త్రీలను తమ బానిసలుగా కాక, స్నేహితులుగా స్వీకరించి గౌరవించిన నాడు వాదాలతో వివాదాలతో అవసరం ఉండదు. అంతవరకు స్త్రీవాద సాహిత్యం రావలసే ఉంటుంది.

### ఉపయుక్త గ్రంథాలు


1. 'స్త్రీవాద కవిత్వోద్యమం' ఆచార్య సి.మృణాళిని.
2. 'స్త్రీవాద సాహిత్యం అవగాహన` డా. సుమతీ నరేంద్ర
3. 'స్త్రీవాద రాజకీయాలు వర్తమాన చర్చలు` సంపాదకులు రమా మెల్కోటే, కె. సజయ.
4. 'స్త్రీవాద సాహిత్యం దృక్పథం-చర్చ` చూపు కాత్యాయని.
5. 'జీవన సారం గ్రహించిన వారికి స్త్రీ వాదం ఒక ఎరుక` డా.శిలాలోలిత.
6. 'నీలి మేఘాలు' అస్మిత సంకలనం.
7. 'సాహిత్యాకాశంలో సగం' కాత్యాయని విద్మహే.

# దళిత కవిత్వం



డా. కోయి కోటేశ్వర రావు
94404 80274

సాంఘీక ఉద్యమాలన్నీఇప్పుడు మరింత నిర్దిష్టత దిశగా పయనిస్తున్నాయి. యుగ యుగాలుగా ఏ ప్రగతికి నోచుకోని జీవితపు సన్నని సందుల్లో ఆత్మగౌరవ పోరాటాలు బలోపేతమవుతున్నాయి. కుల, మత, లింగ,ప్రాంతాల వారీగా ప్రత్యేక అస్తిత్వంకోసం ప్రజలు చెయ్యెత్తి జైకొడుతూ ఎన్నాళ్లుగానో కోల్పోయిన హక్కుల సాధనకోసం ఎలుగెత్తి చాటుతున్నారు. అందరికోసం ఒక్కరు అనే అందమైన ఆదర్శాలకు కాలంచెల్లి పోయి ప్రతిమనిషి స్వీయ విముక్తి కోసం కొత్త మార్గాలను అన్వేషిస్తున్నాడు. పిడికిలి బిగించటానికి ఐదువేళ్లు ఐక్యంగా నిలవటమే ప్రధానంకాదని, అంతకంటే ముందు ఎలాంటి హెచ్చుతగ్గులు లేకుండా వేళ్లన్నీ సమానం కావాలనే సరికొత్తవాదం ముందుకొచ్చింది. సామాజిక, ఆర్థిక, రాజకీయ ఉద్యమాలు సాహిత్య,సాంస్కృతిక రంగాలను నిరంతరం ప్రభావితం చేస్తుంటాయి. తదనుగుణంగా ఎందరో కవులు ఉద్యమస్వరూప స్వభావాల గురించి, లక్ష్యాలను గురించి రచనలు చేస్తారు. అందువల్ల ఉద్యమానికి విస్తృతమైన ప్రచారం లభిస్తుంది. సాహిత్యంలో కొత్త భావజాలం పరివ్యాప్తమవుతుంది. ఉద్యమం, సాహిత్యం ఇవి రెండు పరస్పర పరిపోషకాలుగా మొత్తం సమాజంలో కొత్తప్రశ్నలను రేకెత్తిస్తాయి. ఆధునిక కవిత్వంలో' ముప్పయ్యో దశకానికి ఎంతప్రాధాన్యత ఉందో, అత్యాధునిక కవిత్వం లో ఎనభయ్యో దశకానికి కూడా అంతే ప్రాముఖ్యత ఉంది. 'హంగ్రీ థర్టీస్' లాగే ఎనభయ్యో దశకాన్నికూడ 'యాంగ్రీ యెయిటీస్' అనవచ్చు. గుర్తింపదగిన సామాజిక మలుపులకు ,నూత్న సాహిత్య పరిణామానికి యెనభయ్యదశకం కేంద్రబిందువయింది. ఈ దశాబ్దం ప్రథమార్ధంలో స్త్రీవాదం, ద్వితీయార్ధంలో దళితవాదం ఆవిర్భవించి, తెలుగుసాహిత్యాన్ని కదిపి కుదిపివేశాయి. సమాజంలోని సమస్తరంగాల్లో కులం ఏ విధమైన పాత్రపోషిస్తుందో దళిత కవిత్వం నిరూపించింది.

ప్రాచీన సాహిత్యం లో మౌలికంగా వర్ణవ్యవస్థ సంరక్షణా దృష్టి స్పష్టంగా కనిపిస్తుంది ''వర్ణధర్మముల్ కాచుచు వసుధయెల్ల/ననఘ చరితుడై....'' (ఆదిపర్వం) అంటూ రాజు అనివార్యంగా వర్ణవ్యవస్థకు కాపలాదారుడుగా వ్యవహరించాలని నన్నయ ఉపదేశించాడు. ''వర్ణాశ్రమ ధర్మమహామహిమన్'' తన రచనలోసర్వత్రా కీర్తించాడు. కొండొకచో సంస్కృత మూలాన్ని అధిగమించి, మనుస్మృతి తత్త్వాన్ని అనుసరించి వైదికావేశంతో నన్నయ రచనచేశాడు. పాల్కురికి సోమనాది శివ కవులు మతం విషయంలో పరమ ఉన్మాదాన్ని ప్రదర్శించినప్పటికీ కులనిర్మూలనస్ఫూర్తితో దేశికావ్యాలను రచించారు. అస్పృశ్యతను అక్షరాల నిరసించారు. శివభక్తి తత్పరులైన మాలలకు అంటరానితనం లేనే లేదని తెగేసి చెప్పారు. గుడ్డవ్వ, ఉద్భటుడు, కల్లు దేవయ్య, శ్వపచయ్య లాంటి కిందికులాలకు చెందిన భక్తుల కథలను వర్ణించారు. వేమన, పోతులూరి వీరబ్రహ్మం, సిద్ధప్ప లాంటి సాంఘీక విప్లవమూర్తులు తమకవిత్వంతో సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని విశ్వమంత పాదుకొల్పి, ప్రాచీనకాలంలోనే ఆధునికతకు అడుగుజాడలు వేశారు.

> ప్రాచీన సాహిత్యం లో మౌలికంగా వర్ణవ్యవస్థ సంరక్షణా దృష్టి స్పష్టంగా కనిపిస్తుంది ''వర్ణధర్మముల్ కాచుచు వసుధయెల్ల/ ననఘ చరితుడై....'' (ఆదిపర్వం) అంటూ రాజు అనివార్యంగా వర్ణవ్యవస్థకు కాపలాదారుడుగా వ్యవహరించాలని నన్నయ ఉపదేశించాడు.

సమాజంలో యుగయుగాలుగా పాతుకు పోయిన మూఢనమ్మకాలను, తరతరాలుగా వేళ్లూనుకున్న కుహనా విశ్వాసాలను, కట్టుబాట్లను, స్త్రీల జీవితం చుట్టూ అల్లుకున్న అంధకారాన్ని తిరస్కృస్తూ ఆవిర్భవించిన సంఘసంస్కరణ ఉద్యమం కులసమస్య మూలాలను సరిగా అర్థం చేసుకోలేక పోయింది. బ్రహ్మసమాజం. దివ్యజ్ఞాన సమాజం, ప్రార్థనాసమాజ పరిమితులను అధిగమించి అట్టడుగు వర్గాల అభ్యున్నతి కేంద్రంగా జ్యోతిరావుపూలే, సావిత్రీ బాయి పూలే దంపతులు సత్యశోధక్ సమాజ్ స్థాపించి, సంఘసంస్కరణ ఏదిశగా జరగాలో వారి కార్యాచరణ ద్వారా తెలియజేశారు.

1904లో సంఘసంస్కార సమావేశములు జరుగుతున్నసందర్భంలో ''వర్ణభేధము గాల్చిపైచి యన్యోన్యంబు/పొత్తుగూర్పగా పెద్ద సుత్తి పట్టు'' (ఉద్యమ దర్శనం -ముదిగొండ శివప్రసాద్) అంటూ దాసు వామనరావు పిలుపునిచ్చాడు. 1909సం.లో ''ఎట్టాగుఎక్కువ బ్యామ్మలు మాకంటే/ ఎట్టాగు ఎక్కువ ఎవరైనా మాకంటే'' అని మాలవాండ్రపాటలో ఒక అజ్ఞాత కవి కులవ్యవస్థలోని హెచ్చుతగ్గులను నిలదీసి ప్రశ్నించాడు. ''వర్ణధర్మము అధర్మంబే'' అని లవణరాజు కల (1911 )లో గురజాడ నిర్ధారించాడు. యోగ్యత కులాన్ని బట్టి ఉండదని ప్రబోధించాడు. 1911 నుండి హైదారాబాద్ కేంద్రంగా భాగ్యరెడ్డివర్మ జగన్మిత్రమండలి, మన్యసంఘం లాంటి సంస్థలను నెలకొల్పి అణగారిన ప్రజల్లో బహుముఖీన సంస్కరణలకు బాటలు వేశాడు. ప్రత్యేక పాఠశాలలు స్థాపించి దళితుల్లో విద్యాచైతన్యాన్ని కలిగించాడు. జీవకారుణ్య తత్త్వాన్ని, బౌద్ధధర్మాన్ని విస్తృతంగా ప్రచారం చేశాడు. పంచమ పదాన్ని విడనాడి, దళితులు ఆదిహిందువులనే ఆత్మగౌరవ స్పృహను వారిలో కలిగించాడు. అఖిల భారత స్థాయిలో అణగారిన వర్గాల వారిని ఐక్యం చేశాడు. 1917 నుండి ఆంధ్రా ప్రాంతంలో అనేక చోట్ల పర్యటించి ఆది ఆంధ్ర ఉద్యమ వ్యాప్తికి భాగ్యరెడ్డివర్మ ఎంతగానో కృషిచేశాడు. భాగ్యరెడ్డి వర్మ ఇచ్చిన ప్రేరణ తోనే కుసుమ ధర్మన్న దళితనాయకుడిగా కవిగా, వాగ్గేయకారుడిగా ఎదిగి అంటరాని వాడల్లో వైతాళిక గానమై ప్రతిధ్వనించాడు. హరిజనశతకం, నిమ్నజాతి ముక్తి తరంగిణి, అసురపురాణం వంటి రచనలతో తెలుగు కవిత్వంలో తొలిసారిగా దళిత తాత్త్విక చైతన్యాన్ని అందించాడు.''దీనజనుల దుర్గతిని రూపుమాపేవరకు, దళితుల కన్నీరు సంపూర్ణంగా ఇంకి పోయెవరకు 'అస్పృశ్యతా బడబాగ్నిజ్వాల' చల్లారేవరకు స్వరాజ్యరథం ముందుకుసాగదని శాస్త్రీయ దృష్టితో ప్రతిపాదించాడు.

''ఆలస్యంబయిపోయెనిప్పటికె యీ అస్పృశ్యతాభూత ని
ర్మూల ప్రక్రియ కిప్పుడైన త్వరతో బూనన్ వలెన్, లేనిచో
చాలా చిక్కులు వచ్చు, నీహరిజనుల్ సత్యాగ్రహోద్వృత్తి, స్వే

చ్ఛాలంబంబు గొనన్ బెనంగి, జయమున్ సాధింతురత్యుద్ధతిన్'' (నిరుద్ధభారతం) అని మంగిపూడి వెంకటశర్మ సామాజిక శాస్త్రవేత్తలా జాతిని హెచ్చరించాడు. అంటరానితనాన్ని నిర్మూలించకపోతే అనేక చిక్కు సమస్యలెదురవుతాయని,దళితుల్లో నుండి పోరాటం ఉద్భవిస్తుందని అసాధారణ దార్శనిక దృష్టితో హితవుచెప్పాడు. ''జాతికి వెన్నెముక యనందగునంత్య

జాతులను సంఘమునుకు దూరముజేసి/ మనకు కానివారిగా జేసుకొనుటకన్న ఆత్మహత్య వేరుండలేదు''సాంఘీక అభివృద్ధికి వెన్నుదన్నుగా నిలిచే దళితులపట్ల అంటరానితనం పాటించడం ఆత్మహత్యాసదృశమని ఆవేదన వ్యక్తం చేశాడు. తెలుగు సాహిత్యంలో దళితసమస్య కేంద్రంగా వచ్చిన మొదటికావ్యం నిరుద్ధభారతం. 1915 లో వెలువడిన నిరుద్ధభారతం హరిజనోద్యమ సాహిత్యానికి మార్గం చూపింది. జాతీయోద్యమ కవులను ఎంతగానో ప్రభావితం చేసింది.

''కవులు భక్తులు ఋషుచక్రాధిపతులు/మున్నుగాగల విజ్ఞులుపుట్టినట్టి/ వంశములనంటరాదని పలుకు జనులు /దేశవిద్రోహులుగాక దేశహితులె''(1927 సుజాత పత్రిక) అంటూ సురవరం ప్రతాపరెడ్డి అంటరానితనం పాటించే వారు దేశవిద్రోహులని ప్రకటించాడు.'' బ్రాహ్మణులను మాలలను నొక్కవిధంబుగా జూచు జనుడే మనీషి'' యని సమానత్వకేంద్రంగా మనిషి ని నిర్వచించాడు.

జాతీయోద్యంలో అంతర్భాగంగా మహాత్మాగాంధి సాగించిన హరిజనోద్యమ స్ఫూర్తితో ఎంతోమంది దళితేతర కవులు హరిజనాభ్యుదయాన్ని తమకవిత్వంలో ప్రతిపాదించారు. గరిమెళ్ళ సత్యనారాయణ, పురిపండ అప్పలస్వామి, వెంకట పార్వతీశ కవులు, వెలగల సుబ్బారెడ్డి, నారపరెడ్డి రామిరెడ్డి, బసవరాజు అప్పారావు, నెల్లూరి రామానాయుడు, ఊటుకూరి సత్యనారాయణ లాంటి కవులు అంటరానితనాన్ని నిరసిస్తూ పద్యాలు, గేయాలు రచించారు. హరిజనోద్యమ సాహిత్య ప్రభావంతో, తమ అస్తిత్వచింతనతో మాల, మాదిగల నుండి మహాకవులుద్భవించి తెలుగు కవిత్వాన్ని సుసంపన్నం చేశారు. అసాధారణ ప్రతిభాశక్తితో, అపూర్వమైన సామాజికదృష్టితో 20 వశతాబ్దపు తెలుగుకవిత్వాన్ని మరోమలుపు తిప్పిన జాషువా గబ్బిలం కావ్యంతో దళిత వేదనను అద్భుతంగా అక్షర బద్ధం చేశాడు. జాతీయోద్యమ కాలధర్మంతో జాషువా గాంధీ బాటలో పయనించినప్పటికి ''ఈ వర్ణ వైషమ్య పిశాచము భారతభ్యుదయమునకు ప్రతిబంధకమై., ఆసేతుహిమాచల వ్యాప్తమై జాత్యున్నతిని నరికట్టుచున్నదని

> జాతీయోద్యంలో అంతర్భాగంగా మహాత్మాగాంధి సాగించిన హరిజనోద్యమ స్ఫూర్తితో ఎంతోమంది దళితేతర కవులు హరిజనాభ్యుదయాన్ని తమకవిత్వంలో ప్రతిపాదించారు.

(చిన్ననాయకుడు) కుల నిర్మూలనాపోరాటావశ్యకతను గుర్తెరిగి కావ్యరచనచేశాడు. జలారంగస్వామి. నూతక్కి అబ్రహాం, గద్దెలజోసెఫ్, బీర్ణీడి మోషే, బీర్ణీడి ప్రసన్న, నక్కాచినవెంకయ్య జ్ఞానానంద కవి, మల్లవరపు జాన్ తదితర పద్యకవులు జాషువా బాటలో పయనించి, సామాజిక సమానత్వాన్ని తమ కావ్యాల ద్వారా ప్రచారం చేశారు. వీరిలో బోయిభీమన్న విశిష్టమైనకవి. భీమన్న తన రచనలద్వారా కులవ్యవస్థ దుర్నీతిని ఎండగట్టాడు. గుడిసెలు కాలిపోతున్నాయి, అంబేద్కర్ ప్రభాతం, పాటల్లో అంబేద్కర్ వంటి కావ్యాలతో నవభారత వైతాళికుడు డా.బి.ఆర్ అంబేద్కర్ ఆలోచన విధానానికి బాసటగా నిలిచాడు.

అభ్యుదయ, విప్లవ కవులు శ్రామికవర్గ సమస్యల్లో అంతర్భాగంగానే దళిత సమస్యను అర్థం చేసుకొని సామ్యవాదదృక్పథంతో కవిత్వం రాశారు. కులసమస్యను ఉపరితలాంశంగానే గుర్తించారు. విప్లవం విజయవంతమయితే సామాజిక అంతరాలు వాటికవే తొలగిపోతాయనే భావనతో విప్లవ కవులు కవిత్వం, పాటలు రాశారు. కొలకలూరి ఇనాక్, సి.వి.శంభుక బోయ జంగయ్య లాంటి కవులు జాషువాంతర హరిజన స్పృహకు అస్తిత్వఉద్యమాలు అందించిన చైతన్యానికి మధ్య భావవారధిగా కనిపిస్తారు.

## దళిత కవిత్వం

1985లోజరిగిన కారంచేడు సంఘటతో ఆవిర్భవించిన దళిత మహాసభ సామాజిక విముక్తి ఉద్యమాల స్వరూప స్వభావాలను సమూలంగా మార్చివేసింది. అరుణారుణ పోరాటాల ఎజెండాను తిరగ రాసింది. ఆంధ్రప్రదేశ్ లో కనీ వినీ ఎరుగని ఆత్మగౌరవ పోరాటాన్ని నిర్మించడంలో డా.కత్తి పద్మారావు తోపాటు బొజ్జాతారకం చారిత్రాత్మక పాత్రను పోషించారు. చుండూరు సంఘటన అనంతరం దళిత ఉద్యమం భారతదేశవ్యాప్తంగా సంచలనం సృష్టించింది. ఇదే సందర్భంలో డా.బి.ఆర్ అంబేడ్కర్ రచనలు తెలుగులోకి అనువాదం కావటం, ఈ రచనల ఆధ్యయన స్ఫూర్తి దళితుల్లోని రెండవ జనరేషన్ ను తీవ్రంగా ప్రభావితం చేసింది. బహుజన రాజ్యాధికార ఎరుకతో మాన్యశ్రీ కాన్షీరామ్ దేశ రాజకీయాల్లో ప్రకంపనలు సృష్టించాడు. ఈ నేపథ్యంలో విప్లవ శిబిరాల్లో ఉన్న దళిత బహుజన నాయకుల్లో , కవుల్లో, రచయితల్లో ఒక ఆత్మ విమర్శ చోటుచేసుకుంది, బి.యస్.రాములు, కంచె ఐలయ్య, ఉ.సాంబశివరావు, ఇంగిలాలజ్ఞానబోధి, శివసాగర్, జి.లక్ష్మీ నరసయ్య, కలేకూరి ప్రసాద్ లాంటి ప్రభావశీలమైన ఒకతరం అరుణ బావుటా నీడలనుండి ఆత్మగౌరవ పోరాట జాడలోకి దూసుకువచ్చింది. ఈవిధమైన సామాజిక,రాజకీయ

అగ్నిని నలుపు, ఎదురీత, దళిత రాజ్యం లాంటి పత్రికలు వేడెక్కించాయి. ఈ వాతావరణంలో దళిత వాదం సాహిత్య సాంస్కృతిక రంగాల్లోకి విస్తరించింది. 1987 అక్టోబర్ 7,8,9 తేదీలలో జరిగిన అఖిలభారత దళిత రచయితలసదస్సు దళితసాహిత్యానికి ఉత్ప్రేరకంగా నిలిచింది. దళిత ఉద్యమ క్షేత్రస్థాయి అనుభవాలతో బొజ్జతారకం నది పుట్టిన గొంతుక, కత్తిపద్మారావు జనగీతం, జైలుగంటలు, విముక్తిగీతం వంటి కవితా సంపుటులు దళిత కవిత్వానికి బలం చేకూర్చాయి. జూలూరి గౌరీ శంకర్ పాదముద్ర (1993) దీర్ఘ కవిత నిర్దిష్టమైన దళిత చేతనకు తార్కాణంగా నిలిచింది. పాదముద్ర స్ఫూర్తితో అనంతరం అనేక దళిత దీర్ఘకవితలు వెలువడ్డాయి. జి.లక్ష్మీనరసయ్య, త్రిపురనేని శ్రీనివాస్ ల సంపాదకత్వంలో వెలువడిన చిక్కనవుతున్న పాట(1995) దళిత కవితా సంకలనం తెలుగులో దళితకవిత్వం వికసించడానికి కేంద్ర బిందువుగా నిలిచింది.

తరువాత జి.లక్ష్మీనరసయ్య ప్రధాన సంపాదకత్వంలో వచ్చిన పదునెక్కిన పాట(1996) దళిత కవితా సంకలనం కవిత్వంలో దళిత చూపును మరింత విస్తరించగలిగింది. ఎవరు దళితులు? ఏది దళిత సాహిత్యం అనే అంశాల ప్రాతిపదికగా ఎంతో చర్చ జరిగింది. ''భారతావనిలో సాంఘీకంగా, ఆర్థికంగా, అణగద్రొక్కబడిన వారంతా దళితులే. యస్సీలు, యస్టీలు, బీసీ లుఈ కోవలోకి వస్తారు. మైనార్టీలు హిందూయేతర మతాల్లో ఉన్నవారు కనుక ఈ కోవలోకే వస్తారు.'' (కులము- ప్రత్యామ్నాయ సంస్కృతి) అంటూ కత్తిపద్మారావు దళితులను విస్తృతమైన పరిధిలో నిర్వచించారు. అందుకే చిక్కనవుతున్న పాట, పదునెక్కిన పాట సంకలనాల్లో లో దళిత, బహుజన, మైనార్టీ కవులు తమ కుల, వృత్తి పరమైన అస్తిత్వంతో కవిత్వం రాశారు. ''కింది కులాల రాజ్యాధికార భావనకు కళాత్మకమయిన, మేధో, అనుభూతి పరమైన వ్యక్తీకరణే దళిత కవిత్వం''(దళితసాహిత్య తాత్వికదృక్పథం) అని జి.లక్ష్మీనరసయ్య దళితకవిత్వాన్ని నిర్వచించాడు. సతీష్ చందర్ లాంటివాళ్లు అంటరానివారు అంటే కేవలం మాల, మాదిగ కోవకు చెందిన వారే అని నిర్వచించారు. ఊరు దళితులు, వాడ దళితులు అంటూ వారి మధ్య అంతర్గతంగా ఉన్న సామాజిక అణచివేత గురించి పత్రికల్లో చర్చ జరిగింది. దళిత మానిఫెస్టో, గుండె డప్పు. చిత్తరువు, బహువచనం, మేమే, మొగి, దళితసామ్రాజ్యం, దళిత దేశం, దళిత కవిత్వం1, దళిత కవిత్వం2, తెగిపడినచోటే తెగబడదాం, నువ్వేలేకపోతే లాంటి 25 కు పైగా దళితకవితా సంకలనాలు వెలువడి దళిత ఉద్యమ చైతన్యాన్ని దశ దిశలా వ్యాపింపజేశాయి. తెలుగులో 100 మంది పైగా దళిత బహుజన కవులు తమ కవితా సంపుటలతో వర్తమాన తెలుగుకవిత్వాన్ని తేజోవంతం

చేశారు. అనుభవ జనితమైన, సాంద్రమైన రచనలతో కవిత్వానికి కొత్తనెత్తురు ఎక్కించారు. దళితజీవన వాస్తవికతను కవిత్వంలో అద్భుతంగా ఆవిష్కరించారు. కత్తి పద్మారావు -నల్లకలువ, నీలికేక, ఆత్మగౌరవస్వరం, ముళ్ళకిరీటం, సతీష్ చందర్- పంచమవేదం, మద్దూరి నగేష్ బాబు-వెలివాడ, మీరేవుట్లు, పైడి తెరేష్ బాబు-అల్పపీడనం, హిందూమహాసముద్రం, శిఖామణి-కిర్రుచెప్పులభాష, నల్లగేటు నందివర్ధనం చెట్టు, గిజిగాడు, ఎండ్లూరి సుధాకర్-వర్తమానం, నల్లద్రాక్షా పందిరి, కలేకూరి ప్రసాద్-అంటరాని ప్రేమ, యం వెంకట్-ఎన, మెద, దెంచనాల శ్రీనివాస్-గురితప్పిన పద్యం, బన్న ఐలయ్య-నిప్పుకణిక, తుల్లిమల్లి విల్సన్ సుధాకర్-దళిత వ్యాకరణం, ప్రసాదమూర్తి కలనేత, జి వి రత్నాకర్ - మట్టి పలక, అట్లేటి అల, జె. గౌతమ్-నలుదిక్కుల నుండి రండి, దార్ల వెంకటేశ్వర రావు-దళిత తాత్త్వికుడు, నూకతోటి రవికుమార్ - కంచె మీది పక్షి పాట, నేతలప్రతాప్ కుమార్- అన్నం గిన్నె, భీమ్ పాలరాగం, సమతా వసంత గానం, గూటంస్వామి-నీలిపతాక, నేలపురి రత్నాజీ- నెత్తుటి మరకలు, పసునూరి రవీందర్ - ఒంటరి యుద్ధగీతం, జిలకర శ్రీనివాస్-తత్వ, భూతం ముత్యాలు-దుగిలి, పొన్నాల బాలయ్య-మిగ్గు, బండారుశంకర్-శిబ్బి, కాసిం-పాలమారిన పాలమూరు, మంథనిశంకర్-నల్లరక్తకణాలు, వనపట్ల సుబ్బయ్య-కుర్పీ, సిద్దంకి యాదగిరి -అచ్చు, సంపతి సోమయ్య-ఏశకాంత, కొమ్మవరపు విల్సన్ రావు-దేవుడు తప్పిపోయాడు, తంగిరాలసోని - బ్లాక్ వాయిస్, తదితర కవులు తమ రచనలతో దళిత కవిత్వానికి జవజీవాలను సమకుర్చారు. కారం చేడు నుండి లక్షిం పేట వరకు దళితులపై అమానుషంగా జరిగిన దాడుల పూర్వాపరాలను, అందుకు కారణమైన కులవ్యవస్థ దుర్నీతిని, దళితుల జీవితం లోని చీకటి వెలుగులను, దళితుల శ్రమ ఔన్నత్యాన్ని, దళిత సాంస్కృతిక వైభవ ప్రాభావాలను, దళిత ఉద్యమ స్థితిగతులను, వర్గ కుల సంబంధాలను, రాజ్యాధికార ఎరుకను, హృద్యంగా దళిత కవులు కవిత్వీకరించారు. పగడాల నాగేందర్, కోయి కోటేశ్వరరావు, చిత్రం ప్రసాద్, లాంటి కవులు విప్లవోద్యమ పరిమితులను విమర్శిస్తూ కవిత్వం రాశారు. కులాంతర వివాహాల ఆవశ్యకతను, అందులోని సాధకబాధకాలను విశ్లేషిస్తూ రాసిన దళితకవుల కవితలతో మద్దూరి నగేష్ బాబు సంపాదకత్వంలో వెలువడిన అంబేద్కరిస్టు ప్రేమకవిత్వం(విడి ఆకాశం) విశేషమైన కవితా సంకలనం. మనువాద వ్యవస్థ కుట్రలపై,ఆధునిక మనువుల కుయుక్తులపై నిప్పులు కురిపించిన నిశాని (నగేష్ బాబు, తెరేష్ బాబు, ఖాజా,వరదయ్య ల కవితాసంకలనం) తెలుగు కవిత్వంలో పెనుసంచలనం సృష్టించింది,'' ఈమబ్బులు తొలగిపోవాలి/ ఈగోడలు

కూలిపోవాలి/ ఈ పాతాళంలో బెత్తెడు ఆకాశంకావాలి/ ఈ దేశంలో చారెడు నేల కావాలి/ తొలగిపోనక్కరలేని బతుకు కావాలి/ అన్నింటికీమించి /నా సింహాసనం నాకు కావాలి'' (ఏంకావాలి) అంటూ నగేష్ బాబు దళిత కవితా ధ్యేయాన్ని తెలియజేశాడు. చిక్కనవుతున్నపాట సంపాదకీయంలో దేశీయమార్క్సిజమే దళిత కవిత్వానికి పునాది అని చెప్పిన లక్ష్మీనరసయ్య'' అంబేద్కర్ అందించిన సిద్ధాంతామే దళితకవిత్వానికి తాత్విక భూమిక (పదునెక్కినపాట- సంపాదకీయం) అని తరువాత నిర్ధారించాడు. ఈ రకమైన స్పష్టమైన రాజకీయ దృక్పథంతోనే ఈనాటివరకు దళితకవులు కవిత్వం రాస్తున్నారు. మొదటి దశలో దళిత, బహుజన, మైనార్టీకవులు ఉమ్మడిదళితస్పృహతో కవిత్వం రాసినప్పటికీ అనంతరం వేరు వేరుగా తమ సామాజికవర్గం కేంద్రంగా, ఆ రకమైన అస్తిత్వ చైతన్యం తో ప్రత్యేకంగా సృజన చేశారు. దళితకవిత్వం, బహుజన కవిత్వం,ముస్లిం కవిత్వం వెలువడ్డాయి. దళితకవిత్వలో భాగంగాఉన్న దళిత స్త్రీలు, మాదిగలు కూడా స్వతంత్రంగా కవిత్వం రాశారు.

## దళిత స్త్రీవాదకవిత్వం

లింగ, కుల వివక్షలను తీవ్రంగా నిరసించిన స్త్రీవాద, దళిత ఉద్యమాలు ఈ వివక్షలకు ఏకకాలంలో బలయ్యే విద్యావంతులైన దళిత స్త్రీల మీద గాఢమైనప్రభావాన్ని చూపాయి. దళిత స్త్రీ గురించి దళిత కవులు రాసిన కవిత్వం వీరిలో సరికొత్త సాహిత్య చైతన్యాన్ని కలిగించింది. దళితచైతన్యానికి తొలి కేంద్రబిందువైన మరాఠీ కవిత్వంలో కూడా దళిత పాంథర్స్ ఉద్యమ స్ఫూర్తితో మరాఠీ దళిత కవయిత్రులు వైవిధ్యమైన కవిత్వం రాశారు. కుకుముద్ పావడే, అరుణాలో కాండే, నళినీ సోమువార్, సుగంధాషిండే, తదితర మరాఠీ దళిత కవయిత్రులు సాంఘికంగా, మతపరంగా తాము ఎదుర్కుంటున్న సమస్యల తీరుతెన్నులను అక్షరబద్ధంచేశారు. ''మేం దళితస్త్రీలం. అటు స్త్రీల కమ్యూనిటికీ, ఇటు దళిత కమ్యూనిటికీ చెందినవారం. అయినప్పటికీ ఈ రెండు కమ్యూనిటీల నిర్వచనాల్లో మాకుస్థానంలేదు. అగ్రవర్ణ స్త్రీలు కేవలం పితృస్వామ్యాన్నిమాత్రమే ఎదుర్కొంటారు.దళిత పురుషులు కేవలం కులతత్వాన్ని మాత్రమే ఎదుర్కొంటారు. దళిత స్త్రీలు మాత్రం కులపితృ స్వామ్యానికి వ్యతిరేకంగా పోరాడాలి'' (నల్లపొద్దు- దళిత స్త్రీల కరపత్రం) అన్న మాటల్లో దళిత స్త్రీ నిర్దిష్ట అస్తిత్వం తేట తెల్లమవుతుంది. వర్గపరంగా పేదవారితోపాటు, లింగపరంగా స్త్రీలతోపాటు, కులపరంగా దళితులతో పాటు ఏకకాలంలో అనేక రకాలుగా పీడింపబడుతున్న దళితస్త్రీ వీరందరికంటే ఎక్కువ అణచివేతకు, వెలికి గురవుతుంది. ఈ రకమైన దృష్టితో దళిత స్త్రీలు

సాంద్రమైన కవిత్వం వెలువరించారు. 'పొద్దున్నేసునీతపోస్టరై పలకరిస్తుంది', గుండెడప్పు, పదునెక్కిన పాట, చిత్తరువు, తదితర కవితా సంకలనాల్లో దళిత కవయిత్రులు పదునైన కవిత్వం వెలువరించి దళితవాదానికి వైవిధ్యాన్ని,విశిష్టతను సమకూర్చారు. సమాజంలో లింగ, కుల, వర్గ వివక్షల పరస్పరసంబంధం ఏ విధమైన దుష్ప్రభావానికి దారితీస్తుందో దళిత కవయిత్రులు స్పష్టంగా తమ కవిత్వంలో నిరూపించారు. గోగు శ్యామల వెలువరించిన నల్లపొద్దు సంకలనం దళిత స్త్రీల కవిత్వానికి విమర్శకు సంబంధించిన కొత్తకోణాలను ఆవిష్కరించింది. జాతీయోద్యమం నుండి దండోరా ఉద్యమం వరకు రచనలు చేసిన ఎంతోమంది దళిత కవయిత్రుల జీవిత విశేషాలను, వారి సాంఘీక, ఆర్థిక, సాంస్కృతిక నేపథ్యాలను గోగుశ్యామల నల్లపొద్దులో విశ్లేషించింది. ఫిలిప్. బి.జ్ఞానరత్నమ్మ, వేశపోగు గుల్బానమ్మ, తాడినాగమ్మ, కొమ్ముకృప, కట్టా చంద్రమ్మ, జాలామంగమ్మ, బోయి ద్రౌపది, భూషి అన్నపూర్ణమ్మ, కొమ్ముదమయంతీదేవి, సదాలక్ష్మి, నంబూరి పరిపూర్ణ, మోతుకుపల్లి దమయంతీదేవి, డా.బోయి విజయభారతి లాంటి తొలి తరం దళిత రచయిత్రులను, కవయిత్రుల సృజన ప్రస్థానాన్ని నల్లపొద్దులో శ్యామల సముచితంగా చర్చించింది. చిక్కనవుతున్న పాటవెలువడిన తరువాత చాలా మంది దళిత కవయిత్రులు వెలుగులోకి వచ్చారు. చల్లపల్లి స్వరూపరాణి, జెల్లి ఇందిర, కర్రి విజయకుమారి, మద్దూరివిజయశ్రీ, దరిశి శశినిర్మల, యం యం వినోదిని, పుట్లహేమలత, జూపాక సుభద్ర, గోగుశ్యామల, నక్కా విజభారతి, వర్రేరాణి, జాజులగౌరి, సీతామహాలక్ష్మి, యం గౌరి, కందాలలిల్లి , జాలాదివిజయ, చంద్రశ్రీ, స్వాతి మార్గరెట్, అరుణ గోగులమండ, మిరప మాధవి తదితర కవయిత్రులు దళిత స్త్రీ వాదకవిత్వానికి ఎంతో విస్తృతిని కలిగించారు. మెర్సి మార్గరెట్, యం యం వినోదిని లాంటి కవయిత్రులు క్రిష్టియన్ మహిళల ప్రత్యేకసమస్యలను ప్రస్తావిస్తూవిలక్షణమైన కవిత్వం రాశారు. దనసరి అనసూయ గిరిజన స్త్రీ వేదనను తన కవితల్లోఅక్షరబద్ధం చేసింది.'' సఫాయి స్త్రీ 'దుర్భర వేదనలను మేరి మాదిగ ఆర్ద్రంగా అక్షరబద్ధం చేసింది. ''నేను ముళ్ళ కంపలో చిక్కుకొని అల్లాడుతున్న పాలపిట్టను/ఎటుకదిలినా ముళ్లన్నీ గుచ్చుకునేది నాకే /ముందు నుయ్యి వెనుక గొయ్యిలా ఎప్పుడు నాచుట్టూ ప్రమాదం బుసలుకొడుతుంది /ఇంట్లో పురుషాహంకారం ఒక చెంప చెళ్ళుమనిపిస్తే/ వీధిలో కులాధిపత్యం రెండో చెంప పగలగొడుతుంది''(మంకెనపూవు) దళితస్త్రీ నిరంతరం అనుభవిస్తున్న అస్తిత్వసంక్షోభాన్ని చల్లపల్లి స్వరూపరాణి అద్భుతంగా తనకవిత్వంలో బొమ్మ కట్టించింది. 'మంకెనపూవు', 'వేకువ పిట్ట' లాంటి కవితా సంపుటుల ద్వారా చల్లపల్లి స్వరూపరాణి దళితస్త్రీవాద కవిత్వానికి ప్రాణచైతన్యాన్ని అందించింది. దళితకవిత్వానికి విశిష్టతను విలక్షణతను సమకూర్చింది. దళిత

కవిత్వ పరిణామక్రమాన్ని స్వరూపరాణి వేగవంతం చేసింది. తెలంగాణ దళిత స్త్రీ అనుభవిస్తున్న బహుముఖీన అణిచివేతను జూపాక సుభద్ర తన కవిత్వంలో శక్తిమంతంగా చిత్రించింది. దళితస్త్రీవాద కవిత్వంలో సుభద్ర వెలువరించిన 'అయ్యోయ్యోధమ్మక్క 'కవితాసంపుటి ప్రముఖమైనది. దళిత స్త్రీలలో పెల్లుబుకుతున్న పోరాటపటిమను, నాయకత్వ లక్షణాలను, ప్రతిఘటనాత్మక చైతన్యాన్ని సుభద్ర తన కవిత్వలో కళాతత్త్వ భరితంగా చిత్రించింది. దళిత స్త్రీ శ్రమతత్వం, లైంగికహింస, దళిత అస్తిత్వ సంఘర్షణ, దళితుల్లోని పురుషాహంకార వైఖరి తదితర అంశాలను దళిత కవయిత్రులు తమ కవిత్వంలో విభిన్నంగా చిత్రించారు. అటు స్త్రీవాదంలోనూ దళితవాదం లోను మిగిలిపోయిన ఖాళీలను దళితస్త్రీవాద కవిత్వం భర్తీ చేసింది.

## మాదిగ దండోరా ఉద్యమ కవిత్వం

కృష్ణ మాదిగ నేతృత్వంలో సాగిన మాదిగ దండోరా ఉద్యమం దళిత ఉద్యమాన్ని మరోమలుపు తిప్పింది. జనాభా ప్రాతిపదికపై యస్సీ రిజర్వేషన్లను ఏ బి సి డి లు గా వర్గీకరించాలని డిమాండ్ చేస్తూ ఉవ్వెత్తున ఎగసిపడిన దండోరా ఉద్యమం తక్కువ కాలం లోనే ఆంధ్రరాష్ట్రాన్ని కదిపి కుదిపి వేసింది. దళితుల్లో దళితులైన మాదిగల జీవితంలోని అనేక అణిచివేత పార్శ్వాలను ప్రపంచానికి పరిచయం చేసింది. దళిత సాహిత్యోద్యమంలో భాగంగా ఉమ్మడి దళిత స్పృహతో శక్తివంతమైన రచనలు చేసిన చాలామంది మాదిగకవులు దండోర ఉద్యమ స్ఫూర్తితో మాదిగ చూపుతో మరింత నిర్దిష్టంగా కవిత్వం రాయడం విశేషం. వారంతా దళిత ఐడెంటిటీని త్రోసిరాజని, మాదిగ ఐడెంటిటీని మహోన్నతంగా చాటిచెప్పారు. నాగప్పగారి సుందర రాజు చండాల చాటింపు నుండి గుడిపల్లి నిరంజన్ లందపొద్దు వరకు విస్తృతంగా మాదిగ కవిత్వం వెలివడింది. ఆచార్య కొలకలూరి ఇనాక్ వంటి సుప్రసిద్ధ సాహితీవేత్తలతో పాటు, కృపాకర్ మాదిగ, శరత్ జ్యోత్స్నా రాణి, దార్ల వేంకటేశ్వర రావు, లెల్లే సురేశ్, గుండెదప్పు కనకయ్య, చిత్రం ప్రసాద్, పసునూరి రవీందర్, రావినూతల ప్రేమకిశోర్, కాకాని సుధాకర్, కత్తికళ్యాణ్, ఎజ్రాశాస్త్రి, సిద్ధంకి యాదగిరి, దాసరి లింగస్వామి, లాంటి కవులు మాదిగ అస్తిత్వచైతన్యాన్ని శక్తివంతంగా గానం చేశారు. మాదిగ దండోరా ఉద్యమ ఆశయాలను మాదిగల సాహిత్య సాంస్కృతిక కళాసంపదలను పరిరక్షించుకోవాలనే సదాశయంతో నాగప్పగారి సుందరరాజు మాదిగ సాహిత్య వేదికను స్థాపించి మాదిగ కవిత్వం ఉధృతంగా వెలువడటానికి నిరంతరం కృషి చేశాడు. ''నాపాట నేనే పాడుకుంటా /మాదిగ పాట మధురంగా పాడుకుంటా'' అనే సంకల్పంతో రాష్ట్రవ్యాప్తంగా కవులు

రాసిన కవితలను సేకరించి 'మాదిగచైతన్యం 'అనే బృహత్తర సంకలనాన్ని ప్రచురించి మాదిగ కవిత్వానికి నారు పోసి నీరు పోశాడు. 'కైతునకలదండెం'' (కృపాకర్ మాదిగ) కువ్వ(డప్పొళ్ళ రమేశ్) మాదిగ కేక(గుండెడప్పు కనకయ్య) లాంటి కవితాసంకలనాలు దండోరా ఉద్యమచైతన్యాన్నిదశదిశలా వ్యాపింపజేశాయి. ''ఇప్పుడు నేను నా వాటా గురించి వాదిస్తున్నాను/నాకు దక్కాల్సిన హక్కుల్ని లేవదీస్తున్నాను'' అంటూ ఎండ్లూరి సుధాకర్ తన కర్తృత్వంతో ,నేతృత్వంతో ఈ ఉద్యమానికి కొత్త ఊపిరి పోశాడు.' వర్గీకరణీయం, కొత్తగబ్బిలం, గోసంగి లాంటి దీర్ఘకవితల తో మాదిగ కవితా విస్తృతికి మార్గదర్శకంగా నిలిచాడు. సుధాకర్ కుండబద్దకొట్టినట్లుగా కలం గుండెబద్దలుకొట్టి నిజాల నిప్పులతప్పెట మ్రోగించాడు. మాదిగ కళా, సాంస్కృతిక గరిమతో తనకవిత్వానికి పుటం పెట్టుకొన్నాడు. 'కందిన చరిత్రగాయం దండోరా గేయమై మోగుతుంది'(దార్ల వేంకటేశ్వర రావు),' దగాపడ్డ మాదిగా పల్లె/నిలువెత్తుపోరాటమై/గుండెలమంటల్లో దండోరాకు డప్పుకాపుతుంది''(కె. శ్రీనివాసరావు),''చంద్ర మండలమీద చెప్పులతో పోరాడతాను''(సుందర రాజు) మొదలైన కవితాఖండికలు మాదిగహక్కుల పోరాటపంథాను, మాదిగ చైతన్యాన్ని ప్రతిబింబిస్తున్నాయి. 'చెప్పుల్లేని కళ్ళకు /చెప్పులొచ్చే రోజు కోసం/ చెప్పులకు నమస్కరిస్తున్నాను/చెప్పులు చేసిన యుద్ధాలు/నిలబెట్టినరాజ్యాలు/ముద్దడిన పొలాలు/మోసినపల్లకీలు/పోగొట్టుకున్న ధన, మాన,ప్రాణాల సాక్షిగా/చెప్పులకు నమస్కరిస్తున్నాను(మాదిగచైతన్యం) మాదిగల చారిత్రక కృషిని, ప్రస్తుత పరిస్థితిని ఈ కవితలో ప్రతిభావంతంగా బొమ్మకట్టించాడు కొలకలూరి ఇనాక్. మాదిగల సాంస్కృతిక సంపద, వారి సాంఘీకస్థితిగతులు, వారివృత్తిగతమైన శ్రమసౌందర్యం, దండోరా ఉద్యమ ప్రశంస,మాలమాదిగల సంబంధాలు మొదలైన ఎన్నో అంశాలను ఈ కవులు సహజసుందరంగా కవిత్వీకరిచారు. దళితకవిత్వంలో ప్రవేశించిన 'మోనాటినీ' ని బద్దలు చేయడమే కాకుండా ఇతర బహుజన కులాలనుండి నిర్దిష్ట రీతిలో సృజన జరగాల్సిన అవసరముందని మాదిగకవిత్వం తెలియజేసింది. తొలిదశలో దళిత కవిత్వలో అంతర్భాగంగా వెలువడిన అనంతరం స్వతంత్ర మైన ఉద్యమ కవిత్వంగా మాదిగ కవిత్వం స్థిరపడింది.సామాజిక స్వరూపంలోని సూక్ష్మఅణిచివేతల్ని గ్రహించకుండా సమాజంలో మార్పు అసంభమని మాదిగ కవులు వాదించారు.

## సంఘీవభావకవిత

సామాజిక అంతరాలను, వ్యవస్థీకృతమైన బ్రహ్మణవాద భావజాలాన్ని దళిత కవిత్వం నిలదీసి ప్రశ్నించింది. మనువాదం రగిలించిన పెను ప్రమాదాలను,

కులనిర్మూలనా పోరాట ఆవశ్యకతను దళిత కవులు అంగీకార యోగ్యంగా చర్చకు పెట్టారు. కులవ్యవస్థ స్వరూప స్వభావాలను ప్రాబల్య వర్గాలకు చెందిన కవులు కూడా అర్థం చేసుకుని దళిత ఉద్యమాన్ని సమర్థించారు. వారిలో ఒక ఆత్మవిమర్శతో కూడిన ఆలోచన మొదలైంది. ప్రగతివాదుల్లో ఒక ఈరకమైన ఆత్మవిమర్శ దిశగా దళితవాదానికి సంఘీభావం తెలియజేస్తూ వచ్చిన కవిత్వమే దళిత సంఘీభావ కవిత్వం. ఆధునిక తెలుగు కవిత్వంలో 'కాస్తసిగ్గుపడదాం' అనే కవితాసంకలనం ఒక పెద్దమలుపుగా చెప్పవచ్చు. హరిజనోద్యమ సందర్భంలో, అంతకు ముందు కానీ ఎంతో మంది దళితేతర కవులు దళిత సమస్య గురించి కవిత్వం రాశారు. అయితే ఆ కవిత్వంలో సానుభూతి మాత్రమే కనిపిస్తుంది. మద్దూరి నగేశ్ బాబు, ఖాజా సంపాదకత్వంలో వెలువడిన 'కాస్తసిగ్గుపడదాం' అనే కవితాసంకలనానికి మూలప్రాతిపదిక ఆత్మవిమర్శ.'' స్వీయ లోపమ్ములెరుగుట పెద్దవిద్య/లోపమెరిగినవాడే పరిపూర్ణుడగు నరుడు'' అని దాశరథి చెప్పినట్లుగా తన లోపాన్ని తాను గుర్తించిన నాడే మనిషి పరిపూర్ణుడుగా రూపుదిద్దుకుంటాడు. ఈ పరిపుర్ణత్వమే కవికి గాఢమైన సామాజిక దర్శనాన్ని అందిస్తుంది. కొంతమంది అగ్రవర్ణాలకు చెందిన కవులు తమ సామాజికాధిపత్యాన్ని కులకట్టుబాట్లను, కుహనా ఆచార వ్యవహారాలను తీవ్రంగా వ్యతిరేకించడమే కాకుండా 'మారుమనసుతో' పశ్చాతాపంతో దళిత స్పృహతో కవిత్వంరాయడం గొప్ప విషయంగా చెప్పవచ్చు. సామాజిక, ఆర్థిక అణిచివేతకు కేంద్రంగా ఉన్న కులాలకు చెందిన కవులు ఈ రకమైన అణిచివేతను సమూలంగా నిరసిస్తూ కవిత్వం రాయడం ఆరోగ్యకరమైన ప్రజాస్వామ్య ధోరణి. రామిరెడ్డి, సుజాతాపట్వారి, హెచ్ ఆర్ కె, నూకా రాంప్రసాద్ రెడ్డి, జయ, జి.నాగేశ్వర రావు లాంటి ప్రజాస్వామ్య వాదులు తమ కులాల్లోని ఆధిపత్యవాదాన్ని, కరుడుకట్టిన బ్రాహ్మణ వాదాన్ని తీవ్రంగా విమర్శిస్తూ కులనిర్మూలనాదృక్పథంతో 'కాస్తాసిగ్గుపడదాం' అంటూ దళిత సంఘీభావ కవిత్వం రాశారు.దళిత కవిత్వంలో ఇది విలక్షణ మైనది. బాధితుడి ఆక్రోసాన్ని అర్థం చేసుకొని బాధించే వర్గానికి చెందిన కవులు తమవర్గంలోని కుటిలత్వాన్ని నిజాయితీగా అంగీకరించి కవిత్వం ద్వారా బాధితుడికి సంఘీభావం తెలియజేయటం ఆదర్శనీయం. '' ''ఇప్పుడు సిగ్గుపడాలి మనం / నిజానికి ఎప్పుడో పడాల్సిన సిగ్గిది/ ..రండి ! ఇన్నాళ్ళు /మనల్ని క్షమిస్తూ వచ్చిన /ఆ దళితుడి కాళ్ళ మీద పడి, పాదాలను కన్నీళ్లతో కడుగుదాం ''(కాస్త సిగ్గుపడదాం -రామిరెడ్డి) అంటూ ఆత్మవిమర్శ తో కవిత్వం రాశారు. 'కాస్తాసిగ్గుపడదాం' సంకలనం వచ్చిన తరువాత ఎంతోమంది దళితేతర కవులు దళిత సంఘీభావ కవిత్వం రాశారు.

## దళిత కళాతత్త్వం

ఆధునిక కవిత్వంలో దళితవాదం వినూతన రూపవిప్లవానికి, ప్రత్యామ్నాయ అభివ్యక్తి విధానానికి నాంది పలికింది. భావ, అభ్యుదయ, విప్లవ కవిత్వాలలో లేని రూపవిశిష్టతను, భాషా పరమైన విలక్షణతను దళిత కవులు సాధించారు. హైందవ భావజాల సమన్వితమైన అలంకర శాస్త్ర ప్రమాణాలను తృణీకరిచి. బతుకు పేగు తెంచుకు పుట్టిన సజీవమైన దేశీయతకు దళిత కవులు పెద్దపీఠ వేశారు.పాతబడిన కవిసమయాలను, సంప్రదాయ సాదృశ్యాలను ధిక్కరించి, ఈ కవులు తెలుగు కవితకు సరికొత్త జీవనవ్యాకరణాన్ని రచించారు. అనేక ఉపకులాలకు, వేరు వేరు ప్రాంతాలకు చెందిన దళిత కవులు తమమత, ప్రాంత, కుల, వృత్తి సంబంధ మైన జీవన స్థితి గతులను సాంస్కృతిక విభిన్నతను సహజసుందరంగా కవిత్వీకరిచడంతో పాటు తదనుగుణమైన పరిభాషను రచనల్లో విస్తృతుంగ ప్రయోగించటం వల్ల దళిత కవితారూపంలో అపూర్వమైన మార్పు సంభవించింది ''ప్రత్యామ్నాయ సంస్కృతి, ప్రత్యామ్నాయ సాహిత్య అని నినాదాలిచ్చి కూర్చుంటే చాలదు. ప్రత్యామ్నాయ అభివ్యక్తికుడా అవసరం(గెయిల్ ఆమ్వెత్ తో కలేకూరిప్రసాద్ ఇంతర్వ్యూ-ఏకలవ్య మాసపత్రిక ప్రత్యేక సాహిత్య సంచిక(1997) గెయిల్ ఆమ్వెత్ పిలుపునిచ్చి నట్లుగానే దళిత కవులు భాషలోనూ వ్యక్తీకరణలోను కొత్తపుంతలు తొక్కారు. దళిత జీవితానుభవంలోని పలుకుబడులను, నుడికారాన్ని, జాతీయాలను భావానుకూలంగా సమన్వయ పరుస్తూ సజీవ కళా సౌందర్యభరితమైన కవితారూపానికి ప్రాణప్రతిష్ఠ చేశారు. ఈ విధమైనరచనా పద్ధతిని దళిత కళాతత్త్వం అని పేర్కొనవచ్చు. మరాఠీ కవి శరణ్ కుమార్ లింబాలే 'To words An Aesthetic of Dalit literature' అనే ప్రామాణిక గ్రంథంలో దళిత కళాతత్త్వ తీరు తెన్నులను సోదాహరణంగావిశ్లేషించాడు.'''Dalit writers have rejected traditional Artistic standards and Aesthetics and have attempted to develop separate Aesthetics of their own'' దళిత కవులు సాంప్రదాయ మూల్యాంకన సూత్రాలకు వ్యతిరేకంగా ప్రత్యేక కళాతత్త్వాన్ని రూపొందించుకున్నారని శరణ్ కుమార్ లింబాలే స్పష్ట పరిచాడు. ఈరకమైన రూప విలక్షణత దళిత కవిత్వంలో ఆద్యంతం పరిమళిస్తుంది.

'కవిత్వం నాకు వృత్తిలోని చర్మ తత్వ రహస్యం' అంటూ ఎండ్లూరి సుధాకర్ దళిత దృక్కోణం లోనుండి కవితా తత్వాన్ని పునర్నిర్వచించాడు. కవిపరమాత్మ స్వరూపుడని, కవితా శక్తి దైవ దత్తమని, పూర్వ జన్మ సుకృతమని ప్రాచీనపండితులు

కవిత్వంచుట్టూ అలౌకిక సరిహద్దులను ఏర్పరిచారు కవితాప్రతిభ కొందరికి మాత్రమే సాధ్యమన్న సృజనాత్మక దురహంకారం ప్రాచీన లక్షణ గ్రంథాల్లో కనిపిస్తుంది. ఈ రకమైన ముళ్ళకంచేల సరిహద్దులను చెరిపేసి, కవిత్వానికి శ్రమకు ఉన్న రక్తసంబంధాన్ని హృద్యంగా అక్షరీకరించాడు .'కవిత్వం రాయడం', 'చెప్పులు కుట్టడం' అనే వేరువేరు ప్రక్రియలకు అభేదం చెప్పడం ద్వారా ఈ రెండు వృత్తులకు బ్రాహ్మణీయవ్యవస్థ ఆపాదించిన ఉత్తమ, అధమత్వాలను కవి నిర్మూలించ గలిగాడు. 'కవిత్వం నాకుల విద్యల్లోంచి బతికి బట్ట కడుతున్న కళారూపం'' అంటూ సహస్ర వృత్తుల శ్రమ సంపదలోనే సమస్త కళాసౌందర్యం పురుడు పోసుకుంటుందని మద్దూరి నగేష్ బాబు నిర్ధారించాడు.''ఆరేళ్తో దూడ తోళ్ళ మీద మహాకావ్యాలు రాస్తామని'' బతుకు సాక్షిగాఈ కవి ప్రమాణం చేశాడు. సామాజిక ప్రగతికి పట్టుకొమ్మలైన దళితుల వృత్తుల్ని మనువాద సంస్కృతి నీచ వృత్తులుగా భావించి బ్రాహ్మణ, వైశ్యాది ఉన్నత వర్గాల మేధోపరమైన శ్రమకు నీరాజనాలు పలికింది. అందుకే దళితకవులు తమవృత్తిగతమైన కార్య నిర్వహణా దక్షతను కవిత్వం ద్వారా ఆదర్శీకరిచారు. వృత్తి సంబంధమైన పని ముట్లను పరికరాలను ఉన్నతీకరిస్తూ కవితా సృజనసాగించటం దళిత కవిత్వంలో ప్రధానంగా కనిపిస్తుంది.''అక్షరాన్ని పచ్చి తోలును చేసి లందె లో ఊరేస్తున్నాను/పారదర్శకపు పటికరాయిని చేసిమంగలిపొదిలో ఊరేగిస్తున్నాను /అక్షరాన్నికాల్చినజీడిగింజెను చేసి జాతి వస్త్రం మీద చాకలి సంతకం చేస్తున్నాను/అక్షరాన్ని తెప్ప లాంతరును చేసి /నా వల కు కాపలాగా/చీకటి నదిమీదకు వదులుతున్నాను (కిర్రు చెప్పుల భాష ) దళిత బతుకు నిలువుటద్దంలోనుండి శిఖామణి అక్షరాన్ని దర్శించాడు. కళాసృజన బహుజన శ్రమతత్వంలో అంతర్భాగమనే సత్యాన్ని సమర్థవంతంగా రూపుకట్టించాడు. పచ్చితోలు, లందే, మంగలి పొది, జీడిగింజే, తెప్పలాంతరు లాంటి పదబంధాలవల్ల దళిత పరిభాషకు పట్టంకట్టాడు. శివుని చేతి ఢమరుక నుంచి వర్ణమాల ఆవిర్భవించందనే పాణినీయ సూత్రాన్ని ధిక్కరించి,'వీరబాహుని కిర్రుచెప్పుల చప్పుళ్లనుంచి' అక్షరం ప్రాణం పోసుకుందని దళితకవులు వాదించారు. స్థిరపడిన ఉపమానాలను ఉపమేయాలుగా తమజీవనసంస్కృతిలోని అంశాలను ఉపమానాలుగా మార్చి ప్రయోగించటం మూలంగా దళితకవిత్వంలో అసాధారణమైన సృజనాత్మక వైవిధ్యం ఉట్టిపడుతుంది .''ఆకాశం లోనక్షత్రాలన్నీ / సముద్రపు ఒడ్డున ఎండుచేపల్లా మెరుస్తున్నాయి./..మండుటెండల్లో కాలినబూడిదలా/తెల్లమబ్బులు కమ్ముకుంటున్నాయి'' (నిప్పుకవిత-కత్తి పద్మారావు) ''మా చెల్లెమ్మ జడలోని మల్లె ల్లాగే/ఆకాశంలో నక్షత్రాలు పూసాయి

(వెన్నెలమ్మ)ఈ కవిత ఖండికల్లో పోలికల్ని తారుమారు చేయడం మూలంగా కవి వర్ణనలో నవీనత్వాన్ని సాధించాడు. '' మండే మాదిగ డప్పు లా ఉదయిస్తున్నా / సూరీడుపై /చిర్రా చిటికెన పుల్లా తీసుకొని/ తొలకరి పాటకు దరువేస్తున్నాను/ (మండే మాదిగ డప్పు) అంటూ శివసాగర్ అసాధారణమైన సాదృశ్యాల ద్వారా కవితాశిల్పస్వభావాన్ని దళితీకరించాడు. దళిత కవులు వర్ణ వివక్షత తో పాటు ఆర్య సంస్కృతికి అధికారవర్ణమైన 'తెలుపు' ను తిరస్కరించి 'నలుపు' తనానికి ప్రాధాన్యతనిచ్చారు ' వెన్నెల పక్కల మీద మాకేమీ పులకరింతలు లేవని, మల్లెలైనా సరే తెలుపంటే కడుపులో తిప్పినట్లుంటుందని'' ప్రసాదమూర్తి శ్వేతవర్ణాగ్రహాన్ని ప్రకటించాడు.ఆధిపత్య సంస్కృతి అశుభసూచకంగా భావించే 'నలుపు' ను జాతీయవర్ణంగా దళిత కవులు అభివర్ణించారు. 'నల్లకలువ', 'నల్లపొద్దు', 'నల్లసూరీడు', 'నల్లతుమ్మ' లాంటి శీర్షికలెన్నో దళితకవిత్వంలో ఇబ్బడిముబ్బడిగా కనిపిస్తాయి.

మొత్తం తెలుగు కవిత్వంలోనే దళిత కవులు ప్రయోగించినభాష అత్యంత సహజమైనది. అనంతమైన విఘ్నని అంతులేని అణిచివేతల్ని ఆవేదనల్ని కవిత్వీకరించే క్రమం లోనే పదునైనభాష పుట్టుకొస్తుందని, యజమాని ఆయుధాలతో యజమాని సౌధాన్ని కూలగొట్టడం సాధ్యపడదని' నల్ల జాతి కవయిత్రి పేర్కొన్నట్లుగానే కుల నిర్మూలనా చైతన్య భరితమైన తమ కవిత్వానికి కూడా ప్రత్యామ్నాయ పరిభాషను ,కవితా సామాగ్రిని దళితకవులు సమకూర్చుకున్నారు.సంస్కృత భాషా సామ్రాజ్యవాదాన్ని నిలువరించి, దళిత కవులు ప్రజల నాలుకల మీద జీవించే బతుకుభాషకు ప్రాముఖ్యతనిచ్చారు. 'ఒక ఋక్కు దాడి చేస్తుంది /ఒక విసర్గ ఎమ్మట పడుతుంది/అంటూ నగేష్ బాబు 'దెయ్యనాగరి' అనే కవితలో భాష పరమైన ఆధిపత్యాన్ని సమూలంగా ప్రశ్నించాడు. ఎల్ల భాషలకు తల్లియైన సంస్కృతం ఎల్లిగాడికి సవతి తల్లి వాదించాడు. 'ఒక నుడికారం నిద్ర లేచింది /ఒక జానపదం జాగృతమైందని 'వాడ' పలుకుబడులతో కవితాభాషకు కొత్తజాడవేశాడు. ప్రపంచీకరణ నేపథ్యంలో చానల్ సంస్కృతి పెద్ద సునామిలా వెల్లువెత్తుతున్న సందర్భంలో కవిత్వాన్ని భాషా కాలుష్యం కమ్మేసింది. ఈదశలో తెలుగు నుడికారం దళిత కవిత్వంలో వర్ధిల్లుతుంది. తల్లిరక్తం బిడ్డలో ప్రవహించినంత సహజంగా బతుకు తత్వం వీరి కవిత్వంలో ప్రభాసిస్తుంది. వస్త్రాలనుబట్టి దేహాలను తయారు చేసుకోవాలని మొండిగా వాదించే ధోరణికి భిన్నంగా దేహ స్వరూపాన్ని అనుసరించి వస్త్రాలను రూపొందించుకోవాలని దళితకవులు నిర్దేశిస్తున్నారు.

# లక్ష్యం దిశగా 'బహుజన ఉద్యమ కవిత్వం'



డా. ఎస్.రఘు
అసిస్టెంట్ ప్రొఫెసర్
98482 08533

తెలుగు కవిత్వంలో ఎనభయ్యవ దశాబ్ది విభిన్న వాదాలకు, ఉద్యమాలకు ప్రధాన వేదికైంది. వైయుక్తిక వాదాలకు తోడు అస్తిత్వ ఉద్యమాలు బలంగా ఊపిరిపోసుకున్నాయి. సామాజిక, ఆర్థిక, లైంగిక దోపిడి, అణచివేత, ఆధిపత్యాలపై స్త్రీవాద ఉద్యమం, తరతరాల అస్పృస్యత, వివక్షత, హింసలపై తిరుగుబాటుగా వచ్చిన దళితోద్యమం తెలుగు సాహిత్యాన్ని కొత్త ఆలోచనలతో ప్రభావితం చేసింది. నిశ్శబ్దంగా అత్యంత వేగంగా దూసుకొచ్చిన ప్రపంచీకరణ మానవాళి మనుగడను ప్రశ్నార్థకం చేసింది. పాలకుల రాజకీయ విధానాలు ప్రజలలో అనేక అసమానతలను సృష్టించాయి. సామాజిక అంతరాలు మరింత పెరిగిపోయాయి. అధికారం కోసం నాయకులు హింసను వ్యవస్థీకృతం చేసుకుంటూ ఆధిపత్యాన్ని నిలబెట్టుకునే ప్రయత్నం తీవ్రతరం చేశారు. ప్రజల అస్తిత్వం మరింత ప్రమాదంలోకి జారిపోయింది.

తెలుగు కవిత్వం ఈ పరిణామాలన్నింటిని నిశితంగా గమనిస్తూ హెచ్చరిస్తూనే ఉంది. ఈక్రమంలోనే పూలే ఆలోచనావిధానం, ఆచరణాత్మక ఉద్యమ కార్యాచరణ, అంబేద్కర్ భావజాలం, సిద్ధాంత భూమిక కేంద్రంగా దళిత కవిత్వం ఉవ్వెత్తున ఉద్యమస్థాయిలో ప్రకటితమైంది. 1995లో వెలువడిన 'చిక్కనవుతున్న పాట' కవితా సంకలనం దళిత కవిత్వంలో భిన్న చర్చలకు, వాదనలకు కేంద్రమైంది. కొత్త అస్తిత్వ కవిత్వోద్యమాల ఆవిర్భావానికి కారణమైంది. ఈ నేపథ్యాల తాత్విక మూలాల్లోంచి 2001లో 'వెంటాడే కలాలు' అనే సంకలనంతో బి.సీ వాద కవిత్వం ఉద్యమస్థాయిలో ఆవిర్భవించింది.

'వెంటాడే కలాలు' కంటే ముందే బి.సీ వాద కవితాస్పర్శ 'బహువచనం'(1996-

సంపా: సుంకిరెడ్డి నారాయణ రెడ్డి) కవితా సంకలనంలో కనిపిస్తుంది. నీలగిరి సాహితీ సంస్థ ప్రచురించిన ఈ గ్రంథం 'దళిత బహువచన కవిత్వం' ఉప శీర్షికతో వెలువడింది. గోసంగి, నీలి సాహితీ మిత్రులు ప్రచురించిన 'మేమే', 'మొగి' సంకలనాల్లో కూడా బి.సీ కవితా స్పృహ వ్యక్తమైంది. ఈ సంకలనాల్లోని దళిత, బి.సి, మైనారిటిలు తమ అస్తిత్వ వేదనా స్వరాన్ని తమ మూలాల్లోంచి వినిపించారు. "ప్రజాస్వామీకీకరణ ప్రక్రియలో ఇది ముందడుగు. ఈ బహువచనం ఏకస్వరంలో కలిసిపోయే కోరస్ కాదు. ఏ స్వరానికాస్వరం అస్తిత్వాన్ని, ప్రత్యేకతను నిలుపుకుంటూనే ఏక స్వరంగా వ్యక్తమయ్యే బహువచనం. బహుజనవాదం సిద్ధాంతమైతే 'బహువచనం' దానికి సాహిత్యరూపం" అని ఈ సంకలనం ప్రత్యేకతను సంపాదకులు వ్యాఖ్యానించారు.

'చిక్కనవుతున్నపాట' ముందుమాటలో జి.లక్ష్మీనర్సయ్య దళిత కవితా తత్వాన్ని విశ్లేషిస్తూ ఎస్.సి, ఎస్.టి, బి.సి, మైనారిటీలందరూ కలిసి గొంతెత్తి పాడిన పాటే ఈ దళిత కవిత్వం చిక్కదనానికి కారణమంటూ ఒక విశాలార్థంలో, సంఘటిత చైతన్యంతో గ్రంథ అంతస్సారాన్ని ప్రకటించారు. ఈ సందర్భంగానే సాహితీకారుల మధ్య విస్తృతమైన చర్చలు మొదలయ్యాయి. 'ఏది దళిత కవిత్వం?, ఎవరు బహుజనులు?' అంటే దళితులు, బి.సీలు అని సమ్మిళిత అర్థంలో వ్యవహరించేవారు. 'చిక్కనవుతున్న పాట' తదనంతరం ఒక స్పష్టమైన అవగాహన ఏర్పడింది. సతీష్ చందర్, కొలకలూరి ఇనాక్ ఆరోపణలు, అనుమానాలతో బి.సీ సాహిత్యకారుల్లోనూ సామాజిక,తాత్విక స్పష్టతకు దారితీసింది. దళితుల స్వీయానుభవం, బి.సీల సహానుభూతుల మధ్య వున్న వ్యత్యాసాలపై జరిగిన చర్చలు, వాదనలు, అస్తిత్వ కవిత్వంలో కొత్తదారులకు బాటలు వేశాయి.

> 'ఎవరి బాధలు వాళ్ళే చెప్పుకోవాలి, ఎవరి చెప్పులు వాళ్ళే విప్పుకోవాలనే' స్పష్టతతో నిచ్చెనమెట్ల కులవ్యవస్థను కూల్చివేసే పోరాటం ఉధృతమైంది.

'ఎవరి బాధలు వాళ్ళే చెప్పుకోవాలి, ఎవరి చెప్పులు వాళ్ళే విప్పుకోవాలనే' స్పష్టతతో నిచ్చెనమెట్ల కులవ్యవస్థను కూల్చివేసే పోరాటం ఉధృతమైంది. 'దళిత బహుజనవాదం' పేరుతో తమ అస్తిత్వాన్ని కోల్పోయిన బి.సీ కవులు 'వెంటాడే కలాలు'లో బహుజనవాద ఉద్యమ స్వరాన్ని వినిపించారు.

2001లో జూలూరు గౌరీశంకర్ సంపాదకత్వంలో వెలువడిన "వెంటాడే కలాలు వెనకబడిన కులాలు" కవితా సంకలనం బిసీ వాద కవిత్వానికి తాత్విక దిశానిర్దేశాన్ని చూపింది. దళితోద్యమకారులు బీ.సీలను తమతో కలుపుకుపోవడానికి నిరాకరించినప్పటికీ సహానుభూతికి, స్వీయానుభూతికి తేడా ఉండదని నిరూపించే క్రమంలో ఉద్యమ జైత్రయాత్ర చేరుకున్న డెడ్ ఎండ్ గోడలను పగలగొట్టే ఊతం ఈ వెంటాడే కలాలు. ఇది బీ.సి సూర్యోదయం"అని ముందుమాట కర్తలు ప్రసేన్, గౌరీశంకర్ లు చారిత్రక చేదు నిజాలను వెల్లడించారు. 'దళితాత్మ కవిత' శీర్షికతో వచ్చిన ముందుమాట సంచలనాత్మకమై అనేక కొత్త చర్చలకు, సమీకరణాలకు వేదిక అయింది.

'వెంటాడే కలాలు' సంకలనంలో ఇరవై ముగ్గురు బిసీ కవులు రాసిన 78 కవితలున్నాయి. పదిహేడు వృత్తి కులాల గొప్పదనం, వర్తమాన పరిస్థితులను ఆర్ద్రంగా కవిత్వీకరించారు. ప్రపంచీకరణ ప్రభావంతో కులవృత్తులు ఏ విధంగా విధ్వంసమయ్యాయో గాఢంగా వర్ణించారు వెంటాడే కలాల కవులు. వృత్తికారుల వాస్తవ దుస్థితితో పాటు కొన్ని బీసీ కులాలు అనుభవిస్తున్న వివక్షత, అవమానాలు, జీవన సంక్షోభాలు. మనోవేదన 'వెంటాడే కలాలు'లో వ్యక్తమైంది. ఈ సంపుటిలోని కవులందరూ తమ కుల వృత్తుల చైతన్య చట్రంలోంచి అస్తిత్వ ప్రకటనలు చేశారు. ఇంతకుముందు కవిత్వంలో వృత్తుల ప్రస్తావన వున్నా అందులో తమ వృత్తుల నైపుణ్య వైభవాల వర్ణనకు ప్రాధాన్యం ఉండేది. వృత్తి కులంగా పరిణామం చెంది, వృత్తి ద్వారా వచ్చే ఆదాయం, వనరులు, ఆర్థిక స్థాయిని అనుసరించి సమాజంలో విలువలు నిర్ధారించే స్థితి ఏర్పడింది.

ఆధిపత్య కులపెద్దల కొలమానాలతో వృత్తి కులాల సామాజిక స్థాయిని స్థిరపరిచే కుట్రలను బహుజనులు పసిగట్టలేకపోయారు. తమ కులం చుట్టూ ఏర్పడిన సంప్రదాయాలు, సాంస్కృతిక విశేషాలు, వృత్తి కళా రహస్యాలు, ప్రత్యేకమైన భాషాజాలం వృత్తికులాల జీవన చిత్రణ కవిత్వ అభివ్యక్తిలో వైవిధ్య అంశంగానే పరిగణించబడింది. 'వెంటాడే కలాలు'లోని వెనకబడిన కులాల కవితలు ఈ మూస ధోరణులను బద్దలు కొట్టింది.

"నా కొడుకు వల ఇసిరి
గడ్డ మీదికి చాపలు తెస్తుంటే
కండ్లెల్లవెట్టి

మాయ మాయగా జూసేటోళ్లు
గా దొర
మీ వోడు భలే షికారి గాడురా
అన్నప్పుడు
అదాడి గొప్పతనమన్నప్పుడు
ఆ మాయ మాటలకు
ఉబ్బిపోయానే గాని
అదే ఆడి సదువుకు
ఉచ్చు బిగువవుతుందనుకోలేదు"
(వల ఏరయ్యాకముందే-అంబటి వెంకన్న)

ప్రాణాలకు తెగించి వలలు వేసి చేపలు పట్టే బెస్త, ముత్రాసి కులాలను గట్టుమీదున్న దళారులు ఘోరంగా వారి శ్రమను దోచుకుంటున్నారు.

అంతటితో ఆగకుండా వారు అదే వృత్తిలో మగ్గిపోయేటట్లుగా, చదువుకునే ఆలోచనలు కలగకుండా ఎట్లా ఏమార్చుతున్నారనే విషయాన్ని వెల్లడిస్తున్నాడు కవి. ఎం. వెంకట్ "గంగమ్మ" కవితలో అల్లకల్లోలమైన మత్స్యకారుల బతుకులను దయనీయంగా వర్ణిస్తాడు.

"అయ్యను వెతుకుతూ అమ్మగుండె
తెప్పలా తేలిపోయింది నీటిమీద
నిలువెత్తు నీళ్లలోంచి
కట్టుబట్టలతో మళ్లీ ఏ గట్టుకో పయనమవుతుంటే
అంచనా బృందామొకటి అమ్మను అడుగుతుంది
నష్ట పరిహారానికేమో
మీకు పంట భూములున్నాయా" అని
"లేవు సముద్రముంది" అంది అమ్మ అమాయకంగా (గంగమ్మ-ఎం. వెంకట్)

చేపల వేటకు సముద్రం మీదికి వెళ్లిన భర్త తిరిగిరాలేదు. పోటెత్తిన వరదలో గుడిసె కొట్టుకొనిపోయింది. బతుకు కన్నీళ్లలో మునిగిపోయింది. ఇలాంటి దయనీయమైన స్థితిని ఎం.వెంకట్ గుండె కరిగిపోయేలా చిత్రిస్తారు.

"నేను గొర్రెల్ని కాస్తుంటాను
మంద నా గురుకులం
తాత తండ్రులు నా ఉపాధ్యాయులు
కొండకోన నా తరగతి గది
తడి దుక్కి నా ముద్దుపలక
దుడ్డుకొన నా సుద్దముక్క
అనుదినం ఒక అధ్యాయం
బోడు బీడు నా ఆటస్థలం
తీరు తీరు గొర్రెల పేర్లు వినడమే
నేను నేర్చిన ఓనమాలు
బుజ్జి బుజ్జి పిల్లల్ని తల్లులకు
కుడిపి పొదిలోకి చేర్చడమే నా బాలశిక్ష"

ఈ కవిత చదివిన పాఠకుడు కవివెంట సహ గొర్రెల కాపరిగా, మందలో ఒక గొర్రెగా మారి ప్రయాణించిన అనుభూతి కలుగుతుంది. తన కుల జీవన సాంస్కృతిక సంచారాన్ని సమస్తం తనలో లీనం చేసుకొని తాదాత్మ్యతతో బాటసారి పాడుకున్న ఆత్మగానం ఈ కవిత.

చివరలో ' నిజానికి / గొర్రెలు గొర్రెలు కాదు జనం గొర్రెలు/ తోడేళ్ళు తోడేళ్ళు కాదు / ఓ పద్ధతి ప్రకారం కుట్ర చేస్తూ నన్ను నా గొర్రెల్ని బలిగొంటున్న / దళారులే పెద్ద తోడేళ్ళు' అంటూ తమకు జరుగుతున్న అన్యాయాన్ని, కుట్రల్ని బట్టబయలు చేస్తాడు. గొర్రెలు మంద వెంట ఏ ఆలోచన లేని గొర్రెలా కదలడం లేదన్న యాదవ కుల చైతన్యం ఇందులో ధ్వనిస్తుంది.

లోకానికి వస్త్రాలు కట్టుకునే నాగరికతను నేర్పిన చేనేత కార్మికుడి జీవితాన్ని డా.ఎన్. గోపి "ఓ రాజయ్య కథ"గా చెపుతాడు. 'బతుకు బాటలన్నీమూసుకుపోయి బొంబాయికి బతుకు దెరువు కోసం వలసవెళ్లే చేనేతకారుల దుఃఖాన్ని ఈ కవితలో గుమ్మరిస్తాడు కవి.

"అవి పట్టుచీరలు నేసిన అమ్మ హస్తాలనీ
బట్టపై బంగారు శిల్పాలు నాటిన

కళా విజయ కేతనాలనీ మనకు తెలుసు
లోకాన్ని జలతారు ముసుగుల్తో కప్పినవాడికి
పిర్రల మీద ధోతి చిరుగు లెందుకున్నాయో కూడా మనకు తెలుసు"

ఒక తరం చేనేత కుటుంబాలు చెల్లాచెదురై వలసవెళ్లిన ప్రాంతాల్లో మరింత దుర్భరంగా జీవితాన్ని గడుపుతున్న అనేకమంది రాజయ్యల కథలు ఈ కవితలో నిక్షిప్తమై ఉన్నాయి. ప్రసాదమూర్తి 'తాతకో నూలుపోగు' చేనేత కళా నైపుణ్యాన్ని ఆవిష్కరించే అద్భుతమైన కవిత.

"తాతా తాతా!
వెండివెన్నెల జరీ నేతల నేతగాడా
బతుకంతా బాధల బస్తాల మోతగాడా
ఏం రాయమంటావు తాతా
మగ్గం గోతిలో నువ్వు మౌనంగా కూర్చుని
కాళ్లతో అణగదొక్కుతూ
చేత్తో కుచ్చుతాడు లాగుతూ
శరీరాన్ని అటూ ఇటూ నాడితో పాటు ఆడిస్తుంటే
నీ రక్త మాంసాలతో
ఒక మహోన్నత వస్త్రకావ్యం తయారవుతుంటే
ఆ అద్భుత దృశ్యాన్ని చిత్రించాలని
చిన్నప్పుడే నేనెన్ని కలలు కన్నాను"

కవి కన్న కలలు బహుజన వృత్తి కావ్యంలో అపురూపమైన ఖండికగా ప్రసంశలందుకుంది. ప్రసాదమూర్తి తన వృత్తి కళా వర్ణనకే పరిమితం కాకుండా మహాత్మా పూలే వ్యక్తిత్వాన్ని ఉదాత్తంగా కవిత్వీకరించాడు.

"సిగ్గుపడుతున్నాను చితికిపోతున్నాను/ఈ మట్టిలో మొలకెత్తి/ మూడున్నర దశాబ్దాలైనా నీ పేరే విననందుకు/ నిలువు నిలువునా నీరైపోతున్నాను/ క్షమించు మహాత్మా!

నిన్నిప్పుడు పొగడాలంటే/నా అగ్రవర్ణ నాయకుడి అంగీకారం కావాలి/ సిగ్గుపడుతున్నాను మహాత్మా/ నా శత్రువు రాసిన చరిత్రనే ఇంతకాలం

నమ్మినందుకు/నన్ను నేనే చీదరించుకుంటున్నాను. నీ సమాధి మీద ఇంత భయంకర నిశ్శబ్దాన్ని కప్పిఉంచిన/ కుట్రదారుల్ని ఇప్పుడు బయటపెట్టాలి" అంటూ

నిమ్న కులంలో పుట్టి దళితజాతుల అభివృద్ధి కోసం జీవితాంతం పోరాడిన పూలే బహుజన తాత్విక దృక్పథాన్ని స్పష్టంగా ప్రకటించిన కవిత ఇది. బహుజనవాద సాహిత్యానికి కొత్త చూపును ప్రసాదించిన ఈ కవితలోని ఆగ్రహం తదనంతర బిసీ కవులకు మార్గదర్శకమైంది. పూలే ఉద్యమ స్ఫూర్తి, పోరాట చైతన్యం, ధిక్కార స్వరం బీసివాద సాహిత్యంలో ప్రధాన ఇతివృత్తమైంది.

బహుజన వాద కవిత్వంలో దెంచనాల శ్రీనివాస్ బలమైన స్వరాన్ని వినిపించాడు. 1994 లోనే ' గురితప్పిన స్వరం' కవితా సంపుటిలో ఆధిపత్య అగ్రవర్ణాల దురహంకారాన్ని ఘాటుగా వ్యాఖ్యానించాడు. మనుషుల బానిస మనస్తత్వాన్ని అసహ్యించుకున్నాడు.

" చేతగాని వాణ్ణి / తరాలుగా తగలబడ్తున్నా
నీ భాషకు లిపి ఇవ్వలేనివాణ్ణి
.......
నా కమ్మ దొరల బానిసా
నువ్ కూర్చున్ననేలను వాళ్ళు అసహ్యించుకోవటం చూశాను
నీ సామూహిక డప్పు నాట్యాల్లో దరిద్రాన్ని మర్చిపోయాను"

కవిలోని నిర్మోహమాటం స్వీయ ఆత్మవిమర్శగా పరిణమిస్తూ తన కంసాలి వృత్తి నేపథ్యంలోకి వెళ్లిపోతాడు. 'యాడీ, మనే మార్నాక్' కవితలో తమ కులాలవారు ఇతర బిసీ కులాల వారితో కలిసిపోయి బతుకును ఎలా వెళ్లదీస్తారో ఉద్వేగభరితంగా వ్యక్తపరుస్తాడు.

"కన్నగాని పునాసల కాంచ్ డీల సప్పుడూ
అశ్శరభ శరభ దశ్శరభ శరభ
వొడ్ల బ్రహ్మయ్య కొట్టంల కాంచనమాలా కథలూ
అశ్శరభ శరభ దశ్శరభ శరభ
సోమిలి జాకెట్లో బతుకమ్మ పీటలూ
పెద ఖాసీం ఇంటిముందు మందెచ్చుల ఆటలూ

..........

చనుబాలిచ్చిన దుబ్బ దొడ్డి
కనుగీటుతున్న ముష్టికుంట
భాషను శుభ్రపరుస్తున్న వొడ్డె రెంకమ్మ బూతులు
నన్ను నాస్తికుణ్ణి చేసిన గొల్లమల్లయ్య
లింగ లింగ లింగో లింగ లింగ లింగా"

గ్రామీణ ప్రాంతాలలో బహుజన కులాల వృత్తులన్నీ ఒకదానిమీద ఒకటి ఆధారపడుతూ పనులు జరుగుతాయి. శ్రామిక వృత్తి పనుల కులం వారు ఉత్పత్తి కులాల వారికి అవసరమైన పనిముట్ల తయారీలో కీలకపాత్ర వహిస్తారు. అలాగే వాళ్లలో ఆత్మీయ మానవసంబంధాలు బలపడిపోయి విడదీయలేని అనుబంధాలుగా మారిపోయిన తీరును దెంచనాల శ్రీనివాస్ వీరావేశంతో చిత్రించాడు. ఈ సామాజిక వర్గ నేపథ్యంలోంచే బాణాల శ్రీనివాసరావు 'కుంపటి' దీర్ఘ కవితలో తన కంసాలి వృత్తిలో జీవితాన్ని వెలిగించే కుంపటి కేంద్రంగా తన తండ్రి కళాత్మక నైపుణ్యాన్ని, బాల్య జ్ఞాపకాల్ని కథాకావ్యంగా మలచి వెంటాడే అనుభూతిని అందిస్తాడు.

"కుంపటి మా ఇంటితోటలో పూసే సూర్యపుష్పం
అందులో మేం మెరుపుల్ని చూస్తాం
మేఘాల్ని చూస్తాం.......ఉరుముల్ని వింటాం
రకరకాల రంగుల్ని చూస్తాం
ఆఖరికి పాలపుంతల్ని చూస్తాం
ఈ సమస్త విశ్వం తిరిగేది
మా కంసాలోల్ల కుంపటి చుట్టే
అది నిరంతరం మండే అగ్నిగోళం"

.......

మా కుంపట్లో ఎండి బంగారం కరిగితేనే
మా పొయ్యి మీద అన్నాలు వుడికేది
మా కడుపులు నిండేది"

అంటూ కుంపటి చుట్టూ అలుముకున్న బతుకు దృశ్యాలను కవితాత్మకంగా

చిత్రిస్తాడు. జూలూరు గౌరీశంకర్ 'కల్లులు' కవితలో ఉద్యమావేశ ఉద్ధృతితో తన అస్తిత్వ మూలాలను తలచుకుంటాడు.

"మేం లేకుండా శతాబ్దాలకు శ్వాస
కాలానికి కాళ్ళూ చేతులు
ఆకాశపు గడియారానికి
శబ్ద లోలకులు లేవ్
నీ కొలిమి తిత్తి గొంతుకనై
వూదీ వూదీ
మంటకు మాటలు నేర్పాకేగా
చరిత్ర ప్రసవం
రాయిపై నా చేతివేళ్ళ సంగీతం విన్పించాకే
శిల్పభాషకు జననం
ఇదంతా ఇట్లా ఉందంటే
నేను పట్టిన చిత్రికే
పోతులూరి వీరబ్రహ్మమూ....
కాలజ్ఞానమూ
కాల చిత్ర పటమూను.."

అని బహుజన తాత్వికతకు తొలిపాదాలను చెప్పిన పోతులూరి వీరబ్రహ్మాన్ని స్మరించుకుంటాడు. జుగాష్ విలీ

'మరికొన్ని వాక్యాలు' కవిత భిన్నమైన దృష్టికోణంలోంచి బీసీవాదం లోని ఆగ్రహాన్ని వ్యక్తపరిచింది. ' విశ్వబ్రాహ్మణ స్త్రీలు సోమరిపోతుల'ని వ్యాఖ్యానించిన ఓ దళిత కవికి సమాధానంగా తమ ఇళ్లలో పనిచేస్తున్న స్త్రీల శారీరక శ్రమశక్తిని ఇలా వర్ణిస్తాడు.

"మూడు తరాల వైట్ కాలర్ నీ జన్మస్థలం
తరతరాల చేతివృత్తులు మా పుట్టిళ్లు
ఇదుగో ఇట్లాంటప్పుడే

నిన్ను కొలవడానికి
కులం చాలక
వర్గం అవసరమవుతుంది
తలుపులు మూయని మా ఇంటికి
నువ్వొకసారి తప్పక రావాలి
మా యింటి మండిగం మీద
నల్ల పూసలో, ముత్యాలో అల్లుతున్న
నా ముసలి తల్లి చేతులకు నమస్కారం చేయాలి"

అని బిసీ కులవృత్తి కారుల బహుముఖీనమైన క్రియా చైతన్యాన్ని తెలుపుతాడు. 'సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలు మనమెత్తవలసిన ఆయుధాలు' అని బహుజనుల్లో పోరాట స్ఫూర్తిని రగుల్కొల్పుతాడు.

మందరపు హైమావతి రాసిన 'జ్యుయాలరీ షాపు' 'నెత్తురోడుతున్న గాయాలు' రెండు కవితలు బహుజనులు, కులవృత్తికారులు అనుభవిస్తున్న శ్రమదోపిడిని, వృత్తిపని పరాయీకరణకు గురికావడాన్ని, ప్రపంచీకరణ దుష్ప్రభావాల్ని, సామాజికపరంగా ఎదుర్కొంటున్న అవమానాలను చర్చిస్తుంది.

"అద్దాల తలుపుల్లో
కలుగుల్లో పాము పిల్లల్లా
అధునాతన డిజైన్ల
రకరకాల ఫేషన్ల
ముద్దొచ్చే ఉంగరాలు మురిపించే గాజులు
నగలంటే మోజులేనివారిని సైతం
ఒక క్షణం ప్రలోభపరిచే అందాల పనితనాలు
.......
షాపులో ప్రవేశించగానే
మంచులాంటి తెల్లటి గోడలపై
అప్పులు తీర్చలేక
ఆత్మహత్య చేసుకొన్న

నెత్తుటి రంగుల మరకల
మా అన్నయ్య శవచిత్రం
........
మార్కెట్లో ప్రవేశించిన
కొత్త కొత్త యంత్రాలు
పనివాళ్ళ చేతివేళ్ళ కత్తెరలు
కప్పను మింగే సర్పంలా
కాలం పరిణమించగా
ప్రపంచీకరణ నేపథ్యంలో
కులవృత్తుల కోట గోడలు
కుప్పగూలుతున్న విషాద దృశ్యం".

'మొద్దు మీద కత్తి' కవితలో ఎస్వీ సత్యనారాయణ తన కటిక కులంలో అలముకున్న బతుకు వేదనా వ్యథలను ఆవేదనాభరితంగా వ్యక్తపరుస్తారు. "మా తాత తరంలోనే కులవృత్తిని/ ఇంట్లో హ్యాంగర్ కు తోలుతీసి వేలాడదీశాం/ మా నాన్న సారాబట్టీల ముందు బాల్యాన్ని మొక్క జొన్న కండీలా కాల్చారు/ కసాయిబు అన్న కవి పద ప్రయోగంలో/ కసాయితో పాటు కలిసి ఉండడాన్ని ఆక్షేపించి/ సాహెబ్ గారి అభ్యంతరం మనస్సును చివుక్కుమనిపిస్తుంది. అటు మాదిగ బస్తీకి....ఇటు గౌడ వాడకు మధ్య సరిహద్దు రేఖగా కట్టుకున్న మా ఇల్లు/ కుల అస్తిత్వం కోసం యత్నించని/ అమ్మ ఒడిలో బడిలో/ స్వేచ్ఛను ముద్దాడిన పెదాలు నావి" అంటూ తన కులాన్ని హేళన చేసే పరిస్థితులపై ఘాటుగా సమాధానమిస్తాడు.

బహుజన కుల జీవనంలో 'డా నసుమానస్వామి 'నీలి బాల్యం' విభిన్నమైంది. కన్నతల్లి గౌడకులమైతే, పెంచిన తల్లిది చాకలి కులం. ఈ రెండు కులాల మధ్య గడచిన బాల్యాన్ని ఒక ఎదురుదాడిగా, యుద్ధంగా అభివర్ణిస్తాడు. తనది ఏ కులమని వెక్కిరిస్తున్న మను సమాజ చట్రాన్ని బద్దలు కొట్టుకుని వచ్చిన అనుభవాన్ని అందిస్తాడు.

కులం గోడలు మా వెనుకబడ్డ కులాన్ని ఎంత హేళనగా తొక్కపెట్టాయో అంగుళం అంగుళం చవి చూసిన వాడిని. నా బాల్యాన్ని నెమరేసుకుంటే కాలం కరగని బిళ్ళలా నా నోట్లోనే ఉంది. నన్ను కని ఏదో ఒక కులంలో పడేసినందుకు

అమ్మ పాదాలకు నమస్కరిస్తున్నా. బాల్యానికి గురిబండ కావద్దని చనుబాలుతో నా మేను పెంచిన చాకలమ్మకు దండాలు

కులం తక్కువోడుగా పడాల్సినయన్ని పడ్డోణ్ణి కాబట్టే ఎప్పుడూ ఒక బిసీ గా రాలేందుకు, ఒక పూలేగా పూసేందుకు

కావాల్సినంత ఉంది నా దగ్గర. జూపల్లి ప్రేమచంద్ 'ఇవాళ నా పుట్టినరోజు' అనే కవితలో తన జీవనానుభవాలన్నింటిని కుప్పగా ఒకచోటు పోసి ఆత్మవిమర్శ చేసుకుంటాడు.

'ఊరిలో సవర్ణుల పెళ్ళైతే నా వాళ్ళు సంబరపడి తమ దేహాలను పడుపుకోకలుగా పరిచారు.

ఊరేగింపుల్లో దివిటీలై వెలిగారు.
పండగ పబ్బాల్లో ఇంటి వెల్లలై మెరిశారు. రోజంతా నానా యాతనా చేసి
చివరికి ఇల్లిల్లూ తిరిగి
వెట్టి చీకర్లు ఎంగిలి బట్టలై మిగిలారు. ఇప్పటికీ ఒక ఇస్త్రీ పెట్టె కోసమో
ఒక డ్రమ్ము కోసమో
ఓ దోబిఘాట్ కోసమో దేబిరిస్తూ అమాయకంగా ఎదురుచూస్తూ..."

ఈ మైలపడ్డ దేహాలను విసర్జించి/ఈ పరాధీన ఆత్మలకు పుటం పెట్టి/ ఇన్నేళ్లూ వెట్టి బతుకులకు మరణ శాసనం లిఖించి ఈ పెద్ద కుల దురహంకారం మీద కాండ్రించి వుమ్మేసి" కొత్తముఖాలతో... ఈ లోకాన్ని శాసించమంటున్నా

అప్పటివరకు/ఓ జీవితకాలం నా పుట్టిన రోజును వాయిదా వేస్తున్నా" కవిలో బి.సిలు పడుతున్న అవమానాలపై స్పష్టమైన అవగాహన ఉంది. అందుకే నన్ను అణగారిన కులంగా చేసిన నిచ్చెనమెట్లను కూల్చేస్తానని శపథం చేస్తాడు.

అనిశెట్టి రజిత 'దొర్సానీ దొర్సానీ' కవిత ఒక బీ.సీ మహిళ అగ్రకుల దొరసానికి చేసిన సేవలకు పొందిన ప్రతిఫలం ఏంటనేది చిత్రిస్తుంది.

"ఇన్నొద్దులు నువ్వు కాలు కిందబెడితే / నీ అరికాలుకు నొప్పయితదని నా అరచేతుల్ని పర్సిన/నీకు సుస్తిజేస్తే గది నాకు రావాల్నని మొక్కులు మొక్కుకున్న......./ నాది తక్కువ కులం ప్రేమని / తక్కువజేసి తూట్లు బొడ్సినవ్/ సిత్తు కాయితాన్ని సెత్తకుండ్లెకు ఇసిరినట్టిసిరినవ్/ అంటరాని దంటుకున్నట్టు

దులపరిచ్చినవ్/పేదోళ్ళ బత్కులను అదుమంగ జూసే నువు / సిన్న కులాలని సీదరించుకునే నువు / నా ఆత్మగవురం మర్లబడి /నెత్తురు బొట్లై రాలుతున్న కన్నీల్ల సాచ్చిగా /ఎల్తి బడ్డోల్లు మీరే దొర్సానీ / పేమలకు ఎనకబడ్డోల్లు మీరే దొర్సానీ"

ఒక బహుజన శ్రామిక స్త్రీ తన దొరసాని పట్ల పెంచుకున్న ప్రేమను, అభిమానాన్ని ఈ కవిత తెలుపుతుంది. తన జీవితాన్ని పణంగా పెట్టి దొరసాని బాగుకోసం వెట్టిచాకిరి చేస్తూ మహారాణిలా చూసుకున్నది. ఆ దొరసాని తన అవసరం తీరినప్పుడు అగ్రకుల అహంకారంతో కృతజ్ఞతనేది లేకుండా తన మనసును గాయపర్చింది. ఆత్మగౌరవాన్ని దెబ్బతీసింది. ఇటువంటి అజ్ఞాత త్యాగాలమయమైన బహుజన స్త్రీల వ్యధాభరిత దయనీయ జీవితాలను అనిశెట్టి రజిత ఆత్మ కథాత్మక ధోరణిలో ఆవేదనను వ్యక్తపరుస్తుంది. బహుజన మహిళల మనస్సులో చెలరేగే భావోద్వేగాలన్నింటిని ఆర్ద్రంగా పలికించారు. 'మూడతుకుల చీర' కవితలోనూ బహుజన స్త్రీ ఏదో ఒకరోజు రాజ్యాధికారం దిశగా త్రివర్ణ పతాకాన్ని ఎగరవేస్తుందనీ సాధికారికంగా విశ్వాసాన్ని ప్రకటిస్తారు.

> ఒక బహుజన శ్రామిక స్త్రీ తన దొరసాని పట్ల పెంచుకున్న ప్రేమను, అభిమానాన్ని ఈ కవిత తెలుపుతుంది. తన జీవితాన్ని పణంగా పెట్టి దొరసాని బాగుకోసం వెట్టిచాకిరి చేస్తూ మహారాణిలా చూసుకున్నది.

నాళేశ్వరం శంకరం తమ యాచక కులవృత్తి అనుభవాలన్నింటిని 'శవం ముందు శంఖం' అనే కవితలో ఆత్మకవితగా గానం చేశాడు.

"ఏడవ తరగతి చదువుకునే సమయంలో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం రావటంవల్ల మానాన్న చదువు మాన్పించి కులవృత్తి చేయించాలని పట్టుబట్టడంతో ఇంట్లోనే వుండిపోవాల్సివచ్చింది. భిక్షాటనకు నాతోపాటు స్కూల్లో చదువుకునే వారి ఇళ్ళకు వెళ్లి అడుక్కునేటప్పుడు నాలో కలిగిన న్యూనతాభావం రోజుకింత తొలగించుకుంటున్న దశలోనే చదువును మానేయాల్సి వచ్చింది. మావూళ్లో ఎవరు చనిపోయినా శవం ముందు శంఖం ఊదటానికి మానాన్న నన్నే పంపేవాడు. మా వూళ్లో సహజ మరణాల కన్నా అసహజ మరణాలు ఎక్కువగా ఉండేవి. శంఖం వూదడానికి శవం ముందుకు వెళ్ళినా మనసు కలతపడేది.

శవం చుట్టూ చేరి హోరెత్తి ఏడ్చేవాళ్ళని చూసి నాకు దుఃఖం వచ్చేది. అనేక రాత్రులు డిస్టర్బ్ అయ్యాను" అని నాళేశ్వరం ఒక ప్రోజ్ పోయమ్ గా చెపుతుంటే కాలం పెట్టిన కఠిన పరీక్షలను తట్టుకుంటూ జీవితాన్ని గెలిచి చూపించిన బహుజన యోధుడిగా శంకరం శంఖం ఊదుతూ దర్శనమిస్తాడు.

> బి.సీ వాద కవిత్వంలో సీతారాం రాసిన 'రెజ్యూమ్' కవిత బహుజనులలో గూడుకట్టుకున్న ఆగ్రహావేశాలను, అధిక్షేపాత్మక ధోరణిలో ప్రకటిస్తుంది. బహుజనులు ఇప్పటిదాకా నడుస్తున్న దారిని నిశితంగా విశ్లేషిస్తూ వ్యంగాత్మక రీతిలో రెచ్చగొడుతూ ఆలోచనలకు పదును పెట్టిస్తాడు.

బి.సీ వాద కవిత్వంలో సీతారాం రాసిన 'రెజ్యూమ్' కవిత బహుజనులలో గూడుకట్టుకున్న ఆగ్రహావేశాలను, అధిక్షేపాత్మక ధోరణిలో ప్రకటిస్తుంది. బహుజనులు ఇప్పటిదాకా నడుస్తున్న దారిని నిశితంగా విశ్లేషిస్తూ వ్యంగాత్మక రీతిలో రెచ్చగొడుతూ ఆలోచనలకు పదును పెట్టిస్తాడు. కవిత ప్రారంభాన్ని ఒక బయోడేటా పద్ధతిలో రాస్తూ భిన్నమైన నిరసనను ప్రకటిస్తాడు. ప్రతీవాక్యంలో సమకాలీన సమస్యలను స్ఫురిస్తూ బహుజనుల రాజకీయ చైతన్యాన్ని సాక్ష్యంగా నిలబెడుతుంది. నిందాస్తుతి పద్ధతిలో బహుజన కులాల ప్రాధాన్యాన్ని చెప్పకనే చెబుతాడు.

"మేమెవరం/చాకళ్ళం మంగళ్ళం/ మేమెవరం(అధికారంబు)చౌడుసున్నాలం సన్నాసులం/ గాడిద బరువులం ముట్టు మూటలం/ఇస్త్రీ పెట్టెలం/'ఆదరణ' అంతగాలేని పొదులం/ సానరాళ్ళం చాకిరేవులం/మిషన్ కత్తులం కాదు /మేమెవరం?మేం ఎవురం/ఏ బాధా లేనోళ్ళం/ బి.సీ .కాలనీలం..."అంటూ "బీసీల మొత్తం స్థితిగతిని ఈ కవితలో చెప్పే ప్రయత్నం చేశాడు. సీతారాం రాసిన రెజ్యూమ్ కవిత బీసీ కవిత్వానికి రెజ్యూమ్"అని జూలూరు గౌరీశంకర్ విశ్లేషించాడు. "ఓట్లు ఓట్లో-నాయి బ్రాహ్మ ఓట్లోయ్"అని సీతారాం మరో కవిత కూడా వ్యంగ వైచిత్రిని సంతరించుకున్న కవిత. "ఎవరు కావాలి మనకు. ఎవరితో ఉందాం మనం. ఎవరు కొంటారు మన్ని. ఎవర్ని కమ్ముకుందాం మనల్ని.

ప్రపంచ బీ.సీల్లారా విడిపోండి విడిపోండి" అని బీసీల అస్తిత్వ చైతన్యం కోసం వాళ్ళలో ఆత్మాభిమానాన్ని రెచ్చగొట్టే కవిత ఇది. వర్తమాన రాజకీయాల్లో బహుజన కులాలను ఏవిధంగా వాడుకొని వదిలేస్తున్నారనే వాస్తవాన్ని నాయి బ్రాహ్మణ ఓటర్ల తరపున తిరుగుబాటుకు పిలుపునిస్తున్నాడు.

కవి వరదయ్య కూడా మంగలి కుల నేపథ్యంలోంచే 'కలను సాన బెట్టుకుంటూ' అనే కవితలో

"నా గోడులో ఆకలి మేళాన్ని తప్ప /వర్ణ ఊళల్ని వినలేకపోయిన ఎర్రెర్రని సోదరులారా/ మీకు జీవితమంతా లాల్ సలామ్/నన్నూ నా మంగలి తనాన్ని /పనిలేనితనానికి పసందయిన మెటఫర్ చిత్రించిన గొప్ప వాళ్ళందరికి వందనాలు/....మీ రోడ్లు ఒల్లు విరుచుకొని పక్కకు చేతులు చాపితే కూలిపొయ్యేది నా షాపులే/మీ విదేశీ యంత్రాలు విజిలేసి రంగంలోకి దూకితే/విరిగిపడేది నా కత్తెర్లూ గోరుగల్లులే'అని మంగలుల జీవన విధ్వంసాన్ని చిత్రిక పడతాడు. అభివృద్ధి పేరిట జరిగే పేర్లన్నీ బిసీ కులాల జీవనోపాధిని దెబ్బ తీసే కుట్రలానే సత్యాన్ని కళ్ల ముందుంచుతాడు.

బిసి కవిత్వోద్యమం వచ్చాక బిసీ కవులు తమ కులాల గురించి ఏ విధమైన ఆత్మ న్యూనత లేకుండా వాస్తవాలను వర్ణించే ప్రయత్నం చేశాడు. నిర్మొహమాటంగా తమ కులాలపై ఎవరేవిధంగా వెక్కిరింపులతో వ్యంగ్య వ్యాఖ్యలు చేస్తారో తమ కవితలో ఆత్మావిష్కరణ చేశారు. తెలుగు సాహిత్యంలో కళావంతుల జీవితంలోని చీకటి పార్శ్వాల చిత్రణ కనిపిస్తుంది. వాటిని బిసీయేతర కులాల వారే ఎక్కువగా రాశారు.

> "బిసి కవిత్వోద్యమం వచ్చాక బిసీ కవులు తమ కులాల గురించి ఏ విధమైన ఆత్మ న్యూనత లేకుండా వాస్తవాలను వర్ణించే ప్రయత్నం చేశాడు."

"కోస్తా ఆంధ్ర ప్రాంతంలోని కళావంతుల కుటుంబాల గూర్చి, ఆంధ్రా తెలంగాణ ఇతర ప్రాంతాల దేవదాసి కులాల జీవితాల విషాదాన్ని మొదట కవిత్వీకరించింది బిసీ కవులే" అని నిర్ధారిస్తాడు పగడాల నాగేందర్. 'సుద్ది' కవితలో జోగిని వ్యవస్థలో మగ్గిపోతున్న వారి విషాద జీవితాన్ని, భీభత్సాన్ని ఇలా ఆవిష్కరిస్తాడు.

"గుడి వాకిట్లో జోగినులై తల్లులు /ఎంగిలి తట్టల్లో మానాన్ని
పలారంలా పంచిన కళాజాతోన్ని
మీ అనుమానపు చూపుల్లో /తరాల అవమానాల పుండును మోస్తున్న
ఎనకబడ్డ కులాల దిమికి దిమికి దరువుల్లో
ధ్వజస్తంభాలు దొరలు గడీలు కూలుతుంటే
పురుడు బోసుకున్న గీ నేలంతా
తంగేడు పూలవనంలో/బాలసంతు పాటి మోగుతుంది"

అంటూ జోగిని వ్యవస్థలో మగ్గిపోయి అవమానాలను మోసిన తరానికి కొత్త వెలుగులు ప్రసరించే సమయం ఆసన్నమైందని ఆశావాహ దృక్పథాన్ని వ్యక్తపరుస్తాడు. ఏ.దుర్గా ప్రసాద్ తన స్వీయానుభవంలోంచి మాట్లాడుతూ "తామే సాంస్కృతిక అధిపతులవ్వాలనే కుట్రతో మా దేవదాసీల్ని వేశ్యలుగా ప్రచారం చేసిన అగ్రకుల సంస్కర్తలు, ఏ కులపు స్త్రీనైనా వేశ్యగా చూడమన్న మనువు నెత్తిన మోస్తూ స్త్రీని హైందవ ఆచారం పేర కుటుంబ జోగినిగా చేస్తున్నందుకూ....ఆ చట్రంలో నేను కూడా సుఖపడుతున్నందుకు"

అంటూ "పెనిమిటి కోసమే పెంచబడ్డదానా/నా ఇంటి వనవాసమొచ్చిన బోగం పిల్లా/నా అనుమానాల్లో నా సరదాల్లో/మనసుమానాలు చిట్లి/నా బృందావన బోకర్ ప్రేమలో బట్టలూడిన నా పెళ్ళామా" అంటూ దేవదాసీ కులపు కన్నీటిలో ముంచెత్తుతాడు.

ఈ క్రమంలోనే ప్రసేన్ రాసిన 'కన్నీటి నది దోచుకెళ్ళిన నావ నా పద్యం'లో తన భోగం కులం మీద ఎటువంటి సంకోచాలు, బిడియాలు లేకుండా తన భావాలన్నింటిని వ్యక్తపరుస్తాడు. ఇది వచన కవితారూపంలో రాసుకున్న ఆత్మకథాత్మక శకలం.తన జీవన గ్రంథానికి కవితాత్మక స్వీయపీఠిక. తనలో నిగూడంగా కదలాడుతున్న ప్రశ్నలకు బాధలకు, సందేహాలకు సమాధానపత్రం ఈ పద్యం.

"కులము కన్న శీలము గొప్పదిట
పెద్దబాలశిక్షలోనే చదువుకున్న జ్ఞాపకం
నా కులానికే శీలం లేదుకదా
మరి కులం గొప్పదా శీలం గొప్పదా

భలే అదృష్టం నాకులం పేరు చెపితే
లంజతనం గుర్తొస్తుంది.
భోగం వేషాలు!భోగందానా!భోగం మేళా!"

ప్రసేన్ లోని నిర్భీతి, నిజాయితీకి నిదర్శనం పై కవితా పంక్తులు. నమ్మిన విషయాన్ని ఎవరి హృదయాలు బద్దలైనా సరే బహిర్గతపరచవలసిందే గుసగుసలాడుటం ఇష్టముండదు. తనకు సహితం ఆ మినహాయింపులుండవు. వాదాలకు వివాదాలకు అతీతమైన కవిగా ఉండాలనే ప్రయత్నమేమీ చేయలేదు. సమాజాన్ని తీవ్రంగా ప్రభావితం చేసే 'కులం'మీద ప్రసేన్ కు స్పష్టమైన దృక్పథం వుంది. " కులాన్ని గురించి మాట్లాడకుండా మనం పాలిటిక్స్ గురించి మాట్లాడలేం. ఇపుడు కుల అస్తిత్వ వాదమే రాజకీయ అస్తిత్వవాదం. నిజం చెప్పాలంటే కులం ఒక రియాలిటీ. కులం గురించిన ప్రస్తావన లేకుండా ఏ సామాజికాంశం గురించి మాట్లాడలేం' అని కుల చర్చలేకుండా సాహిత్యమూ సమాజమూ ఉండదనే నిశ్చితాభిప్రాయంతో తన అస్తిత్వ మూలాల్లోకి వెళ్లి బోల్డ్ గా అన్ని అంశాలను చర్చకు పెడతాడు. ఈ విమర్శనాత్మక ధోరణిలోనే 'వెంటాడే కలాలు' ముందుమాటలో దూకుడుగా ఎన్నో ప్రశ్నలను సంధించగలిగాడు. బి.సీ వాద కవిత్వానికి ఉద్యమ ఉధృతిని అందించాడు.

> ప్రసేన్ లోని నిర్భీతి, నిజాయితీకి నిదర్శనం పై కవితా పంక్తులు. నమ్మిన విషయాన్ని ఎవరి హృదయాలు బద్దలైనా సరే బహిర్గతపరచవలసిందే గుసగుసలాడుటం ఇష్టముండదు.

"వంద పులుల మధ్యన మేకలా /వేయిమంది అగ్రకులస్తుల మధ్య చాకలిగా, కుమ్మరిగా, మంగలిగా/ బతకటం ఎంత దుర్భరం/ కుడితిలో పడ్డ ఈగలా ఈ ఊర్లో పడి ఇరుక్కుపోయింది నా బతుకు/ రెడ్డి సరసన జేరి నవ్వేందుకూ లేదు/ ఆడామగా కాని శరీరంలా/నవ్వో ఏడుపో తెలియని అనుభవం /అంతా తెలిసినట్టే వుంటుంది/ తెలవాల్సింది మాత్రం తెరమరుగైపోతుంది / ఎక్కడా గాయం కనిపించదు" అని కో.ప్ర కవి బహుజనుల సందిగ్ధ సామాజిక దుస్థితి,అనుక్షణం డోలాయమానంలో పడే జీవనంపై సరికొత్త ఆలోచనలను రేకెత్తిస్తాడు. "కులమే

వాడి బలమని అర్థమయ్యేలోపే నాకులం వెయ్యి నొక్క ఉపకులమై పోయింది/ దేవుడి గుడి గడప ఎక్కలేనివాడు/ అంటరానివాడయినపుడు/ పూజారి ఇంటి గుమ్మం తొక్కలేని నేను/ అంటరాని వాడ్ని ఎలా కాకుండా పోతాను?" అని బరువైన ప్రశ్నను సమాజం మీదికి విసిరేస్తాడు. మొదటిసారిగా బిసీల్లోని మైనారిటి కుల ప్రజల ఆవేదనను,ఆశ్రిత కులాలు, ఉప కులాల వారి సమస్యలను తెరమీదికి తీసుకువచ్చి బీసీ అస్తిత్వవాదంలో మౌలికమైన చర్చకు ఆరంభం పలుకుతాడు కో.ప్ర.

కొన్ని గాయాలు మానవు. కొన్ని గాయాలు మానినట్టుగా ఉంటాయి. కొన్ని అస్తిత్వ ఉద్యమాలు కూడా గాయాలలాంటివే. ఒక్కసారి ఉవ్వెత్తున ఎగసిన ఉద్యమం అదే స్థాయిలో నిలబడలేకపోతుంది. నిశ్శబ్దంగా మొదలైన ఉద్యమాలు ఒక్కసారిగా ఉప్పెనలా ఎగసిపడుతాయి. తమ ఆశయాలు సాధించడానికి ఉరకలేసే ప్రయత్నం చేస్తుంది. అంతర్గత రక్త స్రావాలు జరుగుతూనే ఉంటాయి. గుండె ఆరిపోని కుంపటిలా రాజుకుంటూనే ఉంటుంది. తెలుగు కవిత్వంలో బి.సీ వాద ఉద్యమానికి అంతటి చారిత్రిక నేపథ్యాన్ని 'వెంటాడే కలాలు' అందించింది. ఈ నేపథ్యంలోంచే ఒక్కసారిగా ఉధృతంగా ఉబికి వచ్చిన మరో బీ.సీ అస్తిత్వవాద యువ కవిత్వసంకలనం 'సమూహం'. సంపాదకుడు డా.చింతం ప్రవీణ్ కుమార్. 'వెంటాడే కలాలు' ఇచ్చిన చారిత్రిక స్ఫూర్తితో తెలుగు కవిత్వ రంగంలోకి కొత్త తరం బీ.సీ. తాత్విక వాదనా స్వరాల్ని ప్రవహింపజేశాడు. ఈ సంపుటిలో ముప్పై ఎనిమిది మంది కవుల నలభై ఒక్క బి.సీ కవితలతో బి.సీ భేరీని మోగించారు.

> 'సమూహం' సంపుటిలోని బీ.సి. కవులలో ఈనాటి రాజకీయ సమీకరణాలకు అనుగుణమైన చైతన్యం కనిపిస్తుంది.

'సమూహం' సంపుటిలోని బీ.సి. కవులలో ఈనాటి రాజకీయ సమీకరణాలకు అనుగుణమైన చైతన్యం కనిపిస్తుంది. తమ కుల సామాజిక జీవన స్థితిగతులను మరింత లోతుగా, పదునుగా వ్యక్తీకరించారు. వస్తు విస్తృతితో పాటు కటువైన ధిక్కార స్వరం వినిపించారు. అంబేద్కర్, పూలే తాత్విక ఆలోచనల్లోంచి అందుకున్న కొత్తశక్తి ఈ కవిత్వంలో ఆవిష్కృతమైంది. భవిష్యత్ కార్యాచరణ ప్రణాళికలు, వాదనలు, వ్యూహాలు కవిత్వంలో ప్రతిఫలించాయి. బి.సి

కవిత్వం తక్షణం చేరుకోవాల్సిన లక్ష్యం నిర్దేశింపబడింది.

'సమూహం'లో ఏడుగురు కవయిత్రులు రాసిన కవిత్వం చదివితే బి.సి. మహిళల్లో వచ్చిన రాజకీయ చైతన్యం అర్థమవుతుంది. సొన్నాయిల కృష్ణవేణి, కందాళ శోభారాణి, రమా రత్నమాల, అంబటి భాగ్య, వాన్గాల యశోధా, గూడూరు ఉమా, జంగం హైమవతిల కవిత్వంలో అర్థవంతమైన వాదన, ఉద్యమ స్ఫూర్తి గల ధిక్కార ధోరణి బహుజన కవిత్వోద్యమానికి జీవశక్తిని అందించింది.

"ఇన్నాళ్ళు నాకసలు అర్థంకాని ప్రశ్నలెన్నింటికో /చిక్కుముడి వీడుతున్నది/ మాకు సమాధానాలు గావలె. ఇంకానా ఇకపై మీ అసలు ఆటలు సాగవు/ మేం చదువుకున్న సావిత్రిబాయి పూలేలం / సమాజాన్ని పసిగట్టిన చాకలి ఐలమ్మలం/ జనాభాలో మెజార్టీ మా కడుపున పుట్టిన బిడ్డలే / ఒక్కసారి మేం కన్నెర్రజేస్తే/ కాలే శరీరాలు మీవవుతాయ్ అదిగో కమ్మరి కొలిమి దగ్గర / నా ఆడపడుచు నిప్పు రాజేస్తున్నది" అని అంబటి భాగ్య మాటలు ఈతరం బహుజన మహిళా ఉద్యమ చైతన్యానికి ప్రతీక మాత్రమే కాదు. బహుజన సమాజంలో వచ్చిన గాఢమైన పోరాట పటిమకు సంకేతంగా భావించవచ్చు. ఇంతవరకు వచ్చిన బి.సీ కవితలోని కొత్త పార్శ్వాలను ఈ కవిత్వం చిత్రించింది. తమ వృత్తిలో గల బాధలు,కులగత వివిధాంశాలు, ఉపాధిలేని వృత్తిపరమైన వేదనలు, శ్రామిక జీవన సౌందర్యం, ఆయా కులజీవన వర్ణనలు, ఆయా కులాలలోని పనిముట్లు, భాష, సంకేతపదాలు మొదలైనవన్నీ నోస్టాల్జియా రీతిలో, స్వీయాత్మక అనుభూతి, అస్తిత్వ వేదనలకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చారు.  నిర్మాణాత్మక సమీకరణ వ్యూహాలతో ఆధిపత్యాలను బద్దలుకొట్టి తిరుగుబాటు తత్త్వం తీవ్ర స్థాయిలో వ్యక్తం కాలేదు. ఆ అదృశ్య సరిహద్దులను దాటుతూ 'సమూహం' కవులు కదనరంగంలోకి దూకారు.

బి.సీల వేదనను ఒక నినాదంగా వినిపించే స్థాయి నుండి తమకు న్యాయంగా రావలసిన వాటాను డిమాండ్ చేసే స్థాయికి నేటి బహుజన ఉద్యమ కవిత్వం ఎదిగినట్లుగా అర్థమవుతుంది. పాలనలో భాగస్వామ్య హక్కుకోసం, అధికార పగ్గాలకోసం అడుగువేస్తున్నట్లుగా విదితమవుతుంది. ఈ సంకలానికి సీతారాం రాసిన ముందుమాట ఒక ఆత్మవిమర్శగా, ఒక ఆత్మాహుతి దాడి హెచ్చరికగా సంకేతాలిస్తుంది. కొన్ని నగ్నసత్యాల్ని అండర్ లైన్ చేసుకొని చర్చించవలసినవి ఉన్నాయి. మరో ముందుమాట కర్త బాణాల శ్రీనివాసరావు లేవనెత్తిన ప్రశ్నలు, ఆలోచనలు బి.సీ వాదులకు కొత్త తార్కికశక్తిని అందిస్తాయి. ఈ 'సమూహం'లోని కవులు చింతనాత్మక భావాలు, చర్చాత్మక ప్రశ్నలు, వాదనాత్మక ప్రకటనలు,

సంచలన నిర్ణయాలు, సాహసాత్మక చర్యలకు ప్రతీకగా గాఢమైన అభివ్యక్తితో బహుజన కవిత్వాన్ని కొత్త వికాసదశకు తీసుకెళ్ళారు.

> తెలుగు కవిత్వంలో బహుజనవాద ఉద్యమ కవిత్వం నిరంతర ధారలా ప్రవహిస్తూనే ఉంది. కొన్ని వృత్తికులాల వారి కవిత్వం వర్తమాన సామాజిక పరిణామాలకు స్పందనగా విస్తృతంగా వెలువడింది.

తెలుగు కవిత్వంలో బహుజనవాద ఉద్యమ కవిత్వం నిరంతర ధారలా ప్రవహిస్తూనే ఉంది. కొన్ని వృత్తికులాల వారి కవిత్వం వర్తమాన సామాజిక పరిణామాలకు స్పందనగా విస్తృతంగా వెలువడింది. చేనేత, విశ్వకర్మ, గౌడ్, యాదవ,నాయీబ్రాహ్మణకులాలకవిత్వం భిన్న రీతులలో వ్యక్తమవుతుంది. డా. పులిపాటి గురుస్వామి 'పోగులవాడు' కవితతో పాటు తన కవితాయానంలో చేనేతకారుల బతుకు పయనాన్ని గాఢంగా చిత్రించారు.

ఎం. వెంకట్ 'జెన' దీర్ఘకవితలో "రాజభరణాలు పోయినా/కులభరణాలు కవచ కుండలాలే గదా" అని దుఃఖ సముద్రంలోకి కవిత్వ వల విసురుతాడు. అన్నవరం దేవేందర్ 'బువ్వకుండ' దీర్ఘకవితలో తమ కుమ్మరి కులవృత్తి చారిత్రక ప్రశస్తిని వర్ణిస్తూ "మన్నులో మట్టిని కనిపెట్టి /కనపిన మెత్తంగా తొక్కి / సారెమీద కుంభాకృతిగా చేయడం / నాగరికతకే తొలి ఇత్తనం" అని ఉన్నతీకరిస్తాడు. జూకంటి జగన్నాథం గానుగ వృత్తి నేపథ్యంలోంచి 'ఆశలేని కులకశ్శి గోస' ను వినిపిస్తాడు. "నువ్వుల నుంచి నూనె తీసే విద్య / దుఃఖాన్ని కండ్లలోనే కుక్కుకొని / నవ్వుతూ నీలకంఠేశుని మీద భారం వేసే మిథ్య/ఊరూరికి నూనె మిల్లులు/గాండ్ల కుల రక్తాన్ని తాగిన నల్లులు / గానుగను పీనుగగా మార్చిన /ఎన్నో పెట్టుబడి పుట్టువడులు" అంటూ గానుగలోంచి కారుతున్న కన్నీటి ధారను దృశ్యీకరిస్తాడు. వనపట్ల సుబ్బయ్య 'అసిపె' దీర్ఘ కావ్యంలో మంగలుల సమస్త జీవన వైవిధ్యాన్ని, "మా ఊరిల కోడికూత/మా నాయన కత్తి నూట/రెండోకటేసారి" అంటూ నూరు రాయి మీద కాలాన్ని నూరి మంగలుల హృదయ వేదనను ఆవిష్కరిస్తాడు.

జూలూరు గౌరీశంకర్ 'నాలుగోకన్ను' దీర్ఘ కవితలో శివుడి మూడో కన్నులాగా బిసీల ఉద్యమాన్ని నాలుగో కన్నుగా ప్రతీకాత్మకంగా చూపుతాడు. "ఇప్పుడు /

చండాలుడి చేతికి రాజ్యం / బహుజనుడే పాలకుడు/రాజ్యాంగం బహువచన ప్రవచనం / ప్రసవానికి ముందు /తల్లిపెట్టిన కేకలా /అదిగో ప్రయాణం" అంటూ రాజ్యాధికారమే బహుజనుల అంతిమ గమ్యంగా నిర్దేశిస్తాడు. "మనం తీసిన బావుల్లో నీళ్ళను తాగుతూ / మనం తొవ్విన చెరువుతోనే సేద్యం చేస్తూ /మనం కట్టినిండ్లలో హాయిగా కులుకుతూ /మనమేసిన రోడ్లపై రయ్యినపోతూ / మనకిక్కడ చోటు లేకుండా చేస్తుర్రు" ఇంద్రసేన్ అలకుంట్ల వడ్డెర కులస్తుల శ్రమ ఎంతగా పరాయికరించబడిందో వర్ణిస్తాడు.

'ఆపతి' పేరుతో అవనిశ్రీ అనేక చేతి వృత్తుల కళానైపుణ్యాన్ని కవిత్వీకరిస్తూ సబ్బండ కులాల ఆత్మఘోషకు ప్రాతినిధ్యం వహించే బహుజన స్వరాన్ని వినిపించాడు. దాసోజు కృష్ణమాచారి 'డాకలి' దీర్ఘ కవితలో 'సురకత్తులు సర్సిన డాకలి చూపుడు వేలును/అధికార పీఠంవైపు చూపుతుంది/ ఇప్పుడు మాకు మా వాటా కావాలి/ మాస్థానం మాక్కావ్వాలి" డాకలి మీద అధికార పీఠం కదిలేలా సుత్తిదెబ్బ వేస్తాడు. వీరి 'వన్నె', 'పుటం' కవితా సంపుటాలు బహుజన ఆగ్రహానికి, ధిక్కారానికి బలమైన సాక్ష్యాలు.

> 'ఆపతి' పేరుతో అవనిశ్రీ అనేక చేతి వృత్తుల కళానైపుణ్యాన్ని కవిత్వీకరిస్తూ సబ్బండ కులాల ఆత్మఘోషకు ప్రాతినిధ్యం వహించే బహుజన స్వరాన్ని వినిపించాడు.

బహుజన కవితా ఉద్యమ స్ఫూర్తి ప్రతి బహుజన కవిని కదిలించింది. తమ కులవృత్తిని, కుల వివక్షను అక్షరాల్లోకి అనువదించుకోవాలనే స్పృహ బలపడింది. తన కులవృత్తితో పాటు ఇతర కులవృత్తుల నైపుణ్యాన్ని, దైన్యాన్ని కవిత్వీరించారు. మెట్టా నాగేశ్వరరావు 'చాకలవ్వ' కవితలో అరవై ఏళ్ల ముసలవ్వ తన కులవృత్తితో ఎలా మమేకమైపోయిందో వర్ణిస్తాడు.

"గాలికి కదలాడే / ఎండిన జొన్న కాడలాగుంటది కానీ/ బట్టల్నుదికితే మాత్రం /మల్లెపూల గుభాళింపు వీస్తది/ పగలంతా రేవులోనే / పన్నీరులా మురికిని జల్లుతుంది/ అందరి బట్టల్ని కొంగరెక్కల్లా అందించి /తాను మాత్రం నడిచే మురికవుతుంది" అని జవసత్వాలుడిగిపోయిన వృద్ధురాలి వృత్తిపట్ల గల నిబద్ధత, నిజాయితిని ఔన్నత్యీకరిస్తాడు. ఈ కవే 'ఇస్త్రీపెట్టె'ను ఏనాటికి వేడితగ్గని కవిత్వ పేటికగా చిత్రించాడు.

ఈ. రాఘవేంద్ర కల్లుగీత వృత్తికారుల శ్రామిక చర్యలను వర్ణిస్తూ "కల్లు నిండిన పటవ/ చెట్టు నుంచి దింపుతుంటే / ఆరోజు మాయింటి /పంట పండినట్లుండేది" అని బహుజన జీవన సౌందర్యాత్మకతను వాస్తవికతలో మేళవించి చూపుతాడు. సుంకర గోపాలయ్య " మా నాయిన పాట" లో "తాగొచ్చిన రాత్రి/ మానాయిన ఒకే పాట పాడేవారు/ అందులో / పారే నీటిగొంతు ఉండేది" అంటూ బహుజన జీవితాల్లోకి వైవిధ్యాన్ని సాధారణీకరించి చూపుతాడు.

> బహుజనులు తమ కులవృత్తుల జీవనానుభవాలు, సామాజిక వివక్షతల వేదనా మూలాల నుండి జీవనోపాధిని అందించలేని కులవృత్తుల సంక్షోభాలను, కుటుంబ దుస్థితిని కవిత్వంలోకి ఒంపారు.

బహుజనులు తమ కులవృత్తుల జీవనానుభవాలు, సామాజిక వివక్షతల వేదనా మూలాల నుండి జీవనోపాధిని అందించలేని కులవృత్తుల సంక్షోభాలను, కుటుంబ దుస్థితిని కవిత్వంలోకి ఒంపారు. బి.సీ. జీవితాల్లోని జీవన వైవిద్యం, కళా నైపుణ్యం, రసాత్మక సౌందర్యం ఈ రచనల్లో అభివ్యక్తమైంది. ఇతర సామాజిక కులాలు, వర్గాలకంటే భిన్నమైన విస్తృతానుభవాలు బిసీల కవిత్వంలో ఎన్నో పార్శ్వాలుగా ప్రకటితమైంది. ఆయా కులవృత్తులలోని విస్తృతమైన విశేషాలు చారిత్రిక స్ఫూర్తిని చాటుతున్నాయి. బహుజనుల జీవితాల్లో అణువణువు నిండిపోయిన జీవకళ సౌందర్యాత్మక కళా తాత్వికతను ఆవిష్కరిస్తుంది.

తెలుగు కవిత్వంలో బహుజన ఉద్యమ కవిత్వాన్ని పరిచయం చెయ్యడమంటే భారతావనిని సమీక్షించడమే. ఇదొక బహుజన ఇతిహాసం. ఎవరే దిశగా చూడాలనుకుంటారో ఆ దిశగా జీవన వైచిత్రినంతా దృశ్యమానం చేస్తుంది బహుజన కవిత్వం. "దేశమంటే మట్టి కాదోయ్ దేశమంటే బహుజనులోయ్" అనే కొత్త కవితా నినాదాన్ని సాహిత్య చరిత్రలో ఈ సందర్భంగా నమోదు చేసుకోవచ్చు. ఈ వ్యాసపరిధిలో ఎందరో ముఖ్యులైన కవులను, కవితలను పేర్కొనలేకపోయాను. కాలక్రమేణా రాయవలసిన బహుజన కవితా వ్యాసాలతో వారిని ప్రత్యేకంగా పరిశీలన చేయవలసిన అనివార్యత ఉంది.

# ముస్లిం మైనారిటీవాద కవిత్వం-విభిన్నపార్శ్వాలు



డా. షేక్ ఇబ్రహీం
95333 36227

సామాజిక అవసరాల నుంచి ఉద్భవించిన సాహిత్యానికే ప్రజల కష్టాలు, కన్నీళ్లు, బాధలు, దుఃఖాలు బోధపడుతాయి. సామాజిక అవసరాల నుంచి వచ్చిన సాహిత్యమే నికార్సయిన సాహిత్యం. ప్రపంచ సాహిత్యంలో ఏ సాహిత్యాన్ని పరిశీలించిన సామాజిక అవసరాల నుంచే ఆవిర్భావించింది. సామాజిక అవసరాల నుంచే ఉద్భవించిన సాహిత్యమే సమాజాన్ని మేల్కొపుతుంది. చైతన్య పరుస్తుంది. సాహిత్యం యొక్క అంతిమ కర్తవ్యం కూడా నిద్రాణమైన వ్యవస్థను తట్టి మేలుకొల్పడమే. సాధారణంగా ఒక కత్తి ఓరలో రెండు కత్తులు ఒదగవు. కానీ సాహిత్యం, సమాజం రెండు కూడా ఒకే ఓరలో ఒదుగుతాయి. అందువలనే సాహిత్యాన్ని, సమాజాన్ని వేరుచేసి చూడలేము. బహుశా ఈ కోణంలోంచే అభ్యుదయ తెలుగు సాహిత్యం వెలువడి మూడు పూవ్వులు ఆరు కాయలుగా వికసిస్తున్నాయి. ఈ పరిణామంలోనే అభ్యుదయ, దిగంబర, విప్లవ, స్త్రీ, దళిత, ముస్లిం మైనారిటీ, బహుజన, ప్రాంతీయ, ప్రపంచీకరణ మొదలగు సాహిత్యాలు వెలుగులోకి వచ్చి ఆయా అస్తిత్వాలకు భరోసాను కలిగించి అసరగా నిలబడ్డాయి.

అమీర్ ఖుస్రు నుంచే తెలుగు సాహిత్యంలో ముస్లింల సాహిత్య చరిత్ర మనకు కన్పిస్తుంది. తెలుగు సాహిత్య చరిత్రకు వేయేళ్ళ చరిత్ర ఉన్నట్లే, ముస్లిం రచయితలు తెలుగులో రచించిన సాహిత్యానికి కూడా సుదీర్ఘ చరిత్ర ఉంది. తెలుగు సాహిత్యాన్న సాహిత్యలారులు ఏవిధంగా సుసంపన్నం చేశారో ఆవిధంగానే ముస్లిం కవులు, రచయితలు ఆ రీతిలోనే సుసంపన్నం చేశారు. ముస్లిం మైనారిటీవాద సాహిత్యం రాక మునుపు పూర్వం కొందరు ముస్లిం సాహితీ పరులు తెలుగు సంస్కృతితో, హిందూ జీవితంతో, పురాణాలతో మమేకమై ఉన్నందు వలన ముస్లిం జీవితాలను సాహితీపరంగా ప్రస్తావించ లేకపోయారు.

కానీ మిగతా సాహితీవేత్తలతో సమంగా సాహిత్య సృజన చేశారు. వారిలో ప్రధానంగా షేక్ దావూద్, బుడన్ సాహెబ్, ఉమర్ అలీషా, ఖాసిం ఖాన్, అచుకట్ల చిన్న దస్తగిరి మొదలైనవారు రామాయణ, మహాభారత కథలను పద్యకావ్యాలుగా రచించారు. అయితే వీళ్లలో కొందరిని తెలుగు సాహిత్య చరిత్ర గుర్తించింది. మరికొందరిని గుర్తించక అలానే మరుగున పడేసింది. ఈ వ్యాసంలో కేవలం ముస్లిం జీవన స్థితి గతుల గురించి ముస్లిం కవులు అంతర్గత, బహిర్గత రాసిన కవిత్వాన్ని మాత్రమే ప్రస్తావిస్తున్నాను.

> తెలుగు సాహిత్యంలో ముస్లింల జీవితాల్ని ప్రస్తావించిన సందర్భాలు, చిత్రించి లిఖించిన సందర్భాలు చాలా అరుదుగా కన్పిస్తాయి. కొంతమంది రచయితలు ముస్లింల జీవితాలకు సంబంధించిన సమాచారాన్ని ఒకటి రెండు చోట్ల రేఖామాత్రంగా చెప్పారు.

తెలుగు సాహిత్యంలో ముస్లింల జీవితాల్ని ప్రస్తావించిన సందర్భాలు, చిత్రించి లిఖించిన సందర్భాలు చాలా అరుదుగా కన్పిస్తాయి. కొంతమంది రచయితలు ముస్లింల జీవితాలకు సంబంధించిన సమాచారాన్ని ఒకటి రెండు చోట్ల రేఖామాత్రంగా చెప్పారు. కానీ.! పూర్తిగా ముస్లింల జీవితాన్ని ప్రతిబింబించే సాహిత్య సృజన చేయలేదు. భారతీయ సమాజంలో దాదాపు మూడు దశాబ్దాలుగా ముస్లింలు పడుతున్న కష్టాలు, కన్నీళ్లు, సమస్యలు, ఆకలి, బాధలు, దుఃఖాలు మొదలైన వాటి నుండి విముక్తి పొందేందుకు., ముస్లిం కవులు పూర్తిగా తమదైన గొంతుకతో ముస్లిం మైనారిటీ వాద సాహిత్యాన్ని తెలుగులో బలంగా వ్యక్తపరిచారు. ముస్లిం మైనారిటీ వాద సాహిత్యం అంటే ముస్లిం జీవితంలోని విభిన్న పార్శ్వాలను వ్యక్తపరచడం. ఆ పార్శ్వాలు ముస్లింల బాహ్యమైన ప్రపంచానికి సంబంధించినవి కావొచ్చు.., అంతర్గతమైన ప్రపంచానికి సంబంధించినవి కావొచ్చు. అయితే 1992కు ముందే తెలుగు సాహిత్యానికి పరిచయమైన ప్రముఖ ముస్లిం కవులు, రచయితలు ముస్లింల జీవితాల్ని కవిత్వీకరించిన వారు లేకపోలేదు. వారిలో ప్రధానంగా సుగన్ బాబు, దేవిప్రియ,

ఇక్బాల్ చంద్, ఇస్మాయిల్, వజీర్ రెహ్మాన్, స్మైల్, కౌముది, ఖాదర్ మొహియుద్దీన్, అఫ్సర్, యాకూబ్ మొదలైన వారు గొప్ప సాహిత్య సృజన చేశారు. అయితే ముస్లిం ఐడెంటిటీతో నికార్సయిన గొంతుక వినిపించింది మాత్రం 1992 తర్వాతనే. అప్పటినుండి ముస్లిం మైనారిటీ వాద కవిత్వం ముస్లిం సమాజం యొక్క నిజమైన కన్నీళ్లని, బాధల్ని బహిరంగంగా, అంతర్గతంగా తెలుగు సాహిత్యంలో ఆవిష్కరించింది. నేటికి తెలుగు సాహిత్యంలో అడుగు పెట్టి సుమారు మూడు పదుల మైలురాయిని దాటుతున్నది.

1947 నుంచి 1989 వరకు భారతదేశంలో ముస్లింల పైన జరిగిన దాడుల గురించి ప్రతిస్పందనగా ప్రభుత్వాలు, సాహిత్యవేత్తలు పెద్దగా పట్టించుకోలేదు. కానీ.! 1992లో బాబ్రీ మసీదును కూల్చివేయడం ద్వారా దేశంలో మత విద్వేషాలను పురిగొల్పి ముస్లింల ఊచకోతకు నాంది పలికారు కొంతమంది మూర్ఖ మత ఛాందసం కలిగిన మత వాదులు. దేశవ్యాప్తంగా అప్పటి దాకా మాట్లాడని ముస్లిం మేధావులు, రచయితలంతా వారి ఐడెంటిటీతో ముస్లింలుగా మాట్లాడాల్సిన అవసరాన్ని గుర్తించారు. తెలుగు సాహిత్యంలోనూ అదే జరిగింది. అప్పుడే ముస్లిం మైనారిటీ వాద కవిత్వానికి బలమైన గొంతుక ఏర్పడింది. 2002 గుజరాత్‌లో ముస్లింల జాతి హత్యాకాండ జరిగింది. వేల మంది ముస్లింల ఊచకోత మళ్ళీ కొనసాగింది. దానికి కొన్ని హిందుత్వ సంస్థలు, పార్టీలు నాయకత్వం వహించాయని మీడియా, పత్రికలు, ప్రజాస్వామిక వాదులు, మేధావులు, రిపోర్టులు, పుస్తకాలు, కవిత్వం, కథలు, వ్యాసాల ద్వారా నమోదు చేశారు. ఈ విధంగా అప్పటి నుంచి తెలుగు సాహిత్యంలో ముస్లిం మైనారిటీ వాదం మరింత బలంగా విస్తరిల్లింది.

> “1947 నుంచి 1989 వరకు భారతదేశంలో ముస్లింల పైన జరిగిన దాడుల గురించి ప్రతిస్పందనగా ప్రభుత్వాలు, సాహిత్యవేత్తలు పెద్దగా పట్టించుకోలేదు.”

ముస్లిం మైనారిటీ వాదం తెలుగు సాహిత్యంలో బలంగా స్థిరపడడానికి 1992 నాటి ముస్లిం యువ కవులు తీవ్రమైన సాహిత్య కృషి చేశారు. వీరు తొలి రోజుల్లో దళితవాద కవులతో కలిసి కవిత్వాన్ని రాశారు. వీరు రాసిన కవిత్వాన్ని దళితవాద

కవులు ప్రచురించిన చిక్కనవుతున్న పాట, పదునెక్కిన పాట, వీడి ఆకాశం, బహువచనం మొదలైన కవితా సంకలనాలలో ప్రచురితమైంది. అంతేగానీ దళిత వాద కవిత్వంలో భాగంగా ముస్లిం మైనారిటీ వాద సాహిత్యం ఆవిర్భవించ లేదు అనే విషయాన్ని గమనించాలి. వీరిలో 1992 మునుపు తరానికి సంబంధించిన కవులు కూడా లేకపోలేదు. ముస్లిం ఐడెంటిటీ కలిగి ముస్లింల సాధక బాధలను కవిత్వ రూపంలో చిత్రించిన కవిత్వాన్ని విప్లవ రచయితల సంఘం 21 మంది ముస్లిం కవులు రాసిన 54 కవితలను సేకరించి 1997వ సంవత్సరంలో 'జిహాద్' అనే కవితా సంకలనాన్ని "ముస్లిం మైనార్టీ కవుల కవిత్వం"గా ప్రచురించింది. అప్పటిదాకా కవిత్వాన్ని రాసిన ముస్లిం కవులు, రచయితలు, యువ కవులు ఆశ్చర్యానికి లోనై విప్లవ రచయితల సంఘంతో కొంతమంది కవులు వాదోపవాదాలు చేశారు. ఈ వాదోపవాదాలపై ఆంధ్రజ్యోతిలో చర్చ జరిగినప్పుడు కూడా విరసం 'జిహాద్' కవితా సంకలనాన్ని ప్రచురించడం సరైనదేనని ప్రకటించింది. ఈ సంఘటనను అప్పటి ముస్లిం యువ కవులు కొందరు ఖండించారు. వీరు ప్రధానంగా ఖండించడానికి కారణం ఏమిటంటే "జిహాద్" కవితా సంకలనంలో ఉన్న ముస్లిం కవులు ఎవరికి విరసంతో సంబంధం లేదు. వీరు ముస్లిం ఐడెంటిటీ అనే తాత్విక చింతనతోనే రాశారు గానీ, విరసం ఆలోచనలతో రాయలేదు. ఏది ఏమైనా విరసం కావచ్చు, అరసం కావచ్చు ఎవరైనా సరే అణగారిన వర్గాల ప్రజల బాధలను చాటి చెప్పడంలో తప్పులేదని చెప్పిన సాహిత్యకారులు కూడా లేకపోలేదు. అయితే అప్పటి ముస్లిం యువ కవులు అందరు కూడా కలిసి, వీరు వ్యక్తీకరించిన కవిత్వానికి, సాహిత్యానికి 'ముస్లిం వాదం' అని పేరు పెట్టడం జరిగింది. కొద్ది రోజులు గడిచిన తర్వాత ముస్లింవాద కవిత్వాన్ని రాసే కవుల్లో మరొక చీలిక ఏర్పడి "ఇస్లాం వాదం" కవిత్వంగా ఒక వర్గం ప్రకటించుకుంది. ఇలా ముస్లింవాదం, ఇస్లాం వాదం అనే రెండు పాయలుగా విడిపోయాయి. ఇలా రెండు పాయలుగా, వర్గాలుగా విడిపోయిన ముస్లింవాదం, ఇస్లాంవాదం కవుల ఆలోచన విధానం ఒకటే. కానీ.! ఒక్క మత ప్రతిపాదక విషయాల దగ్గర మాత్రమే ఇరువురికి పడదు. అయితే ప్రజల అస్తిత్వ విషయంలోనూ, రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, మూలాల అన్వేషణ, పరాయికరణ, అభద్రత మొదలైన భిన్నవిషయాల్లోనూ ఈ రెండు వర్గాలు ఏకాభిప్రాయంతో ఉన్నవారే. అయితే ఇస్లాం వాద కవులు సంప్రదాయకంగా వస్తున్న కొన్ని మతపరమైన విశ్వాసాలను ఆచారాలను సమర్థించడానికి ప్రయత్నించగా, ముస్లింవాద కవులు వాటిని కూడా సమీక్షించే ప్రయత్నం చేశారు. బహుశా మతపరమైన అంశాల దగ్గరే ముస్లిం మైనార్టీ కవులు రెండు వర్గాలుగా

చీలిపోయారు. ముస్లిం కవులు సమాజంలో వారిని అల్లకున్న వివిధ సమస్యలపై స్పందించారు. వాటిలో అభద్రతా భావన, ముస్లిం మైనారిటీ స్త్రీవాదం, సామాజిక వెనుకబాటుతనం, అస్తిత్వ మూలాల అన్వేషణ, సమస్యాత్మక సంఘటనలు, అభద్రతా భావన కలిగి ఉండటం, దేశభక్తిని చాటుకోవడం, దూదేకుల జీవితం, దళిత బహుజన దృక్పథం, మత సంస్కరణ దృక్పథం, హిందూ-ముస్లీం ఐక్యత, విద్య-రిజర్వేషన్లు, ప్రపంచీకరణ మొదలగు అంశాలపై ప్రతిస్పందిస్తూ వారి జీవితాల్ని కవిత్వీకరించారు.

ఈ వ్యాసంలో నేను ముస్లింవాదం, ఇస్లాంవాదమని ప్రస్తావించడం లేదు. ముస్లిం మైనారిటీ సమాజం పట్ల బాధ్యతతో రాసిన కవులందరి కవిత్వాన్ని చర్చిస్తున్నాను. ఎందుకంటే కవి అనేవారు ఒక గీతకు లోబడి మాత్రమే ఉండకూడదు. ఇక్కడ అందరూ కవులు రాసిన కవిత్వాన్ని చర్చించలేను. ముస్లింల జీవితాలకు సంబంధించి వారి సాధక బాధలను విభిన్న కోణాల్లో, విభిన్న పార్శ్వాల్లో వ్యక్తపరిచిన అంశాలను ఒకటి, రెండు కవితలతో విశ్లేషించడానికి ప్రయత్నం చేస్తాను.

తెలుగు సాహిత్యంలో “ముస్లిం ఐడెంటిటీతో” ముస్లిం మైనార్టీవాద కవిత్వ సృష్టికి శంఖం పూరించిన తొలి ముస్లిం కవి ఖాదర్ మొహియిద్దీన్. అప్పటిదాకా కోట్లాది మంది భారత ముస్లింలలో దాగిన బాధను, గుక్క పట్టిన దుఃఖాన్ని, కన్నీళ్లను, అణిచివేతను, వివక్షను భారతదేశ చిత్రపటంపై 1991లో “పుట్టుమచ్చ” అనే దీర్ఘ కవిత రూపంలో వెల్లడించారు. ఆక్స్‌ఫర్డ్, విస్కాన్సిన్ విశ్వవిద్యాలయాలు ప్రచురించిన తెలుగు కవితా సంపుటాల్లో కూడా “పుట్టుమచ్చ” స్థానం సంపాదించింది. తెలుగు సాహిత్యం విస్మరించడానికి వీలులేని ఒక ప్రత్యేకమైన పేరు ఖాదర్ మొహియుద్దీన్. ఇండియాటుడే, తానా సంస్థలో వెయ్యేళ్ల తెలుగు కవిత్వంలో ఎంపిక చేసిన 100 ఉత్తమ రచనల్లో పుట్టుమచ్చ ఒకటి కావడం విశేషం. ఈయన ‘భారత ముస్లింల ముఖచిత్రం’ అనే మరొక రచనను కూడా ప్రచురించారు. ‘సాహితీ సేవ మూర్తి పురస్కారాన్ని’ కూడా అందుకున్నారు.

నేను పుట్టక ముందే
దేశ ద్రోహుల జాబితాలో
నమోదైవుంది నా పేరు
కన్నబిడ్డని సవతి కొడుకుగా
చిత్రించింది చరిత్ర

అన్నదమ్ముల్నించి చీల్చి
నన్ను ఒంటిరివాణ్ణి చేసింది చరిత్ర. (పుట్టుమచ్చ -ఖాదర్ మొహియుద్దీన్)

> 1947 ఆగస్టు 15వ తేదీ కేవలం భారతదేశానికి స్వాతంత్ర్యం లభించిన రోజు మాత్రమే కాదు. దేశవిభజన జరిగిన రోజు కూడా.

1947 ఆగస్టు 15వ తేదీ కేవలం భారతదేశానికి స్వాతంత్ర్యం లభించిన రోజు మాత్రమే కాదు. దేశవిభజన జరిగిన రోజు కూడా. పాకిస్థాన్ వెళ్ళిపోయిన ముస్లీంలు అక్కడ ఏం స్వర్గ సౌఖ్యాలు అనుభవిస్తున్నారో తెలియదుగానీ, భారతదేశంలో ఉండిపోవాలని నిశ్చయించుకున్న ముస్లీంలు మాత్రం తీవ్రమైన అభద్రతలోకి నెట్టివేయబడ్డారు. వెలివేతకీ వివక్షకి గురయ్యారు. రెండవ తరగతి పౌరులుగా మారిపోయారు. దేవుడు తప్ప మరో దిక్కులేని స్థితికి చేరుకున్నారు. అని ఖాదర్ మొహియుద్దీన్ వర్తమాన భారతదేశ ముఖచిత్రంలోని ముస్లీంల అస్తిత్వ సమస్యని స్పష్టంగా చిత్రించాడు. మొదటి మూడు పాదాలు పుట్టుమచ్చ కవితకు తల మానికం వంటివి. భారతదేశంలో ముస్లీంల ఉనికిని, ముస్లీంల అస్తిత్వాన్ని అత్యంత శక్తివంతంగా వ్యక్తం చేసిన నిర్వచనం ఇది. వర్తమాన తెలుగు సాహిత్యంలో శాశ్వతంగా నిలిచిపోగలిగిన కవితా వాక్యమిది. అంతేకాదు ఈ దేశంలో హిందువుగా పుట్టటమే దేశభక్తికి తిరుగులేని ప్రమాణం కావటాన్నీ; ముస్లీంలు పుట్టుకతోనే దేశ ద్రోహులుగా, అభద్రులుగా పరిగణించబడటాన్ని ఈ కవిత నొక్కి చెబుతుంది. చివరి నాలుగు పాదాలలో చారిత్రక వక్రీకరణలోని అమానుషత్వాన్ని స్పష్టం చేస్తున్నాడు కవి. భారతదేశంలో ముస్లీంలు మాతృగర్భంలో ఇంకా రూపుదిద్దుకోక ముందే భవిష్యత్తులో రూపుదిద్దుకోబోయే దేశద్రోహులుగా, మిలిటెంట్లుగా చిత్రించబడటంలోని అశాస్త్రీయతనీ, అన్యాయాన్నీ, అమానుషత్వాన్నీ కవి ప్రశ్నిస్తున్నాడు. భారతదేశ ముస్లింల గతాన్నీ, వర్తమానాన్నీ, భవిష్యత్తును మెజారిటీ మతవాదులు ఎలా చూస్తున్నారు, ఎలా చిత్రిస్తున్నారనేదాన్ని ఈ కవిత ఒక క్రమంలో వివరిస్తుంది. 'పుట్టుమచ్చ' కవిత కోట్లాది ముస్లింల జీవితాల్లో దాగిన కన్నీళ్లను, అభద్రతను తొలిసారిగా బట్ట బయలు చేసింది. ఇదే కవితలో కవి మరో పార్శ్వాన్ని కూడా ప్రస్తావించాడు. "ఒక మనిషిని వేరొక మనిషీ, ఒక జాతిని వేరొక జాతి పీడించే సాంఘిక ధర్మం" నిరంతరం కొనసాగుతూ ఉండటాన్ని ఈ కవిత తనదైన రీతిలో

ప్రశ్నించింది. అఫ్సర్ –నాకే జన్మభూమి లేదు, అల్లాబక్ష్ –ఖబర్దార్ కవితలు కూడా ముస్లింల అభద్రతను చాటుతాయి.

కులం, మతం, వర్గం, జాతులు, ప్రాంతాలు అని భేదం లేకుండా స్త్రీలు సామాజికంగా, రాజకీయంగా, ఆర్థికంగా, విద్యాపరంగా, లైంగికంగా, కుటుంబపరంగా మన భారతదేశంలోనే కాక ప్రపంచ వ్యాప్తంగా నేటికీ కూడా పురుషాధిపత్యం చేతిలో అణిచివేయబడుతున్నారు. సమాజంలో మిగతా వర్గాల స్త్రీల కంటే ఈ అణచివేత ముస్లిం స్త్రీలపై ఎక్కువగా కనిపిస్తుంది. ఇందుకు ఇస్లాం మతాచారాలు, ఆంక్షలు వంటివి అదనపు కారణాలు. ప్రపంచంలో ఏ మతమైనా స్త్రీలను పురుషునికంటే తక్కువ స్థాయిలోనే ఉంచింది. పురుషునికి లోబడి ఉండేలా చేసింది. అయితే ఇంకా ఆధునిక ప్రపంచ ప్రభావం పెద్దగా పడని ముస్లిం సమాజంలో స్త్రీ స్థానం మరింత దుర్భరంగా అణిచివేయబడింది. దీనికి రాజకీయ, ఆర్థిక, సామాజిక, అవిద్య అనే అంశాలు ప్రధానకారణంగా చెప్పవచ్చు. స్త్రీలు అభివృద్ధి చెందకుండా ఏ దేశ అభివృద్ధి సంపూర్ణం కాజాలదు. ముస్లిం స్త్రీవాద కవిత్వమంటే ముస్లిం స్త్రీలు రాసిందే అవుతుంది. ఇక్కడ సానుభూతికి తావులేదు. ముస్లీం స్త్రీ పుట్టుక ముస్లిం ఉనికిని నిర్ధారిస్తుంది. ఏ వర్గపు స్త్రీనైనా రెండుశక్తులు దారుణంగా కట్టడి చేస్తాయి. ఒకటి మతం, రెండు పురుషాధిపత్యం. అణిచివేత విషయంలో ఓ నిజం గుర్తించాలి. దళిత, హిందూ స్త్రీల కంటే ముస్లిం స్త్రీ ఎక్కువ నిర్బంధాలకూ, బాధలకు గురవుతున్నది" అని సమాజంలో ముస్లీం స్త్రీల ప్రత్యేక స్థితిగతులను పరిశీలకులు స్పష్టం చేశారు. ఈ అంశాన్ని ముస్లీం మైనారిటీ స్త్రీవాద కవయిత్రులు మరికొంత బలంగా కవిత్వీకరించారు.

“కులం, మతం, వర్గం, జాతులు, ప్రాంతాలు అని భేదం లేకుండా స్త్రీలు సామాజికంగా, రాజకీయంగా, ఆర్థికంగా, విద్యాపరంగా, లైంగికంగా, కుటుంబపరంగా మన భారతదేశంలోనే కాక ప్రపంచ వ్యాప్తంగా నేటికీ కూడా పురుషాధిపత్యం చేతిలో అణిచి వేయబడుతున్నారు.”

ముందుగా ముస్లీం స్త్రీవాద కవిత్వాన్ని గూర్చి మాట్లాడేటప్పుడు 1992 డిసెంబర్ 25 న ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రికలో వచ్చిన యస్. రజియా బేగం రచించిన 'అలాగే అన్నారు' కవితను గురించి చర్చించకతప్పదు.

బాల్యంలో
చిన్నపిల్లవి నీకేంతెల్సు కూర్చో!' అన్నారు
'యవ్వనంలో
ఉడుకు రక్తం మంచీ చెడూ తెలీదు కూర్చో' అన్నారు
'వృద్ధాప్యంలో
ముసల్దానివి ఇంకేం చేస్తావ్ కూర్చో' అన్నారు
'అవకాశం రానందుకు కోపంగా లేదు నాకు
కూర్చోని కూర్చోని బద్ధకం వచ్చినందుకే బాధగా వుంది
(యస్. రజియా బేగం – అలాగే అన్నారు )

ఈ పురుషాధిపత్య భావజాలం, స్త్రీని బాల్యం నుంచి వృద్ధాప్యం వరకు ఏ రీతిలో బంధీగా కట్టడిచేసి, బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా చేసిందో కవయిత్రి ఈ ఖండికలో ఆ విష్కరించారు. ఈ కవిత నిడివి 8 పాదాలే అయినా ఎంతో విశాలమైన అర్థాన్నిస్తుంది. తెలుగు సాహిత్యంలో స్త్రీవాదానికీ, ముస్లీం స్త్రీవాదానికీ నిలువెత్తు తార్కాణంలా నిలిచింది. రజియా బేగం ఈ కవిత రాసేనాటికి ముస్లీం స్త్రీవాదం అన్న ధోరణి సాహిత్యంలో స్థిరపడలేదు.

ముస్లిం మైనారిటీ స్త్రీ కవిత్వానికి ఒక ధిక్కార గొంతుక, ఒక బలమైన గొంతుక షాజహానా. ఈమె రాకతో ముస్లిం స్త్రీలు సమాజంలో పడుతున్న అణిచివేత, అమానుషత్వం, వెట్టి చాకిరి, ఇంటి నిర్బంధం, అవిద్య మొదలగు ముసుగుల్ని కవిత్వ రూపంలో బట్టబయలు చేసింది.

ఎవరెస్ట్ లేంటి? చంద్రున్ని సైతం తాకొస్తున్న స్త్రీలను చూస్తూ
సంసారాలనేంటి? ఇంగ్లీష్ ఛానల్ని ఈదుతున్న
ఈ తరం స్త్రీలను చూస్తూ
ఇంకా ఇంకా మౌనంగా ఉండడం నా వల్ల కాదు
( షాజహానా – పర్దా హటాకే దేఖో )

ఇది షాజహానా రచించిన 'ప హటాకే దేఖో' అనే కవిత. ప్రపంచంలో ఏ

మతాన్ని గమనించినా స్త్రీల దగ్గరకొచ్చే సరికి పురుషాధిపత్యం వివిధ ఆంక్షలు విధించి కట్టడి చేస్తూ ఉంది. భారతీయ సమాజంలో దళిత స్త్రీల కన్నా, హిందూ స్త్రీల కన్నా ముస్లీం స్త్రీలు మరింత వెనుకబడి ఉన్నారు. దీనికి ప్రధానకారణం ప్రత్యక్షంగా మత పెద్దలు విధించిన కట్టు బాట్లు అయితే, పరోక్షంగా పురుషాధిపత్యం విధించిన షరతులు ముస్లీం స్త్రీల అభివృద్ధికి అడ్డుకట్ట వేస్తున్నాయి. ఇస్లాం అరబ్ దేశాలలోనే ముస్లిం స్త్రీలు ఎవరెస్ట్ శిఖరాలు అధిరోహిస్తున్నారు. ఇంగ్లీష్ ఛానెళ్ళు ఈదుతున్నారు. అంతరిక్షాన్ని సైతం చేరుకుంటున్నారు. ప్రపంచ టెక్నాలజీని అరచేతిలో వీక్షిస్తున్నారు. కానీ అక్కడలేని ఆంక్షలు భారతదేశ ముస్లీం స్త్రీలకు ఎందుకు అని మతాధిపతులను షాజహానా నిలదీస్తున్న వైనాన్ని గమనించవచ్చు. అయితే మొదటగా ముస్లిం స్త్రీల గొంతుక పురుష గొంతుకలో వినబడింది. ఖాజా రాసిన " ఫత్వా, షరతు " కవితలు ముస్లిం మైనారిటీ స్త్రీవాదానికి గొప్ప సంఘీభావ గొంతుక. ఈ కవితలపై 1994-1996 మధ్య కాలంలో ఆంధ్రప్రభ వార పత్రికలో తీవ్రమైన చర్చ కొనసాగింది. షుకూర్ – బూబమ్మ, షేక్ మహమ్మద్ రఫీ – ఎంత ఏకినా తెగనిరాగం, హనీఫ్ – వందేళ్ల కాపురాలు కావాలి, షేక్ ఇబ్రహీం- బంధీకా జిందగీ, మహమ్మద్ రఫీ –అమ్మీజాన్ చద్దర్ మొదలగు కవితలు పురుష గొంతుక నుండి వెలువడి ముస్లిం మైనారిటీ స్త్రీవాద కవిత్వానికి ఒక బలాన్ని కలిగించాయి. షంషాద్ బేగం- పర్సనల్ లా, జవేరియా –ముస్లిం వనిత, వాజిదా ఖాతున్ - పర్దా, షెహనాజ్ –బట్టేబాజ్, ఖాలిదా పర్వీన్ –స్వేచ్ఛా ముసుగులో, ఇప్పుడు నేనొక్కత్తినే, నస్రీన్ ఖాన్ – జఖ్మీ, ఫరీదా భాను – మేం బానిసలము కాము, మున్వరున్నిసా – గుడియా మొదలగు కవితలు ముస్లిం మైనారిటీవాద స్త్రీవాద కవిత్వానికి మరింత బలాన్ని కలిగించిన ధిక్కార గొంతుకలు.

కాలం ముందుకు వెళ్లే కొద్దీ ఏ సమాజమైనా అభివృద్ధి బాటలో పయనించాలి. కానీ! భారతీయ ముస్లిం సమాజం మాత్రం కాలం ముందుకు వెళ్తున్న కొద్దీ మరింత వెనుకబడుతుంది. లేనిపోని పాతకాలపు తాతల గొప్పదనాన్ని చెప్పుకుంటూ వారి సామాజిక వెనుకబాటుతనాన్ని కప్పిపుచ్చుకుంటూ దిక్కుతోచని స్థితిలో మరుగున పడి ఉంది.

పట్టెడన్నం కోసం
పేమెంట్స్ మీద పూలమ్ముకుంటాను
పళ్ళమ్ము కుంటాను, పల్లీలమ్ముకుంటాను
గొడుగులు బాగు చేస్తుంటాను

గడియారాలు బాగు చేస్తుంటాను
వీధరుగుల మీద దర్జీ పని చేస్తుంటాను
దూదేకుతుంటాను దినంగడుపుతుంటాను
ఏ గొడవల్లేకుండా

బతుకును వెళ్ళ మార్చాలను కుంటాను

ప్రస్తుత ముస్లిం సమాజం వివిధ చేతి వృత్తులతో ఎలా పొట్టనింపుకుంటుందో, బతకడానికి జీవితంతో ఎలా పోరాటం చేస్తుందో 'పుట్టుమచ్చ'లోని ఈ పాదాలు విశదపరుస్తున్నాయి. యావత్తు భారతీయ ముస్లిం సమాజం అన్ని రంగాలలో వెనుకబడి ఉందని జాతీయ, రాష్ట్ర స్థాయిల్లో అనేక నివేదికలు వెలువడుతున్నాయి. అయినా తూ-తూ మంత్రంగా చూసీ చూడనట్లు ప్రభుత్వాలు వ్యవహరించడం ముస్లిం సమాజంలో అసహనాన్ని కలుగ జేస్తున్నదన్నది కవి ఆవేదన. దారిద్ర్యం తాండవించే ముస్లీం ఇళ్ళల్లో పిల్లలను ఎవరూ చదివించాలనుకోరు. వారికి మంచి సదా, ఉద్యోగం వచ్చేలా ఆలోచించరు. పేదరికం ఇంట్లో తిష్టవేసి ఉన్నందు వలన ఇంట్లో పస్తులు ఉండకుండా బతుకు బండి నడిస్తే చాలు అనుకోవడం ముస్లీం ఇళ్ళల్లో పరిపాటి. అందువలన ముస్లిం సమాజం పిల్లలను తమలాగే ఏదో ఒక పనికి పంపిస్తే సాయంత్రానికల్లా ఎంతో కొంత కష్టపడి తెస్తారు అనుకుంటుంది. ఇల్లు పస్తులు లేకుండా గడుస్తుందనే ఆలోచన చేస్తున్నారే తప్ప వారి భవిష్యత్తు ఎలా పోతుందో ఆలోచించలేక పోతున్నారు.

ఆలీ 'పాన్ మరక' కవిత ముస్లిం మైనారిటీవాద కవిత్వంలో పేదరికానికి ప్రతీక.

ఇక్కడ నా చేతులాడితేనే
ఇంట్లో పిల్లల చేతులు కంచాల్లో కదుల్తాయి
అబ్బా! చారానె హైలో దేవ్ నా
నైహైబేటా! కలె దేతాఁవ్
ఎన్ని రాత్రిళ్ళు నా అసమర్థత కన్నీళ్ళై కారిందో
చిల్లులు పడ్డ కుండను నా బేగం
గుడ్డతో పూడ్చుతుంటె
చిల్లులు పడ్డ నా జేబు గుర్తుకొస్తుంది

నాకు జీవితంతో కూడుకున్న సెలవుదినాల్లేవు
అంగ్ పే షేర్వానీ-ఘర్ మే ఫరేశానీ ( అలీ – పాన్ మరక )

ముస్లింలంటే బయటి ప్రపంచానికి మొఘల్ చక్రవర్తులు, నవాబులు, ధనవంతులు, విలాస జీవితాన్ని గడిపేవారు అనే ప్రచారం జరుగుతుంది. కానీ స్వతంత్ర దేశంలో వీరి నిజజీవితం వీటన్నిటికీ పూర్తి భిన్నంగా ఉండటం గమనించవచ్చు. "మొగల్ కాలంలోనూ లేక సుల్తానుల కాలంలో కూడా సామ్రాజ్యం యొక్క ఆర్థిక వ్యవహారాలు హిందువులే చూశారు. ఆర్థిక మంత్రులుగా హిందువులే ఉండేవారు. సుప్రసిద్ధ చరిత్రకారుడు టోయన్ బీ కూడా యీ వాస్తవాన్ని మనదృష్టికి తెచ్చాడని అర్దర్ అలీ పూర్వం రాజుల పరిపాలనా కాలంలో ఆర్థిక వ్యవహారాలు ఎవరు చూసుకుంటున్నారనే వాస్తవాన్ని తెలియజేశారు. 'అంగ్ పే షేర్వానీ ఘరమే పరేశానీ' అన్న కవి మాటల్లో ముస్లింల బతుకులు ఎలా ఉన్నాయో, ఈ దేశంలో ముస్లింలు ఎలా జీవిస్తున్నారో అర్థమౌతుంది. రసూల్ ఖాన్ – ఐస్ బాబు ఐస్, మహమ్మద్ రఫీ –ఆజీద్ విజా, షేక్ ఇబ్రహీం- బతుకుపయాణం, బాజి – అనాథ, వేంపల్లి అబ్దుల్ ఖాదర్ – రేపటి చూపు మొదలైన కవితలు ముస్లింల సామజిక వెనుకబాటుతనాన్ని తెలియజేశాయి.

దేశ విభజన తర్వాత ముస్లింల చరిత్ర మీద, ప్రజల మీద, ముఖ్యంగా తరతరాలుగా ఈ మట్టినే నమ్ముకుని, ఈ మట్టి గాలినే శ్వాశిస్తూ, ఈ దేశ స్వాతంత్ర్యం కోసం ప్రాణా త్యాగాలు చేసి, రక్తాన్ని చిందించిన భారతీయ ముస్లింల అస్తిత్వాన్ని కొందరు మతోన్మాదులు, కొన్ని రాజకీయ శక్తులు, పార్టీలు పరిహసించాయి. శంకించాయి. ఈ నేపథ్యంలో ముస్లిం కవులు అస్తిత్వ పరివేదన అత్యంత కీలకమైనదని భావించారు. ఈ అంశంపై బలమైన కవిత్వాన్ని కవిత్వీకరించారు.

షేక్ పీరా రచించిన 'సిటిజన్‌షిప్' అనే కవిత కూడా ఈ సందర్భంలో పరిశీలించ దగింది.

పొరుగున నిప్పు కణిక రాజుకుంది
ఇక్కడ నా విశ్వాసం నిషేధించబడింది
నా అనుమతి లేకుండానే పరీక్షకు నిలబెట్టి
నా స్వేచ్ఛకు ఆంక్షల సంకెళ్ళు బిగించారు
సరిహద్దులు ఉందిక్తమైనప్పుడల్లా
దేశీయ ఎమర్జెన్సీ నెదుర్కొంటున్నాను

నా పూర్వీకులు నెత్తురోడిన గడ్డమీద
అమ్మీజాన్ నన్ను పురుడు పోసుకున్న నేలమీద
అర్ధ శతాబ్దం పైగా నిజాయితీగా చెమటోడ్చిన భూమిమీద
నా సిటిజన్‌షిప్ తరచూ గల్లంతువుంతోది. ( షేక్ పీరా - సిటిజన్ షిప్ )

ఏ దేశంలోనైనా సరే పరదేశీయులు దాదాపు 5 సంవత్సరాలు నివాసముంటే అక్కడ వారికి ఆ దేశ పౌరసత్వం లభిస్తుంది. ఈ మట్టిలో పుట్టి, ఈ మట్టిలో పెరిగి, ఈ మట్టితో మమేకమై ఈ మట్టిలో మట్టిగా తరతరాలుగా ముస్లీంల బంధం పెనవేసుకుని ఉంది. ఈ మట్టితో ముస్లీంలకు ఉన్న గాఢమైన అనుబంధాన్ని బంధాన్ని చూసి ఓర్వలేకపోయిన కొందరు మెజార్టీవాదులు ఏ సంఘటన జరిగినా, దానిని ముస్లింలకు

ఆపాదిస్తున్నారు. వారి అస్తిత్వాన్ని పదుల సంవత్సరాల నుండి కాలరాసి అభద్రతకు గురిచేస్తూనే ఉన్నారని కవి ఆవేదన. షేక్ పీరా రాసింది కొన్ని కవితలే అయినా, బలమైన గొంతుకతో ముస్లీంల అస్థిత్వాన్ని, మూలాల్ని, అంతర్గత సమస్యలను బహిర్గతంగా కవిత్వీకరించాడు.

ముస్లింల అస్తిత్వ విషయమై కొంత తీవ్రంగా స్పందించిన ముస్లీం మైనారిటీ కవులు కూడా ఉన్నారు. గౌస్ మొహియుద్దీన్ రచించిన 'ఖౌమి' అనే కవితలో ఆ స్వరాన్ని మనం గమనించగలం.

ఇక నా సహనాన్ని పిరికితనంగా భావించకు
కన్నీళ్ళు ఆవిరైపోయిన కళ్ళ గోతుల్లో
మరలా మరలా త్రవ్వానో
బయల్పడేవి ఇక ఆర్డీఎక్స్ గనులే...!
హైదరాలీనై టిప్పుసుల్తాన్నై
తల్వార్ తడాఖా చూపెట్టిన నన్నే
నా సారే జహాసే అచ్చాను విడిచిపోమ్మంటే
ఇక సహించను సహించలేను
ఏకంగా నీ కుత్తుకునే ఖత్నా చేస్తాను ( గౌస్ మోహీయుద్దీన్ – ఖౌమి )

భారత ముస్లింల సహనాన్ని ఇంకా పరీక్షించకు, పరీక్షిస్తే నాలో

దాగిన అలావాను ఎవరూ ఆపలేరు అని కవి స్పందిస్తున్నాడు. 'దక్షిణ భారత నెపోలియన్'గా ఖ్యాతి గడించిన హైదరాలీ ఈస్ట్ ఇండియా పాలకులపై అనేకమార్లు దండయాత్రలు చేసి శత్రువు సైన్యాల ఎముకల్లో చలి పుట్టించిన గొప్ప యుద్ధ వీరుడు, పరిపాలకుడు. హైదరాలీ కొడుకు టిప్పుసుల్తాన్. టిప్పు సుల్తాన్ 'మైసూరు పులి'గా కూడా ఖ్యాతి గడించాడు. టిప్పుసుల్తాన్ ప్రజల ఇష్టానుసారంగా పరిపాలించి కంపెనీ పాలకుల దాడులను తిప్పి గొట్టాడు. రాజ్యంలో సర్వమానవతాభివృద్ధిని సాధించాడు. నా అఖండ డిస్కవరీల వారసత్వాన్ని ఆపాదించుకున్న నన్ను, నా సారేజహాఁసే అచ్చాను విడిపోమంటే ఇకనేను సహించేదే లేదని, నా సహనాన్ని పరిక్షిస్తే భారత ముస్లిం ప్రజానీకంలో మరో హైదరాలీలను, టిప్పుసుల్తాన్ల పరాక్రమాన్నిచవిచూడక తప్పదన్న కవి ఆవేశాన్ని అర్థం చేసుకోవచ్చు. ఆనాడు దేశం కోసం, ప్రజలకోసం, దేశ విముక్తి కోసం వారు యుద్ధాన్ని ప్రకటించారు. ఆ పోరాట పటిమ మళ్లీ తమలో కలిగించొద్దన్నది కవి అభ్యర్థన. తమ అస్తిత్వాన్ని ఇంకా ఇంకా శంకిస్తే అలా శంకించినవారి కుత్తుకలనే ఖత్నా చేస్తామన్నది కవి హెచ్చరిక. ఈ హెచ్చరిక వెనుక ఉన్న కవి ఆవేదనని మనం అర్థం చేసుకోవచ్చు. తాహెర్ – బైల్ కే దిమాక్ వాలే, సికిందర్ – కరీంభాయ్, అఫ్రీన్ – చమన్, అల్ ఫతా – నేనే మూలవాసిని, ఎ. రాజా హుస్సేన్ – జాగో కవితలు ముస్లింల అస్తిత్వాన్ని వ్యక్తపరిచాయి.

> సమాజంలో ఏదైనా ఒక సంఘటన జరిగినప్పుడు దానికి స్పందించి రాసిన కవిత్వాన్ని సంఘటనాత్మక కవిత్వమని వ్యవహరించవచ్చు. ఈ ముస్లిం మైనారిటీవాద కవిత్వం ఆవిర్భవించడానికి కారణభూతమైన సంఘటనలు చాలా ఉన్నాయి.

సమాజంలో ఏదైనా ఒక సంఘటన జరిగినప్పుడు దానికి స్పందించి రాసిన కవిత్వాన్ని సంఘటనాత్మక కవిత్వమని వ్యవహరించవచ్చు. ఈ ముస్లిం మైనారిటీవాద కవిత్వం ఆవిర్భవించడానికి కారణభూతమైన సంఘటనలు చాలా ఉన్నాయి. వాటిలో సంఘటనాత్మక కవిత్వం మనకు కొత్త కాదు. నిజానికి చాలా సందర్భాలలో ఉత్తమ కవిత్వం ఎప్పుడూ ఏదో ఒక సంఘటన భూమికగానే వెలువడుతుంది. ప్రధానంగా బాబ్రీ మసీదు

సంఘటన, గుజరాత్ జాతి హత్యకాండ, ఎం.ఎఫ్.హుస్సేన్ పై దాడులు మరియు కర్ణాటకలో ఉర్దూ వార్తలు నిషేధించడం వంటివి ప్రధానమైనవి. ముస్లిం మైనారిటీ వాద కవిత్వంలో సంఘటనలకు సంబందించిన వస్తువుల్లో ముస్లీం' అనే మాటను పక్కన బెట్టి, అది హిందూ అయినా, క్రైస్తవం అయినా, బౌద్ధం అయినా, జైనం అయినా సరే ఆ ప్రజల బాధను, హృదయాన్ని అర్ధం చేసుకుంటే నిజానిజాలు తేటతెల్లమవుతాయన్న విషయాన్ని గమనించగలం. ఒక డిసెంబర్6 చాలు ముస్లింల అస్తిత్వ జీవన విధానం ఎలా తచ్చాడుతుందో తెలియడానికి.

'అక్కడ మందిరం కడితే ఇప్పటికే దేశంలో వున్న లక్షలాది మందిరాల సంఖ్యకు మరొకటి వచ్చి చేరుతుంది తప్ప హిందువులకు ప్రత్యేకంగా ఒరిగేదేమీ లేదు. అక్కడ మస్జీద్ కడితే ఇప్పటికే దేశంలో వున్న వేలాది మసీదుల సంఖ్యకు ఒకటి వచ్చి చేరుతుంది తప్ప ముస్లీంలకు ఒరిగేదేమీ లేదు. నా దేశపు రాజకీయ నేతల్లారా, మీకు రాముడి పైనా, అల్లాపైనా భక్తి లేదు. కేవలం వాళ్ళ పేరుతో స్వార్ధ రాజకీయ ప్రయోజనాలే మీకు కావాల్సింది. అక్కడ మందిరం కడతారో, మస్జీద్ కడతారో, లేక రెండూ కలిపి కడతారో

మీ ఇష్టం. కానీ మందిర్, మస్జీద్ పేరుతో సమాజంలో కాస్తో, కూస్తో మిగిలి ఉన్న మానవత్వాన్ని మాత్రం ధ్వంసం చేయకండి అని ముస్లిం మైనారిటీవాద కవులు ఆవేదన వ్యక్తం చేశారు. యం.డి. యాకూబ్ బాషా రాసిన 'ఒక ఇతిహాసం-ఒక వర్తమానం' అనే కవితలోనూ బాబ్రీ మసీదు సంఘటనకు సంబంధించిన పరామర్శ ఉంది.

చివరికి
నా బాబ్రీ గుండె గుమ్మటాలను కూల్చే కరకు దృశ్యం
చూడనివ్వలేదు
ఒక్క మారుగా పరిగెత్తుకొచ్చిన ఆ రక్తసిక్త గణాంకావశేషం
వింత భయాల్ని ఆవిష్కరిస్తుంది
మన ఏడేడు తరాలను డిసెంబర్ గాయం
మళ్ళీ మళ్ళీ కవ్విస్తూనే ఉంటుంది.

బాబ్రీ సంఘటనను రాచరికపు నియంతల కోణంలోంచి చూస్తే తప్పుకాదు. కానీ, మనం ప్రజాస్వామ్యంలో బ్రతుకుతున్నాం అని గుర్తించుకోవాలి. గతంలో రాజులు ఏ మతాన్ని అధికారిక మతంగా ప్రకటిస్తారో ఆ మతం మిగతా మతాలను

మింగే సేది. జైనం, బౌద్ధం, శైవం, వైష్ణవం, ఇస్లాం ఏ మతమైనా కావచ్చు. కానీ నేడు మత వాదులు మతాల పేరుతో విధ్వంసం సృష్టించి ప్రజల మధ్య ఒక అభద్రతా భావాన్ని, వైరుధ్యాలను పెంచుతున్నాడు. ప్రజాస్వామ్యానికి హాని కలిగిస్తున్నారు. మనం బ్రతుకుతుంది ప్రజాస్వామ్యంలో అని గుర్తుంచుకుంటే ప్రజల మనస్సు తెలుస్తుందనీ, ఒకరిపై ఒకరికి ఆత్మీయతలకు కొరత ఉండదని గుండెలో దాగిన బాధను కవి తెలియచేశాడు. గౌస్ మోహియుద్దీన్ – ట్రిగ్గర్ మరియు కాషాయము, యం.డి యాకూబ్ పాషా- ఒక ఇతిహాసం ఒక వర్తమానం, స్కైబాబ – సర్ఫకస్ కవితలు బాబ్రి ఉదంతానికి తార్కాణాలు.

గుజరాత్ సంఘటనమీద ముస్లింలు, ముస్లీమేతరులు కూడా విస్తృతంగా కవిత్వాన్ని ప్రకటించారు. గుజరాత్ గాయం, అజా వంటి కవితా సంకలనాలు ఈ నేపథ్యంలోనే వెలువడ్డాయి. ఈ సందర్భంగా ప్రకటించబడిన కవితలు కొన్నింటిని పరిశీలిద్దాం. గుజరాత్ లో జరిగిన జాతి నరమేధంపైన ఒక అఖిల భారత బృందం సమర్పించిన నివేదికకు సంక్షిప్త రూపంగా ముస్లీమేతర కవి సూర్యవంశీ ముస్లింలకు సంఘీభావంగా చెప్పిన కవిత ఇది.

నా సిరస్సు పై<br>
నా ఇంటి పై కప్పు నీడ వుంటే<br>
నన్ను<br>
నా ఇంట్లోనే<br>
పై కప్పుతో సహా<br>
సజీవ దహనం చేశావు<br>
ఇప్పుడు నేను<br>
నా మాతృభూమి ఎదను<br>
హత్తుకున్న బూడిదని<br>
నాపై ఆకాశం ఉంది.<br>
నీవు ఈ ఆకాశాన్ని<br>
తగల బెట్టగలవా (సూర్యవంశి –గుజరాత్ 2002)

గుజరాత్ జాతి హత్య కాండపై సంఘీభావంగా సూర్యవంశి మాత్రమే కాదు, అనేకమంది ముస్లీమేతర కవులు కూడా కవిత్వ రూపంలో తమ గళాలను వినిపించారు. నందిని సిద్ధారెడ్డి, వరవరరావు, శివారెడ్డి, కె. రాజనర్సింహ, రివేరా,

కటుకోజ్వల ఆనందాచారి, కె. బాలగోపాల్, డా. ఎస్వీ సత్యనారాయణ, శివలక్ష్మీ, కూర్మా చలం శంకరస్వామి, కోటం చంద్రశేఖర్, ప్రొ.కె. ఎన్. ఫణిక్కర్, నిఖిలేశ్వర్, శ్రీధరరావు దేశ్ పాండే, ఓల్గా, కొండేపూడి నిర్మల, రామ్ కీ, జక్కంపూడి నాగేశ్వరరావు, బోయ జంగయ్య, కె. గీత, సీతారం, బసలింగప్ప, బీరం సుందర రావు, ఎ.బి.కె. ప్రసాద్, పసునూరి రవీందర్, వసంత, టి. కృష్ణమూర్తి యాదవ్, వంశీకృష్ణ, కె.జె. రమేష్, మంచికంటి, వి.ఆర్. విద్యార్థి మొదలైన వారు కలాన్ని ఝులిపించిన వారిలో కొందరు.

> ఆంధ్రప్రదేశ్ నుండి 28 మంది కవులు, రచయితలు, కళాకారులు మే 29 నుండి జూన్ 13 వరకు గుజరాత్ లో అనేక ప్రాంతాలను పరిశీలించి, విచారించి అనేక విషయాలను వెలుగులోకి తీసుకొచ్చారు.

ఆంధ్రప్రదేశ్ నుండి 28 మంది కవులు, రచయితలు, కళాకారులు మే 29 నుండి జూన్ 13 వరకు గుజరాత్ లో అనేక ప్రాంతాలను పరిశీలించి, విచారించి అనేక విషయాలను వెలుగులోకి తీసుకొచ్చారు. గుండెలను పిండిచేసే ఈ చేదు నిజాలనుకవిత్వ రూపంలో, వ్యాసరూపంలో ఆవిష్కరించారు. 2002 ఫిబ్రవరి 27, 28న జరిగిన గుజరాత్ సంఘటన మీద 'అజా' పేరుతో గుజరాత్ ముస్లిం కవిత్వం ఒక సంపుటిగా వెలువడింది. అన్వర్, స్కైబాబా దీనికి సంపాదకత్వం వహించారు. 'గుజరాత్ గాయం' పేరుతో యాకూబ్ సంపాదకత్వంలో 200 కవితలతో మరొక సంకలనం వెలువడింది. ఎ బి సి పబ్లికేషన్ వారు వేయించిన రిపోర్ట్ తోపాటు, వివిధ పత్రికలలో, సంపుటాల్లో కూడా గుజరాత్ సంఘటన గురించి కవిత్వం విరివిగానే వెలువడింది. దిలావర్ – జఖ్మీవలి, స్కైబాబ – గుజ్రాత్, షేక్ హాజి నూరాని – స్వర్గం నుండి ఎహ్సాన్ జాఫ్రీ దాకా మొదలగు కవితలు గుజరాత్ సంఘటనలో సర్వం కోల్పోయిన ముస్లింల జీవితాలను తెలియజేసాయి. గుజరాత్ సంఘటనపై అజాఁ, గుజరాత్ గాయం సంకలనాలు కూడా వచ్చాయి.

"భిన్నత్వంలో ఏకత్వం"మన భారతీయ ప్రత్యేకత. మనది బహుముఖాలు కలిగిన సమాజం. పూలతోటలో ఎన్నెన్ని రకాల పూలు ఉంటాయో, అలాగే స్వతంత్ర

భారతావనిలో అన్ని రకాల రంగుల, అన్నిరకాల ధోరణుల మనస్తత్వం కలిగిన మనుషులు ఉన్నారు. చరిత్రలో మొగల్ సామ్రాజ్య నిర్మాణం తర్వాత భారతదేశంలో ముస్లీంలు స్థిరపడిపోయారు. భారతీయ జీవన స్రవంతిలో కలిసిపోయారు. దాదాపు 600 సంవత్సరాలుగా హిందువులతో కలిసి మెలిసి సుఖదుఃఖాలు పంచుకున్నటువంటి పైనాన్ని చరిత్ర తిరగేస్తే విశదపడుతుంది.

ఇస్లాంవాద కవిత్వానికి మార్గదర్శి కరీముల్లా గారు తాను రచించిన ఈద్ ముబారక్ కవితా సంపుటిలో దేశభక్తిని ప్రస్తావిస్తూ

నువ్వు దేన్ని గురించి
మాట్లాడున్నావో నాకు తెలీదు
నేను మాత్రం
ఈ మట్టిని గురించి మాట్లాడున్నాను
తల్లిపాలు తాగిన వాడ్ని కదా
దేశ పటాన్ని లుంగచుట్టి
సామ్రాజ్యవాదుల జారుడు మెట్లపై
కార్పెట్ పర్చిన వాడా!
నువ్వు పాడే జనగణమనలో
నా జనం లేరని తెల్సు
నేను పాడే జనగణమనలో
సమస్త ప్రజల గొంతుకలున్నాయి ( షేక్ కరీముల్లా – జనగణమన )

భారతదేశం భిన్న మతాల, భిన్న కులాల, భిన్న జాతుల, భిన్న సంస్కృతుల సమ్మేళనం. ఇన్ని సమ్మేళనాలను మన జాతీయగీతం 'జనగణమన' తొక్కేస్తూ కేవలం మెజార్టీ వర్గాల ఆధిపత్యాన్ని మాత్రమే గుర్తిస్తుందన్నది కవి భావన. ముస్లీంలు, క్రిస్టియన్లు, సిక్కులు, బౌద్ధులు మొదలైన మైనారిటీ వర్గాల వారి మనోభావాల్ని దెబ్బతీస్తుందని కవి అభిప్రాయపడ్డాడు. ఈ దేశాన్ని సామ్రాజ్యవాదుల కనుసన్నల్లో తాకట్టు పెట్టే శక్తుల పైన, తన పూర్వీకుల్లా తిరుగుబాటు చేస్తానని ధ్వనించాడు.

నాకు మాత్రం నాదేశమంటే
సమస్త సంస్కృతుల సమాహారం
పంచ ప్రాణాల ఆనంద విహారం ( ఆఫ్గలిండియా – కవాతు )

అని ముస్లిం మైనారిటీవాద కవులు భారతదేశంపై వారి జాతీయతను, దేశభక్తిని ఆవిష్కరించారు. సయ్యద్ గఫార్ –అంగట్లో దొరికే కుంకుమకాదు దేశభక్తి, ఎ.రాజా హుస్సేన్ – తిరంగా ముసల్మాన్, సయ్యద్ సాబిర్ హుస్సేన్ – దేశమంటే మతం కాదోయ్, అబ్దుల్ ఖాదర్ – విలోమ న్యాయం, మహమూద్ – నేను నేనుకాను మొదలగు కవితలు ముస్లింల దేశభక్తిని తెలియజేసాయి.

ఇస్లాం మతం ప్రకారం కుల, వర్గ, వర్ణ, జాతి అనే తేడాలు ఏమీ లేకుండా మహమ్మదీయులంతా ఒక్కటిగా జీవించాల్సిందే. అన్న పానాదుల దగ్గర కానీ, ప్రార్థనాలయాల్లోగానీ ఏ తారతమ్యాలు పాటించకుండా అంతా సమానంగా మెలగాలని బోధించడం ఇస్లాంలోని గొప్ప లక్షణం. ఆచరణలో అది జరగడం లేదు. ముస్లింలలో భాగమైన దూదేకుల వారిని అవమానించడం, చులకనగా చూడటం జరుగుతుంది. 'ఏ సాయిబు లేని కాడ దూదేకుల సాయిబే పీరుసాయిబు' లాంటి సామెతలు ప్రజల నాలుకల మీద నానిపోవడం గమనిస్తూనే ఉంటాం. అలాగే 'పింజారి వెధవ' అని తిట్టడం కూడా పరిపాటి అయిపోయింది. ఈ అంతర్గత వివక్షను వారి జీవన విధానాన్ని కూడా ముస్లిం మైనారిటీవాద కవులు కవితా వస్తువులుగా మలిచారు.

ముస్లిం దూదేకుల జీవన స్థితిగతుల గురించి యాకూబ్ రచించిన 'అవల్ కల్మా' అనే కవితను పరిశీలిద్దాం.

మీ ఇళ్ళల్లో నీళ్ళు నింపి 'బెనిఫీ'లమై
గుడ్డలుతికి 'ధోబీ, ధోబన్'లమై
జుట్టు గొరికి 'హజ్జామ్' లమై
దొడ్లు కడిగి 'మహతర్' 'మెహతరానీ'లమై పోయాం
లద్దాఫ్, దూదేకుల, కసాబు, పింజారీ
వృత్తిని కులమై కరిచిన కాలపు గుర్తులమయ్యాం
చెప్పుకుంటే నమ్మరుకానీ
చెబితే పలుచనై పోతామని భయం
షేక్, సయ్యద్, పఠాన్...
మీ దర్పాల హోదాల కాంథానుల
దగ్గరికైనా చేర నిచ్చారా (యాకూబ్ – అవ్వల్ కలీమా )

వివిధ ప్రాంతాలలో దూదేకులవారు వివిధ మారు పేర్లతో పిలువబడి వివక్షకు గురవుతున్నారు. ఈ అంతర్గత వివక్షపై కవులు బలంగా స్పందించిన ఇలాంటి కవితలు వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. సయ్యద్ అమీర్ –మనం ముస్లింలమేనా, ఖాజా –ఏకే కులం, షేక్ ఇబ్రహీం –ఆనవాలు, దిలావర్ –న ఘర్కా న ఘట్కా, మహమ్మద్ –గవాహ్, షాజహానా –లద్దాఫ్ని కవితలు దూదేకుల జీవితాలను ఆవిష్కరించాయి.

ఈ క్రమంలో ముస్లింవాద కవుల దళిత, బహుజన దృక్పథంతో కూడా కవితలు అనేకం రాసారు. ముస్లిం మైనారిటీవాద కవిత్వ వస్తు వైవిధ్యంలో ఇది కూడా ఒక ప్రధానమైన అంశమే. ఈ సందర్భంలో ఈ అంశానికి సంబంధించిన కొన్ని కవితలు పరిశీలించడం అవసరం.

**I am looking back**
ఔను! ఈ ఇరవై ఒకటో శతాబ్దపు గుమ్మంలో నిలబడి
నేను వెనక్కి తిరిగి చూసుకుంటున్నాను
... .... ..... ..... ......
మొన్న దస్యుణ్ణి నిన్న ఛండాలుడ్ని
ఈవేళ నా సవాలక్ష గాయాల సాక్షిగా సాయిబుని
నిజానికి నేను దళితుణ్ణి ( ఖాజా –రూట్స్ )

ముస్లింలకు, దళిత బహుజనులకు మధ్య ఉన్న ఆత్మీయ అనుబంధాలకూ, వారి సామాజిక మూలాలపైన ఉటంకించిన కవితాపాదాలు ఎవరూ చెరపలేని శిలాక్షరాలు. భారతీయ ముస్లింలు నవాబులు కాదు, మతం మార్చుకోబడిన గరిబీ నవాబులమని, నాటి దళిత బహుజనులే నేటి ముస్లింలమని కవి తెలియజేసాడు.

ప్రముఖ ముస్లిం మైనారిటీవాద కవి. స్కైబాబ కవిత్వంలోనూ అక్కడక్కడ దళిత బహుజన సమ్మేళన సంస్కృతి బలంగానే ఉట్టిపడుతుంది. స్కైబాబ రచించిన 'మర్ఫా' అనే కవిత ఈ సందర్భంలో సమీక్షించుకోవలసిన ఒక ముఖ్యమైన కవిత.

మాదిగవాడలూ తురకబజార్లూ
మురికి కాల్వల్నీ 'నీసు కంపు'ల్నీ
ఒక్కలాగే మోస్తుంటాయ్
ఆని గుడిసెలో ఎండు తునకలై
మాసాయమాల్లో కబాబులై

దండేనికి వేలాడే కౌసువాసన
మా బంధుత్వాన్ని చెబుతోంది ( స్కైబాబ – మర్ఫా )

ముస్లీంలుగా మతం మార్చుకున్న ఈ భారతీయుల జీవన విధానంలో నేటికీ దళిత బహుజనుల ఛాయలే ఎక్కువగా కనిపిస్తాయి. ముస్లీంలలో సాంస్కృతిక భిన్నత్వం కన్పించడానికి ప్రధాన కారణం ముస్లీంల మూలాలు దళిత బహుజనుల్లో ఉండడమే. ఈ చారిత్రక వాస్తవాల్ని స్కైబాబ 'మర్ఫా' కవితలో ప్రకటించాడు. అల్ ఫతా – వతన్ ను నమ్ముకున్న వాళ్లం, షేక్ పీరాం – పై బోరేవాలా కవితలు కూడా ముస్లింలు ఈ దేశ మూలవాసులేనని, నాటి ముస్లింలందరూ నేటి దళిత బహుజనులేనని తెలియజేసాయి.

పెరియార్ అనే దార్శనిక సంస్కర్త 'మానవ సమాజం ముందుకు వెళ్తున్నప్పుడు దారిలో ఏవైనా అడ్డం వస్తే పక్కన తీసేసి వెళ్ళాలి!' అని చెప్పాడు. ఇలా ప్రతి ఒక్కరు ఆలోచిస్తారు. అలానే ముస్లీంలకు ఏవైతే అడ్డంకులుగా మారుతున్నాయో, ముస్లీంలు తమ జీవన గమనంలో వాటిని తొలగించుకోవాలి. వాటిని తొలగించుకోకుండా, ఇస్లాం చెప్పింది కాబట్టి ఇలానే ఉండాలి అనుకుంటే ముస్లిం సమాజం అంధకారంలో పడినట్టే. ఇస్లాం మతసంస్కరణలకు పుట్టినిల్లు. ఇస్లాం తీసుకొచ్చినన్ని సంస్కరణలు ప్రపంచ చరిత్రలో ఏ మతం కూడా తీసుకుని రాలేదు. దీన్ని గుర్తించి ముస్లీంలు అందరూ ఆ మార్గంలో వెళితే ముస్లీం సమాజానికి ఇప్పుడున్న ఇబ్బందులు కొన్ని ఉండేవికావు. ముస్లిం సమాజం అభివృద్ధి చెందాలంటే మతపరమైన కొన్ని అంశాల్లో సంస్కరణలు అవసరం. లేకుంటే ముస్లిం సమాజం ముందుకు నడవలేదు. మారుతున్న కాలానికి అనుగుణంగా మనుషుల్లో, మార్పులు వస్తేనే సమాజం అభివృద్ధి చెందుతుంది. తమని అణచి పెట్టిన మతాచారాలలో మార్పు తీసుకుని రావడానికి ప్రయత్నం చేస్తే మతంలో తమ ఉనికినే కోల్పోవలసి వస్తుందని, తమ ఐడెంటిటీని కోల్పోవలసి వస్తుందని భయపడ్డారు. ఆ హీనస్థితి నుండి బయటపడలేక, ఆ పరిస్థితిని మార్చుకోలేక అందులోనే మగ్గిపోతున్నారు. ఖదీర్ రచించిన 'పిశాని' అనే కవిత కూడా ఈ సందర్భంలో ప్రస్తావించదగింది.

నయా పైసా లేదు
వొక్క పాపమూ చేయలేదు
పుణ్యప్రాప్తి కోసం

రోజూ అయిదుపూటలా
నడుము వంచుతూనే ఉన్నాను
అలా చేయగా
చేయగా
చేయగా
చేయగా
నా నుదిటిపైకి నల్లటి మచ్చ వొకటి చేరింది
మియా యేమి తలరాత  ( ఖదీర్ – పిశాని )

ఉన్నాడో లేడో తెలియని దేవుడి కోసం ఐదు పూటలా నమాజ్ చేయగా చేయగా నుదిటిపైనా ఒక నల్లటి మచ్చ ఏర్పడిందన్న నిరాశను కవి వ్యక్తం చేశాడు. ముస్లీముల్లో ధనికవర్గమైన 5% పెట్టుబడిదారులు మతంలో మార్పులకు తావివ్వకుండా వారి సౌకర్యవంతమైన జీవితం కోసం మతాన్ని మార్పులు చేసుకుంటూ పోయారు. వీళ్ళు ఎప్పుడూ మరుగున పడిన ముస్లీం జీవితాల గురించి, వారి ఆశలపై

దృష్టి సారించలేదు. ఖురాన్లో ఉన్న సందేశాన్ని గోరంతను కొండంతగా చేసి చెప్తారు. వక్ఫ్ బోర్డ్, మసీదు స్థలాలు, మదరసాలు వాటి పైనా వచ్చే ఆదాయం మొత్తం వీరి చేతుల్లోనే ఉంటుంది. సామాన్య ముస్లీంల మెప్పుకోసం అప్పుడప్పుడు ఏవో చిన్న చిన్న కార్యక్రమాలు చేసి చేతులు దులుపుకునే వారు లేకపోలేదని ముస్లీం మైనారటీవాద కవులు మత సంస్కరణలపై దృష్టి సారించారు. అన్వర్ – దేవ్ లాట, సికిందర్ – నైటింగల్ ఏట్ మాస్క్ కవితలు కూడా మతాన్ని సంస్కరించలన్నా తపనతోనే వచ్చినవి.

ముస్లీం మైనారిటీవాద కవులు కూడా ప్రపంచీకరణ స్వరూప స్వభావాలను కవిత్వీకరించారు. సామ్రాజ్యవాదులు, పెట్టుబడిదారులు మనుషుల మధ్య ప్రేమను, ఆత్మీయతల్ని, మానవత్వపు విలువల్ని, మానవ సంబంధాల్ని హరించి వేస్తున్నారు. ఈ నేపథ్యంలో మన జీవితాల్లో కూడా మారుతున్న అనేక దృశ్యాలను మైనారిటీవాద కవులు కూడా చిత్రించారు. ముస్లింల జీవనవిధానం దాదాపు చిన్న చిన్న కులవృత్తులపై ఆధారపడి ఉంది. ఆ కులవృత్తుల చుట్టే తిరుగుతుంటుంది. ఆ కులవృత్తులే వారి జీవనాధారం. బ్రిటీష్ సామ్రాజ్యవాదులు ఈ దేశంలోని చిన్నా చితకా చేతివృత్తులను, ఆ వృత్తులు జీవనధారమై ఉన్న జీవితాలనూ అత్యంత

ఘోరంగా ధ్వంసం చేశారు. చేనేత పరిశ్రమలు, లోహ పరిశ్రమలు, చెప్పుల పరిశ్రమలు మీద సామ్రాజ్యవాదం బలంగా వేటువేసింది. ఈ కులవృత్తులవారు గ్రామాలలో వ్యవసాయ కూలీలుగా, పట్టణాలలో కార్మికులుగా మారి బతుకు బండిని బారంగా లాగుతున్నారు. ఇలా దేశంలో లక్షలాదిమంది ముస్లీంలు, ముస్లీమేతరులు చేతివృత్తులను కోల్పోయి రోడ్డున పడ్డారు. ఒకచోట పని దొరకకపోతే మరొక చోటుకి వెళ్ళవచ్చు. బతుకు భారాన్ని నడిపే కులవృత్తులే ధ్వంసమైతే ఎలా అని కవి ప్రశ్నిస్తున్నాడు. ముస్లీం మైనారిటీ సాహిత్యంలో ప్రపంచీకరణ కవిత్వానికి బలమైన గొంతుక ఖాజా. ఈ కవి రచించిన 'నరం తెగిన కవాను' అందుకు ఒక నిదర్శనం.

నైపుణ్యం నిండిన నా చేతివేళ్ళమీద
ఒక విదేశీ ఫోమ్ పాదం నాడా బూట్లతో నృత్యం చేస్తున్నది
పగలని పత్తికాయలా
నా కవాను తీగల్లో ఒక అత్యాధునిక అపశృతి
పంటికింద పలుకురాయిలా తగులుతుంది. ( ఖాజా –నరం తెగిన కవాను )

వివిధ రంగాల్లో తరతరాల నుంచి చేస్తున్న కులవృత్తులన్నింటినీ ఒక్కసారిగా సామ్రాజ్యవాద దేశాలు ముస్లీం దూదేకుల 'కాయర్' పరిశ్రమలను ఉక్కుపాదాలతో తొక్కి వారి ఆత్మస్థైర్యాన్ని కుదేల్ మనిపించాయి. సామ్రాజ్యవాదుల గుత్తాధిపత్యం వలన దళితులు, బహుజనులు, ముస్లింలు, బడుగు బలహీన వర్గాలు తమతమ కులవృత్తులను కోల్పోతున్నారు. ప్రపంచీకరణ ప్రభావం వలన ముస్లీంలు ప్రపంచానికి దగ్గరై, ఆర్థికంగా చితికిపోయారు. ఈ వెనుకబాటుతనం వలన ముస్లిం సమాజం విద్య, ఉద్యోగ, వైద్యం, ఉపాధి వంటి రంగాలలో మరింతగా వెనక్కి నెట్టివెయ్యబడ్డారని కవి ఆవేదన చెందుతున్నాడు. గ్లోబల్ మార్కెట్లో ఈ రోజున ప్రతి వినియోగదారుడూ ఒక సరుకైపోతున్నాడు. ఎవరెవరికో అమ్ముడుపోతున్నాడు. ఈ ఛిద్రాన్ని అఫ్సర్ 'వలస' అనే కవితలో పదునుగా చిత్రించాడు.

అమ్ముడు పోతున్నాం
నిలువునా
ఎవరెవరి సంతకాల పైనో
వస్తువుల పట్టిక
అయిపోతున్నాం

మార్కెట్లో అంతా
ప్రెషగా ఉండాలి ( అఫ్సర్ – వలస )

ప్రపంచీకరణ వలన సమాజంలో ఉండే మానవ సంబంధాలు అన్నీ దెబ్బ తింటున్నాయి. అవి రోజు రోజుకూ కనుమరుగవుతున్నాయి. నేడు మనుషుల మధ్య ఆత్మీయ విలువలు తగ్గిపోయి, వారి కళలు, కన్నీళ్లు, బాధలు, కోరికలు, ఆలోచనలు అన్నీ ఈనాడు వస్తువులైపోతున్నాయి. మనుషులు సమాజ నైజాన్ని కోల్పోతున్నారన్న కవి ఆవేదన ఈ ఖండికలో ఆవిష్కృతమైంది.ముస్లీంల జీవితం మీద, వృత్తుల మీద, చిన్న చిన్న వ్యాపారాల మీద గుదిబండై వారి జీవితాన్ని ప్రశ్నార్థకంగా నిలిచిన ప్రపంచీకరణ దుష్పరిణామాలను ముస్లీం మైనారిటీవాద కవిత్వంలో మరికొన్ని ఖండికల్లోనూ చూడగలం. ఇంకా ముస్లిం మైనారిటీవాద కవులు హిందూ ముస్లిం సమైక్యత, విద్య రిజర్వేషన్లు, బాలల సమస్యలు, అమ్మ నాన్నలు మొదలగు వస్తువులపై కవిత్వాన్ని రాశారు.

భారతీయ ముస్లిం జీవితాలను వ్యక్తపరచడంలో ముస్లింవాద, ఇస్లాంవాద కవుల కృషి మెచ్చుకోదగినది. కానీ! ముస్లిం వాదం, ఇస్లాంవాదం అనే రెండు రకాల పేర్లతో రాయడం అనేది తెలుగు సాహితీ లోకానికి గందరగోళానికి గురిచేస్తున్నారు. కొంతమంది సాహితీపరులు ఈ ముస్లిం వాదం, ఇస్లాంవాదం ఏంటి.? ఇరువురు రాసిన కవిత్వం కూడా ముస్లిం జీవితాలను వాస్తవికతో చక్కగా ప్రతిబింబింపజేస్తున్నది కదా మరేందుకు ఇటువంటి పేర్లు అని చెప్పేవారును లేకపోలేదు. అయితే ఇక్కడ ఒక విషయం చెప్పాలి. సాహిత్యం అంటే ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా నిక్కచ్చిగా వ్యక్తపరచడం. ఇక్కడ ఇరువురూ కవులు ఒక మతానికి సంబంధించిన అంశాల దగ్గర ఒకరికి ఒకరికి పడక ఇలా రెండు వర్గాలుగా విడిపోయారు. ముస్లింవాద కవిత్వం మతానికి సంబంధించిన విషయాలను కూడా లాగిపెట్టి అంతర్గతంగా బహిర్గతంగా వ్యక్తపరిచింది. ఇస్లాం వాదం మతానికి సంబంధించిన అంశాలను సున్నితంగా ప్రశ్నించడం అప్పటి కవిత్వంలో చూడవచ్చు. కానీ నేటి కవిత్వంలో వీరు ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా కుండబద్దలు కొట్టినట్లుగా వ్యక్తం చేస్తున్నారు. అయితే ఇక్కడ ఇరు వర్గాలవారు ఒక విషయాన్ని గుర్తించాలి. మతాచారాలు సమాజాన్ని ముందుకు నడిపించేవిధంగా ఉంటే వాటిని శిరసా వహించాలి. ఒకవేళ సమాజాన్ని వెనక్కినెట్టి తొక్కేస్తుంటే అటువంటి మతాచారాలను మనమే తొక్కేయాలి. ఇరువురు కలిసి రచనలు చేస్తే ముస్లిం మైనారిటీ సాహిత్యానికి మరింత బలాన్ని చేకూర్చిన వారవుతారు. ముఖ్యంగా తెలుగు అస్తిత్వ సాహిత్యానికి కొండంత బలాన్ని కలిగించిన వారవుతారు.

# ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమాలు - తెలుగు కవిత్వం



డా. సుంకిరెడ్డి నారాయణరెడ్డి
80745 23344

స్త్రీ, దళిత బహుజన, ముస్లిం, ప్రాంతీయ ఐడెంటిటీ ఉద్యమాలను అస్తిత్వ ఉద్యమాలని, అస్తిత్వ వాదాలని అంటున్నాం. కాని 'అస్తిత్వవాదం' అనే పదబంధం 1950, 60ల నుంచీ Existentialism అనే పదానికి సమానార్థకంగా వ్యవహారంలో ఉంది. భూస్వామ్య వ్యవస్థ స్థానంలో పెట్టుబడీదారీ వ్యవస్థ ఆవిర్భవిస్తున్న క్రమంలో, అంతవరకు కులం, మతం లాంటి సామూహిక గుర్తింపు మాత్రమే ఉన్న మనిషికి వికాసోద్యమంలో భాగంగా, మానవవాద ఉద్యమంలో భాగంగా 'వ్యక్తివాదం'లో భాగంగా విడి వ్యక్తిగా గుర్తింపు లభించింది. ఈ గుర్తింపు కోసం సాగిన ఘర్షణ, ఈ గుర్తింపు వలన వచ్చిపడిన భారం - పెట్టుబడిదారీ వ్యవస్థ స్థిరపడిన క్రమంలో, తిరిగి వ్యక్తి తన ఉనికిని కోల్పోతూ తన ఇచ్ఛను కోల్పోతూ, మరల మరగా మారుతున్న క్రమంలో వ్యక్తి తన చుట్టూ ఉన్న ఆవరణంతో పడిన ఘర్షణ, తన వ్యక్తిత్వాన్ని, ఉనికిని, స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను, అస్వేచ్ఛను ముఖ్యంగా ఇచ్ఛను నిలబెట్టుకోవడానికి పడిన తపన 'అస్తిత్వవాదం'గా వ్యవహారంలోకి వచ్చింది.

వ్యక్తి వేదనను, తపనను, ఒక సమూహానికి అంటే ఒక కులానికి, లింగానికి, మతానికి, ప్రాంతానికి అనువర్తింపజేసి వీటికి సంబంధించిన వాటిని అస్తిత్వ ఉద్యమాలని, అస్తిత్వ వాదాలని అంటున్నాం. ఏదైనా ఒక సమూహం (కులం, జెండర్, మతం, ప్రాంతం) తన అస్తిత్వానికి ఉనికికి, తన గౌరవానికి భంగం వాటిల్లుతున్నప్పుడు, ప్రమాదం సమీపించినప్పుడు తను వేసే కేకే అస్తిత్వవాదం. ఆ కేక వర్తమానం నుంచి ప్రారంభమై గతంలోకి వెళ్తుంది. ఆ పునాదిని ఆవిష్కరించుకొని, కాలుకింద పిల్లర్‌ను బేస్‌గా చేసుకొని తిరిగి వర్తమానంలోకి వస్తుంది. అక్కడ నిలబడి భవిష్యత్తులోకి చూస్తుంది. ఈ మొత్తం ప్రక్రియ

సామూహిక అస్తిత్వ వేదన. ఈ నేపథ్యంలో వివిధ ప్రాంతాల అస్తిత్వ సోయిని, చేతనను, ఉద్యమాన్ని తెలుగు కవిత్వం ఎట్లా పట్టుకుందో పరిశీలించటం ఈ వ్యాస ఉద్దేశం.

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ పేరుకు ఒకే రాష్ట్రమైనా వైవిధ్య పూరితమైన నాలుగు ప్రాంతాల కలయిక అనే విషయం అందరికీ తెలిసిందే. అవి ఉత్తరాంధ్ర, కోస్తాంధ్ర, తెలంగాణ, రాయలసీమ. భౌగోళిక సరిహద్దులు, భాష, సంస్కృతి, ఆర్థిక స్థితిగతులు, చాలా కాలం విడి రాజ్యాలుగా ఉండటం అనే అంశాలు ఈ ప్రాంతాల చారిత్రక ప్రత్యేక అస్తిత్వానికి హేతువులు.

> కవిత్వం ప్రపంచానికి సంబంధించిన సాధారణీకరల్ని ప్రతిబింబించడమే కాక నిర్దిష్టతను కూడా ప్రతిబింబిస్తుంది. అందులో భాగంగా కవి తన ప్రాంత, కుల, మత, వర్గ సమస్యల్ని ప్రతిబింబిస్తాడు.

కవిత్వం ప్రపంచానికి సంబంధించిన సాధారణీకరల్ని ప్రతిబింబించడమే కాక నిర్దిష్టతను కూడా ప్రతిబింబిస్తుంది. అందులో భాగంగా కవి తన ప్రాంత, కుల, మత, వర్గ సమస్యల్ని ప్రతిబింబిస్తాడు. అందులో భాగంగానే వివిధ అస్తిత్వ ఉద్యమాలు వచ్చాయి. ఆయా అస్తిత్వాల తక్షణ సమస్యలు అసలు కారణం కాగా ఇన్నాళ్ళు విస్మృతికి గురైన ఉపశ్రేణుల చరిత్ర బయటకు రావాల్సి వుందని చెప్పిన సబాల్టర్న్ స్టడీస్, రీజినల్ స్టడీస్ ఈ అస్తిత్వ ఉద్యమాలకు దోహదాన్ని కలుగజేశాయి. ఎవరి అనుభవాన్ని వారు వ్యక్తీకరించుకోవాలని చెప్పిన పోస్ట్ మోడర్నిజం తాత్విక, సైద్ధాంతిక నేపథ్యాన్ని అందించింది. పెట్టుబడిదారీ శ్రమదోపిడీ మీద దృష్టి కేంద్రీకరించడం వల్ల స్త్రీల సమస్యలు, నల్లజాతి ప్రజల సమస్యలు, కుల అణచివేతకు గురయ్యే దళితుల సమస్యలు, ఆదివాసుల సమస్యలు మొదలయినవి ఏవిధంగా కనిపించకుండా పోయాయో పోస్ట్ మోడర్నిజం చూపిస్తుందని బాలగోపాల్ అన్నారు. ఇట్లా విస్మరణకు గురైన ఈ సమస్యలలో ప్రాంతీయ సమస్యలు కూడా ఉన్నవి.

వీటితో పాటు పోస్ట్ మోడర్నిజంలో భాగమైన నిర్మాణవాదం కూడా దోహదం చేసింది. ఈ సందర్భంగా నిర్మాణవాదం ఏమన్నదో తెలుసుకోవాలి. అంతిమమైన

అర్థం లేదని చెప్పడం ద్వారా నిర్మాణవాదం ఇంతవరకూ జరిగిన సహజ విశ్లేషణ తుది విశ్లేషణ కాదని, ఈ విశ్లేషణ తిరిగి మదింపు చేయాలనే ఆలోచన నిచ్చింది. ఇది అన్ని అస్తిత్వోద్యమాలతో పాటు అనేక కొత్త ఉద్యమాలకు, కొత్త ఆలోచనలకు తావు నిచ్చింది. ఒక వాచకానికి అనేక వ్యాఖ్యానాలు రావడం దోహదం చేసింది.

పురుషుడు - స్త్రీ లాంటి విరుద్ధ ద్వంద్వాలను పేర్కొని "Derrida Suggests these oppositions are hierarchies in miniature containing one term that western culture views as positive or superior and another considered negative or inferior. Through deconstruction, Derrida aims to erase the boundary between binary oppositions and to do so in such away that the hierarchy implied by the oppositions thrown into question" అని అంటాడు ప్రముఖ నిర్మాణవాది Hills miller. అంటే పాశ్చాత్య సంస్కృతి ఉన్నతమైనదిగానూ, సవ్యమైనదిగానూ ఇతర సంస్కృతులు అధమమైనవిగానూ భావించే సూక్ష్మరూప ఆధిపత్య నిర్మాణమే (Hierarchy) పురుషుడు - స్త్రీ, తెల్లజాతి - నల్లజాతి లాంటి విరుద్ధ ద్వంద్వాలని డెరీడా సూచిస్తాడని ఈ ద్వంద్వాలు సూచన చేస్తున్న ఆధిపత్య నిర్మాణాన్ని సందిగ్ధంలో పడేసే విధంగా ఆ విరుద్ధ ద్వంద్వాల మధ్యనున్న హద్దులను చెరిపేయడమే డెరీడా ధ్యేయం అని ఇక్కడ ఆయన వివరించాడు. ఈ విరుద్ధ ద్వంద్వ నిరాకరణ అనేది పురుషుడు - స్త్రీ, అగ్రవర్ణం - కిందివర్ణం, మెజారిటీమతం - మైనారిటీమతం, అభివృద్ధిచెందిన ప్రాంతాలు - వెనుకబడిన ప్రాంతాలు అనే ద్వంద్వాల్లో మొదటి శ్రేణుల ఆధిపత్యాన్ని తిరస్కరించి రెండవ శ్రేణులు తమ అస్తిత్వాన్ని Assert చేసుకోవటానికి, ఆత్మగౌరవాన్ని ప్రకటించుకోవటానికి ఒకానొక తావు కల్పించింది.

ఈ నిర్మాణ వాదులు దేవుడు, సత్యం, అహం, ఏకార్థం అనే అఖండ కేంద్రాల స్థానంలో సాపేక్షత బహుళత్వం మొదలైనవాటిని ముందుకు తెచ్చారు. ఈ 'ఏకకేంద్రక' సిద్ధాంత ఫలితంగానే ఐరోపా దృక్కోణకేంద్ర చరిత్ర నిర్మాణానికి భిన్నంగా దక్షిణాసియా చరిత్ర పునర్నిర్మాణ ప్రయత్నంలో సబాల్టర్న అధ్యయనం ఆవిర్భవించింది. ఒక అంశాన్ని కేంద్రంగా చేయడం వల్ల దీని దృష్ట్యాన్నే మిగతావాటిని నిర్వచించడం జరిగింది. యూరప్ కేంద్రంగా తూర్పు దేశాలను నిర్వచించడం అందువల్లనే జరిగింది. హిందూ సంస్కృతి కేంద్రం నుండి ముస్లిం సంస్కృతి హేళన చేయడం, అగ్రవర్ణ సంస్కృతి కేంద్రం నుండి కింది వర్ణాలను నిర్వచించడం అందువల్లనే. అదేవిధంగా ఆంధ్ర సాహిత్యాన్నే కేంద్రంగా

చేయడం వల్ల దానిని దృష్టిలో ఉంచుకుని తెలంగాణలో కవులు లేరని, తెలంగాణ, రాయలసీమల కవిత్వం వెనుకబడిందని నిర్వచించారు. కోస్తాంధ్ర భాషను కేంద్రం చేసి తెలంగాణ, రాయలసీమ, ఉత్తరాంధ్ర భాషలను అవహేళన చేసినారు. కోస్తాంధ్ర సాహిత్యాన్ని, చరిత్రను ముఖ్యంగా సంస్కృతిని కేంద్రంగా చేసుకుని తెలంగాణ, రాయలసీమ, ఉత్తరాంధ్ర సంస్కృతుల్ని నిర్వచించడాన్ని ఇక్కడ గమనించాలి. ఆ కేంద్రక భావనను తిరస్కరించిన తర్వాత మాత్రమే ఈ ప్రాంతాలు స్వతంత్రనీ గుర్తింపునీ పొందగలుగుతాయి. ఇది తెలంగాణ విషయంలో రుజువైంది కూడా. ఇది మిగతా ద్వంద్వాలకు కూడా వర్తిస్తుంది.

మార్జినలైజ్ అయిన అంశాన్ని కేంద్రం కాని అంశాన్ని ముందుకు తెచ్చినాడు డెరీడా. మరోక విమర్శకుడు గూడా ఇదే అభిప్రాయం చెప్పినాడు ఇలా "Another Deconstruction approach is to take what has heretofore seemed marginal and make it central" అంటే అప్రధానంగా అగుపించే అంశాన్ని తీసుకొని దాన్ని కేంద్ర అంశంగా చూపడం ఈ నిర్మాణ అధ్యయనపు మరొక పద్ధతి. బహుశా గ్రాంసీ ఆలోచనతో పాటు ఈ అప్రోచ్ సబాల్టర్న్ అధ్యయనానికి ప్రేరణనిచ్చి ఉంటాయి. ఈ పద్ధతి వల్లనే దళిత, స్త్రీ, ప్రాంతీయ అస్తిత్వవాదాలు ప్రాధాన్యతకు నోచుకున్నవి.

ఈ నేపథ్యంలో ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమాలను, వాటిని తెలుగు కవిత్వం ప్రతిబింబించిన తీరును తెలుసుకుందాం.

### రాయలసీమ అస్తిత్వ ఉద్యమ కవిత్వం :

ఉత్తరాన కృష్ణా, తుంగభద్ర నదులు నల్లమలలు, ఎర్రమలలు, శ్రీ పర్వత (శ్రీశైలం) సానువులు, అరణ్యాలు, పడమర వైపు కన్నడ ప్రాంతం, దక్షిణాన తమిళ ప్రాంతం, తూర్పున సముద్రం (తొలుత నెల్లూరు ఈ ప్రాంతంలో భాగంగానే పిలువబడేది. తర్వాత కోస్తాంధ్రలో భాగమయ్యింది) ఈ ప్రాంత ప్రత్యేకతను కొంతవరకు నిర్ధారించాయి. నెల్లూరు జిల్లా కోస్తాంధ్రలో భాగంగా మారిన తరువాత ఈ ప్రాంతానికి రాయలసీమ అనేపేరు వ్యవహారంలోకి వచ్చింది.

ఈ ప్రాంతం తొలిత మౌర్యుల సామ్రాజ్యంలో వుండేది. తరువాత కొంతభాగం, కొంతకాలం శాతవాహనుల రాజ్యంలో వుండేది. ఇక్ష్వాకుల కాలంలో హిరణ్యకులు ప్రస్తుతం కడప, కర్నూలు జిల్లాలుగా పిలువబడుతున్న ప్రాంతాలను పాలించినారు. ఇక్కడ దొరికిన శాసనాలను బట్టి 3,4 శతాబ్ధాల మధ్య పల్లవులు రాయలసీమలోని కొంత భాగాన్ని పాలించినారు. బాదామి చాళుక్యులు, కంచి పల్లవుల కాలంలో

(6,7 శతాబ్దాలు) రేనాటి చోళులు (500 - 850) రాయలసీమలో చాలాభాగాన్ని పాలించినారు. ఈ కాలం నుంచే ఈ ప్రాంతానికి 'రేనాడు' అనేపేరు వచ్చింది. ఈ వంశానికి చెందిన వివిధ శాఖల వాళ్ళు 11వ శతాబ్దం వరకు పాలించినారు. తర్వాత కేంద్రీకృత రాజ్యవ్యవస్థ పోయింది. రాష్ట్రకూట, దక్షిణ చోళ, కాకతీయ సామంతులుగా చిన్న చిన్న రాజ్యాలు ఉండినాయి. తదనంతరం విజయనగర సామ్రాజ్యంలో భాగంగా ఉండింది. ఆ తరువాత కుతుబ్‌షాహీలు, మైసూరు రాజులు, అసఫ్‌జాహీలు, మరాఠా రాజుల కాలంలో రాయలసీమ ఎవరి పాలనలో ఎంత ప్రాంతముండేదో చెప్పడం కష్టం. ఈ మధ్యలో ఎప్పుడో పాలెగాళ్ళ వ్యవస్థ వచ్చింది. "1790 - 1800 ప్రాంతంలో బ్రిటీష్ వారి ఆధీనంలోకి వచ్చింది. ఈ చరిత్రంతా ఎందుకంటే మొత్తం ఆంధ్ర ప్రాంతంలో కలువకుండా విడి రాజ్యంగా కొంతకాలముండడమనేది కూడా ఈ ప్రాంత ప్రత్యేకతను నిర్ధారించిందని చెప్పడానికే. ఇక్కడి భాష, సంస్కృతుల వైవిధ్యం, ఆర్థిక, సామాజిక పరిస్థితులు కూడా ఈ ప్రాంత ప్రత్యేకతలను నిర్ధారించాయి. ఇట్లా రూపొందిన రాయలసీమ పట్ల ఇక్కడి కవులకు గొప్ప గౌరవాభిమానాలున్నాయి.

ఏతపస్వి జీవించెను యీ మనోజ్ఞ
సీమ, పూజ్యమౌ రాయలసీమలోన....

ప్రకృతి మాధుర్యమొలుకు మా పల్లెలిచట (బెళ్ళూరి శ్రీనివాసమూర్తి) - అనీ

అచట నొకనాడు పండె ముత్యాల చాలు
అచటనొకప్పుడు నిండె కావ్యాల జల్లు
అచటనొకప్పుడు కురిసె భాష్యాల జల్లు
విరిసెనటనొకనాడు వేయంచుల విచ్చుకత్తి" (విద్వాన్ విశ్వం) అనీ
అప్పుడెప్పుడో నా సీమ
దేశానికే తల మానికమట" (ముని సుందరం) అనీ

రాయలసీమ రతనాల సీమ అనీ, ఇక్కడ రత్నాలను అంగళ్ళలో రాసులు పోసి అమ్మినారనీ, రాయలసీమ ప్రాశస్త్యాన్ని వేనోళ్ళ పొగిడినారు.

అయితే ఇదంతా గత వైభవం. ప్రస్తుత పరిస్థితి వేరు. ఇప్పుడది సమస్యల నిలయం. ఈ సమస్యలకు ఈ ప్రాంత భౌగోళిక స్థితి గతులకు తోడు రాజకీయ వివక్ష కూడా తోడైంది. ఇక్కడి రాజకీయ నేపథ్యాన్ని కొద్దిగా పరిశీలిద్దాం.

ఉమ్మడి మద్రాసు సంయుక్త రాష్ట్రంలో భాగంగా వున్న రాయలసీమ, కోస్తాంధ్ర

వాసులు ఆంధ్ర రాష్ట్ర సాధనకోసం 1913లో ఆంధ్ర మహాసభను ఏర్పాటు చేసుకున్నారు, ఉద్యమించారు. అయితే ఈ ఉద్యమం అంత సజావుగా సమైఖ్యంగా సాగలేదు. రాయలసీమ వారికి సర్కార్ జిల్లాల పట్ల (కోస్తాంధ్ర) మొదటి నుండి అనుమాన దృష్టి వుండేది. భాషా సంస్కృతులపరంగా తమను వీరు తక్కువగా చూస్తున్నారనే అనుమానం ఉండేది. అనంతపురంలో ఏర్పాటు చేస్తానన్న ఆంధ్ర విశ్వవిద్యాలయాన్ని విశాఖపట్నంలో ఏర్పాటు చేశారు. అంతేకాక రాయలసీమను ఆంధ్ర యూనివర్శిటి నుండి వేరుచేశారు. దీంతో సీమవాసులకు కోస్తాంధ్రమీద నమ్మకం పోయింది. 1931 జూన్‌లో జరిగిన ఆంధ్ర మహాసభలో పప్పూరి రామాచార్యులు అనే నాయకుడు చెన్నై రాజధాని నుండి ఆంధ్రరాష్ట్రం విడివడుట లాభకరమైనచో, ఆంధ్ర రాష్ట్రం నుండి రాయలసీమ విడువడుట మరింత లాభకరము కదా అన్నారు. అనడంతో ఊరుకోకుండా సీమకు జరుగుతున్న అన్యాయాలను చర్చించేందుకు, సీమ అవసరాలను పరిరక్షించేందుకు 1934లో రాయలసీమ మహాసభను ఏర్పాటు చేసి ప్రత్యేక రాయలసీమ రాష్ట్రం ఏర్పాటు గురించి చర్చించారు. ఈ సభలోనే టి.ఎన్. రామకృష్ణారెడ్డి అనే మరో నాయకుడు 'మేమొక వ్యక్తులమన్న గణన కూడా వారికి లేదు. వారికి లెక్కకురాము" అన్నాడు. 1937లో జరిగిన ప్రాంతీయ శాసన సభ ఎన్నికల్లో గెలిచి ప్రధానమంత్రి అయిన రాజగోపాలచారి అత్యున్నత పదవుల్లోకి ఒక్కరిని కూడా సీమ నుంచి తీసుకోలేదు. ఇది రెండు ప్రాంతాల మధ్య మరింత అగాధాన్ని పెంచింది. ఈ అనుమానాల్ని తీర్చడానికి, అగాధాల్ని తగ్గించడానికి 16 - 11 - 1937 లో చారిత్రాత్మకమైన శ్రీభాగ్ ఒడంబడిక జరిగింది. దీనిలో నాలుగు అంశాలున్నాయి. 1. సేద్యపు నీటి సౌకర్యాల విషయంలో సీమ అవసరాలు ముందు తీర్చాలి. 2. రాష్ట్ర పరిపాలనలో అన్ని జిల్లాలకు దాదాపు సమాన ప్రాతినిధ్యం వుండాలి. విశ్వవిద్యాలయం హైకోర్టుకు

ఉమ్మడి మద్రాసు సంయుక్త రాష్ట్రంలో భాగంగా వున్న రాయలసీమ, కోస్తాంధ్ర వాసులు ఆంధ్ర రాష్ట్ర సాధనకోసం 1913లో ఆంధ్ర మహాసభను ఏర్పాటు చేసుకున్నారు, ఉద్యమించారు. అయితే ఈ ఉద్యమం అంత సజావుగా సమైఖ్యంగా సాగలేదు.

సంబంధించినవి మిగతా రెండు అంశాలు. కాని ఈ ఒప్పందం అమలు కాలేదు. 1947 రాయలసీమ మహాసభలో నీలం సంజీవరెడ్డి ఈ విషయం ప్రస్తావించి ఆవేదన వెలిబుచ్చినారు. ఆ తరువాత 1953లో ఆంధ్రరాష్ట్రం, 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక కూడా శ్రీ బాగ్ ఒప్పందం అమలు కాలేదని, సీమ వెనుకబాటుకు గురైందని, అన్నిరంగాల్లో సీమ వివక్షకు గురౌతున్నదనీ సీమవాసులు అసంతృప్తితో ఉంటూ వచ్చారు. ఈ వివక్షకు కరువు కాటకాలు తోడయ్యాయి. రాయలసీమ ప్రజా జీవితం ఛిన్నాభిన్నమైంది. ఈ పరిస్థితి నుంచి బయటపడటానికి 1980వ దశకంలో రాయలసీమ చైతన్య ఉద్యమాలు మొదలయ్యాయి. పాదయాత్రలు సాగినాయి. సీమకరువు పెద్ద చర్చనీయాంశమైంది. కదలిక వంటి పత్రికలొచ్చాయి. సీమ సాహితి వంటి సంస్థలొచ్చినవి. డా. ఎం.వి. రమణారెడ్డి, భూమన్, వల్లంపాటి వెంకటసుబ్బయ్య, రాచపాలెం చంద్రశేఖర రెడ్డి, సింగమనేని నారాయణ వంటి అనేకమంది మేధావులు గ్రంథాలు రచించారు. వీరు కోస్తాంధ్రతో పోల్చి చూపి సీమ ఏయే రంగాల్లో వివక్షకు గురైందో తద్వారా ఎంత వెనుకబాటుకు లోనైందో గణాంకాలతో సహా విశ్లేషించారు. కరువుకు గల కారణాలను చర్చించినారు.

ఈ నేపథ్యంలో సీమ కవిత్వంలో ఆ ప్రాంత అస్తిత్వ ఉద్యమ ప్రతిఫలనాన్ని పరిశీలించాలి.

> 80వ దశకం కంటే ముందు కూడా సీమ కవిత్వంలో పరిగణించదగిన స్థాయిలో సీమ ప్రస్తావన కనిపిస్తుంది. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారి పెనుగొండలో సీమ గత వైభవ కీర్తిగానం వున్నది.

80వ దశకం కంటే ముందు కూడా సీమ కవిత్వంలో పరిగణించదగిన స్థాయిలో సీమ ప్రస్తావన కనిపిస్తుంది. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గారి పెనుగొండలో సీమ గత వైభవ కీర్తిగానం వున్నది. పుట్టపర్తి గారి 'పెనుగొండ లక్ష్మి' (1930) లో 'మేఘదూతం' లో సమకాలీన సీమ చైతన్యం చిత్రించబడినది. బళ్ళారి శ్రీనివాసమూర్తి 'తపోవనం' (1954) బైరపురెడ్డి నారాయణ రెడ్డి 'రాయలసీమ రైతు' (1976) పాలా వెంకటసుబ్బయ్య 'అనిల సందేశం' మన్నవ భాస్కరరాయుడి 'శ్వేత సూర్యోదయం' సుబ్రహ్మణ్యపిళ్ళై 'ఒక రాఘవరెడ్డి'

కుంటిమద్ది శేషశర్మ 'రామిరెడ్డి' మొదలైన కావ్యాలు సీమ కరువునూ, ఇతర జీవిత పార్శ్వాలను ఎంతో కొంత చిత్రించారు. వీటన్నింటికంటే మించినది విద్వాన్ విశ్వం గారి 'పెన్నేటిపాట' (1956) ఇది రాయలసీమకు ప్రాతినిధ్య కావ్యం. వల్లంపాటి వారి అభిప్రాయం ప్రకారం కవితావేశంతో 'పెన్నేటిపాట' 'మహాప్రస్థానా'నికి ధీటైన కావ్యం.

అదేపెన్న అదే పెన్న
నిదానించినడు
విదారించునెదన్
వట్టి ఎడారి తమ్ముడు....
ఏదీనీరు ఏదోహోరు
ఏదీనీటి జాలు"

అంటూ సాగే పెన్నేటిపాట రాయలసీమ గత వైభవాన్ని, ఆ ప్రాంత ప్రాశస్త్యాన్ని పెన్ననీటి వైశిష్ట్యాన్ని, అక్కడి కరువునీ కళ్ళకు కట్టినట్టు వర్ణించింది.

1980 దశకంలో సీమచైతన్య ఉద్యమాలు ప్రారంభమైన తర్వాత కొత్తతరం కవులు వచ్చినారు. సీమ వాస్తవికతను రచనలుగా మలచడం అధికమైంది. రాయలసీమ చరిత్రలో నూతనాధ్యాయం మొదలయ్యింది. కవులేకాక కథారచయితలు, మేధావులు కూడా సీమవేదనను కవిత్వంలో ఆవిష్కరించారు. రాయలసీమ జీవితమే ఇతివృత్తంగా జూపల్లి ప్రేంచంద్ 'ఆవేద' రఘుబాబు 'సంఘటిత స్పర్శ' పై. శ్రీరాములు 'జలగండం' అనే దీర్ఘకవితలు రాసినారు. ఈ రెండు దశాబ్దాల కాలంలో వచ్చిన కవుల లిస్టు చాలా పెద్దదే. కొంతమందిని పేర్కొంటాను. పులికంటి కృష్ణారెడ్డి, శాంతినారాయణ, ఎస్. మునిసుందరం, రాచపాలెం చంద్రశేఖరరెడ్డి, సూర్యసాగర్, శ్రీనివాసరెడ్డి, హెచ్. ఆర్. కె. దాదాహయత్, రాప్తాడు గోపాలకృష్ణ, వి.ఆర్. రాసాని, నరాల రామిరెడ్డి, సన్నపురెడ్డి వెంకట్రాం రెడ్డి, రాధేయ, శశిశ్రీ, సడ్లపల్లి చిదంబరరెడ్డి, మల్లెల నర్సింహమూర్తి, ఎస్. జయ, ఏ.ఎన్. దస్తగిరి, కె.ఎం.రాయుడు, గోపిని కరుణాకర్, నాగప్పగారి సుందర్రాజు, సుంకోజు దేవేంద్రాచారి, నూకా రాంప్రసాదరెడ్డి, జి. వెంకటకృష్ణ, శాంతికుమార్, ఎస్. రామచంద్ర, రాజారామ్, బిక్కికృష్ణ, షమీవుల్లా, నిర్మలారాణి, శశికళ, సాయిప్రసాద్ మొదలైనవారు.

ఇక ఈ కవులు రాయలసీమ అస్తిత్వాన్ని తమ కవిత్వంలో ఎట్లా పట్టుకున్నారో పరిశీలిద్దాం.

ఎదురుచూపుల ఎడారివాసులకు ఎండమావి
శ్రీబాగ్ ఒప్పందం
స్వార్థం పులుముకొని రంగులు మార్చే
రాజకీయ ఊసరవెల్లులు
అభివృద్ధికి వారసులై
మిమ్ము నిస్సహాయంగా గెంటేసినపుడు
ఒప్పందాలు నీటిమీద రాతలే
నెత్తురు కార్చేసీమ - నేల పగిలిన సీమ (ఏ.ఎన్)

రాయలసీమ అభివృద్ధికి మూలం కావలసిన శ్రీభాగ్ ఒప్పందంలో ప్రధానాంశం నదులపై ప్రాజెక్టులు నిర్మించడం. అది జరుగలేదని ఇక్కడ కవి ఆగ్రహిస్తాడు.

"నాగరికతలు నీళ్ళలోనే ప్రవహిస్తాయి
చరిత్రను ఏటి అలలే రాస్తాయి"

నీళ్ళ కారణంగానే, నీటి ప్రాజెక్టుల కారణంగానే కోస్తాంధ్ర నాగరిక ప్రాంతమైనందున అవి లేని కారణంగానే సీమ అనాగరికమైందని మునిసుందరరంగారంటున్నారు.

"గౌతమి, కృష్ణవేణులు సాగరంలో
పడి ఆత్మహత్యించికుంటున్నాయి"

రాయలసీమ కరువు సీమగా విసిరేసి నదులు వృధాగా సముద్రంలో కలుస్తున్న వైనాన్ని జూపల్లి ప్రేంచంద్ కవితాత్మకంగా చెప్పినాడు. నీటి ప్రాజెక్టులు కట్టని పాలకుల నిర్లక్ష్యాన్ని ఇక్కడ సూచిస్తున్నాడు. ఇక్కడి ఊర్ల పేర్లన్నింటి చివర సముద్రమే కాని సముద్రమెక్కడా లేదంటాడు మరోకవి.

"వానమాట విన్పిస్తే చాలు
చెవులు అలుగుల్ని సవరించుకునే చెరువులవుతున్నాయి"

అన్న సన్నపురెడ్డి వెంకట్రాంరెడ్డి, పై కవులూ ఇంకా చాలామంది కవులు వర్షధార ప్రాంతమైన సీమకు నీరెంత ముఖ్యమో, వాన ఎంత ప్రాణప్రదమో వివరంగా రాసినారు. పై శ్రీరాములు ఈ నీళ్ళమీదనే కావ్యం రాశాడు. ఇటు ప్రాజెక్టులు కట్టక, అటు చాలాకాలంగా వానలుపడక సీమ గిలగిల కొట్టుకుంటున్నది. ఈ స్థితిని కవులు హృదయవిదారకంగా చిత్రించినారు.

"రాజకీయ నెత్తుటి మడుగు అందులో దాహం తీర్చుకునే ప్రతిపులినీ అడుగూ డేగల రాజ్యంలో

కోయిల ఊసెక్కడిది
సీమ నిర్జల భూముల్లో
రైతు రాతి వాసన వేస్తాడు
నాగలి

ఆకలితో జచ్చిన పాముల్ల పడి ఉంటుంది. రాళ్ళమూనాగ్నిజ్వాలకు
అనువాదం నా కవిత్వం

అంటూ కరువును కవితాత్మకంగా చెప్పిన మల్లెల నరసింహమూర్తి వర్తమాన రాయలసీమ కవుల్లో ప్రముఖుడు.

నా సీమ వర్తమాన చరిత్ర
జీవరసం ఇంకిపోయిన మట్టి చరిత్ర
నేతల నిర్లక్ష్యపు చూపుల్లోంచి జారిన పాత్ర
అంటాడు రాధేయ
కాసంత వానపడదా - అని/
తోట్లో కాసుకుని కూకుండే
కాసిన పూత రాలిపోయే
వానికండ్లు మాత్రం కాయలు కాసే
అంటాడు సడ్లపల్లి చిదంబరంరెడ్డి.

"ఈ ఎడారిలో మొలిచే ప్రతి ఇసుక రేణువు చేజారిపోతున్న ఒక సంకటి ముద్దకు ఆనవాలు" అంటాడు దాదాహయత్.

"నాన్నను ఆశపెట్టిని బావి
ఇప్పుడు నిన్ను మోసం చేస్తుందా తమ్ముడూ"
అంటున్నది ఎస్. విజయ.
"రాయలసీమ మా తల్లి.... పది మట్లబావులు కూడా
బావురుమంటున్న వెత నీది
సుగ్గిలో కూడా ఆకలి తీరని అభాగ్యం నీది
అంటాడు సూర్యసాగర్.
"రుతువులెన్నైనా మా రాళ్ళసీమకు ఒకే రుతువు
కరువు రుతువు కాలాలెన్నైనా మా బీళ్ళ సీమకు ఒకే కాలం
ఎండాకాలం" అంటాడు పై శ్రీరాములు.

"సేద్యం జూదమైపోయింది
మా అమ్మ మెడలోని తాళిబొట్టు పసుపు కొమ్మైంది....
మా తాత బస్టాండులో బిచ్చగాడైపోతున్నాడు"
అంటాడు గోపిని కరుణాకర్.
"ఇక్కడ నీళ్ళు లేవు
కన్నీళ్ళు లేవు
సిరిసంపదలు లేవు
చలువ పందిళ్ళులేవు
తరాల బండరాళ్ళవలె
మొండి బ్రతుకులున్నాయ్"
అంటాడు మునిసుందరం.

"కడుపులో ఆకలిని డప్పు అంచుతో అణచి పెడుతున్నట్టు పొట్టకు హత్తుకొని డప్పు వాయిస్తున్నాడు" అంటాడు వి.ఆర్. రాసాని.

"పురితాడు పేనిన పత్తి
పురుగుమందు తాపిన వుల్లిగడ్డ
బతుకులా బజారుపాలైన
రేటు పలకని టమోటా....

వూడలు దిగని వేరుశెనగ

బోరులో పడ్డ బాల్యంలా వుక్కిరి బిక్కిరి చేసి చంపుతున్నది

సేద్యం బతుకు సీమ రైతును ఆదుకోని ప్రతిపంటా మృత్యు హస్తం కావటాన్ని బలంగా చెబుతాడు జి. వెంకటకృష్ణ.

1998 నుండి మొదలై వేలాది మంది రైతులు ఆత్మహత్య చేసుకున్న వాస్తవానికి వ్యక్తీకరణ ఈ పంక్తులు.

ప్రాజెక్టులు కట్టక, వానలు గురవక కరువులో తల్లడమల్లడమైన రైతులు తమ ప్రాణంలో ప్రాణమైన పశువుల్ని, తమకు జీవనాధారమైన పశువుల్ని కబేళాలకు తెగనమ్మిన దృశ్యాన్ని ఇక్కడి కవులు కళ్ళకు కట్టినారు.

"బతుకు అప్పుల పాలై

కండ్ల బావుల్లో కన్నీరుబకతా వుండాది

తల్లి పాలకు నోసుకోని నీకు పాలిచ్చి

నీ ప్రాణాలను నిలబెట్టిన పెద్దావు

బర్రెముకలు బయటపడి

నీ ఫోటో కల్ల జూస్తా పాణిమిడిసిందిరా...." అని తండ్రి గోపినికి రాసినమాటలు

"తడారిన గొంతుతో నేనూ నేల

గడ్డి కోసమని కసాయి వాని వెంట నడిచిన పశువులు"

అన్న నూకా రాంప్రసాద్రెడ్డి మాటలు కరువుసీమ మనుషుల్నే కాదు పశువుల్నీ ఎట్లా తరిగిందో తరిమిందో చెబుతాయి. కవులు ఈ దృశ్యాల్ని చిత్రించకపోతే లోకానికెలా తెలుస్తుంది. సీమ అంటే లోకానికి ఒకనాటి రతనాల సీమో, ఇప్పటి బాంబుల సీమో అనేదే తెలిసివుండేది. అందుకని కవి ఆయా కాలాన్ని రికార్డ్ చేసే చరిత్రకారుడు కూడా.

"మాకు / కరువు చావుకన్నా

ఆకలి చావు కన్నా

వరదచావు ఎంతో సుఖమనిపిస్తుంది"

అన్న రాచపాళెం కవిత్వంలో లోతైన అర్థముంది. వరద చావు క్షణాల్లో జరిగి

పోతుంది. యాతన వుండదు. పైగా సానుభూతిని సంపాదిస్తుంది. మిగిలినవాళ్ళకైనా వరద సహాయ నిధులు అందుతాయి. లోకం అయ్యో అంటుంది. కాని కరువు చావు నవిసిన రోగిల మెల్లమెల్లగా చంపుతుంది. లోకం దృష్టినీ, సానుభూతినీ, నిధుల్నీ ఆకర్షించదు. ఎప్పుడు వరదలు వచ్చినా ప్రభుత్వం ఉద్యోగుల్నుండి వరద సహాయం ఒక రోజు జీతం వసూలు చేసి వాళ్ళకు పంపిస్తుంది. కాని కరువు సహాయంగా ఎప్పుడన్నా చేసిందా? రెండూ చావులే, కాని సీమ చావులు ఆదరణ పొందని చావులు.

రాయలసీమలోని మరొక ముఖ్య సమస్య ఫ్యాక్షనిజం. శతాబ్దాల కింద ఏర్పడిన పాలెగాళ్ళ వ్యవస్థ స్థానంలో ఆధునిక ప్రజాస్వామిక విలువలు రాకపోవడం కూడా దీనికి కారణం. ఈ సమస్య నుంచి సీమకవులు సరియైన రీతిలో స్పందించారు.

"ఇక్కడ విత్తనాలు చల్లినా
మొలిచేది కొడవళ్ళు, గొడ్డళ్ళు
ఇక్కడ
రేపటి బిడ్డ పలికేది
బి ఫర్ బుక్కు కాదు
బి ఫర్ బాంబు"

అన్న రాచపాలెం మాటల్లో "పిల్లలు దాగుడుమూతలాడుకోను వీల్లేదు గోడలమాటున గుసగుసలాడుతుంటాయి నాటు బాంబులు" అని ప్రొ.శ్రీనివాసరెడ్డి వాక్యాల్లోనూ ఫ్యాక్షనిజం పట్ల అసహనం ఆగ్రహం కన్పిస్తుంది.

రాయలసీమ భాషను కథా రచయితలు పట్టుకున్నట్లుగా కవులు పట్టుకోలేదు. కవిత్వంలో అక్కడక్కడ మాత్రమే ఆ భాష కన్పిస్తుంది. ఒకటి రెండు ఉదాహరణలు చూద్దాం.....

"సిన్నోడికి పాలు బడదామంటె

ఆలి చన్నులు వడబారి యాలబడినాయి
అమ్మ కడుపుకాడ సెర్మం బీడు బడిన నేల మాదిరి గుండాది....
వాన కురిసె.... పల్లె తడిసె కాల్వలు పద్దాలు పాడ్తే....

పైన గడిమోడమొస్నే నా ఆలికి సీరగా సుట్టుదామని కాసుక్కూచునుండా వాన వస్తదో రాదో" అన్న మహమూద్ కవితలోనూ....

"ధాన్యం తూర్పేయడానికి.... దడాన కానీండ్రా...
తూర్పేసారు, మూటలు నింపారు.....
కొట్టడీ యిల్లు భర్తీ చేశారు......
అబ్బబ్బ ఒళ్ళంత నొప్పులు పై కావువత్తు కుంటుందేమో...
రెండు పిచ్చల చింతపండుని
రెండు ఉప్పురాళ్ళి....

అన్న దస్తగిరి కవితల్లోనూ ఇంకా గోపిని వంటి కవుల కవితల్లోనూ సీమ భాషను చూడవచ్చు. కోస్తాంధ్రులు తమ భాషను సంస్కృతిని తక్కువ చూస్తున్నారని 1931లోనే గమనించిన సీమవాసులు తమ భాష పట్ల అభిమానం పెంచుకోలేందుకో తెలియదు. సీమలోని దారిద్ర్యానికి, కరువుకు, వివిధ రంగాల వెనుకబాటుకు ప్రత్యేక రాష్ట్రమే పరిష్కారంగా వాళ్ళు భావించలేదు. వాళ్ళ అసంతృప్తిని అసహనాన్ని ఆగ్రహాన్ని రాజకీయాల మీద ప్రదర్శించినారు. ఈ కింది కవితలు ఆ విషయాన్ని తెలుపుతున్నది.

"మమ్ము / పీనుగులను చేసి ఆడుకునే శత్రువులు ఇద్దరే ఇద్దరు (ఒకరు కరువు రక్కసి మరొకరు రాజకీయ వ్యూహం" రఘుబాబు. "ఐదేండ్లకు ఒకసారి ఆవులించే విమోచన సమితి అడ్డపంచకింద అణుబాంబులు భద్రపరిచింది" - నాగప్పగారి సుందర్రాజు.

"పదవి ఊడిన వాడి నోట సీమ బాదల బోసిపాట నా లోపల నేను పెను వికటహాసమవుతాను" - హెచ్. ఆర్. కె (హనుమంతరెడ్డి)

అక్కడక్కడ కవులు తిరుగుబాటును ఆశించారు. ఉదా.

"తాను నాటే ప్రతి గింజమీద
గిట్టుబాటు ధరముద్రించకపోతే
ఆధునిక దోపిడి అందమైన ముఖాన్ని
ఖండఖండాలుగా చీల్చేందుకు
నాగలి మొన నూరుతున్న వీరుడు"

ఇదీ సంక్షిప్త రాయలసీమ ప్రాంత అస్తిత్వ కవిత్వం.

ఉత్తరాంధ్ర ప్రాంతీయ అస్తిత్వ కవిత్వం:

శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం జిల్లాలతో ఉన్న ఈ ప్రాంతానికి కళింగసీమ, కళింగాంధ్ర, ఉత్కళం అనే పేర్లు కూడా వున్నాయి.

"ఈ ప్రాంతం ఎటుచూసినా కోస్తా జిల్లాల్లో భాగం కాజాలదనీ, ఉత్తరాంధ్ర ఒక ప్రత్యేకమైన తెలుగుజాతి అనీ ఈ ప్రాంత ప్రభావాన్ని తెలుసుకోవాలంటే కళింగాంధ్రగా అర్థం చేసుకుంటేనే మంచిదనీ ఉత్తరాన తామ్రలిపి (మిడ్నాపూర్) నుండి పశ్చిమాన బస్తర్, దక్షిణాన గోదావరి తూర్పున బంగాళాఖాతం వరకు విస్తరించిన ఈ ప్రాంతం అతి ప్రాచీన నాగరికత గలదనీ" ఆ ప్రాంత మేధావులు (ఉత్తరాంధ్ర - డిసెంబర్ 1999 సంచిక) అభిప్రాయపడుతున్నారు.

> "అయితే ఒకప్పటి కళింగాంధ్రలోని తూర్పు గోదావరి ఒరిస్సాలో కలిసిన కొన్ని ప్రాంతాలు ఇప్పుడు ఉత్తరాంధ్రగా పిలువబడుతున్న ప్రాంతాలలో లేనందున ఈ ప్రాంతాన్ని కళింగాంధ్రగా పిలువడం కంటే ఉత్తరాంధ్రగా పిలువడమే సబబు."

అయితే ఒకప్పటి కళింగాంధ్రలోని తూర్పు గోదావరి ఒరిస్సాలో కలిసిన కొన్ని ప్రాంతాలు ఇప్పుడు ఉత్తరాంధ్రగా పిలువబడుతున్న ప్రాంతాలలో లేనందున ఈ ప్రాంతాన్ని కళింగాంధ్రగా పిలువడం కంటే ఉత్తరాంధ్రగా పిలువడమే సబబు. బౌద్ధ వాంగ్మయం ప్రకారం క్రీ.పూ. 6వ శతాబ్దం నాటికే కోసల - తోసల, కళింగ - తెలింగ జంట రాజ్యాలలో ఒక రాజ్యంగా పేరుకెక్కింది. క్రీ.పూ 3వ శతాబ్దంలో ఈ ప్రాంతాన్ని పాలించిన ఖారవేలుడు తొలి చారిత్రక పురుషుడు. పైన పేర్కొన్న సరిహద్దులకు కొంత అటూ ఇటూ ఉత్తరాంధ్ర క్రీ.శ. 497 నుండి 1434 వరకు కళింగ గాంగుల పాలనలో (సుమారు 10 శతాబ్దాల కాలం) ఉంది. కళింగ గజపతుల పాలనలో క్రీ.శ 1434 నుండి 1538 వరకు ఉంది. మిగతాకాలం, మిగతా తెలుగు ప్రాంతాలలోని కొన్ని ప్రాంతాలతో కలిపి కొంతకాలం, ఒరిస్సా భూభాగాలతో కలిసి కొంతకాలం వేరు వేరు రాజుల పాలనలో ఉంది. పైన పేర్కొన్న సరిహద్దుల కారణంగానూ, పైన పేర్కొన్న సుదీర్ఘపాలనా కాలం కారణంగానూ ఈ ప్రాంతం భిన్న సంస్కృతిని, భిన్న మాండలికాన్ని, భిన్న చరిత్రను కలిగి ఉంది.

తరువాతి కాలంలో కోస్తా జిల్లాలతో పాటు నిజాం నుంచి ఈ ప్రాంతం 1768లో బ్రిటీషర్ల ఆధీనంలోకి వచ్చింది. 1930లో ఒరిస్సా రాష్ట్రం ఏర్పడేదాకా ఈ ప్రాంతం గంజాం జిల్లాలో భాగంగా ఉండేది. 1930 నుంచి ఉత్తర, దక్షిణ విశాఖలుగా పిలువబడింది. 1946 - 47లో విశాఖ నుండి శ్రీకాకుళం జిల్లా ఏర్పడింది. తరువాత విజయనగరం జిల్లా ఏర్పడింది. స్థూలంగా ఇదీ ఉత్తరాంధ్ర చరిత్ర. "బ్రిటీష్ ఆధిపత్యంలోకి వెళ్ళి సర్కారు జిల్లాలుగా ఉన్నప్పటికీ ఆ సంప్రదాయాలు, సంస్కృతిని అంటించుకోలేదు. కళింగ ప్రజలు తమ సంస్కృతినే కొనసాగిస్తూ వచ్చారు. నేటివరకూ ఎలాంటి ప్రభావం (ఆ సంస్కృతి) చూపలేకపోయింది" అని ఆ ప్రాంత మేధావులు విశ్లేషించారు. దీన్ని బట్టి ఆ ప్రాంతం ప్రాచీన కాలంలోనే కాక ఆధునిక కాలంలో కూడా విభిన్న సంస్కృతిని కలిగి ఉందనేది అర్థమవుతుంది.

> తరువాతి కాలంలో కోస్తా జిల్లాలతో పాటు నిజాం నుంచి ఈ ప్రాంతం 1768లో బ్రిటీషర్ల ఆధీనంలోకి వచ్చింది. 1930లో ఒరిస్సా రాష్ట్రం ఏర్పడేదాకా ఈ ప్రాంతం గంజాం జిల్లాలో భాగంగా ఉండేది.

ఆంధ్ర రాష్ట్ర సాధన ఉద్యమంలో ఈ ప్రాంత ప్రజలు పాల్గొన్నా శ్రీభాగ్ ఒడంబడికలో ఈ ప్రాంత వెనుకబాటుతనం ప్రస్తావన లేదనీ, ఆంధ్రప్రదేశ ఏర్పాటు సమయంలో జరిగిన పెద్దమనుషుల ఒప్పందంలో ఈ ప్రాంత నాయకుడు గౌతులచ్చన్న సంతకం చేసినా ఈ ప్రాంత వెనుకబాటు గురించి ప్రస్తావించలేదనీ, ఈ రెండు ఒప్పందాలతో మధ్య కోస్తా నాయకుల పథకం ప్రకారం మిగతా వెనుకబడిన ప్రాంతాలతో పాటు ఉత్తరాంధ్రను మోసం చేశారని ఈ ప్రాంత మేధావులు అభిప్రాయపడుతున్నారు.

ఈ ప్రాంతంలో వంశధార, నాగావళి, బహుదా, మహేంద్రతనయ, జంఝావతి మొదలైన 15 నదులున్నా, వర్షపాతం ఎక్కువగానే వున్నా, తక్కువ నదులున్న గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరి జిల్లాలతో పోల్చితే ఇక్కడ నీటి పారుదల భూముల శాతం చాలా తక్కువనీ, పరిశ్రమల స్థాపన, వైద్య సదుపాయం, విద్యా సంస్థల స్థాపన, ఉద్యోగాలు మొదలైనవి అన్ని ఇక్కడ తక్కువేననీ ఇక్కడి ప్రజలు భావిస్తున్నారు. (చూ. ఉత్తరాంధ్ర జనవరి 2000 సంచిక)

దీనికంతటికి మధ్య కోస్తా నాయకుల వివక్షే కారణమంటున్నారు.

ఈ రంగాలతో పాటు సాంస్కృతికంగా కూడా ఈ ప్రాంతం వివక్షకు, అవహేళనకు గుర్త్రైందని వీరి భావన. "నాగరికులమని విర్రవీగే ఒక ప్రాంత దోపిడి వర్గాలు పాలక వర్గాలు ఈ మాండలికాన్ని హేళన చేస్తున్నారు. కళింగాంధ్రలో వెలసిన విజయవాడ, గుంటూరు వంటి నామాలతో గల భోజనశాలలు కళింగాంధ్ర ప్రజల ఆహారపు అలవాట్లను , వంటకాలను అగౌరవపరుస్తున్నారు, హేళన చేస్తున్నారు" అన్న ఈ ప్రాంత విద్యావేత్తల మాటలందుకు నిదర్శనం. ఈ వివక్షను నిరసించడంతో పాటు "రాజకీయాధికార స్థానం మారవలసి వుందని" (చూ.ఉత్తరాంధ్ర - డిసెంబర్ 1999) వాళ్ళు ప్రకటిస్తున్నారు.

తమకు జరిగే అన్యాయాలను లోకానికి తెలియజేయడానికి అక్కడి ప్రజల్ని చైతన్యవంతం చేయడానికి ప్రొఫెసర్ కె.ఎస్. చలం కన్వీనర్‌గా "ఉత్తరాంధ్ర అధ్యయన వేదిక"ను, సన్నశెట్టి రాజశేఖర్ ఎడిటర్‌గా "ఉత్తరాంధ్ర" పత్రికను స్థాపించుకున్నారు.

> ఈ ప్రాంత అస్తిత్వ చైతన్యం ప్రజా ఉద్యమంగా రూపుదిద్దుకోలేదు. కానీ కవిత్వంలో వ్యక్రమయింది.

ఈ ప్రాంత అస్తిత్వ చైతన్యం ప్రజా ఉద్యమంగా రూపుదిద్దుకోలేదు. కానీ కవిత్వంలో వ్యక్రమయింది. గురజాడ, రవిశాస్త్రి, కారాలు ఈ ప్రాంత భాషకు ఎప్పట్నుంచో మొత్తం తెలుగు ప్రాంతం సమ్మతిని సాధించి పెట్టిన వారసత్వం ఈ ప్రాంతానికున్నది. శ్రీశ్రీ, నారాయణబాబు పాణిగ్రహి, వెంపటాపు సత్యం ఇచ్చిన హీరోయిక్ వారసత్వం ఈ ప్రాంతానికున్నది. తర్వాత కాలంలో భూషణం, వంగపండు, అప్పల్నాయుడుల పైన పేర్కొన్న వారసత్వ కొనసాగింపు ఈ ప్రాంతానికున్నది. ఈ నేపథ్యం నుంచి ఇక్కడి కవిత్వాన్ని పరిశీలిద్దాం.

"శ్రీకాకుళ సాహితి" "జముకు" (ఈ వ్యాస రచయిత ఎడిటర్‌గా) అనే సాహితీ బులెటన్స్ 1986లో మొదలుపెట్టి 9 సంచికల్ని వెలువరించింది. ఇందులో ప్రాంతీయ అస్తిత్వ చైతన్యం వ్యక్తం కాలేదు. కానీ బహుశా అది అంతర్లీనంగా పనిచేసిందేమో, తమ ప్రాంత రచయితల్ని గుర్తు చేసుకుంటూ వారి మీద

వరుసగా వ్యాసాలు రాయించి, తర్వాత "ఉత్తరాంధ్ర రచయితలు" పుస్తకంగా వేశారు. 1991లో 'శ్రీకాకుళ సాహితి" ఈ వ్యాసకర్త, బి.వి.ఏ రామారావు నాయుడు మొదలైన సంపాదకులుగా "యానగాలి" కవితా సంపుటిని వెలువరించింది. ఇందులో ఈ ప్రాంత భాష కొద్దిగా కనిపిస్తుంది తప్ప ప్రాంతీయ అస్తిత్వ చైతన్యమే కనిపించదు. దీనికి ముందు వెనకాల వచ్చిన ఛాయారాజ్ కవిత్వ పుస్తకాలో ఇక్కడి ఉద్యమాల చరిత్ర, ఇక్కడీ భాష కనబడుతుంది.

1999లో శ్రీకాకుళ సాహితి వేసిన మరొక కవితా సంకలనం 'జముకు' ఇందులో ప్రాంతీయ చైతన్యం ప్రస్ఫుటంగానే వ్యక్తమయ్యింది. "ఇక ఇంటి పెణక్కి కట్టిన విత్తనాల కట్ట, వేలాడే మధురమైన జ్ఞాపకం మాత్రమే" అన్న గంటాడ గౌరునాయుడి కవితలో టెర్మినేటర్ విత్తనాలతో మొదలైన పల్లె విధ్వంసం వ్యక్తమయింది.

"తూర్పున జోగి కొండ
పశ్చిమాన మహేంద్ర తనయ అండ"

అని సాగే కె.ఎస్. చలం కవితలో తన ప్రాంత పల్లెలను నెమరువేసుకోవడం కనిపిస్తుంది.

'మా బతుకులు పత్తి పూలై పేలిపోవడం చూశావు... అధిక దిగుబడుల భాగోతంలో అన్యాయాన్ని చూడు' (బి.వి.ఏ. రామారావు నాయుడు)

"కమిలిపోయిన కొబ్బరిపిందెలు

కాలిపోయిన జీడిపిక్కల సాక్షిగా - ఇక్కడ పొద్దు దిరుగుడు పువ్వుకి కాలం చెల్లింది (నిశితాసి).

తెల్ల - తెల్లవారే మన పల్లెలు ఏమాయె
ఉత్తరాంధ్రలోన
మన ఊరులు ఏమాయె
అమ్మ తల్లులు
డప్పుల గెంతులు
హరిదాసులు
ముద్దలి వంతలు

తాళంపాటలు
తప్పెట గుళ్ళు
ఎటూ పోయెనమ్మ
మన జానపదుల కళలూ (వంగపండు)

అన్న కవితల్లో ఉత్తరాంధ్ర పల్లెల విధ్వంసం కళ్ళకు కట్టినట్లు వ్యక్తమయ్యింది.

'ఉత్తరాంధ్ర' పత్రిక (1999), అధ్యయనవేదిక వచ్చిన అరువాత ప్రాంతీయ అస్తిత్వ చైతన్యం కవిత్వం ఎక్కువగా వచ్చినట్టు కన్పబడుతున్నది. వస్తువిస్తృతి పెరిగింది.

నాగావళి నాట్యాలు - వంశధార వయ్యారాలు....
బహుదానది సిరుల ధార - ఉద్దానం బంగారం.....
వీరులగాథలకు - విప్లవమూర్తులకు...
కాణాచి యై - కళింగసీమగా - కమనీయ చరిత గల...
ఎవరమ్మా? ఈ తల్లి.... ఎదలో విరిసిన మల్లి (పైడి సత్యవతి)
ఉత్తరాంధ్ర మాతా
లాంగుల్య సలిల పునీతా
మా జోహార్లివే మాతా - (మట్టవాసుదేవం)
కళింగులేలారు గజపతులు చూశారు
సిరిపురం దంత, కళింగపురాలు

రాజధానులు చేసి రాజ్యాలేలినారు (సీరపు మల్లేశ్వరరావు) లాంటి కవితల్లో ఉత్తరాంధ్రాభిమానం కనిపిస్తుంది.

"ఇన్ని జీవనదులుండీ.... ఇబ్బందులు మనకేలా బంగారు బావులుండీ... బాధల బతుకులు యేల

ఉడుకు నెత్తురాంధ్ర ఉప్పెనవ్వాల - లాగుల్య
కవితలోనూ....
"ఏరులు - గెడ్డలు సుట్టూ వుండీ
నీరులేని బతుకూ / మన కళింగాఅంధ్ర బతుకూ"

అంటూ సాగే వంగపండు పాటల్లోనూ ఉతరాంధ్ర నీటి ప్రాజెక్టుల పట్ల, పాలకుల వివక్ష చిత్రించబడింది.

"ఒక పక్కనుండి రాజులూ రెడ్లూ చౌదర్లూ వచ్చి నన్ను ఆక్రమించేసినారు ఆక్రమణ అనడం తప్పట" అంటూ సాగే రామారావు నాయుడి దీర్ఘకవితలో మద్యాంధ్ర (కోస్తాంధ్ర)లు ఉత్తరాంధ్రను ఆక్రమించుకున్న వైనం చిత్రించబడింది.

ఉత్తరాంధ్ర ప్రత్యేక సమస్యలో అతివేగంగా వీచే గాలి ఒకటి. దానివల్ల నష్టాలు ఈ కింది నల్లి ధర్మారావు కవితలో వ్యక్తమయ్యాయి.

"మొగిలి రేకుల సొగసు మేసి మత్తెక్కిందో...
కొబ్బిరాకుల ఊసు కొంచమైనా ఇనక
మా వుసురు తీసింది మాయదారీ గాలీ....
నంగనాచీ గాలీ నాశనాల గాలీ...."
జముకుల పాటలకు, జానపద కళలకూ
సంస్కృతి సంపదకూ నీళ్ళొదిలేస్తున్నామెందుకు (బెందాళం కృష్ణారావు)
"కంకరలో సంకర విత్తులు మొలిపించి
పదేపదే చిగురు తొడుగుతున్న
దేశీయ మొక్కకి అంటుకడుతున్నారు" (శ్రీ చమన్)
కొండ కోనమీద మాగూడ
మంచెమీద ముద్దుగుమ్మలాగుండేది
పచ్చని అడవి మధ్య మావూరు
పందిట్లో పెళ్ళికూతురు లాగుండేది.
సాయంత్రాలు వీధులు సవర పాటలతో సేదదీరేవి.
వెన్నెల రాత్రుల గడపలో 'ధింసా' అడుగులతో పరవశించేది.
విప్పపూలపై తేలి జీలుగు కొమ్మల్ని మీటి గాలి....
జాకరమ్మ నుదుటి కుంకమ చెదిరిపోతుంది.
నాలుగు దిక్కుల "ఊరికట్టు గవినీలు" ఉనికి కోల్పోతున్నాయి
(మల్లిపురం జగదీశ్)
"అందమైన పొందూరు పాటి నూలుపంచె
ప్రపంచ దేశాలలో తెలుగు హుందాతనానికి

ఐడెంటిటీ కారు" (దూసి ధర్మారావు)

"నా కళ్ళనిండా

పొలంలో ధాన్యం గింజలేరుకుంటున్న పిట్టలే

వర్షంలో తడిసి చెట్టుమీద లెక్కలారేసుకుంటున పక్షులే

యిప్పుడు సన్నివేశాలకి సన్నివేశాలే మారిపోయాయి" (అరుణ్ బవేరా)

లాంటి కవితల్లో ఉత్తరాంధ్ర సంస్కృతి ప్రకృతి అదృశ్యం కావడం వర్ణించబడింది.

రెండు గడ్డిపరకలు లేకనేకదా

దుక్కిటెద్దుల్ని సంతకు తోలింది

బతుకుబండి దారి మళ్ళించి

వలసకెళ్ళొచ్చామా

పుర్రాకులే తప్ప

పరక మిగిలింది లేదు" (రామినాయుడు)

లాంటి కవిత్వంలో పాలకుల నిర్లక్ష్యం కారణంగా ఈ ప్రాంతం ఎలా వెనుకబాటుకు గురైందో, ఎలా వలసలు వెళ్ళాల్సిన దుస్థితి దాపురించిందో వ్యక్తమైంది. ఆర్. రామకృష్ణ రాసిన 'గేడిముక్క' అనే దీర్ఘకవిత ఇక్కడి దళిత జీవితాన్ని బాగా చిత్రించింది. ఇంకా చింతా అప్పలనాయుడు, సిరికి స్వామినాయుడులు రాసిన 'రెక్కత తలుపుల గోస' , పి.ఎస్. నాగరాజు వేసిన "ప్రవహించే ప్రజలు" ప్రసిద్ధ కవితా రచయిత గంటేడు గౌరవనాయుడు రాసిన "నదిని దానం చేశాక" అరుణ్‌బవేరా, శ్రీచమన్‌ల సంపాదకత్వంలో వచ్చిన "తూరుపు" మొ కవితా సంపుటాలు ఈ ప్రాంత కరువును, వ్యవసాయ విధ్వంసాన్ని, స్థానిక సంస్కృతుల విధ్వంసాన్ని శక్తివంతంగా చిత్రించిందని గ్లోబనీకరణను అంతే తీవ్రంగా ఖండించినవి.

"నేలపై ఒక ప్రత్యేక స్థలం మీద నిలబడి మాట్లాడుతున్నాను" (మానేపల్లి) అని కవులు చెప్పుకున్నప్పటికీ) ఉత్తరాంధ్ర ప్రాంతీయ అస్థిత్వ చైతన్య కవిత్వం ఉద్యమ స్థాయినందుకోలేదనే చెప్పవలసి వస్తుంది.

అయితే ఇటీవల ఉరకవే (ఉత్తరాంధ్ర రచయితల వేదిక) అట్టాడ అప్పల్నాడు అధ్యక్షుడిగా, సన్నశెట్టి రాజశేఖర్ కార్యదర్శిగా ప్రారభం కావడం, "ఉత్తరాంధ్ర" పత్రిక తిరిగి ప్రారంభం కావడం, ఈ సంస్థ పత్రిక ద్వారా, ఇతర కార్యక్రమాల ద్వారా

ఉత్తరాంధ్ర చరిత్రను, సంస్కృతిని, భాషా విశిష్టతను, ఆర్థిక, రాజకీయ రంగాల్లో ఉత్తరాంధ్ర వివక్షతను వెలికి తీస్తుండడం కారణాలు తిరిగి ఉత్తరంధ్ర అస్తిత్వ చైతన్యం, ఆ సాహిత్యం ఉధృతమౌతోంది.

**తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వ కవిత్వం:**

మిగతా రెండు ప్రాంతాలతో పోలిస్తే పూర్తి స్థాయినందుకొన్నదీ, గాఢమైనదీ, సుదీర్ఘ చరిత్ర కలిగినదీ తెలంగాణ ఉద్యమం. ఇట్లా ఉండటానికి దీనికి చారిత్రా కారణాలున్నాయి. శాతవాహన విష్ణుకుండిన, కళ్యాణీ చాళుక్య, పద్మనాయక కాకతీయ వంటి సామ్రాజ్యాలు తెలంగాణాలోనే ఆవిర్భవించడం, కుతుబ్‌షాహీల, అసఫ్ జాహీల రాజ్యాలకు కూడా తెలంగాణ కేంద్రస్థానం కావడం ఈ ప్రాంత విశిష్టతకు నిదర్శనం.

కోస్తాంధ్రులు రావడానికి ముందు, ఇక్కడికి వచ్చి ఆధిపత్యం చెలాయించడానికి ప్రయత్నంచేసిన స్థానికేతరులను ఇక్కడి నుంచి తరిమికొట్టడానికి ఉద్యమించిన చరిత్ర ఈ ప్రాంతానికి ఉన్నది. దక్షిణ భారతదేశంలో మొట్టమొదటి పట్టణీకరణ పొందిన ప్రాంతమిది. ఉత్తర దక్షిణ భారతదేశాల వారధి యిది.

ఉత్తరాన గోదావరి ప్రాణహిత నదులు, దక్షిణాన కృష్ణా తుంగభద్రా నదులు, తూర్పున తీరాంధ్ర ప్రాంతాన్ని వేరుచేస్తున్న నల్లగొండ, ఖమ్మం జిల్లాలోని పర్వతసానువులు పడమటి దిశలో కర్ణాటక, మహారాష్ట్రాలను వేరుచేస్తూ ఆదిలాబాద్ నుంచి రంగారెడ్డి జిల్లా వరకు వ్యాపించివున్న పర్వత పంక్తులు తెలంగాణ ప్రత్యేక అస్తిత్వాన్ని నిర్ధారించే మొదటి అంశం.

మిగిలిన మూడు ప్రాంతాలతో నిమిత్తం లేకుండా సుమారు 1700 సంవత్సరాల సుదీర్ఘ కాలం విడి రాజ్యంగా కొంతకాలం (కొన్ని ఇతర ప్రాంతాలతో కలిసి) వుంది. ఇది ఈ ప్రాంత ప్రత్యేకతను నిర్దేశించే రెండో అంశం. ఈ కారణంగా రూపొందిన భాష, సంస్కృతి, ఆర్థిక సామాజిక పరిస్థితులు తెలంగాణ ప్రత్యేక అస్తిత్వాన్ని నిర్ధారించే మిగతా అంశాలు.

ఇట్లా రూపొందిన తెలంగాణాను, 1948లో హైదరాబాద్ రాష్ట్రంగా ఏర్పడిన తెలంగాణాను, తెలంగాణా ప్రజల అబీష్టానికి వ్యతిరేకంగా 1956లో ఆంధ్రరాష్ట్రంలో విలీనం చేసినారు. ఆంధ్ర రాష్ట్రంలో విలీనం చేస్తే వచ్చే కష్టాలను, నష్టాలను తెలంగాణ ప్రజలు ముందే వూహించి తమ భయాలను “ఫజల్ ఆలీ కమీషన్ ముందు మొరపెట్టుకున్నారు. హైదరాబాద్ రాష్ట్రం ఏర్పడిన వెంటనే వలన వచ్చిన

కోస్తాంధ్ర ఆధిపత్య ధోరణి తిరస్కరించి నాన్‌ముల్కి (1952) ఉద్యమం నడిపిన అనుభవం ఈ విజ్ఞప్తి వెనుక ఉన్నది. ప్రజల ఆకాంక్షలను గమనించిన కమీషన్, విలీనం అవసరం లేదని సిఫార్స్ చేసింది. "విశాలాంధ్ర ప్రతిపాదనలో తమ రాజ్యాన్ని విస్తరించుకోవాలనే సామ్రాజ్యవాద భావనలున్నాయి" అని నెహ్రూ అన్నాడు. మాటలను చెవిన బెట్టకుండా కోస్తా సంపన్న వర్గాలు, కమ్యూనిస్టులు తమ దీర్ఘకాలిక స్వార్థ ప్రయోజనాల కోసం బలవంతంగా ఈ విలీనాన్ని జరిపినారు. పెద్దమనుషుల ఒప్పందం పేరుతో ఉత్తుత్తి హామీలిచ్చినారు. అవి ఉత్తుత్తి హామీలేనని ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డ మరునాటి నుంచే రుజువైంది. ప్రజలు ఊహించినట్టే కష్టాలు, నష్టాలు మొదలైనాయి. లక్షలాది ఎకరాల తెలంగాణ భూముల్ని ఆక్రమించినారు. ఉద్యోగాల్లో నిండిపోయినారు. ఇక్కడి నిధుల్ని తరలించినారు. ఇక్కడి భాషను, సంస్కృతిని అవహేళన చేసినారు. ఈ అన్యాయాన్ని, వివక్షను తిరస్కరిస్తూ తెలంగాణ ప్రజలు 1969లో ఉధృతంగా ఉద్యమించినారు. ఆరు సూత్రాల పథకమనే మరో ఉత్తుత్తి హామీతో ఉద్యమాన్ని మళ్ళీ అణిచివేసినారు. ఇక ఇప్పట్నుంచి కోస్తాంధ్రుల వలస మరింత పెరిగిపోయింది. మరీ ముఖ్యంగా 'తెలుగుదేశం పార్టీ' ఆవిర్భావంతో ఈ వలసలకు ఎదురులేకుండా పోయింది. తెలంగాణ అస్తిత్వం ఉనికినే కోల్పోయే పరిస్థితి ఏర్పడింది. అన్యాయం, వివక్ష ఇంకా తీవ్రమైంది.

> ఈ నేపథ్యంలో మూడోసారి 1996 నుంచి తెలంగాణ ఉద్యమం మొదలైంది. 1997 జనవరిలో "ఫోరం ఫర్ ఫ్రీడమ్ ఆఫ్ ఎక్స్ ప్రెషన్" జరిపిన సదస్సు ఉద్యమానికి ఉత్తేజానిచ్చింది.

ఈ నేపథ్యంలో మూడోసారి 1996 నుంచి తెలంగాణ ఉద్యమం మొదలైంది. 1997 జనవరిలో "ఫోరం ఫర్ ఫ్రీడమ్ ఆఫ్ ఎక్స్ ప్రెషన్" జరిపిన సదస్సు ఉద్యమానికి ఉత్తేజానిచ్చింది. ఆ తరువాత అనేక తెలంగాణా సంస్థలు ఆవిర్భవించి ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళాయి. 2001లో తెలంగాణ రాష్ట్ర సమితి ఆవిర్భావంతో ఉద్యమం తిరుగులేకుండా నిలబడినది. తెలంగాణ రాష్ట్రం ఆవిర్భావాన్ని ఎవరూ ఆపలేరనే ఉత్తేజాన్ని కలిగించింది.

ఈసారి వచ్చిన ఉద్యమం గత ఉద్యమాల కంటే మౌలికంగా భిన్నమైంది.

అప్పటి ఉద్యమాలు ఉద్యోగులకు విద్యార్థులకు పరిమితమైతే ఇప్పటి ఉద్యమం అన్ని వర్గాలలో అన్ని రంగాలలో వ్యాపించింది. సంస్కృతికోద్యమంగా, ఆత్మగౌరవ ఉద్యమంగా రూపుదిద్దుకొన్నది.

ఈ నేపథ్యంలో తెలంగాణ అస్తిత్వ ఉద్యమ కవిత్వాన్ని పరిశీలించాలి.

ప్రాచీన సాహిత్యంలో పాల్కూరికి, పోతన మొదలైన ఎంతోమంది కవులు ఈ ప్రాంత వైశిష్ట్యాన్ని కొనియాడిరి. 1910లో జరిగిన ముల్కి ఉద్యమంలో ఓ చిరుద్యోగి స్థానికేతరులకు వ్యతిరేకంగా "మా ఉద్యోగాలన్ని అపహరించి మీ వారికి అప్పగించావు / నీ కుట్రలన్ని అమలైతే ఇక చిరుద్యోగాలే మా గతి" అని ఒక కవిత రాశాడు. ఈ ప్రాంత చైతన్యాన్ని ప్రతిబింభించే తొలి కవిత ఇదే కావచ్చు. తెలంగాణ సాయుధ పోరాట కాలంలో ప్రపంచ వ్యాప్తంగా మారుమ్రోగిపోయింది. ఆ కాలపు తెలుగు అభ్యుదయ కవిత్వాన్నంతటినీ తెలంగాణా ఆవరించింది.

1969 నాటి ఉద్యమంలో ప్రాంతీయ చైతన్యంతో కొంత కవిత్వమొచ్చింది. అనుముల శ్రీహరి, ఎస్వీ సత్యనారాయణ జగదీశ్వరస్వామి ఉద్యమానికి మద్దతుగా 'విప్లవ శంఖం' (1969) అనే కవితా సంపుటిని ప్రచురించినారు. ఋక్నుద్దీన్, యాదగిరి విప్లవ ఢంకా ను ప్రచురించినారు. జనధర్మ తెలంగాణ కవిత్వ ప్రత్యేక సంచికను ప్రచురించింది. ఇంకా వివిధ పత్రికల్లో కవితలు వచ్చినవి.

"తెలంగాణాయే విడికాకుంటే
అంతా ఆంధ్రా దాసులమే.
స్వంత లాభమొకటి చూచి
సంతకాలు చేసినారు
భావి తెలంగాణ ప్రజల
బ్రతుకులతో ఆడినారు
"మానదురా తెలంగాణ ప్రజల
మనసులో గాయం
కాసూ! త్వరలోనే నీకు / కాటి యాత్రఖాయం"

ఇది నా తెలంగాణ సంజీవదీవిరా, ఇది తెలంగాణ పుణ్యాల దీవిరా" అంటూ అందులో అనాటి ఉద్యమ చైతన్యాన్ని ప్రతిబింబించినారు. తెలుగు పేరిట తెలివిపరులై - పెత్తనమ్మొనరించు ధూర్తులు తెలంగాణము నేలు చుండిరి.

రక్తసిక్తము చేయుచుండిరి" (1969) అని కసిరెడ్డి వెంకటరెడ్డి రాసిండు. "వీర తెలంగాణ యిదిగో సలాం నీకు తగదు ఆంధ్రతో గులాం" (1968 - 69) అంటూ మేర మల్లేశం రాసిండు. (చూ.మత్తడి - తెలంగాణ ఆధునిక కవితా సంకలనం) "ప్రాంతం వారి రక్షణ పనికిరాదు అన్నప్పుడు ప్రత్యేకంగా రాజ్యం పాలు గోరడం తప్పదు" అని కాళోజి రాసిండు. ఆ ఉద్యమంలో ఇంకా కవితలు, పాటలు చాలా వచ్చినవి.

బహుశా ఈ ఉద్యమ ప్రభావంతోనే కావచ్చు ఆ తరువాత అయిలయ్య (1972) దేవరాజు మహారాజు (1973) ఎన్.గోపి, కృష్ణమూర్తి యాదవ్. తెలంగాణ తెలుగులో కవిత్వం రాసినారు. తెలంగాణ పేర్లు పెట్టినారు. తెలంగాణ నేటివిటికీ పట్టం కట్టినారు.

ఇక మూడోసారి వచ్చిన ఉద్యమ సందర్భంగా వచ్చిన ప్రాంతీయ అస్తిత్వోద్యమ కవిత్వాన్ని పరిశీలిద్దాం. 1996 లో మూడవ దఫా ఉద్యమం ప్రారంభం కాగానే సాహిత్య రంగంలో కూడా ఆ దిశలో ప్రయత్నాలు జరిగాయి. కె. శ్రీనివాస్, సురేంద్రరాజు, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, నందిని సిద్ధారెడ్డి, కాసుల ప్రతాపరెడ్డి, డా. ఎస్వీ సత్యనారాయణ తదితరులు కలిసి విడిగానూ పలు చర్చలు చేసినారు. అనంతరం 1998 నవంబర్ 1న తెలంగాణ రైటర్స్ పేరుతో అనేకమంది తెలంగాణ కవుల్ని ఆహ్వానించి చర్చలు నిర్వచించినారు. ఈ సమావేశం తెలంగాణ కవులకు గొప్ప ఉత్తేజాన్నిచ్చింది. 1999 జనవరి 11న జరిగిన సమావేశంలో కె.శ్రీనివాస్ ప్రవేశపెట్టిన అవగాహన పత్రం మీద జరిగిన చర్చ అనంతరం సురేంద్రరాజు, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, అనిశెట్టి రజిత, మల్లేపల్లి లక్ష్మయ్య, స్కైబాబలు కన్వీనర్లుగా 'తెలంగాణ సాంస్కృతిక వేదిక' ఏర్పడింది. అదే సంవత్సరం నల్లగొండలో వేదిక తొలి రాష్ట్ర మహాసభ జరిగింది. 2001 సెప్టెంబర్ 9న రెడ్డి హాస్టల్‌లో జరిగిన వేదిక నాలుగో

> ఇక మూడోసారి వచ్చిన ఉద్యమ సందర్భంగా వచ్చిన ప్రాంతీయ అస్తిత్వోద్యమ కవిత్వాన్ని పరిశీలిద్దాం. 1996 లో మూడవ దఫా ఉద్యమం ప్రారంభం కాగానే సాహిత్య రంగంలో కూడా ఆ దిశలో ప్రయత్నాలు జరిగాయి.

సదస్సు తెలంగాణ సాహిత్యానికి దిశానిర్దేశం చేసిందని విమర్శకులు భావించారు. ఈ సదస్సులోనే తెలంగాణ తోవలు, దాలి వెలువడినవి. తరువాత నందిని సిద్ధారెడ్డి అధ్యక్షతన 'తెలంగాణ రచయితల వేదిక' పేరుతో మరో సంస్థ ఏర్పడింది. ఈ వేదిక తరుపున అనేక సభలు నిర్వహించినారు. 'సోయి' అనే పత్రికను వెలువరించినారు. ఇవి రెండు తెలంగాణ సాహిత్య చైతన్య విస్తృతికి చాలా దోహదం చేసినవి.

ఈ పరిణామానికి సమాంతరంగా ఎంతో కవిత్వం, ఎన్నో పాటలు, ఎన్నో వ్యాసాలు వచ్చినాయి. తొలుత గౌరీశంకర్ 'తెలంగాణ' వచ్చింది. శివకుమార్, రఘునాథం, సుంకిరెడ్డిలు రాసిన 'నల్లవలస' (1997 - 99) నందిని సిద్ధారెడ్డి, 'నాగేటి సాల్లల్ల నా తెలంగాణా' పాట, గద్దర్, అందెశ్రీ, గూడ అంజయ్య పాటలు, బైరెడ్డి కృష్ణారెడ్డి దేవులాట బాగా ప్రాచుర్యం పొందినాయి. వందలాది మంది కవితలతో పొక్కిలి, మత్తడి సంకలనాలు వచ్చినవి. “ఈ రెండు తెలంగాణ సాహిత్య చైతన్యానికి ప్రాతినిధ్యం వహించినవి, తెలంగాణలో వెల్లివిరుస్తున్న కవితా వైభవాన్ని తెలుగు సాహిత్యం ముందు ఆవిష్కరించినవి” తెలంగాణ ఇతివృత్తంతో సుంకిరెడ్డి 'దాలి' అల్లంనారాయణ 'యాది - మనాది' వెంకట్ 'వర్జి' గ్యార యాదయ్య 'ఎర్కోషి' కాసుల ప్రతాపరెడ్డి 'గుక్క' దీర్ఘకవితలు వచ్చినవి. యెన్నం ఉపేందర్, అన్నవరం దేవేందర్ తొవ్వ, నడక అంకమ్మ తోట లేబర్ అడ్డ, జూకంటి జగన్నాథం, దర్భశయనం శ్రీనివాసాచార్యుల కవితలు - మంజీరా రచయితల సంఘం వేసిన 'తెలంగాణ' 'నా తెలంగాణ' తెలంగాణ తల్లి (2002) పాటల సంపుటులు వచ్చినవి. పై సంకలనాల్లోను సొంత సంకలనాల్లోను విడిగాను తెలంగాణ కవిత్వాన్ని రాసిన కవులు అసంఖ్యాకం.

జయధీర్ తిరుమల రావు, నాళేశ్వరం శంకరం, డా. ఎస్వీ. చెరుకుసుధాకర్, జింబో, కందుకూరి, శ్రీరాములు, ఆశారాజు, కె.శ్రీనివాస్, ఏలేశ్వరం నాగభూషణాచార్యులు, ప్రసేన్, సీతారాం, ఎస్. జగన్‌రెడ్డి, దేశపతి శ్రీనివాస్, యాకూబ్, ననుమాసస్వామి, మోత్కూరి అశోక్ కుమార్, తైదల అంజయ్య, వఝుల శివకుమార్, సిద్ధార్థ, వేణు సంకోజు, స్కైబాబ, పగడాల నాగేందర్, వేముల ఎల్లయ్య, వెంకట్, చిత్రంప్రసాద్, షాజహానా, దొడ్డి రామ్మూర్తి, గౌస్, దాసరాజు రామారావు, బోధనం నర్సిరెడ్డి, కాసుల ప్రతాపరెడ్డి, బైరెడ్డి కృష్ణారెడ్డి, ఉదారి నారాయణ, అన్వర్, పొట్లపల్లి శ్రీనివాసరావు, దాస్యం లక్ష్మయ్య, హరగోపాల్, అనిశెట్టి రజిత, ఆర్యాబ్, ఏనుగు నర్సింహారెడ్డి, బాణాల శ్రీనివాసరావు, ఐలేనిగిరి, కందుకూరి దుర్గాప్రసాద్, కాంచనపల్లి, కోట్ల వెంకటేశ్వరరెడ్డి, గోపగాని రవిందర్, తిరునగరి శ్రీనివాస్, వాసు, దెంచనాల శ్రీనివాస్, పులిపాటి గురుస్వామి, బెల్లి యాదయ్య, వేముగంటి మురళీకృష్ణ, సుంకర రమేశ్, సబ్బని శారద, హనీఫ్, రేడియం, జనజ్వాల, హిమజ్వాల,

తెలిదేవర భానుమూర్తి, కోడూరి విజయ్ కుమార్, కాంచనపల్లి రాజేందర్‌రాజు, దున్న యాదగిరి, అలాజిపూరి కిషన్, చైతన్య ప్రకాశ్, చామల రవిందర్, లోకేశ్వర్, పరిమళ్, భూపాల్, అలీ, దాసోజు కృష్ణమాచారి, జూజుల గౌరి, జూపాక సుభద్ర, కాందళై రాఘవాచార్య, బోడ జగన్నాథ్, చింతపట్ల సుదర్శన్ వీళ్లంతా తెలంగాణ అస్తిత్వకవిత్వాన్ని సుసంపన్నం చేసిన వారే. 1969 ఉద్యమ సందర్భంలో కూడా తెలుగు ప్రజల ఏకత అనే ఆదర్శవాదాన్ని నమ్మినారు. కాని ఇప్పటి ఉద్యమ సందర్భంగా ప్రతి ఒక్కరూ ఆంధ్ర వలసవాద దృష్టిని అర్థం చేసుకున్నారు. కనుకనే 1952, 1969 ఉద్యమాల్లో రాని కవిత్వం ఇప్పుడు వరదలా పొంగి పొర్లింది.

ప్రాంతాలనాక్రమించడమే
మీ మార్క్సిజం (నల్లవలస) అని
కవులు వలసవాద దృష్టి ఉన్న మార్క్సిస్టులను నిలదీసినారు.
'అయ్యోనివా నువ్వు అవ్వోనివా
ఇసుంట రమ్మంటె ఇల్లంత నాదంటివి (గూడ అంజయ్య)
నైజాములు పతనమై నయానవాబులు
ఆంధ్రాబాద్‌లో అడ్డ వేశాక
ఈస్ట్ సిటీ, వెస్ట్ సిటీ మొత్తం
పరాయివాడి సొత్తుగా మారిపోయింది (జనార్ధనరావు)
ప్రాజెక్టులేమొ తెలంగాణలో
నీళ్ళు పారుతుయ్ కోస్తా ఆంధ్రలో (గద్దర్)
అంగలార్చి అక్కున చేర్చుకుంటే

నల్లరేగళ్ళ మీద పచ్చిపుండు పడె (కాసుల ప్రతాపరెడ్డి) అని ఆంధ్రుల ఆక్రమణ పైనాన్ని బట్టబయలు చేసినారు.

ఇంకా తెలంగాణ అస్తిత్వ సమస్యలోని ఏయే పార్శ్వాలను తెలంగాణ కవులు చిత్రించారో వ్యాఖ్యానం లేకుండా కొన్ని కవితలను చూద్దాం.

**ఒప్పందాల ఉల్లంఘన :**

ఆరువరాలను
నూరుశాపాలుగా మలచిన
పాచిన న్యాయం మీది (నల్లవలస)

మాట్లాడండి! మాట్లాడండి
నోళ్ళుమూసుకోని
పెద్ద మనుషుల ఒప్పందంలో పారతేసిన మీ అంతరాత్మల్ని
బద్దలు కొట్టుకొని మరీ మాట్లాడండి (దాసరాజురామారావు)

**ఆక్రమణ :**

తాతలిచ్చిన సారెడు భూమి పైసగ్గొంటివి
కాలువనీళ్ళు నీకువారె
కళ్ళనీళ్ళు నాకు మిగిలె (కోట్ల వెంకటేశ్వరరెడ్డి)
వలసకొచ్చిన కొంగ
చెరువు నాదంటదా
పాపమని నీడిస్తే చెట్టు నాదంటివి (సుంకిరెడ్డి నారాయణరెడ్డి)

**నీళ్ళదోపిడి :**

కె.ఎల్. రావుకు నీళ్లదులుతాం
తిలోదకాలతో సహా
అతనొక కుట్రదారు (అల్లం నారాయణ)
ఎన్నెకరాలుప్టేనేమి
నేల
ఎంగిలినాలుకంతగాదు
నెత్తిమీద మబ్బులు లేవు
కాళ్లకింద కాల్వల్లేవు (నల్లవలస)
నిజం దేవుడెరుగు
నీరుకోస్తా నెరుగు
ఓ నీటిపారుదలా
నీ రస్తాకోస్తాకే
పల్లం ఒక నెపం మాత్రమే (నల్లవలస)
ఎడమకాల్వకు ఎడంచేత్తో కూడా జలబిచ్చం వేయనికాడ
బారెడు బ్యాలెట్ పేపర్‌తో బక్కెనేసినా
చుక్కనీరు దక్కనప్పుడు

అరవై అడుగులు పెంచితే మాకేం

అల్మట్టి ఆకాశంలో కడితే మాకేం (కె. శ్రీనివాస్)

**ఇతర వనరుల దోపిడి :**

తెలంగాణ రగిలెగుండెల

ఆకలిమంటల పిడికెడు గూడుగా

అజాంజాహి (అన్వర్) కంపెనీల బతుకు తెరువుల్ని మూతలు బడేస్తుంటివి (స్కైబాబ)

**ఉద్యోగాలు :**

సదువులు కొలువులు

ఆంధ్రోళ్ళపాలాయే (వరవరరావు)

ఉద్యమం మీద

తేలుతూ వచ్చావ్)

ఉద్యోగక్షేత్రంలో విస్తరించావ్ (నల్లవలస)

**భాష :**

మాటకు రంగులద్దిన మాయలోడా

నీ కొంచెపుతనానికి

నా మాట మంచం పట్టింది గదరా

- నందిని సిద్ధారెడ్డి

బడిలో మా అమ్మ పలుకులేదు

నీ భాష నేర్పి

పుట్టినచోట పరదేశిని చేశావ్

నా మాటనే మాట్లాడితే

నాగరీకుడిని కాను

(నల్లవలస)

నా మాట తెలువదంటివి

నా బాస రాదంటివి

(నా యాసను ఎక్కిరిస్తివి - నమలికొండబాలకిషన్‌రావు

**సంస్కృతి :**

నీ నిర్మాణాలన్నీ
మా సంస్కృతికి స్మశానాలే
హుస్సేన్ సాగర తీరాన
విగ్రహాలన్నీ మీవి శవాలన్నీ మావి (నల్లవలస)
ఊరుందా
మా కాలనీ వుందా గాని ఊర్లల్ల....
గాని పదమెందుగ్గీడ
పేరెందుగ్గీడ
విగ్రహమెందుగ్గీడ (శింగం కృష్ణయ్య)
బాట మలిపితిరి
బాస ములిపితిరి
ఎవుసం రాదంటిరి
ఏశం బాగా లేదంటిరి (చెరుకు సుధాకర్)

**మీడియా :**

ఆకాశవాణి నీది
పత్రిక నీది
గాత్రం నీది
చలనచిత్రం నీది
నాయకులు మీరే ప్రతినాయకులు మీరే (నల్లవలస)

**వృత్తుల ధ్వంసం :**

నైపుణ్యం నిండిన నా చేతివేళ్ళ మీద
ఒక విదేశీ ఫోమ్ పాదం నాడాబూట్లతో నృత్యం చేస్తుంది (ఖాజా)
కుమ్మరి వాముల తుమ్ములు మొలిసెను
కమ్మరి కొలిమిల దుమ్ముపేరెను
పెద్దబాడిస మొద్దువారినది
సాలెల మగ్గం సడుగులిరిగినవి
చేతివృత్తుల చేతులిర్గిపాయె నా పల్లెలోన (గోరటి వెంకన్న)

**వ్యవసాయ విధ్వంసం:**

పునాస పులకరింతలేయి
అయిటి కలపటాల పలకరింతలేయి
గువ్వలెటుబాయె
గునుగుబాలేమాయె
మిటికిల్లు
మినుముల్ల బొబ్బర్ల సంగతేమాయె
పాలపిట్టేదీ (సుంకిరెడ్డి నారాయణరెడ్డి)
గండిపడ్డ చెరువు
ఒట్టిపోయిన పర్రె
పర్రెవారిన పంటపొలం
కాలిన మోటారు
పెరిగిన కరెంటుబిల్లు
పడావుబడ్డ ఎవుసం (కాసుల లింగారెడ్డి)
కరెంటు హెచ్చుతగ్గులు
మోటారుని కాలుస్తుంది
నీరు పార్చక మోటారు కాల్చిన పొలాన్ని
దళారీరేటుతోనూ దగ్ధం చేస్తాడు (జయధీర్ తిరుమలరావు)

**పల్లెల ధ్వంసం :**

ఊరూరంత ఇంపు సొంపుగా లేదు
ఇరిగిపోయిన పెంటపొనుక
తూట్లపడ్డ వడ్లబోరెం
కూలిపోయిన పిడికెల కుచ్చె
చెదలుపట్టిన పాతగుమ్మి
పగిలిపోయిన కురాటికుండ (అన్నవరం దేవేందర్)
లేగదూడ లేని పట్నం గొడ్రాలికి దొరికినన్ని పాలు
పాలమీగడలు పూళ్ళ నైతే దొరకవు
ఏ యింటి పొయ్యిమీదైనా పాలపొంగులు కనిపించవు (నాళేశ్వరం శంకరం)

**ఫ్లోరిన్ :**

జలం కాటేసిన ఊరది
జలం గరళమై
నమ్మి తాగినవారిని
నిలువునా ముంచేసిన ఊరది
- ఎన్. గోపి

విషమై పారుతున్న పాతాళగంగ కాలంకర కండ్లొంకర
బడిపోరగాండ్లయినా పండ్లిగిలిస్తే
నల్లని గారలు
- కాసుల ప్రతాపరెడ్డి

**బూటకపు సమైఖ్యత:**

తెలుగుతల్లి
తన కలశాన్ని తెలంగాణలో
ఒంపలేదు (నల్లవలస) మన నేల ఒకటే మన జాతి ఒకటే అయితే
బతుకులక్కతీర్గ ఎందుకు లెవ్వురా అయ్య
మన తల్లి ఒకటే అయితే
బతుకులక్కతీర్గ ఎందుకు లెవ్వురా అయ్య
మన తల్లి ఒకటే అయితే
మాతృ స్తన్యమెందుకు దొరుకది
(నందిని సిదారెడ్డి) విశాలాంధ్ర
మీ ఆక్టోపస్ సిద్ధాంతవేదిక
మా కది పొంద్ర పొదాంద్ర (నల్లవలస)

**తెలంగాణ ప్రాశస్త్యం :**

ఈ భూమిలోంచి ఎక్కడ పిడికెడు మట్టి తీసుకున్నా
ఒంగిన వీరుల కనుగుడ్లే కదలాడుతున్నాయి
- పగడాల నాగేందర్

**తెలంగాణ తల్లి :**

సేపని తల్లి అసలే వద్దు
తెలంగాణే మా రక్తం పంచిన తల్లి
- నందిని సిద్ధారెడ్డి

ఊరుకు ఉరుకు నేర్పిన తల్లి
రాజ్యానికి ఉలుకు కలిగించిన తల్లి
అడివికి ఆవుసు బోసిన తల్లి
పొలిమేరకు పోరు ఎదురెక్కించిన తల్లి
దేశానికి తొలుత గోరుకల్లు అందించిన తల్లి
- చెరుకు సుధాకర్

ఆంధ్రవలస - సామ్రాజ్యవాదం - ప్రపంచీకరణ :

హంసపై వస్తే చెరువు మావోడు
దాహమై వస్తే చెలిమె మావోడు
బేహారివై వస్తివి
భూహారివై వస్తివి
తెల్లోని మారేశమై వస్తివి గదరా
- సుంకిరెడ్డి నారాయణరెడ్డి

చెట్టు తెలియకుండానే తోట అమ్మబడుతుంది
పిట్టకు తెలియకుండానే చెట్టు అమ్ముడవుతోంది
పిట్టకంటానికి తెలియకుండానే పాట బాణీ మారుతోంది
దేశం దేశమంతా రాబందు చేతిలో మాంసపు ముద్ద
- పెన్నా శివరామకృష్ణ

**కోస్తాంధ్ర** : ప్రాంతీయ చైతన్య ఉద్యమమేదీ కోస్తాంధ్రలో రాలేదు. అలా రాకపోవడానికి కారణాలున్నాయి. 1973లో వచ్చిన జై ఆంధ్రా ఉద్యమం ప్రజలకు సంబంధించింది కాదు. తెలంగాణ ఉద్యమాన్ని పక్కదారి పట్టించడానికి, ఇతర రాజకీయ ప్రయోజనాల కోసం వచ్చింది. కాబట్టి ఇక్కడి కవులు ఈ ఉద్యమానికి పెద్దగా ప్రతిస్పందించిన సూచనలు కనిపించవు. రెండు పుస్తకాలు మాత్రమే వచ్చినవి. ఒకటి కృష్ణాజిల్లా అరసం వేసిన "సమైక్యవాణి" (1972) ఇందుకో కోస్తాంధ్రపై అభిమానమేమి వ్యక్తం కాలేదు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర వ్యతిరేక కవిత్వం ఉంది. రెండోది నూజివీడు నుంచి డా. యనమదుల పుల్లయ్యరావు వేసిన జై ఆంధ్ర గేయాలు (1973) ఇందులో తెలంగాణ వాళ్ళు తమను దూషిస్తున్నారంటూ ఆక్రోశం

వెలిబుచ్చినారు. ప్రాంతీయాభిమానం పెద్దగా పెల్లుబుకలేదు. ఎందుకని? దీనికి వేరే కారణాలున్నాయి.

మిగతా మూడు ప్రాంతాలకంటే ముందుగా ఈ ప్రాంతంలో 1852లో కృష్ణా బ్యారేజి (ప్రకాశం బ్యారేజి) 1883లోనే ధవళేశ్వరం (గోదావరి ఆనకట్ట) రావడంతో ఈ ప్రాంతం సంపద్వంతం అయింది. ఈ ప్రాజెక్టుల వల్ల వ్యవసాయంలో మిగులు సాధ్యమైంది. ఈ మిగులును సినిమా, ప్రచురణ వంటి అనుత్పాదక రంగాలకు విస్తరించారు. కోస్తాంధ్ర నయా సంపన్నులకు మొబిలిటీ పెరిగి అన్ని రంగాలకు కబళించారు. తమ మార్కెట్ విస్తరణ కోసం 1953లో ఆంధ్ర రాష్ట్రాన్ని, 1956లో ఆంధ్రప్రదేశ్‌నూ సాధించుకొని మిగతా మూడు ప్రాంతాల్లో కబ్జాదారులుగా అంతర్గత వలసాధిపత్య వాదులుగా పేరు గడించారు. (ఈ ప్రాంతంలో అక్కడక్కడ వెనుకబడిన ప్రాంతాలు ఉన్నాయి. ఈ ప్రాంతంలోనూ పేద ప్రజలు ఉన్నారు. ఈ ప్రాంతంలోని వెనుకబడిన ప్రాంతాల్లో విప్లవోద్యమం తద్వారా విప్లవసాహిత్యం బలంగా ఉండటం చూస్తాం) మిగతా మూడు ప్రాంతాల భాషా సంస్కృతులను, ఆహారపు అలవాట్లను అవహేళన చేసి ఆ ప్రాంతాల ప్రజల మనోభావాలను గాయపరిచిన వారిగా పేరు గడించినారు. స్వార్థ ప్రయోజనాలు నెరవేర్చుకోవడానికి అన్ని ప్రాంతాలు తమవే అన్నరీతిలో ప్రవర్తించారు. మిగతా ప్రాంతాలను తమ జీవిత మూలాల్లోకి ఆహ్వానించకుండానే మిగతా ప్రాంతాల్లో తమ ప్రత్యేక అస్తిత్వాన్ని (మైనారిటీ అయినా సరే) కాపాడుకుంటూనే ఆధిపత్య ధోరణి ప్రదర్శించారు. వలస దేశాల్లోనే జాతీయోద్యమాలు వచ్చినట్టు పీడిత, బాధిత, వెనుకబడిన ప్రాంతాల్లోనే ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమాలు వస్తాయి. అందువల్ల ఇక్కడ ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమం అవసరం ఏర్పడలేదు. అందువల్ల ప్రాంతీయ అస్తిత్వ కవిత్వమూ రాలేదు. ఈ

ఈ నాలుగు ప్రాంతాల్లో అన్నిరకాలుగా తెలంగాణ అస్తిత్వ ఉద్యమం, కవిత్వం అన్నిరకాల అధిపత్యాలను ఎదిరించే ఉద్యమంగా సాగింది. ప్రపంచాన్నంతా కుగ్రామంగా మార్చేసి, తన మార్కెట్‌ను విస్తరించుకునే అమెరికా అగ్రరాజ్యానికి కోస్తాంధ్ర పాలకులు అండదండలు అందిస్తూ తెలంగాణాను ప్రయాగ ప్రాంతంగా మార్చారు. కేవలం ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు కోసం రాజకీయోద్యమంగానే కాకుండా ప్రపంచీకరణను, దానికి కొమ్ము కాస్తున్న దేశీయ పాలక వర్గాన్ని వ్యతిరేకించే విశాల ప్రాపంచిక దృక్పథాన్ని తెలంగాణ అస్తిత్వ ఉద్యమం అందిస్తున్నది. ఈ దృష్ట్యా అస్తిత్వ కవిత్వం అన్ని ఇతర ప్రాంత అస్తిత్వవాదాల కన్న ముందు వుందని చెప్పవచ్చు.

(19-09-2006 న ఉస్మానియా విశ్వ విద్యాలయ తెలుగు శాఖ నిర్వహించిన యు.జి.సి జాతీయ సదస్సులో చదివిన ప్రసంగ పత్రానికి పరివర్ధిత రూపం)

# ఆధునిక తెలుగు కవిత్వం: ఇతర భాషల ప్రభావం



డా. కొత్తపల్లి రవిబాబు
94901 96890

మనిషి సంఘజీవి. కనుక ఒకరిపై మరొకరి ప్రభావం పడటమనేది అత్యంత సహజం. అలా ప్రభావితం కావడం తప్పుపట్టవలసిన అంశం కాదు. అలాగే చరిత్రలో ఒక నాగరికత ప్రభావం మరొక నాగరికతపై పడటమూ మనం గమనిస్తాం. ఈ వెలుగులో ఆధునిక తెలుగు కవిత్వంపై, కవితా ఉద్యమాలపై ఇతర దేశీయ, అంతర్దేశీయ భాషల కవిత్వ, కవిత్వ ఉద్యమాల ప్రభావం పరిశీలిద్దాం.

ప్రముఖంగా పేర్కొనదగినది మన భావ కవిత్వయుగం. ఇది ఇంగ్లీషు సాహిత్యంలోని రొమాంటిక్ కవిత్వంతో ప్రభావితమైనదని స్పష్టంగా చెప్పుకోవచ్చు. గురజాడ దేశభక్తి గేయం, ముత్యాలసరాలు, కన్యక మొదలైన వాటిలో ప్రవేశబెట్టిన అభ్యుదయ భావాల కొనసాగింపు సాగకపోగా, తెలుగు కవిత్వం భావ కవిత్వపుదారులు తొక్కడం ఆశ్చర్యకరమైన విషయం. రొమాంటిక్ కవిత్వంలో ప్రధానంగా వున్న అంశాలు. 1. పాత నియమాల ఉల్లంఘన 2. ప్రకృతి - గ్రామీణ జీవితం పట్ల అభిరుచి 3. స్వేచ్ఛా, స్వాతంత్ర్యకాంక్ష 4. భావోద్రేకాలకు ప్రాముఖ్యత 5. నిరాడంబర శైలి మొదలగునవి. ఇటువంటి కవిత్వం 19వ శతాబ్దంలో ఇంగ్లీషులో, ఫ్రెంచి భాషల్లో విరివిగా వచ్చింది . పాశ్చాత్య రొమాంటిక్ కవులలో ప్రముఖులు. కీట్సు (1795 - 1821), షెల్లీ (1792 - 1822), బైరన్ (1788 - 1824), వర్డ్స్ వర్త్ (1770 - 1850), కోలరిడ్జ్ (1772 - 1934), రాబర్ట్ బర్న్సు (1759 - 1796), విలియం బ్లేక్ (1757 - 1827), ఫ్రెంచిభాషలో విక్టర్ హ్యూగో (1802 - 1885), అమెరికాకు చెందిన ఎడ్గార్ ఎలన్ పో (1809 - 1849), రష్యన్ భాషకు చెందిన పుష్కిన్ (1799 - 1837).

ఇంగ్లీషు భాషలోని రొమాంటిక్ కవుల కవిత్వ ప్రభావం తెలుగు కవులైన కృష్ణశాస్త్రి (1997 - 1980), రాయప్రోలు సుబ్బారావు (1892 - 1984), అబ్బూరి రామకృష్ణరావు, (1896 - 1979), తల్లావఝుల శివశంకర శాస్త్రి (1892 - 1972),

దువ్వూరి రామిరెడ్డి (1895 -1947), నండూరి సుబ్బారావు (1884 - 1957), విశ్వనాథ సత్యనారాయణ (1895 - 1976), ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి (1911 - 1987), వేదుల సత్యనారాయణశాస్త్రి (1900 - 1976), నాయని సుబ్బారావు (1899 - 1978), బసవరాజు రాజ్యలక్ష్మమ్మ 'సౌదామిని' (1904 - ?), బసవరాజు అప్పారావు (1894 - 1933), తల్లాప్రగడ విశ్వసుందరమ్మ (1899 - 1949) చావలి బంగారమ్మ (1897 - 1920) గాడిచర్ల హరిసర్వోత్తమరావు (1883 - 1960), కాళోజీ రామేశ్వరరావు (1908 - 1996), వానమామలై వరదాచార్యులు (1912 - 1984) మొదలైనవారిపై చూడగలం అంటే వీరందరూ ఇంగ్లీషు కవిత్వం చదవడం ద్వారా ప్రభావితులైనవారు అని అర్థం కాదు. తెలుగులో భావకవిత్వం ప్రారంభమైన తరువాత దాని ప్రభావంతో రాసిన వారు వీరిలో వున్నారు. ఈ కవితకు ఆ పేరు పెట్టినది 1906లో గాడిచర్ల హరిసర్వోత్తమరావు. భావకవి అంటే దుస్తులు, జుట్టు మొదలైనవి ప్రత్యేకంగా వుండేట్లు కూడా ఆ కవులు కొందరు చూసుకున్నారు. ఈ కవిత్వపు ప్రారంభదశలో 'భావం లేకుండా కవిత్వం వుంటుందా? ఇదేం పేరు' అని హేళన చేసినవారున్నారు. 'బావ' కవిత్వం అని వెక్కిరించినవారూ వున్నారు. 1940 వరకు తెలుగు భావకవులు ప్రణయం, ప్రకృతి, దేశభక్తి, సంఘ సంస్కరణ, స్మృతి, మానవత, ఆధ్యాత్మికత మొదలైన అంశాలపై రాశారు. 'భావం అంటే ఊహ. ఆ ఊహకు రెక్కలు తొడిగి వెలువరించే ఆత్మాశ్రయం కవితే భావకవిత'గా విమర్శకులు నిర్వచించారు. ఇదే ఆ తర్వాత కాలంలో పేరు మార్చుకుని 'అనుభూతి కవిత'గా ప్రాచుర్యం పొందింది.

మొదటి ప్రపంచ యుద్ధం (1964 జూలై 28 - నవంబరు 11, 1918), రెండవ ప్రపంచ యుద్ధం (1939 సెప్టెంబరు 1 - 1945 సెప్టెంబరు 2) ప్రభావంతో విశ్వశాంతి, యుద్ధవ్యతిరేకత, యుద్ధం సృష్టించే విధ్వంసం, విఛ్ఛిన్నమైన కుటుంబజీవితాలు మొదలైన అంశాలతో ఇంగ్లీషు కవులు కవితలను రాశారు. వీరిలో ప్రముఖులు సీగ్ ఫ్రీడ్ ససూన్ (1886-1967) , రూపర్ట్ బ్రూక్ (1887-1915), విల్ ఫ్రెడ్ ఓవెన్ (1893-1918) రాబర్ట్ గ్రేవ్స్ లు. ప్రపంచవ్యాప్తంగా మహా ఆర్థికమాంద్యం (Great Depression) 1929, 1930 లలో కొనసాగింది. అనాటి రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిణామాల ప్రభావం సాహిత్యంపై పడింది. దీని నేపథ్యంలో రూపుదిద్దుకుంది ప్రజాసాహిత్య, సాంస్కృతికోద్యమం.

ప్రజలంటే సమస్త మానవ జాతిలో బానిసలై, పీడితులై బాధామయ జీవితాలను గడుపుతున్న అత్యధిక శాతం ప్రజలు. బాధలుపడుతూ, పోరాడుతూ, పడిపోయి మరల లేచి నిలబడుతూ, తమ చెమట, రక్తంతో తాము నడిచే

గతుకుల మార్గాన్ని తడుపుతూ ముందుకు సాగే జనం వీరు. మొదటి ప్రపంచ యుద్ధానంతరం "జనం కోసం నిలబడదాం, రచనలు చేద్దాం, పాటలు పాడుదాం - రచయితలుగా, కళాకారులుగా ఇది మన విధ్యుక్తధర్మం" అంటూ 1919 జూన్ 26న 'లా హ్యూమలైట్' అనే ఫ్రెంచి పత్రికలో దాదాపు 18 దేశాలకు చెందిన 140 మంది రచయితలు 'ఆలోచనా స్వాతంత్ర్యప్రకటన' (Declaration of the Independence of Mind) విడుదల చేశారు. ఆ 140 మందిలో మన దేశానికి చెందిన చిత్రకారుడు, విమర్శకుడు ఆనందకుమారస్వామి, 1913లోనే సాహిత్యంలో నోబెల్ బహుమతి నందుకున్న రవీంద్రనాథ టాగోరు వున్నారు. వీరుగాక వివిధ దేశాలకు చెందిన ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, హెన్రీ బార్బూస్, హెర్మన్ హెస్, కాథే కాల్విట్జ్, రోమరోలా, అప్టన్ సింక్లేర్, ఆల్‌ఫ్రెడ్ స్టిగ్‌లిట్జ్, బెర్‌ట్రెండ్ రసెల్ మొదలగు వారెందరో వున్నారు.

ఆనాటి ఇటలీలోనూ, జర్మనీలోనూ వేళ్ళూనుకుంటున్న ఫాసిస్టు రాజకీయాల అనర్థాలను అర్థం చేసుకున్న రచయితలు, కళాకారులు 1935 జూన్ 21 నుండి 25 వరకు పారిస్‌లో 'సంస్కృతీ పరిరక్షణ అంతర్జాతీయ మహాసభ' (Congress for the Defence of Culture) ను నిర్వహించారు. టికెట్ కొనుక్కున్నవారితో మూడువేలమంది పట్టే హాలు నిండిపోగా, బయటకు లౌడ్ స్పీకర్లు పెట్టారు. 38 దేశాల నుంచి 250 మంది రచయితలను ఆహ్వానించిన మహాసభ అది. ఐదురోజులపాటు మధ్యాహ్నం మూడు నుంచి తొమ్మిదివరకు సమావేశాలు జరిగాయి. దీనికి బెర్టోల్ట్ బ్రెష్ట్, ఇ.ఎమ్. ఫాస్టర్, ఆండ్రీ మాల్రా, అన్నా సెగర్స్, గుస్తావ్ రెగ్లర్, ఆల్డస్ హక్స్ లీ, హెన్రీ బార్బూస్, బోరిస్ పాస్టర్ నాక్, అలెక్సీ టాల్‌స్టాయ్, ఇల్యా ఎ హ్రెన్ బర్గ్ మొదలగు హేమాహేమీలెందరో హాజరయ్యారు. మనదేశం నుండి ముల్క్ రాజ్ ఆనంద్, సజ్జాద్ జహీర్ హాజరయ్యారు. యుద్ధానికి, ఫాసిజానికి వ్యతిరేకంగానూ, వాక్స్వాతంత్ర్యాన్ని పరిరక్షించాలనీ మహాసభ ఏకగ్రీవంగా తీర్మానించింది.

1936 ఏప్రిల్ 9, 10 తేదీలలో లండన్‌లో 'సంస్కృతీ పరిరక్షణకై ఏర్పడిన అంతర్జాతీయ రచయితల సంఘం' వారి కాన్ఫరెన్స్ జరగ్గా, ముల్క్ రాజ్ ఆనంద్ దానికి హాజరయ్యారు.

1935 నాటి సమావేశం ఇచ్చిన ఉత్సాహంతో 1935 నవంబర్ 24న. లండన్‌లోని డెన్మార్క్ వీధిలో వున్న చైనావారి నాన్‌కింగ్ రెస్టారెంట్ వెనుకగదిలో అక్కడ చదువుకుంటున్న భారతీయ రచయితల బృందమొకటి అభ్యుదయ

రచయితల సంఘాన్ని ప్రారంభించింది. ఆనాటి సమావేశంలో ముల్క్ రాజ్ ఆనంద్, సజ్జాద్ జహీర్, జ్యోతిర్మయి ఘోష్, డా.ఎన్. సిన్హా, డా. కె. ఎస్ భట్ మొదలగువారు పాల్గొని, ఆనాడు రూపొందించిన సంఘ ప్రణాళికపై సంతకం చేశారు. ఆ ప్రణాళికలో 'దేశంలోని అభివృద్ధి నిరోధక రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక అంశాలన్నిటినీ నిర్దాక్షిణ్యంగా విమర్శించడం, సాహిత్యాన్నీ, కళలను ప్రజలకు సన్నిహితం చేస్తూ జీవిత వాస్తవాలను చిత్రించే సాధనాలుగ మలచడం మన ఆశయం. ఈనాడు ప్రధానంగా వున్న ఆకలి, దారిద్ర్యం, సాంఘిక అసమానతల, రాజకీయ పరాధీనతలపై మనం కేంద్రీకరించి సాహిత్యాన్ని సృష్టించాలి" అంటూ వారు ఆ ప్రణాళికలో నిర్దేశించుకున్నారు.

ఈ ప్రణాళిక తీసుకొని సజ్జాద్ జహీర్ లండన్ నుండి భారతదేశానికి తిరిగివచ్చారు. (ఈ ఇంగ్లీషు ప్రతిని శ్రీశ్రీకి ఆనాటి ఆంధ్ర విశ్వకళాపరిషత్తు గ్రంథాలయాధికారి అబ్బూరి రామకృష్ణారావు అందించారు.) వారు ఇక్కడ రచయితలతో చర్చించి 1936 ఏప్రిల్ 9, 10 తేదీలలో లక్నోలో ప్రేమచంద్ అధ్యక్షతన అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం మొదటి మహాసభను నిర్వహించారు. "సాహిత్యం పాఠకులను నిద్ర బుచ్చరాదనీ, వారిని చైతన్యపరచి కార్యోన్ముఖుల్ని చేయాలనీ, అభివృద్ధి నిరోధక, పునరుద్ధరణవాద ధోరణులను నిరుత్సాహపరచాలనీ, భారత స్వాతంత్ర్యకాంక్షను, సామాజిక పునరుజ్జీవనాన్నీ ప్రతిబింబించే రచనలు చేయాలనీ" వీరి ప్రణాళిక నిర్దేశించుకుంది.

తెలుగునాట ప్రథమ అభ్యుదయ రచయితల మహాసభ 1943 ఫిబ్రవరి 13, 14 తేదీలలో తెనాలిలో తాపీ ధర్మారావు అధ్యక్షతన జరిగింది. ఈ సంఘ ఐదవ మహాసభ (జూలై 30, 31, 1955) తర్వాత 1973 వరకు పదమూడేళ్ళపాటు స్తబ్ధతకు గురైనా, వ్యక్తిగతంగా రచయితలు అభ్యుదయ, ప్రగతిశీల కవిత్వరచన కొనసాగించారు. దేశంలోని అన్ని ప్రముఖభాషలలోనూ ప్రగతిశీలభావాలతో (యుద్ధవ్యతిరేకత, మార్క్సిజం పట్ల అనుకూలత, పీడిత ప్రజల సమస్యల చిత్రీకరణ, ప్రజల పోరాటాలు, విప్లవవీరుల పట్ల అభిమానం, దేశభక్తి మొదలగునవి) కవిత్వం వెల్లివిరిసింది. ఈ భాషల కవిత్వం పై దేశీయ అంతర్దేశీయ

> "తెలుగునాట ప్రథమ అభ్యుదయ రచయితల మహాసభ 1943 ఫిబ్రవరి 13, 14 తేదీలలో తెనాలిలో తాపీ ధర్మారావు అధ్యక్షతన జరిగింది."

ప్రగతిశీల భావాల ప్రభావం గణనీయంగా వుంది.

పర్షియన్ భాష నుండి నేరుగా ఉమర్ఖయాం, కవితలను దువ్వూరి రామిరెడ్డి అనువదించారు. గాలిబ్ గీతాలు, దాశరథి అందించారు. 'గీతాంజలి' ని పలువురు అనువదించారు. మయకోవస్కీ రాసిన 'లెనిన్' కావ్యాన్ని శ్రీశ్రీ తన సొంత కవితా అన్నంత బాగా తెలుగులో రాశారు. ఖలీల్ జిబ్రాన్ రచనలు కూడా కాళోజీయే గాక, మరికొందరు అనువదించారు. శ్రీ శ్రీ ఇంగ్లీషు, ఫ్రెంచి, స్పానిష్ మొదలగు కవుల రచనలను అనువదించారు.ఇతర భాషల నుండి తెలుగు కవితాలోకంలోకి కొన్ని విదేశీ కవితారూపాలు కూడా ప్రవేశించి సృజనాత్మకంగా నిలదొక్కుకున్నాయి. వాటిలో చెప్పుకోదగినవి రుబాయిలు, హైకూలు, గజళ్ళు.

1955 - 1965 కాలంలో దేశంలో, రాష్ట్రంలో ఏర్పడిన సర్వవ్యాపిత సంక్షోభం, పతన విలువలు, కుళ్ళికంపు కొడుతున్న రాజకీయాలు మొదలైనవాటిని ప్రశ్నిస్తూ తెలుగు కవులు ఆరుగురు1 దిగంబర కవిత్వం రాశారు. వారి 'దిగంబర కవులు' మొదట సంపుటి 1965మే 6న, రెండవ సంపుటి 1966 డిశంబరు 8న, మూడవ సంపుటి 1968 సెప్టెంబరు 14న విడుదల చేశారు. అయితే ఈ కవులపై 20వ శతాబ్దపు ప్రారంభంలో ఇంగ్లీషులో వచ్చిన Naked Poetry ప్రభావం లేదు. వీరు కూడా మనిషి పైన ధరించే ముసుగును తొలగించమని కోరారు. ఈ దిగంబర కవిత్వానికి ముందే బెంగాల్‌లో ఆకలికవుల2 (Hungry poets) కవిత్వం వచ్చింది.అమెరికాలో బీట్ తరం కవులు వచ్చారు. వారిలో ప్రముఖులైన ఎలెన్ గిన్స్ బర్గ్ 1962 - 63లో ఇండియాకు వచ్చారు. హిందీలో అకవితా, నయీ కవితాఉద్యమాలు వచ్చాయి. అయితే ఈ కవిత్వాల, ఉద్యమాల ప్రభావం తమపై ఉందని దిగంబర కవులు ఎవరూ చెప్పలేదు.

1955 – 1965 కాలంలో దేశంలో, రాష్ట్రంలో ఏర్పడిన సర్వవ్యాపిత సంక్షోభం, పతన విలువలు, కుళ్ళికంపు కొడుతున్న రాజకీయాలు మొదలైనవాటిని ప్రశ్నిస్తూ తెలుగు కవులు ఆరుగురు1 దిగంబర కవిత్వం రాశారు.

1950 - 60లలో లిటిల్ మాగజైన్ ఉద్యమం వివిధ భారతీయ భాషల్లో వచ్చింది. మనకు తెలుగులో అది ఒక ఉద్యమరూపంగా గాక 1960 - 80ల మధ్య కాలంలో వివిధ ప్రాంతాల నుండి ప్రగతిశీల భావాలతో సాహిత్య బులెటిన్లు పత్రికలు వచ్చాయి. వాటిలో కొన్ని 'జీవనాడి', 'విద్యుల్లత', 'నూతన', 'రచన', 'కంజిర' ,'చినుకు', 'ప్రస్థానం', 'మంజీర', మొదలగునవి.

బెంగాల్‌లోని 'తారా సప్తక్' ఉద్యమానికి హైదరాబాద్‌లో 'నక్షత్రసప్తకం'(Seven Stars Syndicate) సంస్థకు ఎటువంటి సంబంధం లేదు. నక్షత్ర సప్తకం సంస్థ సాహిత్య, సాంస్కృతిక సినీరంగాల కార్యక్రమాలు చేస్తూ, 'నవత' అనే పత్రికను శ్రీ శ్రీ గౌరవ సంపాదకునిగా కొన్ని త్రైమాస సంచికలను ప్రచురించింది.

విప్లవ రచయితల సంఘం ఏర్పడటానికి ముందే తెలుగునాట విప్లవకవితాసంపుటాలు వెలువడ్డాయి. ఆయా కవితాసంపుటాల పేర్లతో ఆ కవుల బృందాల్ని పిలవడం ప్రారంభమైంది. ఉదాహరణకు 'మార్చ' కవులు, 'తిరగబడు' కవులు, 'పైగంబర కవులు'. 1967లో పశ్చిమ బెంగాల్‌లో డార్జిలింగ్ జిల్లా సిలిగురి సబ్ డివిజన్లో గ్రామమైన నక్సల్ బరిలో, కమ్యూనిస్టు పార్టీ చేసిన దశాబ్దాల కృషి ఫలితంగా రైతాంగం జోతేదార్లపై దాడులు చేసి, భూములూ, పంటలూ స్వాధీనం చేసుకుని, అప్పుల పత్రాలను తగులబెట్టే స్థితికి చేరుకున్నారు. దీని ప్రభావంతో 1945 నుండి కమ్యూనిస్టు పార్టీ నిర్మించిన ఉద్యమాలకు పరాకాష్టగా 1968 నవంబరులో శ్రీకాకుళం జిల్లాలోని గిరిజన రైతాంగం సాయుధ ప్రతిఘటన ప్రారంభించింది. అయితే ఉద్యమం అవలంబించిన దుందుడుకు పద్ధతుల ఫలితంగా రాజ్యం దీనిని అణచివేసింది. నక్సల్బరి పోరాటం దేశంలో వివిధ ప్రాంతాల్లో పోరాటాలకు స్ఫూర్తి నిచ్చింది. వీటి ప్రభావం అభ్యుదయ, ప్రగతిశీల రచయితలు, కళాకారులపై పడింది. కనుకనే 1968 సెప్టెంబరు 14న దిగంబర కవులు విడుదల చేసిన తమ కవితల మూడవ సంపుటిలో ఈ ప్రభావం స్పష్టంగా కనబడుతుంది. బెంగాలీలో, హిందీలో ఈ దృక్పథంతో ఎందరో కవులు తమ కవితలను ప్రచురించారు. అయితే ఆయా కవుల ప్రభావం తెలుగు ప్రగతిశీల,విప్లవకవులపై వున్నట్లు దాఖలాలు లేవు. దేశవ్యాప్తంగా వున్న పరిస్థితులపై ఏ భాషకు సంబంధించిన కవులు ఆయాభాషలలో స్పందించారు.

మహారాష్ట్రలో దళిత పాంథర్ల ఉద్యమాన్ని నాందేవ్ ధసాల్, అర్జున్ డాంగ్లే, రాజా ధలే, జె.వి. పవార్‌లు 29 మే 1972 లో ప్రారంభించారు. ఇది అమెరికాలోని

నల్లజాతివారు ఏర్పరచుకున్న బ్లాక్ పాంథర్ల ఉద్యమంతో స్ఫూర్తి పొందింది. వీరి మానిఫెస్టో 1973 లో వెలువడింది. అంబేద్కర్, జ్యోతిరావు ఫూలే , కారల్ మార్క్స ల చింతనను సమర్థించారు.

తెలుగులో దళితుల సమస్యలపైనా, అంటరానితనంపైనా కవిత్వాన్ని రాసినవారిలో తొలితరంలో జాల రంగసామి, కుసుమధర్మన్న కవి, నక్కా చినవెంకయ్య, నూతక్కి అబ్రహాం, ప్రేమయ్య, జాషువా, బోయి భీమన్న మొదలగు వారు వున్నారు. మలితరం దళిత కవిత కారంచేడులో 17జూలై 1985న జరిగిన దళితుల ఊచకోత తర్వాత ప్రారంభమైంది. ఆధుకానంతరవాద ధోరణులు కూడా దీనికి ఊతమిచ్చాయి. 1981 ఆగస్టు 6న చుండూరులో మరోసారి దళితులపై మారణకాండ జరిగింది. వీటితో ప్రభావితమైన కవుల కవితా సంకలనాలు 1995 లో 'చిక్కనవుతున్న పాట' (సం. గుంటూరు లక్ష్మీనరసయ్య, త్రిపురనేని శ్రీనివాస్), 1996లో 'పదునెక్కిన పాట' ( సం.గుంటూరు లక్ష్మీనరసయ్య) వెలువడ్డాయి. ఒక ఉద్యమ రూపు తీసుకోవడానికి మరాఠీ కవుల 'దళిత పాంథర్స్' స్ఫూర్తిని ఇచ్చి వుండవచ్చును గాని ఈ తెలుగు దళిత కవులపై ఇతర భాషాసాహిత్య ప్రభావం చాలా తక్కువ.

ఆధునికానంతరవాద ధోరణులలో భాగంగా వచ్చిన స్త్రీవాద, ముస్లింవాద, బహుజనవాద, దళితవాదకవిత్వాలపై ఇతర దేశాలలోని ఆయా వాదాల సిద్ధాంత ప్రభావాలు వున్నాయిగాని, ఆయా దేశాల కవుల ప్రభావం వుందని చెప్పలేము. అది ఇంకా సూక్ష్మపరిశీలనలో తేలాల్సిన అంశంగా మిగిలి వుంది.

చివరగా ఆధునిక తెలుగు కవిత్వంలోని రూపాలపై ఇతర భాషల ప్రభావం చూద్దాం. 1830ల చివర్లో ఫ్రెంచికవులు, పాత నియమబద్ధమైన, ఛందస్సుతో కూడిన కవిత స్థానంలో Verse Libre (Free Verse) ను ప్రవేశపెట్టారు. వీరికంటే ముందే ప్రతీకవాదుల (Symbolists) కవిత్వంలోనూ, రింబాడ్ (Rimbaud) కవిత్వంలోనూ, విక్టర్ హ్యూగో కవిత్వంలోనూ ఈ పద్ధతి ఉపయోగించారు. కాని విస్తృతంగా అది వాడుకలో వచ్చింది పంతొమ్మిదవ శతాబ్దపు చివర్లోనే. ఇంగ్లీషులోనే కార్ల్ సాండ్ బర్గ్, మాత్యూ ఆర్నోల్డ్, వాల్ట్ విట్మన్ మొదలగువారు ఈ రూపాన్ని తమ కవిత్వంలో విస్తృతంగా వాడారు. Prose poem కు Free Verse

కూ తేడాలున్నా తెలుగు కవిత్వంలో ఇది వచన కవితగా స్థిరపడింది. 1960లలో దీని పేరుపై జరిగిన చర్చలో ముక్త కవిత, ముక్తకాలు, వచన పద్యం, ముక్తఛంధం అనే పేర్లు వినపడినా ఇప్పుడు వచన కవిత పేరు స్థిరపడిపోయింది.

కవిత్వం కొత్తగా రాస్తున్నవారు ఏ మాత్రం కవితాత్మకతలేని వచనాన్నే తుంటలుగా అమర్చి, దానిని వచన కవిత్వంగా పిలుచుకుంటున్నారు. ఫేస్‌బుక్, వాట్సప్, బ్లాగ్‌స్పాట్ లాంటి సోషల్ మీడియాలోకి ఎక్కించి సంతోషపడుతున్నారు. అంతేగాక ఛందస్సునూ, నియమాలనూ ధిక్కరించి వచన కవిత రాగా, ఈనాడు పలువురు మరలా కొన్ని నియమాలు విధించి కొత్త రూపాలను సృష్టించి వాటికి కొత్త పేర్లు పెట్టి ప్రచారం విరివిగా చేస్తున్నారు.

ఇంగ్లీషువారి 'ఎలిజీ' కూడా తెలుగు కవిత్వంలో ప్రవేశించింది. దాని ప్రభావంతో నాయకులు, కవులు, సన్నిహితులు మరణించినపుడు, తెలుగు కవుల విషాద కవితలు రాస్తున్నారు. ఉదాహరణకు శ్రీశ్రీ తన మిత్రుడు జనార్ధనరావు మరణంపైనా, తిలక్ మరణంపైనా రాసిన కవితలు.

విదేశీ కవితాప్రక్రియలైన రుబాయీలు, గజళ్ళు, హైకులూ, మొదలైనవాటిని తెలుగు కవులు దేశీయం చేసుకుంటూ మార్పులు, చేర్పులతో తెలుగు కవిత్వాన్ని సుసంపన్నం చేస్తున్నారు.

## జ్ఞాపికలు

(1) దిగంబర కవులు : జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజు, భైరవయ్య, నగ్నముని, మహాస్వప్న, ఇవి కలంపేర్లు

(2)హంగ్రియలిస్ట్ కవుల్లో ప్రముఖులు : మలయరాయ్ చౌదరి, సమీర్ రాయ్ చౌదరి, శక్తి ఛటోపాధ్యాయ, దేవీరాయ్. పదకొండుమంది హంగ్రీ కవులను అశ్లీలరచనలు. రాజ్యంపై కుట్రచేశారనే ఆరోపణలతో 1964 సెప్టెంబర్ రెండున పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం అరెస్టు చేసింది).

(3) తారా సప్తక్ కవులు : సచ్చిదానంద వాత్స్యాయన'అజ్ఞేయ', గజానన్ మాధవ్ ముక్తిబోధ్, నేమి చంద్రజైన్, భరత్ భూషణ్ అగర్వాల్, ప్రభాకర్ మాచ్వే, గిరిజా కుమార్ మాథుర్, రామ్ విలాస్ శర్మ. వీరి సంపుటులు మొదటిది 1943లో, దూసరా సప్తక్ 1951లో ,తీసరా సప్తక్ 1959లో, చౌతా సప్తక్ 1979 లో వెలువడ్డాయి.)

